# మానవీయుడు

# మావో



క్వాన్ యాంచి

# మానవీయుడు మావో

## మావో అంగరక్షకుని జ్ఞాపకాల ఆధారంగా

## క్వాన్ యాంచీ

# విషయసూచిక

కామ్రేడ్ లీ

# పరిచయం

లీ యాంకియావో మావో వద్ద పదిహేనేళ్లు పనిచేశారు. తొలుత మైదాన ప్రాంతంలో మావో అంగరక్షకునిగాను, ఆ తరువాత సెక్షన్ లీడర్‌గాను, డిప్యూటి కమాండర్‌గాను, చివరిగా మావో అంగరక్షకులకు కమాండర్‌గాను పనిచేశారు. అతనితో మావో ఒక సారి ఇలా అన్నాడు. "నా కుటుంబంలో ఏదన్నా జరిగితే ఇతరులకు అది రహస్యం. కాని నీకు మాత్రం అది రహస్యం కాదు." ఇంకా ఇలా అన్నాడు. "కాని నేను బ్రతికి ఉన్నంత వరకు నా గురించి ఏమీ రాయవద్దు. నేను చనిపోయేంతవరకు వేచి ఉండు. సత్యాన్ని రాయి." 1962లో మావో నుండి లీ వెళ్లిపోతున్నపుడు ఆయన ఇలా అన్నారు, "నీ స్థానంలో మరో కొత్త బాడీగార్డ్ కమాండర్‌ను నేను నియమించుకోవడం లేదు. నిన్ను చాల కాలం ఉంచుకోగలిగాను. మన ఇద్దరికీ అలా కుదిరిపోయింది. నీ స్థానాన్ని భర్తీ చేసే వ్యక్తి నాకు లభించదు." అందుచేత లీ మావోకు చివరి బాడీగార్డు కమాండర్ కూడా.

లీ స్నేహితునిగా, ఆయన విశ్వాసం పొందిన వ్యక్తిగా మావో సేటుంగ్ గురించి ఆయనకు నేను అనేక ప్రశ్నలు పంపాను. అయితే వాటికి ఆయన సమాధానాలు ఇస్తారన్న నమ్మకం లేదు. వాటిలో కొన్ని మావో ఇష్టాలు ఏమిటి, అయిష్టాలు ఏమిటి, భయాలు ఏమిటి, మావో ఎప్పుడైనా ఇతరులతో గొడవపడుతూనో, ఘర్షణ పడుతూనో ఉండటం చూశారా - లాంటివి ఉన్నాయి. వాటికి సమాధానాలు చెప్పడం ఇబ్బందికరమే అయినా, ఆ విషయాలను తెలుసుకోవాలని ప్రజలకు నాలాగే ఎంతో ఆసక్తి ఉంటుంది.

కాని, ఆశ్చర్యమేమంటే మావో మాజీ బాడీగార్డు తన జ్ఞాపకం చేసుకోగలిగినంత వరకు జ్ఞాపకం చేసుకొని మావోతో తాను గడిపిన రోజుల గురించి ఎలాంటి మినహాయింపు లేకుండా వివరంగా తెలియచేశారు. ఆయన చెప్పిన విషయాలను వింటున్న కొద్దీ మావో గురించిన నా అభిప్రాయం మరింత సంపూర్ణతను, మరింత స్పష్టతను సంతరించుకుంది. ఈ శతాబ్దంలోనే చైనాలో జన్మించిన వారిలో మావో అతిగొప్ప వ్యక్తి అన్న నా విశ్వాసం మరింత బలపడింది.

నేను ప్రశ్నలు వేసినది ఒక్క లీకు మాత్రమే కాదు. మావోతో ఎంతో కొంత కాలం పనిచేసి ఇప్పుడు దేశంలో వేర్వేరు ప్రాంతాల్లో పనిచేస్తున్న అనేక మందిని కూడా ప్రశ్నించాను. నా ప్రశ్నలకు లీ ఎలా సమాధానాలు చెప్పారో, వీరు కూడా అంతే ఉత్సాహంగా సమాధానాలు చెప్పారు. అయితే నా ప్రశ్నలకు సమాధానాలు చెప్పిన వారిలో లీ అతి ముఖ్యుడు.

లీ వయసు మీదపడిన వ్యక్తి. ఆయన తన అనుభవాలను గుర్తుకు తెచ్చుకునేటపుడు వివరాలకు సంబంధించి, ప్రదేశాలకు సంబంధించిన కొన్ని పొరపాట్లు ఉంటేఉండవచ్చు. కాని, ఈ పుస్తకంలో పాఠకులు ఒక గొప్ప వ్యక్తి చరిత్రకు అందించిన సేవల గురించిన వాస్తవ కథనాలను తెలుసుకుంటారు.



# రచయిత గురించి

క్వాన్ యాంచి 1945 నవంబర్ 26న చీఫెంగ్‌లో జన్మించారు. హోహోట్‌లో ప్రాథమిక, సెకండరీ విద్యను ముగించారు. ప్రతిభ కలిగిన విద్యార్థిగా గుర్తింపు పొందిన క్వాన్ జీవశాస్త్రంలో ఆసక్తి కలిగి ఉండేవాడు. 1970లో బీజింగ్ పాలీటెక్నిక్ సంస్థలో పట్టభద్రుడయిన తర్వాత సైన్యంలో చేరారు. ముప్పై ఏళ్ళ వయసు నుండి ఆయన రాయడం ఆరంభించారు. పుస్తకాల పట్ల ఆసక్తి, నిశిత పరిశీలన, స్పష్టత, సుసంపన్నమైన అనుభవం, విస్తృతమైన మిత్రబృందం – వీటన్నింటిని మించి తాను బాల్యం నుండి అలవాటుచేసుకున్న విషయాల పట్ల నిరంతర జిజ్ఞాస – ఆయన ఒక రచయితగా రూపొందడంలో దోహదపడ్డాయి. క్వాన్ చైనా రచయితల సంఘంలో సభ్యుడు.

# 1. నేను మావో అంగరక్షకుడిని ఎలా అయ్యాను?

మావో నన్ను తన అంగరక్షకుడిగా ఎందుకు పెట్టుకున్నాడో రెండు ముక్కల్లో చెప్పడం నా వల్ల అయ్యే పని కాదు. ఇతరత్రా కారణాలు చాలా ఉండొచ్చు. కానీ అసలు నాకు ఈ అంగరక్షకుడి ఉద్యోగం సుతరాము ఇష్టం లేకపోవడమే నన్ను ఆ పనికి ఎంపిక చెయ్యడానికి ప్రధాన కారణం అయి ఉండొచ్చని నా నమ్మకం. నిజంగానే మావో ఒక చారిత్రక పురుషుడు. కానీ అతనూ మానవ మాత్రుడే. ఇందులో ఎలాంటి మినహాయింపు లేదు. నేను పొరపాటున ఇలా అంటున్నాను అనుకునేరు. అలాంటిదేం కాదని పోనుపోను మీకే తెలుస్తుంది.

1946-49 మధ్య కాలంలో జన చైనా విముక్తి యుద్ధం జరిగింది. నేను 1947 వసంతకాలంలో చౌఎన్‌లై అంగరక్షకుడిగా కుదుర్చుకున్నాను. ఆ పాటికి కొమింగ్‌టాంగ్ సైన్యానికి, కమ్యూనిస్టు ప్రజా విముక్తి సైన్యానికి మధ్యన భీకరపోరు సాగుతుంది. చాంగ్‌కై షేక్‌ను నమ్మినబంటు అనతగ్గ జనరల్ హుజోంగ్‌నాన్ రెండు లక్షల ముప్పైవేల మంది మెరికల్లాంటి సైనిక పటాలంతో షాంగ్సీ ఉత్తర ప్రాంతంలోని విముక్తి ప్రాంతాలమీద భారీ దెబ్బ తీయడానికి కదిలి వస్తున్నాడు. శత్రువు ఎదురుదాడికి దిగిన నేపథ్యంలో కమ్యూనిస్టు పార్టీ సెంట్రల్ కమిటీ యేనాన్ విడిచిపెట్టి షాంగ్సీ ప్రావిన్సులో గెరిల్లా యుద్ధానికి దిగింది.

బహుశా 1947 ఆగస్టు 18 ప్రాంతంలో అనుకుంటా సెంట్రల్ కమిటీ సహా వందలాదిమందిమి పచ్చ నది వద్దకు చేరుకున్నాం. మొత్తం చైనా విముక్తి యుద్ధంలోనే షాంగ్సీ ఉత్తర ప్రాంతంలో ఆనాడు నడిచిన కాలం చాలాగడ్డు కాలం. జనరల్ లియుకాప్ మమ్మల్ని వెన్నంటి ఉండడానికి ఏడు బ్రిగేడ్‌ల దళాల్ని పంపించాడు. సూయిడే నుండి మిఘి వరకు, అక్కడ నుండి జియాంగ్జిన్ కౌంటీకు, అక్కడ నుండి పచ్చనది చేరే వరకూ మమ్మల్ని కంటికి రెప్పలా కాపాడుకుంటూ వచ్చాయి ఆ దళాలు. అప్పటికి చాల రోజులుగా ముసురు వానలు కురుస్తున్నాయి. ఒంట్లో ఎముకలు కూడా తడిసిపోతాయా అన్నంతగా వానలు కురుస్తున్నాయి. పచ్చనది పొంగి ప్రవహిస్తుంది. దాని ఉధృతి మైళ్ళ దూరం నుండే చెవులకు వినబడుతుంది. మావో మహా చికాగ్గా ఉన్నాడు. ఆ చికాకంతా అప్పుడు మేం ఉన్న పరిస్థితులను గురించి కాదని నాకు తెలుస్తూనే

ఉంది. మేం పచ్చనదిని దాటబోతున్నాం అనే సణుగుడు మా పటాలంలో చక్కర్లు కొడుతూ ఉంది. మావో ఒక మాట అన్నాడంటే అది జరిగి తీరాల్సిందే. అంత తేలిగ్గా తను అన్న మాట నుండి వెనక్కి తగ్గడు. ఓ పట్టాన మనసు మార్చుకోడు."మనం హుజోంగ్‌నాన్‌ను మట్టి కరిపించాక గానీ నదిని దాటే ప్రసక్తి ఉండదు' అని మావో అప్పటికే చెప్పాడు. హూ ప్రత్యక్షంగా చాంగ్‌కైషేక్ నియంత్రణలో ఉన్నాడు. కాబట్టి అతగాడి పటాలం వెనక్కి తగ్గే ప్రశ్న లేదు. ఇటుచూస్తే మేము ఏడు బ్రిగేడ్ల సైన్యం ఎప్పుడెప్పుడు పచ్చనదిని దాటుదామా అని మునేళ్ళమీద సిద్ధంగా ఉన్నాం. కానీ మావో 'అసలు ప్రసక్తే లేదు' అంటున్నాడు. అయితే ఒక విషయం మాత్రం చెప్పుకోవాలి. ప్రజా విముక్తి సైన్యం బలానికి షాంగ్సీని ప్రతిరూపంగా చెప్పుకుంటాడు. కొమింగ్‌టాంగ్ సైన్యంతో చావోరేవో తేల్చుకోవడానికి ప్రజా విముక్తి సైన్యం సదా సంసిద్ధంగానే ఉంది. మిన్ను విరిగి మీద పడనీ, ఉప్పెనరానీ 'ఛైర్మన్ మావో షాంగ్సీలో తమకు తోడుగా ఉంటే చాలు' ఐసా పైసా తేల్చుకోవడానికి సై అంటుంది.

చౌఎన్‌లై కాస్తంత లౌక్యంగా 'ఇప్పుడు మన ముందు ఉన్నది పచ్చనది కాదు. అదింకా ఎగువన ఉంది దీన్ని జియాలూ అని పిలుస్తారిక్కడ' అన్నాడు. అంటే మేం నదిని దాటి అవతలకు పోయే అవకాశం ఉంది. ఆ దాటడం ఏదో ఇక్కడ కాకపోతే ఇంకాస్త ఎగువన అయితే మాత్రం ఏం పోయిందిలే అనుకున్నాం. కానీ మావో ముఖకవళికల్లో ఏం మార్పులేదు.

ఏదయితేనేం మల్లగుల్లాలు పడి అప్పుడు ఉన్న పరిస్థితులలో జియాలూ దగ్గరే నదిని దాటాలని నిర్ణయించారు. మా వెనక ఉన్న కొండల్ని అప్పటికే శత్రువు అక్రమించేసుకున్నాడు. వాళ్ళు పేల్చే తుపాకి గుళ్ళు మా తలల మీదుగా దూసుకుపోయి కాళ్ళ కట్టన ఎదురుగా ఉన్న బురద నేలలో దిగబడుతున్నాయి. శత్రువు ముందుకు రాకుండా కట్టడి చేసే ప్రయత్నంలో మూడు కంపెనీల ప్రజా విముక్తి సైన్యం మా వెనగ్గా అల్లంత దూరంలో ఉంది. సెంట్రల్ కమిటీ ఆఫీసుకు రక్షణగా ఒక కంపెనీ, ఛైర్మన్ మావోకు రక్షణగా ఒక ప్లటూన్ ప్రజావిముక్తి సైన్యం ఉంది. ఆన్ చాంగ్లిన్ మావో రక్షణ ప్లటూన్‌కు కమాండర్. ఇప్పుడు గనక మా మీద శత్రువు దాడి చేస్తే వాళ్ళు వేల సంఖ్యలో మేం వందల అంకెల్లో ఉంటాం.

సెంట్రల్ కమిటీ సెక్రటేరియట్‌కు కార్యదర్శిగా ఉన్న రెన్‌బిషికు మమ్మల్ని నది దాటించే బాధ్యత అప్పగించారు. అయితే ఆ నదిని దాటడం మాటల్లో అయ్యే పనికాదు. నది పరవళ్ళు తొక్కుతూ ప్రవహిస్తుంది. తాడి ఎత్తు అలలు ఎగిసి ఎగిసి పడుతున్నాయి. ఆ ప్రవాహపు హోరు చెవుల్ని గింగుర్లెత్తిస్తుంది. మేకతోలుతో చేసిన 'రాఫ్ట్'లు నీళ్ళలోకి వదలడమే ఆలస్యం తల్లకిందులయిపోయి గాల్లో తేలే ఆకుల్లా నీటి ఒరవడికి కొట్టుకు

పోతున్నాయి. క్షణాల్లో కంటి ముందు నుండి అదృశ్యమైపోతున్నాయి.

ఒక పక్కన ఉగ్ర మహోగ్రంగా ఉన్న నది, రెండో పక్క నుండి వేలాది మందిగా మీదకు వచ్చి పడుతున్న శత్రుసైన్యం- చెప్పొద్దు మా లావు సైనికుణ్ణి అయినా ఒక్కక్షణం నాకూ బెదురుపుట్టుకొచ్చింది.

మావో గంభీరంగా ఉన్నాడు. మనిషి నిండు కుండలా ఏ మాత్రం తొణక లేదు. ఉన్నట్టుండి 'కుడి చెయ్యి 'పైకెత్తి చూపుడువేలు, నడిమివేలును చూయిస్తూ 'సిగిరెట్' అన్నాడు.

మా నెత్తిన పిడుగు పడినట్టయింది. మాలో మేం కాళ్ళు తొక్కుకోసాగాం. 'సిగరెట్ ఉందా' 'సిగరెట్టు' కామ్రేడ్ దేషెంగ్‌కు సిగరెట్టట' 'సిగరెట్టు' 'నీ దగ్గరుందా' 'నీ దగ్గరా' 'నీ దగ్గరా' అని దేవులాడసాగాం. షాంగ్సీ యుద్ధంలో మావోను కామ్రేడ్ దేషెంగ్ అని పిలవడం అలవాటయింది. ఆ మధ్య కొంత కాలంగా ఒంట్లో నలతగా ఉన్న మూలాని సిగరెట్లు తాగడం మానేసాడు. అందుకే మావో కోసం అని ప్రత్యేకంగా సిగరెట్లు జాగ్రత్త చెయ్యలేదు. పోని సిగరెట్లు అలవాటు ఉన్న వాళ్ళ దగ్గర ఎవరినుండైనా తీసుకుందామా అని చూస్తే అందరికి అందరూ వానకి తడిసి ముద్దగా అయిపోయి ఉన్నారు. ఒంట్లోని ఎముకలు కూడా తడిసిపోయి ఉంటాయనిపించేంత వర్షంలో ఇప్పుడు మావోకు సిగరెట్లు ఎలా సంపాయించడం అని గాభరాపడిపోతున్నాం. అసలు ఇట్టాంటి సమయంలో తను సిగరెట్టు అడుగుతాడని ఎవరన్నా కలగంటారా?

మావో ఒక కొండరాయి మీద కూర్చున్నాడు. చెయ్యి అలాపైకి ఎత్తే ఉంది. వేళ్ళు ఆడతానే ఉన్నాయి. ఎక్కడా సిగరెట్టని అడిగా అన్నాడు మావో. ఈసారి ఆ గొంతులో కాస్తంత అసహనం, కాస్తంత కోపం ధ్వనించింది. లేవని నోటితో చెప్పకుండా ఎవరికి వాళ్ళం తడిసిన పంట్లాం, చొక్క జేములు వెతుకులాడసాగాం. ఇంతలో అల్లంత దూరం నుంచి అలజడి, ఒక మనిషి వెనకాల గుంపుగా ఇంకొంత మంది కాసరబీసరగా మాట్లాడుతూ మావోకేసి వస్తున్నారు. ఆ వచ్చేది మావో గుర్రాల సంరక్షకుడని గుర్తుపట్టాం. సిగరెట్టు పెట్టె, అగ్గిపెట్టె వానకి తడవకుండా అతను ఓ నూనె గుడ్డలో చుట్టి దగ్గర అట్టే పెట్టుకున్నాడల్లే ఉంది. అది తెచ్చి మావోకు అందచేసాడు.

అది చూసి మావోకు కూడా అలాంటి గుడ్డ కప్పండి అని చౌఎన్‌లై చెప్పాడు.

మావో ఇదేం పట్టనట్లు దీర్ఘంగా ఆలోచిస్తూ సిగరెట్ వెలిగించాడు. గుండెల నిండా పట్టేలా గట్టిగా దమ్ములాగి కణకణలాడుతున్న సిగరెట్ కొసకేసిచూస్తూ ఉండిపోయాడు కొన్ని క్షణాలు. ఆ తర్వాత గాఢంగా ఊపిరివదిలాడు. అప్పుడు మేం కూడా 'అమ్మయ్యా' అనుకుంటూ తేలిగ్గా ఊపిరివదిలాం. దూరం నుండి తుపాకి మోగుతున్న శబ్దాలు

భీకరంగా వినబడుతున్నాయి. మావో అవేం పట్టించుకోకుండా దిగంతంలోకి చూస్తూ ఆలోచిస్తూ ఉన్నాడు. అతని భృకుటి ముడిపడి ఉంది. ముక్కుపుటాల్లోంచి పళ్ళ సందునుంచి సిగరెట్ పొగ బయటకు వొదిలాడు. అంతలోనే ఆ పొగను మళ్ళీ లోపలికి పీల్చుకున్నాడు. అదేం పీకుడో గానీ, సిగరెట్టు నాలుగు దమ్ములకే చిన్న పీక మాదిరి అయిపోయింది. ఆ పీకని వేళ్ళతో కసిగా దూరంగా విసిరేసి రాయిమీంచి చివ్వున లేచి 'మనం పచ్చనదిని దాటడం లేదు అంతే' అన్నాడు. అందరికి వినబడేలా.

ఆ వెంటనే అక్కణ్ణించి నదీ ముఖ ద్వారం కేసి నడవసాగాడు. నిలకడగా, చకచకా అడుగులు వేస్తూ ఉంటే బాడీగార్డు తన వెంట పరుగుతీసాడు. కానీ మావో చికాగ్గా అతన్ని రావొద్దనేసాడు. ఎదుట నుంచి శత్రువుల తుపాకుల నుంచి గుళ్ళ వర్షం కురుస్తున్నా లెక్క చెయ్యకుండా మావో ఒంటరిగా మా అందరికంటే ముందు ఉండి నడిచాడు. అందులో ఒక్క గుండు తగిలినా చరిత్ర దిశే వేరేగా మారిపోయి ఉండేది కదా అని ఆరోజుల గురించి తలచుకుంటూపోగానే హఠాత్తుగా తుపాకులు మౌనం వహించాయి. ఇంకాస్త ముందుకుపోయాక మావో ఒక కొండగట్టు మాటున అదృశ్యం అయిపోయాడు.

రెండు నిమిషాలకి 'ధనా'మని పెద్ద శబ్దం అయింది. ఎవరి తుపాకి అన్నా అదాటున పేలిందా లేక మావోకు గౌరవ వందన సూచకంగా పేల్చారా అనుకున్నాం. ఆ మరు నిమిషం నుండి అప్పుడే నిద్దరలోంచి లేచారా అన్నట్లు శత్రుసైనికులు గుళ్ళ వర్షం కురిపిస్తూ దుమ్ము రేగకొట్టారు.

ఉత్తర షాంగ్సీలో జరిగిన యుద్ధంలో శత్రు సైనికుల నుండి ఇలాంటి ఆకస్మిక, నాటకీయ దాడుల్ని నాలుగైదు సార్లు మేం చవిచూసాం.

తుపాకి పేలుళ్ళను లెక్క చెయ్యకుండా మావో ఓ బండరాయి మీద విశ్రాంతిగా చతికలబడి కూర్చుని బీజింగ్ ఒపేరా 'అరియా'లోంచి కొన్ని పాటలు జ్ఞాపకం తెచ్చుకుని రాగం తీస్తూ ఉండిపోయాడు.

ఆ తరువాత, అక్కడ నుంచి కొండ ఎక్కడం మొదలయింది. సగం దూరం ప్రయాణించాక మాకు ఒక ఊరు తగిలింది. డెబ్బై, ఎనభై గడప ఉన్న ఊరు అది. చుట్టూ చెట్టూ చేమగాని, నీళ్ళుగానీ లేని రాతి ప్రాంతం అది. ఆ ఊళ్ళో తెల్ల డ్రాగను గుడి ఒకటి ఉంది. వాన రాకడ కోసం ఆ గుళ్ళో పూజలు చేస్తారని తెలిసింది. మేం ఆ ఊళ్ళోకి అడుగుపెట్టామో లేదో కుండపోతగా వాన మొదలయింది. దాంతో ఆ భగవత్ స్వరూపుడే మావో రూపంలో వచ్చి తమ ఊళ్ళో వాన కురిపించాడని ఆ ఊరిజనం అనుకోవడం నే విన్నాను. కొండ కింద లీకువాన్ సైన్యం విడిది చేసింది. కనుచూపు మేరంతా నెగళ్ళు వేసి మంటపెట్టుకుని ఉన్నారు వాళ్ళు. ఆ రోజుకి మేం ఆ ఊళ్ళోనే బస చేసాం. బయట వాన కుండపోతగా పడతా ఉంది పక్కనే నిద్దర్లో ఉన్న మావో

గురక గట్టిగా వినబడతా ఉంది.

మరుసటి రోజు ఆగస్టు 19, యేజిలోంగ్, వాంగ్ డాంగ్ జింగ్‌లు రమ్మనమని కబురు పంపారు నాకు. సెంట్రల్ కమిటీ డిటాచ్‌మెంట్ చీఫ్ స్టాఫ్ ఆఫీసరు బాధ్యతలు చూసేవాడు 'యే'. వాంగ్ అతనికి సహాయకుడిగా ఉండేవాడు. మేం ముగ్గురం ఒక చోట కలిసాం.

'యే' ముక్కుసూటి మనిషి, ఏం మాట్లాడాలన్నా తిన్నగా అసలు విషయం తోనే మొదలుపెడతాడు. మేం కలవడంతోనే అబ్బాయ్ నీకు వేరే పని అప్పగించాలనుకుంటున్నాం. బాడీగార్డుగా పనిచెయ్యడంలో నీవు దిట్టవి కాబట్టి రేపటి నుంచి నువ్వు మావోకు బాడీగార్డుగా పనిచెయ్యాలి అన్నాడు.

'నీ అనుభవాన్ని దృష్టిలో పెట్టుకుని నువ్వంటే ఎంతో నమ్మకంతో నీకు ఈ బాధ్యతలు ఒప్ప చెబుతున్నాం. చాన్నాళ్ళ క్రితమే ఈ విషయమై ఓ నిర్ణయానికి వచ్చేసాం. ఇదిగో ఇప్పటికి కుదిరింది' అన్నాడు వాంగ్. ఆ నిర్ణయం వెనుక ఉన్న రాజకీయ ప్రాధాన్యత వివరించి 'ఇదెంతో కీలకమైన బాధ్యత. ఎంతో గౌరవప్రదమైంది కూడా. నువ్వు మాకు మాట రాకుండా చూసుకోవాలని ముక్తాయించాడు.

'అలాగే' అన్నట్లునే తల ఊపాగానీ, నేను ఆ పని స్వీకరించేందుకు మానసికంగా సిద్ధంగా లేననే సంగతి వాళ్ళతో రకీమని చెప్పలేకపోయా. అంతకు ముందు రోజే వెర్రికోపంతో మావో అప్పటిదాక తనకు బాడీగార్డుగా పనిచేసిన మాన్‌యెంగ్ షెంగ్‌ను ఆ పన్లోంచి తప్పించేసాడు. అప్పటికి పదేళ్ళ క్రితం పదకొండు ఏళ్ళ వయసులో నేను ప్రజావిముక్తి సైన్యంలో చేరాను. అదీ 'ఆర్డర్లీ'గా ఆ తరువాత గార్డుగా 'ప్రమోట్' అయ్యాను. ఆ పిమ్మట బాడీగార్డుగా ఎంపిక అయ్యాను. కానీ నాతోపాటు సైన్యంలో చేరిన చాలామంది ఇప్పుడు లెఫ్టినెంటు, కల్నల్ హోదాల్లో ఆఫీసర్లుగా పనిచేస్తున్నారు.

నేను వాళ్ళ నిర్ణయానికి అలాగే అని తల ఊపినా 'ఇంతకీ నేవ్వేం అనుకుంటుందీ చెప్పనేలేదు' అనడిగాడు 'యే'. అది యథాలాపంగా అడిగిన మాటే అని తెల్సినా నేను ఆ ప్రశ్న కోసమే ఎదురు చూస్తున్నట్లుగా రకీమని కుండబద్దలు కొట్టినట్టు' ఆయన దగ్గర పనిచెయ్యడం నావల్ల అయ్యే పనికాదు. ఇంకా ఎంతకాలమూ నేను బాడీగార్డుగా ఉండిపోవాల్సిందేనా' అనేసాను.

నేనట్లా అంటానని వాళ్ళు ఊహించి ఉండరు. మొదట బిత్తరపోయారు. ఆ తరువాత ఇబ్బందిగా మొహం పెట్టారు. 'నా వల్లకాదు' అని చెప్పేసి ఊరుకుంటే సరిపోయేదేమో. కానీ అప్పటికే నేను నా పరిధికి మించి మాట్లాడాను అని అర్థమై అయినా పార్టీ ఎలా నిర్ణయిస్తే అలా పనిచెయ్యడానికి నేను సిద్ధం. అడిగారు కాబట్టి చెప్పాను అంతే' అన్నా నే

సర్దుకుంటూ.

'మా బాగా అర్థం చేసుకున్నావ్ అబ్బాయ్. ఇది పార్టీ నిర్ణయం నువ్వు ఈ కొత్త బాధ్యతలని మా అంచనాల మేరకు నిర్వర్తిస్తావనే నమ్మకం నాకుంది' అన్నాడు 'యే'.

'నువ్వు ఈ రోజే డ్యూటీ ఎక్కాలి' అన్నాడు వాంగ్. భృకుటి ముడేస్తూ 'ఇది తాత్కాలిక నిర్ణయయమే అనుకో ఇంకా ఫైసలా చెయ్యాలా సరేనా' అన్నాడు నా మనసులో ఉన్న అయిష్టతను పసిగడుతూ.

అదిగో అలాగ నేను ఛైర్మన్ మావోకు అంగరక్షకుడిని అయ్యాను. పార్టీ నిర్ణయించినట్లు ఆ రోజే పనిలోకి దిగిపోయాను.

ఆ తరువాత నాలుగైదు రోజులకి ఆ రోజు ప్రయాణంలో పొద్దు పొడిచిన దగ్గర నుంచి పొద్దుగూకే దాకా మావో నాతో ఒక్క మాట కూడా మాట్లాడలేదు. అది ఆయన పద్ధతికి విరుద్ధం. నేను మావోకు, చౌఎన్‌లైకు మధ్యగా నిలబడి నడుస్తున్నా ఆయన కనీసం నాకేసి కన్నెత్తి అయినా చూళ్ళేదు. దాంతో నాకు గుబులు పట్టుకుంది. నేను 'యే'-'వాంగ్'లతో, నాకు ఆయన దగ్గర పనిచెయ్యడం ఇష్టం లేదు అని అదాటున అన్నమాట వాళ్ళుగానీ ఈయనకు మోసెయ్యలేదు కదా. అందుకే ఆయన ఈ మాదిరి నాతో ముభావంగా ఉంటున్నారా, కోపం జేసుకున్నారా; అటు చేసి ఇటు చేసి నా పీక మీదకి వొచ్చిందే అంటూ నామనుసులోనే తర్కించుకున్నా.

వాన ధాటికి కొండమీంచి కిందికి దొర్లుకుంటూ వచ్చినంత పనయింది మాకు. పచ్చనది చూస్తే పర్వత పాదాలదాకా పొంగి వచ్చింది. ఈత వచ్చిన వాళ్ళు పొంగుమీద ఉన్నా లెక్క చెయ్యకుండా ఈదుకుంటూ అవతలి ఒడ్డుకు చేరుకుంటున్నారు. ఈతరాని వాళ్ళకోసం వాంగ్ అప్పటికప్పుడు వేయించిన తాళ్ళ వంతెన మీద దాటుతున్నారు. మమ్మల్ని వెంబడిస్తూ బయల్దేరిన లీకువాన్ సైన్యం ఇప్పటికి కొండమీదికి చేరినట్టుంది. వెర్రెత్తిన వాళ్ళకు మల్లే తుపాకులు మోత మోగిస్తూ గుళ్ళ వర్షం కురిపిస్తున్నారు.

'వాళ్ళు అర్చుకుని తీర్చుకుని వచ్చేసరికి తెల్లారుద్ది కానీ ఈలోగా మనం దాటేస్తామా' అంటూ తాళ్ళ వంతెన పని ఎంతవరకూ వచ్చిందో చూసాడు మావో. 'రేడియో ట్రాన్స్‌మీటర్‌ను పెట్టండీ' అని చెప్పాడు. కాసేపు కీచురాయి మోతచేసి మొత్తానికి రేడియో ట్రాన్స్‌మీటర్ పనిచేసేలా చూసారు. అప్పటిదాకా ఏదో తెలియని ఆదుర్దాతో ఉన్న మేం హఠాత్తుగా నిశ్శబ్దంగా అయిపోయాం. సైన్యంలో వాడే టార్పాలిన్ గుడ్డను గొడుగుగా చేసి దాని కింద కూచుని దేశంలో వివిధ ప్రాంతాల నుండి వచ్చిన టెలిగ్రాములు చదివి తగిన సూచనలు ఆదేశాలు పెన్సిల్‌తో కాగితం ముక్కలు మీద రాసి వెంటనే ఆయా యుద్ధ ప్రాంతాల ప్రధాన సైనిక స్థావరాలకు రేడియో ట్రాన్స్‌మీటర్ ద్వారా పంపించమని

లీయు చేతికి ఇచ్చాడు మావో.

శత్రు సైనికుల యుద్ధ విమానాలు ఆకాశంలో 'మా నెత్తిమీద చక్కర్లు కొడుతున్నాయి. కొండ మొదట్లోకి వెళ్ళి షెల్టర్' తీసుకోమని మావోకు చెప్పి చూసా కాని మావో కళ్ళయినా తిప్పకుండా టెలిగ్రామ్‌లు చదువుతూ చేతిలో పెన్సిల్‌తో ఆకాశంలో చక్కర్లు కొడుతున్న విమానం కేసి చూయిస్తూ 'కోరికోరి చావుకు ఎదురొస్తారా ఎవరైనా, కింద దిగమనండి చూద్దాం. మీ సత్తా ఎంతో మీ కన్నా వాళ్ళకే బాగా తెలుసు చూడండి" అన్నాడు.

నిజంగానే మావో అన్నట్లు ఆ విమానాలు ఆకాశంలో అక్కడక్కడే చక్కర్లు కొట్టాయి. కానీ అంగుళం కిందకి దిగడానికి సాహసించలా అటు నుంచి అటే చిత్తగించాయి. మా నెత్తినపాలు పోసినట్లనిపించింది.

ఆ పాటికి నదిమీద తాళ్ళ వంతెన వేసేసారు. నదికి ఈ కొసన ఆ కొసన ఉన్న కొండరాళ్ళకు మోకులు బిగించి తాళ్ళతోనే వంతెన పరిచారు. అవతలి ఒడ్డున ఉన్న ఇళ్ళ తలుపులు తెచ్చి అడ్డ పలకలుగా ఎడం ఎడంగా పరిచారు. ఆ నదిమీద వంతెన కట్టడానికి పిల్లర్లు ఎంత అవసరమో ఈ తాళ్ళ వంతెన నిలవడానికి పిల్లర్లు అంత అవసరం. ప్రజా విముక్తి సైనికులే సుడులు తిరుగుతూ ప్రవహిస్తున్న ఆ నదిలో మొలబంటి లోతున ఆ తాళ్ళ వంతెనకు ఈ బారు నుండి ఆ బారుకు పిల్లర్లుగా నిలబడ్డారు. నది దగ్గరకు చేరుకున్న మావో ఆ దృశ్యం చూడగానే ఒక్క క్షణం అప్రతిభుడైపోయాడు. మావో కళ్ళు చెమరించడం నే గమనించా. ప్రజా విముక్తి సైనికుల అంకుఠిత దీక్ష మావో హృదయాన్ని తాకింది. అంతలోనే తేరుకుని తన వెనుక ఉన్న వారికేసి తిరిగి 'ముందు మీరు వెళ్ళండి' అన్నాడు.

'లేదు లేదు కామ్రెడ్ దేషెంగ్ ముందు మీరు వెళ్ళండి' అన్నారు. వాళ్ళంతా ముక్తకంఠంతో, నదిలో పిల్లర్లుగా నిలబడిన వాళ్ళూ వాళ్లతో శృతి కలిపారు. కానీ మావో అందుకు ఒప్పుకోలేదు. 'ముందు మన కామ్రేడ్స్ వెళ్ళాల్సిందే' అన్నాడు. దాంతో మళ్ళీ నదిలో ఉన్న వాళ్ళూ ఒడ్డున ఉన్న వాళ్ళూ అంతా ఏక కంఠంతో 'దేషెంగ్ ముందు మీరు వెళ్ళాల్సిందే' అన్నారు. అక్కడ ఉన్నది కొద్ది వందల మందే అయినా వాళ్ళ కంఠ ధ్వని ఆ లోయంతా ప్రతిధ్వనించేలా కంగుకంగున మోగింది. ఇంతలో చౌఎన్‌లై ఆ పలకలవంతెన మీద ఇటు నుంచి అటు అటు నుంచి ఇటు నడిచివచ్చి మావో దగ్గరకు వెళ్ళాడు. 'కామ్రెడ్ ఛైర్మన్ మనవాళ్ళు ఈ విషయంలో మీ మాట వినరు. ముందు మీరు వెళ్తేగాని వాళ్ళు కదలరు. బయల్దేరడం మంచిది' అన్నాడు. అవతల కామ్రేడ్స్ 'రావాలి, రావాలి' అని నినాదాలు అందుకున్నారు. నేను మాత్రం మౌన ప్రేక్షకుడిలా అంతా చూస్తూ ఉండిపోయాను అంతసేపూ. మావో తన వెనక ఉన్న కామ్రేడ్స్ వంక నదిలో ఉన్న కామ్రెడ్స్ వంకా ఆరాధనాపూర్వకంగా చూసి నాకేసి చూశాడు.

నేను సిగ్గుపడి పోయా అంతసేపూ మౌనవ్రతం పట్టినందుకు, మావో పలకల వంతెన కేసి నడిచాడు. నేనూ ఆయన వెనకే కాలుకదిపా. పరవళ్ళు తొక్కుతున్న నదిని ఆ పలకల వంతెన మీదుగా దాటేసాం.

ఒక రోజు మేం యాంగ్టీ యువాన్జీలో మకాం వేసాం.గార్డ్ ప్ల టూన్ లీడరు, ఇంకొంత మంది బాడీగార్డులు కలిసి తడిబట్టలు పొడారబెట్టడానికి అక్కడా ఇక్కడా పేళ్ళు ఏరుకొచ్చి మంట పెట్టడానికి నానా తిప్పలూ పడుతున్నారు. తడిచిన పేళ్ళు ఒక పట్టాన వెలగడం లేదు. మొత్తానికి మంట రగిలింది. కానీ ఒకటే పొగ, మావో ఉన్న గదిలోకి కూడా పొగ చుట్టేసింది. అప్పుడు ఆయన నూనెలాంతరు వెలుగులో మ్యాప్ ఒకటి ఎదురుగా పెట్టుకుని దీక్షగా ఏవో గుర్తులు పెట్టుకుంటున్నారు. ఎదుటి మనిషి కనబడకుండా పోయేంతగా గదంతా పొగ కమ్మేసింది. ఆ పొగకి మావో దగ్గుతూనే తన పని చేసుకుంటున్నాడు. పొగ మూలాన కళ్ళ నుండి కారుతున్న నీళ్ళు తుడుచుకుంటూ పక్కనే ఉన్న మావో 'అలా చోద్యం చూస్తూ నిలబెడతావే, పెద్దాయన్ని ఈ పొగలోంచి అలా ఆరు బయటి గాలికి తీసుకెళ్ళూ' అని నన్ను గదమాయించాడు. నేను హడావుడిపడుతూ మావో దగ్గరకు వెళ్ళి 'కామ్రేడ్ దేషెంగ్ ఆ మ్యాపు సంగతి పొగ తగ్గాక చూద్దురు బయటికెళ్దాం. రండి' అంటూ మడత కుర్చీలో కూచుని ఉన్న ఆయనకి సాయంగా చెయ్యి అందించా, ఆయన నా చెయ్యి పక్కకితోసేసాడు. మాప్ మీద ఇంకొన్ని గుర్తులు పెట్టాక అప్పుడు తనంతట తనే లేచి నిలబడి దగ్గుతూనే బయటికి వచ్చాడు.

ఆ పాటికి వాన పూర్తిగా నిదానించింది. మబ్బులు తేలిపోయి ఆకాశం నక్షత్రాలతో మిలమిలలాడుతూ కనిపిస్తా ఉంది. మావో గుండెల నిండా ఒకసారి ఊపిరి పీల్చుకున్నాడు. నోట్లో కఫాన్ని బయటికి ఉమిసి కళ్ళ వెంట కారుతున్న నీళ్ళు తుడుచుకుని పొలం గట్లకేసి నడిచాడు. నేను తోకలా ఆయన వెనకే పడ్డా. నేను తన వెనకే వొస్తున్నానని తెలిసి కూడా వెనక్కి తిరిగి చూడలా. అది నాకు చాలా బాధ వేసింది. కామ్రేడ్ మావో నన్ను తప్పుగా అర్థం చేసుకున్నాడేమో అని మనసు పీకులాడుతూ ఉంది.

ఉన్నట్టుండి మావో ఒక చోట ఆగిపోయాడు. తలెత్తి ఆకాశంలోకి చూస్తూ 'అన్నట్టు నీ పేరేంటో' అనడిగాడు.

ఆయన నన్నేనా అడిగిందీ అనుకున్నా మనసులో. నమ్మబుద్ధికాలా మొదట నాకు. అంతలోనే తేరుకుని నిటారుగా నిలబడి ధైర్యమంతా కూడగట్టుకుని 'నా పేరు లీఇంకి యావో కామ్రేడ్ ఛైర్మన్' అన్నా.

'లీ-ఇన్ అంటే వెండి, కియావో అంటే వంతెన 'ఊ' అవునూ జిన్ (అంటే బంగారు) కియావో అని ఎందుకు పెట్టుకోలేదూ? ఏ ఊరేంటి మనదీ' అనడిగాడు మావో నన్ను.

'హైబ్రీ ప్రావిన్సులో యాన్‌పింగ్ కౌంటీ' అని బదులిచ్చా నేను. 'మీ నాన్నగారూ, అమ్మగారూ' అని అర్ధోక్తిలో ఆగిపోయాడు మావో.

'మానాన్న రైతువారీ పనులు చేస్తుంటాడు. వ్యవసాయం పనులు లేనప్పుడు ధాన్యం వ్యాపారానికి వెళ్తుంటాడు. మా అమ్మ ఇంటి పట్టునే ఉంటుంది. వ్యవసాయం పనుల్లో నాన్నకి అప్పుడప్పుడూ సాయంగా వెళుతుంటుంది' అని చెప్పా నేను.

'అచ్చం నా కుటుంబం మాదిరే అన్నమాట' అన్నాడాయన క్షణం ఆగి 'అవునూ, అమ్మానాన్నల్లో నీకు ఎవరంటే ఎక్కువ ఇష్టం' అనడిగాడు.

నేను రకీమని 'మా అమ్మంటే ఎక్కువ ఇష్టం. మా నాన్న చురుకైన మనిషే. లెక్కలూ, డొక్కలూ బాగా ఎక్కువ ఎరుగు. కానీ ముక్కోపి, దానికి తోడు తాగుడు అలవాటు కూడాను. తెగ తాగుతాడు. తిండి తిప్పల్లో కూడా తేడాయే. ఆయనకేమో రోజూ మా అమ్మ కేకులు చేసి పెట్టాల్సిందే. అమ్మతో సహా మేమంతా గోధుమ రొట్టెలు తినేవాళ్ళం. మా అమ్మ మనసు వెన్నలాంటిదనుకోండి. ఎవరినైనా సరే చల్లగా చూసే దయగల తల్లి ఆవిడ' అని బదులిచ్చా నేను అమ్మను గుర్తు చేసుకుంటూ.

'వింటుంటే నీకూ నాకూ సాపత్యం ఎక్కువలా ఉందే. అవునూ ఇంతకీ మీ అమ్మగారూ బౌద్ధమతం పుచ్చుకున్నారా' అనడిగారు మావో.

' ఆ విషయం మీకెలా తెలుసూ' అనడిగా నే ఆశ్చర్యంగా 'నువ్వే చెప్పావుగా మీ అమ్మ మనసు వెన్నలాంటిదని, బౌద్ధమతస్థులు అంతా అలానే ఉంటారు' అని బదులిచ్చాడు మావో.

'ఎప్పుడూ రాజకీయాల గురించి మాట్లాడే ఈయనలో ఇంత సునిశితమైన పరిశీలన ఉందా' అని ఆశ్చర్యపోవడం నా వంతయింది. ఆ క్షణంలోనే మా ఇద్దరి మధ్యన ఉన్న ఎడం మాయమయిపోయినట్లు అనిపించింది. 'అయితే మీ అమ్మగారు కూడా బౌద్ధమతస్థురాలేనా కామ్రేడ్' అనడిగా నేను మావోను.

'అవును, చల్లని తల్లి ఆవిడ. నీకు లాగే నాకు కూడా మా అమ్మగారంటే చాలా ఇష్టం. నేను పసితనంలో ఉండగా మా అమ్మ నన్ను వెంట పెట్టుకుని గుళ్ళూ, గోపురాలు తిరుగుతూ, నాతో కూడా ప్రార్థనలు చేయించేది. నేను పెరిగి పెద్దవాడినయ్యాక అన్నీ మానేశా. ఎవరెంత నిష్టగా ప్రార్థన చేసినా ప్రజల కష్టాలూ కడగండ్లు మత విశ్వాసాలతో తీరేవి కావు' అని బదులు చెప్పాడాయన.

'ప్రార్థించడం కన్నా తిరగబడడమే అందుకు మార్గం' అన్నా నేను. మాబాగా చెప్పావ్ అంటూ మావో నడక సాగించాడు. నేనూ తన వెనకే అడుగు కదిపా. ఉన్నట్టుండి మావో వెనక్కి తిరిగి 'ఇంతకీ నాకు అంగరక్షకుడిగా పని చెయ్యటం నీకు ఇష్టమేనా' అనడిగాడు.

అనుకోకుండా ఎదురయిన ఆ ప్రశ్నకి ఒక్కసారిగా నా గుండె ఆగిపోయినట్లు అనిపించింది. నోటమాటరాలా. తలదించేసుకున్నా ఏమని చెప్పాలి? ఈ పాటికే ఈ డ్యూటీ నాకు ఇష్టం లేదని ఆయన గ్రహించేసినట్లున్నాడు. అసలు విషయం దాచి పెట్టడం కన్నా నిజం ఏమిటో చెప్పేస్తేనే మంచిది అనిపించింది.

'అంటే... నాకు అంతగా ఇష్టం కాదు' అని గొణిగానేను. నా సమాధానం విని మావో మౌనంగా ఉండిపోయాడు కాసేపు. ఆ నిశ్శబ్ధం మహా భయంకరంగా తోచింది. నా జీవితంలో నేనంత నిస్సహాయ స్థితిని ఏనాడూ ఎదుర్కోలా.

గడ్డ కట్టిన నిశ్శబ్ధాన్ని భంగం చేస్తూ, మావోనే 'అలాగా! నీ మనసులో ఉన్న మాట ఏంటోచెప్పి మంచి పని చేసావ్' ఆ రెండు క్షణాలు ఆగి 'అవునూ ఇంతకీ నా దగ్గర పనిచెయ్యడం నీకెందుకని ఇష్టం కాదో తెల్సుకోవచ్చా' అనడిగాడు.

'ఎన్నేళ్ళు నుంచి చేస్తున్నావో ఈ రొడ్డ కొట్టుడు పని. 1938లో నేను మన ప్రజా విముక్తి సైన్యంలో ఆర్డర్లీ (సేవకుడు)గా చేరా. ఇంకా ఎన్నేళ్ళు ఇలా?! నాకయితే శత్రుమూకల మీద దాడిచేసే బలగాల్లో పని చెయ్యాలని ఎంత తహతహగా ఉందో' అని బదులిచ్చా నేను.

'ముప్పై ఎనిమిదో సంవత్సరంలో చేరావా? ఇంకా గార్డుగానే ఉండిపోయావా? అంటే పెద్ద ప్రమోషన్లు గట్రా రానట్లే. ఇంతేనా లేక వేరే కారణం ఏదన్నా ఉందా... అంటే నాతో వేగడం కన్నా ఏ చౌఎన్‌లై దగ్గరో పనిచెయ్యడం ఆరాంగా ఉంటుందనే ఆలోచన ఏదన్నా' అని మావో అంటుండగానే ఆయన నోటివెంట ఆ వాక్యం పూర్తవకుండా నేను కంగారుగా 'లేదు లేదు. మీరు పొరపాటున కూడా అలా అర్థం, చేసుకోవద్దు మన గెరిల్లా దళాలలోనో, దాడుల బలగాల్లోనే పనిచెయ్యాలని ఎప్పట్నించో ఎదురుచూస్తున్నానంతే అన్నా. కాస్త ఊపిరి పీల్చుకుని 'ఈ విషయం కామ్రేడ్ చౌఎన్‌లైకు కూడా తెలుసు. ఆయన దగ్గర కొంతకాలం పనిచేస్తా అప్పుడు ఈ విషయమై ఆయన్తో ప్రస్తావించా.. పరిస్థితి కాస్త చక్కబడ్డాక అలానే చూద్దాంలే అని చెప్పాడాయన. ఆయన దగ్గర ఉంటే అందుకు వీలవునేమో కానీ మీ దగ్గర పనిచేస్తా ఉంటే అలా మిమ్మల్ని అడిగేందుకు వీలు కాదేమో అని వొద్దనుకున్నా అంతే' అని వివరంగా చెప్పి ఊపిరి పీల్చుకున్నా.

'నేను నిన్ను వొదిలి పెట్టనని ఎందుకు అనుకున్నావ్' అనడిగాడు. మావో 'ఎందుకంటే మార్పు అంటే మీరు ఇష్టపడరు కదా' అని బదులిచ్చానేను 'ఏంటీ? మార్పు అంటేనే ఇష్టపడనా? ఎవరు చెప్పారు నీకూ' అనడిగాడు ఆయన.

'ఎవరైతే ఏంలే కామ్రేడ్. ఇప్పటికీ ఆ పాత గుర్రాన్ని మీరు వొదల్రు కదా. మీరు

తొడుక్కునే బట్టలు, రాత పాళీలు, బ్రష్‌లు, ఇంకు సుద్దలు, ఆఖరికి టీ మగ్గులు సహా మార్చడానికి మీరు ఇష్టపడరు కదా. ఇంతకన్నా మంచివి దొరుకుతున్న వాటిని వొదలరయితిరయ్యే. పాత వాటితో మీకు ఏదో తెలీని మానసిక బంధం ఏర్పడిపోయింది అనుకుంటా. ఆ చేతి కర్ర సంగతే తీసుకోండి. ఒట్టి వెదురు ముక్కే కదా! సన్‌జెన్‌గువో ఆ కర్రకు సామాను కట్టి మోసేవారు. యేనాన్ నుండి వెళ్ళిపోతూ ఆయన దాన్ని మీ చేతుల్లో పెట్టిపోయారు. అప్పట్నించి దాన్నే మీరు చేతికర్రగా వాడుతున్నారు. ఇంతకు ముందు ఓసారి అది కొండవాలులో పడిపోతే పోయిందిలే అని కొత్తది తెప్పించుకోలేక వెతికి దాన్నే తెప్పించుకున్నారు. జీవం లేని ఆ కర్ర ముక్కనే మీరు వొదలడానికి ఇచ్ఛగించని వాళ్ళు ఒకసారి మీ దగ్గర అలవాటు పడిన ఈ జీవుణ్ణి అంత తొందరగా వదిలి పెడతారా... నాకైతే బొత్తిగా నమ్మకం లేదు' అన్నా నేను.

దాంతో మావో పగలబడి నవ్వాడు. 'అయితే నువ్వు నన్ను ఎప్పుడూ ఓ కంట కనిపెట్టే ఉంటున్నామన్నమాట. మంచిది, నా గురించి చాలా విషయాలే తెల్సుసుకున్నావు. ఇప్పుడు నువ్వంటే నాకు మరీ ఇష్టం పెరిగిపోయింది. నువ్వు నా దగ్గర పని చెయ్యక తప్పదు అబ్బాయ్. ఏం చేస్తాం? ఎవరో ఒకరం రాజీ పడాల్సిందేగా అన్నాడు.

'అయితే నన్ను రాజీపడమంటారా' అనడిగా నేను 'లేదు లేదు. అది బొత్తిగా అన్యాయం కాదూ, ఇద్దరం రాజీపడదాం సరేనా' అని ఒక్క క్షణం ఆగి మావో చాలా గంభీరంగా 'ఇక్కడ నువ్వొక విషయం అర్థం చేసుకోవాలి. ఇక్కడ ఎవరికి ఎవరూ నౌకర్లూ చాకర్లూ కాదు. మనమంతా ప్రజలకు సేవకులం. విప్లవానికి సేవకులం. నువ్వు నాకు సాయంగా ఉండడం కూడా ఇందులో భాగమే. ఈ వాస్తవం గమనించమని చెప్పి నీకు సర్ది చెప్పడం నా ఉద్దేశం కాదు. ముప్పై ఎనిమిదో సంవత్సరంలో మన ప్రజా విముక్తి సైన్యంలో చేరి ఇంత సీనియారిటీ ఉంచుకుని నువ్వు ఇంకా బాడీగార్డుగా ఉండటమంటే అది నీ సీనియారిటీకి అప్రతిష్టే. అందుకే నిన్ను నాయకుడిగా (లీడర్) నియమిస్తా. నా అంగరక్ష దళానికి నువ్వు నాయకుడిగా ఉందువు' అంటూ వేళ్ళు విరుచుకుంటూ 'అదీ ఓ ఆర్నెళ్ల పాటు సరేనా..అప్పుగానే అనుకో.. ఏమంటావ్' అనడిగాడు.

'అట్లా అయితే సరే' అన్నా నే హుషారుగా.

'శుభం.. అయితే వెళ్ళి యేజిలోంగ్‌తో మాట్లాడు. నా గురించి ఇంకా చాలా విషయాలు తెలుసుకోవచ్చు. ఉండనా మరీ' అంటూ మావో కొండ గుహలో ఏర్పాటు చేసిన తాత్కాలిక ఆవాసంలోకి వెళ్ళిపోయాడు. ఆ తర్వాత నాకు మా ఈ సంభాషణ ముందు జరిగింది ఏమిటో తెలిసింది. నేను తన దగ్గర పని చెయ్యడానికి ఇష్టపడట్లేదు అనే విషయం ఎవరోమావో దగ్గర ప్రస్తావించారట. దానికి ఆయన ముందు

ఆశ్చర్యపోయాడట. ఆ తర్వాత 'అట్లా అని మీరు వేరే మనిషి కోసం వెదుకులాట మొదలెట్టకండి.. నా దగ్గర పని చెయ్యడానికి అతనయితేనే సరైనవాడు' అని చెప్పాడట.

అప్పటిదాకా నా మదిలో ఉన్న నిష్ఠూరాన్ని పక్కన పెట్టేసి నేను మనసా, వాచా నాకు అప్పచెప్పిన పనిని నెరవేర్చాను. విప్లవం పట్ల అంకిత భావం పనిలో నాకు అంత శ్రద్ధను నేర్పింది. తీరుబడిగా కూచోవడం, బద్ధకించడం అనే పదాలు నాకు ఆమడదూరంలో ఉండేవి. పదేళ్ళకు పైగా అటు ఆర్డర్లీగా ఇటు బాడీగార్డుగా పనిచేసిన మూలాన ఎవరి అలవాట్లు ఏమిటో, ఏ నిమిషానికి వాళ్ళకి ఏది అవసరమనే రోజువారీ కృత్యాలు నాకు కొట్టిన పిండి, మావో దగ్గర పనికి కుదుర్చుకున్న కొన్నిరోజుల్లోనే ఆయకు ఏ నిమిషంలో ఏమి అవసరమో ఇట్టే పనిగట్టేసా. మావో నాకేసి చూసే చూపును బట్టి ఆయనకు టీ కావాలో, భోజనం కావాలో, పుస్తకాలు కావాలో, కలం, కాయితాలు కావాలో, ఎవరినీ కలవద్దనుకునే ఏకాంతంకావాలోనే గ్రహించి అన్నీ అమర్చేవాడిని. దాంతో చాలా తడవలు మావో అభినందన పూర్వకంగా నా వీపు తట్టేవాడు. 'మొత్తానికి రాజీగా కుదిరిన మన దోస్తీ బాగానే సాగిపోతుంది. పాదరసంలాగా నీ బుర్ర అని మెచ్చుకునేవాడు.

నేను అప్పుడు మనసులో 'మొత్తానికి అనుకున్నదంతా అయింది. నా పనితీరు బాగా నచ్చిందంటే ఇంక ఈయన నన్ను జన్మకి వొదలడు కామోసు' అనుకునేవాణ్ణి.

1948 ఫిబ్రవరి ప్రాంతంలో సెంట్రల్ కమిటీ ఆఫీసు యాంగ్జీజమావోలో మకాం వేసింది. ఆ రోజు ఎప్పట్లానే నేను టీ తెచ్చి బల్లమీద పెట్టా. మావో ఏదో ఆలోచిస్తూ గంభీరంగా గదిలో అటూ ఇటూ పచార్లు చేస్తా ఉన్నాడు. నేను టీ కప్పు పెట్టేసి అక్కణ్ణించి చల్లగా జారుకోవాలని చూసా. అప్పుడు మావో 'ఇంకియావో' అని నా పేను పెట్టి పిలిచాడు. నే గుమ్మంలోనే ఆగిపోయా. 'నీతో మాట్లాడే పనుంది రా' అని పిలిచాడు. మావో 'చెప్పండి' అంటే నేను వెళ్ళి ఆయన ఎదురుగా నిల్చున్నా.

'ఇవాళ తారీఖు ఎంతో తెలుసా' అనడిగి, 'పంతొమ్మిదో తారీఖు' అని తానే చెప్పి వేళ్ళమీద 'ఆగస్టు' సెప్టెంబరు, అక్టోబరు.. అంటూ నెలలు లెక్కగట్టి 'ఇవాళ ఫిబ్రవరి పంతొమ్మిదో తారీఖు-ఇవాళ్టితో మనం అనుకున్నా ఆరునెలల గడువు ముగిసిపోయింది. ఒప్పందం ప్రకారం నువ్వు ఈ డ్యూటీ వదిలెయ్యచ్చు. రేపటి నుండే, వెళ్ళిపోతావా' అనడిగాడు.

మాటకు కట్టుబడి ఉండాలా, మావో అంటే నాకు కలిగిన ఇష్టానికి కట్టుబడి ఉండాలా అని రెండు నిమిషాలు సతమతం అయిపోయా. చివరికి 'వెళ్తా' అని చెప్పాను.

అప్పుడు మావో కళ్ళలో కదలాడిన నిరాశ నన్ను నిలువునా కదిలించింది. అందుకే

నేను 'కానీ కామ్రేడ్ ఛైర్మన్ మీరు...! అని ఏదో చెప్పబోతుండగా మావో నన్ను వదులుకోవడం ఇష్టం లేని బాధను దిగమింగుకుని చేతులు విసురుగా కదుపుతూ 'ఇంకేం చెప్పొద్దు. నేను ఇచ్చిన మాట మీద నిలబడతాను. నువ్వు వెళ్ళిపోవచ్చు' అన్నాడు.

కానీ నేనూ మావోను వదిలివెళ్ళడానికి సిద్ధంగా లేను. అందుకే 'మీ మాట మీరు నిలుపుకున్నారు. ఒప్పందం ప్రకారం నన్ను పంపించేస్తున్నారు. అక్కడితో ఆ కథ అయిపోయింది. అవసరాన్నిబట్టి మనం ఇంకో ఒప్పందం ఎందుకు చేసుకోకూడదు అనడిగా నేను.

దాంతో మావో మొహంలో నవ్వు విరబూసింది. 'మంచిది. ఇంకేం ఇంకో ఆర్నెల్లకు కొత్త ఒప్పందం కుదుర్చుకుందాం. నువ్వు నా పక్కన ఉండు ఈ ఆర్నెల్లలో హూజోంగ్‌వనాన్‌ను మట్టి కరిపించి తీరదాం' అన్నాడు.

ఈ తరువాత కొద్దిరోజులకే జనరల్ పెంగ్‌దెహుయి దగ్గర నుండి శుభవార్త వచ్చింది. ఇంచువాన్ దగ్గర జరిగి భీకర పోరులో హూకు చెందిన ఏడు బ్రిగేడ్ల సైన్యాన్ని దునుమాడినట్లు, కొమింటాంగ్ ఇరవై తొమ్మిదవ దళ కమాండర లియుకాన్ కూడా హతమయిపోయినట్లు సందేశం అందింది.

1948 ఆగస్టు ప్రాంతంలో మేం జిబైపో ప్రాంతంలో మకాం వేసి ఉన్నాం. అప్పుడు ఒకరోజు మావో నన్ను పిలిచి 'ఇంకియావో మన మధ్య కుదిరిన రెండో ఒప్పందం గడువు కూడా అయిపోయింది. కానీ నిన్ను ఇంకో ఆర్నెల్లు అప్పుగా నా బాడీగార్డుగానే ఉంచుకోవాలి అనుకుంటున్నా. ఈలోగా నువ్వు ఏకంగా చాంగ్-కై-షేక్ పతనాన్ని చూడొచ్చు' అన్నాడు.

నా మనసులో ఉన్నమాటే ఆయన్తో చెప్పాను. రెండవ దఫా ఆర్నెల్లు మావోకు బాడీగార్డుగా పనిచేసే సమయంలో అతి సామాన్యంగా కనిపించే ఆయనలో నిబిడీకృతమై ఉన్న అపారమైన మేధస్సు, గొప్ప మానసిన స్థైర్యం, చరిత్రను నిర్మించగల సత్తాను గ్రహించాను. ప్రజల హృదయాలను కొల్లగొట్టాడు మావో. మావో వ్యక్తిత్వం నన్ను కట్టిపడేసింది. జీవితాంతం మావో దగ్గరే పని చెయ్యాలనే నిర్ణయానికి వచ్చా. ఆ ప్రకారమే ఇష్ట పూర్వకంగా మావో దగ్గర పనిచేసా.

1953లో మావో అంగరక్షక దళానికి డిప్యూటీ కమాండర్ అయ్యాను. ఒక రోజున మావో 'నువ్విప్పుడు కమాండర్‌వి అయిపోయావ్ కాబట్టి రోజూ గార్డు డ్యూటీకి రానవసరం లేదేమో. ఇక నుండి- నీ దర్శనం లభించడం కష్టమయిపోతుందనుకుంటా కానీ నా కలా ఇష్టం లేదబ్బాయ్. వారానికి రెండుసార్లయినా నువ్వు డ్యూటీ మీద వాస్తే బావుండు. నిన్ను చూడందే, నీతో మాటాడంతే ఉండలేను అనిపిస్తుంది ఏమంటావ్'

అనడిగాడు నవ్వుతూ. దానిదేం భాగ్యం, అలాగే కామ్రేడ్ అన్నా నేను.

1956లో నేను కమాండర్‌గా పదోన్నతి పొందా. అయినా వారానికి రెండు రోజులు మావోకు బాడీగార్డుగా పనిచేసే అలవాటు మానుకోలేదు.

1962లో నన్ను టియాన్‌జిన్‌లో పనిచెయ్యమని ఆర్డరు వేసారు. ఆ రోజున మావోను కలవడానికి వెళ్ళాను. నే వెళ్ళేసరికి మంచానికి తలకట్టున దిళ్ళు ఆనించి జారుగా వాలగిలబడి ఫీవో డాక్యుమెంట్లు చూసుకుంటున్నాడు. ఆయన చదవడం అయ్యాక వెళ్దాంలే అని నేనలా గుమ్మం దగ్గరే నిశ్శబ్దంగా ఉండిపోయా, ఇంతలో 'దా ఇంకియావో అక్కడే ఆగిపోయావే! అని పిల్చాడు మావో. ముఖానికి కాయితాలు అడ్డంగా ఉన్నా నా రాకను ఎలా పసిగడతాడో మా మధ్య ఉన్నఅనుబంధమా లేక జనాలు అనుకునేట్టు సిక్స్‌సెన్స్ లాంటిది ఏవన్నా ఉందా ఈయనకి అనుకున్నా నే మనసులో.

నే వెళ్ళి మంచం పక్కన నిలబడ్డాను. ఆయన ఓ చేత్తో, నా చెయ్యి పుచ్చుకుని ఇంకో చేత్తో నా వీపు తట్టాడు. 'వెళ్ళిరా' అన్నట్లు. అంతే ఉద్వేగాన్ని ఆపుకోలేక నేను ఏడ్చేసా. మావో కూడా కళ్లనీళ్ళు పెట్టుకున్నాడు. 'నేను మీ దగ్గర పనిచెయ్యను మొర్రో అన్నప్పుడు ఆర్నెల్లు అప్పు మీద పన్జెయ్ అంటూ నన్ను మీ దగ్గర కట్టిపడేసారు. తీరా ఇప్పుడు నేను ఎక్కడికి పోను మీ దగ్గరే పన్జేస్తాను అంటుంటే నన్ను పంపించేస్తున్నారు. నా వల్లయ్యే పనేనా' అనడిగా నేను.

'నాకూ అదే బాధగా ఉంది మిత్రమా అని నిట్టూరుస్తూ' నేను నా కన్నబిడ్డల్ని ఏడాదికి రెండుమాట్లో మూడుమాట్లో చూస్తాను కానీ నిన్ను చూడందే నాకు పొద్దుగడవని పరిస్థితి. నా కన్న బిడ్డల కన్నా ఆత్మీయుడివి అయిపోయావ్. నిన్ను వొదిలి ఉండడం నాకు కష్టమే. కానీ నా కోసం నీ కెరీర్‌కు నష్టం కలిగించడం భావ్యం కాదు కదా. ఎంత కాలం నా అంగరక్షక దళానికి కమాండర్‌గా ఉండిపోతావ్. రెజిమెంటల్ సైన్యంలో పని చెయ్యాలన్న నీ కోరిక ఎప్పుడు తీరుతుంది. నువ్వు ఇంతకన్నా గొప్ప గొప్ప హోదాల్లోకి ఎదగాలి. అందుకే. అని మావో అంటుండగా 'నాకు ఏ హోదాలు వొద్దు, మీ కాడ పనిచెయ్యనియ్యండి చాలు' అని నే భోరున ఏడ్చాను ఆ క్షణాన.

మావో నన్ను సముదాయించి, సర్ది చెప్పాడు. వెళ్ళాల్సిందే' అని మానసికంగా నన్ను సిద్ధం చేసాడు. 'ఇంకియావో ఈ మావో చనిపోయాక కూడా నువ్వు ఏడాదికి ఓ మారయినా నా సమాధి దగ్గరకొచ్చి కనిపించాలి. అన్నాడు. 'అదేం మాట కామ్రేడ్' అన్నా నే తేరుకుంటూ.

ఆ తరువాత కొద్దిరోజులకే బాధా తప్త హృదయంతో నేను మావోను విడిచి వెళ్ళాను. కొత్త బాధ్యతలు స్వీకరించడానికి.

# ౨. సవాళ్ళకు 'సై'

మావో గుణగణాల్లో కొట్టొచ్చినట్లు కనబడేది ఏంటంటే ఎటువంటి సవాళ్ళను ఎదుర్కోవడానికయినా సదా సంసిద్ధంగా ఉండడం. కొమింటాంగ్ సైన్యం విసిరిన సవాళ్ళ నుండి ప్రతీఘాతకులు విసిరిన సవాళ్ళ వరకూ మావో ఈ షణ్మాత్రం వెరిచేవాడు కాదు. జీవిత పర్యంతం మావో విజేతగానే నిలిచాడు. పొగిడినప్పుడు పొంగిపోయి విమర్శలకు కుంగిపోయే రకం కాదు. ఎంతటి విషమ సవాళ్ళనయినా నిలకడగా ఎదుర్కొన్నాడు. విజయం సాధించడమే లక్ష్యంగా పనిచేసేవాడు.

కొమింటాంగ్ సైన్యంతో ప్రజా విముక్తి సైన్యం యుద్ధం చేసినంతకాలం శత్రువుని దెబ్బతియ్యడంలో మావో ప్రదర్శించిన ధైర్య సాహసాలు అనితరసాధ్యం. కొమింటాంగ్ సైన్యాన్ని ఏం మాత్రం లెక్క చేసేవాడు కాదు. గొప్ప విశ్వాసంతో, వాళ్ళ పనయిపోయింది అనే ధీమాతో ఎత్తుగడలు వేసి విజయం సాధించేవాడు. మావోలో ఉన్న అపారమైన విశ్వాసం, ప్రజావిముక్తి యుద్ధంలో ఎలాగైనా గెలిచి తీరాలనే పట్టుదల ఒక్కోసారి తలకు మించిన పనులు ఎత్తుకోడానికయినా వెనుదీయని గుణాన్ని అబ్బించింది అనుకుంటా.

1947లో లాంతర్ల పండగ అయిన కొద్ది రోజులకే 230,000 మంది సైన్యంతో హుజోంగావాన్ సరిహద్దుల వైపు నుండి ఐదు మార్గాల గుండా యేనాన్ మీదకి బయల్దేరాడని, మెరుపుదాడులు చెయ్యడానికి సియాన్‌లో పారాట్రూపర్ దళాల్ని సిద్ధంగా ఉంచాడనే గూఢచారి వర్తమానం అందింది. దాంతో జనరల్ పెంగ్‌దెహుయి యేనాన్ వైమానిక స్థావరం వద్ద రక్షణ బలగాలను మోహరించి వచ్చిన మావోను తక్షణం యేనాన్ విడిచి వెళ్ళమని కోరాడు.

కానీ మావో అందుకు తిరస్కరించాడు. 'మనం ఇక్కడ నుండి ఖాళీ చెయ్యాల్సివస్తే వరసలో చిట్ట చివరివాడిగా' ఉంటాను. అయితే అయింది. కానీ నాన్ సైన్యానికి, మన తడాఖా చూపిద్దాం' అన్నాడు.

మేం ఇదంతా విన్నాంకానీ మావో మాటల్ని సీరియస్‌గా తీసుకోలేదు. కానీ జనరల్ పెంగ్ మా దగ్గరకు వచ్చి కాస్త కటువుగా 'ఆయన మాటల్ని ఆషామాషీగా తీసుకోకండి. కామ్రేడ్ మావో మొండిఘటం. ఏదన్నా మాట అన్నాడంటే మాటే. ఆయన తన వ్యక్తిగత రక్షణ కోసం అంటూ ఏం ఆలోచించడు. కానీ పార్టీ వేరేగా నిర్ణయం తీసుకుంది. ఈ

విషయంలో మీరు పార్టీ నిర్ణయాన్ని దృష్టిలో ఉంచుకోండి. ఆయన కదలనని భీష్మించుకు కూర్చున్నా అవసరమైతే పార్టీ ఆదేశిస్తే మీరు బలవంతంగానైనా ఆయన్ని ఎత్తుకు వెళ్ళడానికి సిద్ధంగా ఉండాలి సరేనా' అన్నాడు.

జనరల్ పెంగ్ మావోను కాచివడబోసినట్లు అర్ధం చేసుకున్నాడని మాకు తొందరగానే అర్ధం అయింది మావో ఎంతకీ తన మాట మీదే పట్టుగా ఉన్నాడు.

మార్చి 13వ తేదీన హుజోంగ్‌నాన్ బలగాలు యేనాన్‌మీద రెండు వైపుల నుండీ దాడులు మొదలుపెట్టాయి. రోజూ దాదాపు యాభై యుద్ధ విమానాలు అకాశం నుండి బాంబులు కురిపిస్తూ ఉన్నాయి. పార్టీ నిర్ణయం మేరకు మనం ఇక్కణ్ణించి ఖాళీ చేద్దాం కామ్రేడ్ అని మావోను సతాయించినప్పుడల్లా ఆయన 'ఉండదర్రా, హూ పారాట్రూపర్లు ఎలా ఉంటారో, వాళ్ళ సత్తా ఏంటో చూడకుండా ఎలా వెళ్ళడం' అనేవాడు.

ఒకసారయితే మావో ఉంటున్న ఇంటి పెరట్లో బాంబు పేలింది. ఆ పాటికి మావో ఒకచేత్తో టీకప్పు పట్టుకుని ఇంకో చేత్తో నిలువుబల్లపై ఉన్న 'మ్యాప్' మీద గుర్తులు పెడతా ఉన్నాడు. బాంబు పేలడంతో అంతటా పొగ కమ్మేసింది. మేం చాలా కంగారుపడ్డాం. మేం తేరుకుని కమ్ముకున్న పొగ నిమ్మదించాక లోపలికి వెళ్ళి చూద్దుం కదా. మావో యధావిధిగా ఓ చేత్తో టీ కప్పుతో ఇంకో చేత్తో ప్రజా విముక్తి దళాల కదలికలను 'మాప్ మీద నమోదు చేస్తూ కనిపించాడు. కప్పులోంచి చుక్కటీ కూడా కింద ఒలికిన దాఖలా లేకపోవడంతో మావో నిబ్బరానికి మాకు దిమ్మ తిరిగిపోయింది.

ఇంతలో స్టాఫ్ ఆఫీసర్ ఒకతను పెరట్లో పేలిన బాంబు తాలుకు ఇనుప ముక్క ఒకటి తీసుకుని హడావుడిగా లోపలికి వచ్చి 'చూడండి, వెంట్రుకవాసిలో ప్రమాదం ఎలా తప్పిపోయిందో ఇంక లాభంలేదు కామ్రేడ్ ఛైర్మన్, మనం వెంటనే ఇక్కణ్ణించి బయల్దేరాల్సిందే' అన్నాడు.

మావో అతని చేతిలోంచి ఆ ఇనుపముక్క తీసుకుని అరచేత్తో బరువుతూచి 'దీన్తో రెండు చాకులు తయారు చెయ్యెచ్చు ఆ పన్లో ఉండండి' అని ఇనుపముక్కని వెనక్కి ఇచ్చేసాడు. ఆయన కదిలే రకం కాదని చెప్పకనే చెప్పాడు.

16వ తేది మధ్యాహ్నం కామ్రేడ్ మావో, చౌఎన్‌లై, పెంగ్ దెహూయాలతో సమావేశం అయ్యారు. వారం క్రితం తలకు ఎర్రపీలికలు కట్టుకుని తుపాకులు, కత్తులు, పలుగు, పార- ఇలా చేతికి ఏ ఆయుధం దొరికితే అది చేతబట్టి సరిహద్దులను కాపాడుతాం' అని మిన్నంటే నినాదాలతో సాగిన అపూర్వ ప్రజా ప్రదర్శన గురించి సమీక్ష జరిపారు. 'ప్రజలు చైతన్యవంతులయ్యారు. వాళ్ళిప్పుడు తుపానులా విరుచుకుపడడం ఖాయం'

అని విశ్లేషించారు.

మావో మాటలు పూర్తికాక ముందే శత్రుయుద్ధ విమానాలు రెండు భారీ బాంబులు కురిపించాయి. ఒక బాంబు, మావో వాళ్ళున్న గది గుమ్మం ముందు పేలింది. కిటికీ తలుపులు ముక్కచెక్కలయ్యాయి. మేం హడావుడిగా లోపలికి దూసుకుపోయాం. బాంబు పేలుడు ధాటికి ఒంటినున్న బట్టలమీద ఎగిసిపడిన మట్టిని దులుపుకుంటూ కనిపించాడు మావో. ఆందళనగా లోపలికి ప్రవేశించిన మాకేసి చూసి నవ్వుతూ 'చూసారా వాళ్ళు వేసిన బాంబులు నామీద ఇంత దుమ్ము పోసాయి తప్ప కనీసం నేను బ్యాలన్సు తప్పి కిందపడేలా కూడా చెయ్యలేకపోయాయి. కానీ మనవాళ్ళు మాత్రం వాళ్ళమీద ఉప్పెనలా విరుచుకుపడి కూకటివ్రేళ్ళతో సహా పెకలించడం ఖాయం' అన్నాడు . దాంతో అక్కడ ఉన్న మా అందరి మొహాల్లో ఆందోళన మటుమాయం అయి ఆనందం వెల్లి విరిసింది.

ఆ రోజు సాయంత్రం యుద్ధ రంగంలో తాజా పరస్థితి గురించి మావోకు నివేదించడానికి వచ్చిన ఇద్దరు ఆఫీసర్లు వివరాలన్నీ చెప్పాక 'కామ్రేడ్ ఛైర్మన్ మీకు ఇక్కడ ఉండడం అంత క్షేమము కాదు. యేనాన్ విడిచి వెళ్ళడం మంచిది' అన్నారు. మావో ఒక చేత్తో బల్లమీద దరువేస్తూ ఇంకో చేతిని వాళ్ళకేసి అడ్డంగా ఊపుతూ 'ఈ విషయం గురించి నేనేం వినదలుచుకోలేదు.కొత్త సంగతులు ఏమన్నా ఉంటే చెప్పండి. నేను ఇంతకు ముందే చెప్పాను. అదే పరిస్థితి వస్తే యేనాన్ నుండి వెళ్ళే చివరి వ్యక్తిగా ఉంటాననీ' అన్నాడు.

'నేను ఇంతకు ముందే చెప్పాను' అనే మావో మాట ఎంత నికార్సయినదో, జనరల్ పెంగ్‌మాతో 'మావో' మహా మొండిఘటం, మాటంటే మాటే' అని ఎందుకు అన్నాడో అప్పుడు మాకు అర్థం అయింది.

18వ తేది సాయం సంధ్య వేళ మావోను కలవడానికి వాంగ్‌జెన్ వచ్చాడు. ఆ పాటికే ఈశాన్యం దిక్కునుండి తుపాకీ గర్జనలు వినిపిస్తున్నాయి. అంటే శత్రు బలగాల 'అడ్వాన్స్ ట్రూపు' పుజియా జావోయువాన్ చేరుకుందన్నమాట.

ఇంతలో దబాదబా అడుగుల శబ్దం వినబడింది. ఆ మరు నిమిషంలోనే జనరల్ పెంగ్ ప్రత్యక్షమయ్యాడు. జనరల్ పెంగ్ చురుగ్గా నడుస్తాడు. కానీ ఇలా పరుగెత్తినట్లు రావడం నే చూడ్డం ఇదే మొదటిసారి. రొప్పుతూ రోజుతూ మాకేసి చూసి 'ఏంటి' ఇంకా చోద్యం చూస్తూ నిలబడ్డారిక్కడ. వెంటనే ఇక్కణ్ణించి మకాం ఎత్తేయ్యండి. ఒక్క క్షణం కూడా ఆలస్యం కావడానికి వీల్లేదు మావోను వెంటనే తీసుకెళ్ళండి ఇక్కణ్ణించి అని కరిచినట్లు చెప్పాడు.

అప్పటికి మాకు నషాళానికి అంటింది ప్రమాదం ముంచుకొచ్చేసిందని. మాలో

ఒక గార్డు తలుపయినా తట్టకుండా మావో ఉన్న గదిలోకి దూసుకువెళ్ళాడు. 'కా(మ్రేడ్ ఛైర్మన్ జనరల్ పెంగ్ మా మీద కారాలు మిరియాలు నూరుతున్నాడు. మనం తక్షణమే ఇక్కణ్ణించి బయల్దేరాలి' అన్నాడు.

ఈలోగా వాంగ్‌జెన్ చౌ-ఎన్-లైలు కూడా లోపలికి, వచ్చి 'తప్పదు కా(మ్రేడ్, మీరు బయల్దేరాలి' అన్నారు కోరస్‌గా, కుర్చీలో కూచుని ఉన్న మావో 'మన కా(మ్రేడ్స్ అందరూ బయల్దేరారా' అనడిగాడు.

'ఎప్పుడో' అని సమాధానం చెప్పాడు. జనరల్ పెంగ్ 'మరి ఇక్కడి జనాతో అనడిగాడు మావో.

'వాళ్ళు కూడా, ఎవ్వర్నీ మిగలనీయకుండా అందర్నీ బయల్దేరదీసాం' అని చెప్పాడు పెంగ్.

'మంచిదయితే' అన్నాడు మావో. అందరూ ఖాళీ చేసాకే తను యేవాన్ వొదిలేది" అన్న మాట ప్రకారం ఇప్పుడైనా ఆయన లేచి బయల్దేరతాడు అనుకున్నాం. తీరా ఆయన 'నా క్కాస్త భోజనం తెప్పించండి' అని తాపీగా అడిగేసరికి మాకు మతిపోయినంత పనయింది.

శత్రు సైనికుల తుపాకి మోతలు, చేతి బాంబుల పేలుళ్ళు అంతకంతకు దగ్గరగా వినవస్తున్నాయి. అప్పటికే మేం కంగారు గొడ్లలా కాళ్ళు తొక్కుకుంటున్నాం. ఇటు చూస్తే ఈయనేమో ఈ సమయంలో తిండి పట్రండి అని అడిగాడు. అలాగే పడుతూ లేస్తూ ఆ పాటికే సర్దేసిన తిండి ఓ ప్లేటులో సర్దితెచ్చి మావో ముందు పెట్టాం. మామూలుగా అయితే మావో భోజనం తినడంచాలా తొందరగా ముగిస్తాడు. కానీ ఆ పూట చాలా తాపీగా తింటూ ఉన్నాడు. హూ పారా టూపర్లను చూసి కాని కదిలేలా లేడు ఈయన అనుకున్నాం మేం మనసులో.

ఇంతలో మళ్ళీ జనరల్ పెంగ్ వచ్చాడు. ఒక కాలు గుమ్మం లోపల ఇంకో కాలు బయటపెట్టి 'ఏంటి కా(మ్రేడ్ ఛైర్మన్ మీరంత తాపీగా తింటున్నారు. హూ గాడి పారా ట్రూపర్లను మీరు చూసేదేంటి? వాళ్ళ సంగతి చూసుకోవడానికి మనవాళ్ళు చాలరా? మీరింకా బయల్దేరరా అనడిగాడు మావోను. పెంగ్ ఆందోళనగా హడావుడి పడుతున్నా మావో మీదపడి ఆయన చేతుల్లోంచి పుల్ల చెంచాలు లాక్కుని ఆయన్ని బయల్దేరదీసేలా ఉన్నాడు. ఉన్నట్టుండి పెంగ్ మాకేసి తిరిగి బొమ్మలాట చూస్తున్నారా, కానీండి, చకచకా అన్నీ సర్దేసి బయల్దేరండి' అని అరిచాడు.

సెక్రటరీలు హడావుడిగా గదంతా సర్దేస్తూ ఉన్నారు. బయటకారు ఇంజను ఆడతానే

ఉంది. మావో తాపీగా లేచి సుబ్బరంగా సర్దేయ్యండి అబ్బాయిలూ,పెంగ్ చెప్పాడు కదా' అని త్రేనుస్తూ' ఒక్క కాయితం ముక్క కూడా దొరకనీయ మాకండి. పుస్తకాలు మాత్రం వొదిలెయ్యండి. హు సైన్యంలో కుర్రాళ్ళు ఈ మార్క్సిజం-లెనినిజం పుస్తకాలు చదివన్నా బాగుపడతారేమో! అన్నాడు.

ఆయన నోట్లోమాట నోట్లో ఉండగానే అందరం పడి గదిలో సామానంతా మూట కట్టేసాం. ఖాళీ అయిన గదిని ఓ మాటు కలియచూసి అప్పుడు బయటకు అడుగుపెట్టాడు మావో. నడ్డిమీద రెండు చేతులూ ఆన్చి నిలబడి మా అందరికేసీ చూసాడు. తర్వాత తుపాకులు, బాంబుల మోతలు వినవస్తున్న దిశగా తలపంకించాడు. ఈశాన్యం దిక్కున ఉన్న పగోడా కేసి దీక్షగా చూసాడు కాసేపు. పెదాల కొసలకు ఊరిన నీళ్లని జుర్రున గొంతులోకి లాక్కుంటూ 'నాకేమో పారాట్రూపర్లను చూడాలని మా కోరికగా ఉంది. ఆ మాటంటే చాలు జనరల్ పెంగ్ రయ్యిన లేస్తున్నాడు. మా కుర్రాళ్ళు చూసుకుంటారు. వాళ్ళ సంగతి అంటున్నాడాయె జనరల్ పెంగ్‌కు ఇంకా కోం తెప్పించడం మర్యాదగా ఉండదు. కానీండి, బయల్దేరండి' అన్నాడు.

చకచకా జీపు కేసి నడిచి ఎక్కి కూచున్నాడు. మాకేసి తిరిగి ఎక్కండి ఎక్కండి తిరిగి ఎట్లాను మళ్ళీ ఇక్కడికి తిరిగి రావల్సిన వాళ్ళమే అన్నాడు.

ఒక ఏడాది తరువాత 'నే ముందే చెప్పానా' అని మావో వాడే ఊతపదం చౌ-ఎన్-లైకు గొప్ప చిక్కు తెచ్చి పెట్టింది.

యేనాన్‌కు ఈశాన్యం దిక్కున ప్రజావిముక్తి సైన్యం శత్రు బలగాలకు చెందిన ఐదు బ్రిగేడ్ల సైనికులను, 29వ ప్లటూన్ కమాండరను హతమార్చింది. (ఈ యుద్ధానికి మావోయే స్వయంగా పక్కా ప్రణాళిక రూపొందించాడు) ఆగ్నేయం దిక్కున కూడా శతృమూకల మీద ప్రజావిముక్తి సైన్యం దాడులు, ప్రతి దాడులను నికరంగా పర్యవేక్షించడానికి మావోను అక్కడి నుంచి తూర్పుదిశగా ఉన్న పచ్చనది వైపుకు తరలించడమే ఉత్తమమని పార్టీ భావించింది.

పార్టీ సమిష్టి నిర్ణయానికి ఎవరైనా కట్టుబడి ఉండాల్సిందే అన్న నిర్మాణ సూత్రం ఔదల దాల్చడానికి మావో మళ్ళీ యేనాన్‌కు తిరిగి రాలేదు కానీ, లేకపోతే ఆయన అన్నంత పనీ చేసేవాడే. చౌ-ఎన్-లై, రెన్‌బిషిలు ఇరువురూ నేర్పుగా వ్యవహరించి పచ్చనది దాటి వెళ్ళడానికి మావోను ఒప్పించారు. మొదట ఈ విషయం ప్రస్తావించినప్పుడు మావో మాత్రం ససేమిరా అన్నాడు. 'నే ముందే చెప్పా కదా. హుజోంగ్‌నాన్‌ను ఓడించందే నేను నది దాటి వెళ్ళేది లేదనీ' అని మంకు పట్టు పట్టాడు. అప్పుడు చౌ-ఎన్-లై' అయితే కామ్రెడ్ మనం యిచువాన్‌లో ఓడిపోయినట్టా గెలిచినట్లా

అనడిగాడు మావోను.

'యిచువాన్‌లో మనం విజయం సాధించాం. అదొక చారిత్రక విజయం. ఈ సత్యాన్ని ఎవరూ కాదనలేరు' అని బదులిచ్చాడు మావో. 'మరికనేం యిచువాన్‌లో మనం విజయం సాధించామంటే హూ ఓడినట్లేగా. మీరు అన్నట్లు అది చారిత్రక విజయమే కాబట్టి మీరు ఇంకా ఇలా పట్టుబట్టడంలో అర్థం లేదు. తుది విజయం సాధించడానికి పదాతి దళాలను, రిజర్వు దళాలను సెంట్రల్ వర్కింగ్ కమిటీ సమన్వయ పరిచి ముందుకు నడిపించాలి కదా. ఆ పని చెయ్యడం కోసమే మీరు మా మాట విని పచ్చనది దాటి బయల్దేరండి' అని చౌ-ఎన్-లై మావోకు చెప్పాడు.

'అంటే మనం ఇప్పుడు ఉత్తర షాంగ్సీవైపుకు బయల్దేరాలా' అనడిగాడు మావో.

'సరిగ్గా చెప్పారు. అక్కణ్ణుంచి అయితేనే మన పర్యవేక్షణ, కార్యకలాపాలు చురుగ్గా సాగుతాయి' అన్నాడు చౌ-ఎన్-లై.

ఆ తరువాత ఉత్తర షాంగ్జీలో కూడా మాకు గడ్డు పరిస్థితి ఎదురయింది. అయినా అక్కణ్ణించి మకాం వేరే చోటకు తరలించడానికి మావో ఒప్పుకోలేదు. 'నిజమే.. నన్ను నది దాటి వెళ్ళమని చాలా టెలిగ్రామ్‌లు వచ్చాయి. అక్కడయితే ప్రశాంతంగా పనిచెయ్యచ్చు కూడా, నే కాదనట్లా, అయితే నా అభ్యంతరం ఏంటో మీరు అర్థం చేసుకోవాలి. యేనాన్‌లో పదేళ్ళపాటు ప్రశాంతంగా పనిచేసా. ఇప్పుడు శత్రువు ముందుకు చొచ్చుకువస్తున్న సమయంలో నేను మకాం మార్చడానికి సిద్ధపడడమంటే ఈ షాంగ్జీ ప్రజల సాక్షిగా నేను శతృవుకి వెన్ను చూపుతున్నట్లే.అందుకే మనం ఇప్పుడు పచ్చనదిని దాటబోవటం లేదు' అని చెప్పాడు మావో. 'ఇంకా రెండో కారణం కూడా చూద్దాం. హూ రెండు లక్షల మంది భారీ సైన్యంతో వస్తున్నాడు. మనం చూద్దామా ఇరవై వేల మందిమి ఉన్నాం. అంటే ఒకటికి పది తలకాయలు అన్నమాట. మన మిగతా దళాలు కూడా దేశంలోని వివిధ ప్రాంతాలలో ఇదే పరిస్థితిని ఎదుర్కొంటున్నాయి. చెప్పాలంటే వాళ్ళకన్నా మనం ఇంకా మెరుగైన పరిస్థితిలో ఉన్నామేమో. కాబట్టి 'హూ' గాడిని మట్టి కరిపించందే మన ఇక్కణ్ణించి బయల్దేరేది లేదు. మిలిటరీ వ్యవహారాల ఇన్‌ఛార్జి'గా పార్టీ నాకు బాధ్యతలు అప్పచెప్పింది. ఆ బాధ్యత నెరవేర్చాలంటే నేనిక్కడే ఉండాలి కదా. మన ప్రజా విముక్తి దళాలు ఇప్పుడిప్పుడే కొన్ని చోట్ల పై చెయ్యి సాధించి విముక్తి ప్రాంతాలను ప్రకటించాయి. అవి నిలబెట్టుకోవాలన్నా నేను ఇక్కడ ఉండడమే కరెక్టు. నేను ఇక్కడ ఉండగా చాంగ్‌కైషేక్ హూ సైన్యాన్ని ఇక్కణ్ణించి వేరే చోటకి, మన వాళ్ళు సాధించిన విముక్తి ప్రాంతాలకు తరలించే ధైర్యం చెయ్యడు. చాగ్‌కై షేక్ సర్వసేనాన్ని మనం ఇక్కడ అష్టదిగ్బంధనం చేసినట్లే కదా. ఈ వెసులుబాటు మనవాళ్ళు మిగతా

చోట్ల చెలరేగిపోవడానికి అని వివరించాడు. అప్పటిదాకా మావోది మంకుపట్టు అనుకున్న మాకు ఆయన యుద్ధ వ్యూహ చతురత ఏమిటో అర్థమైంది.

యేనాన్ విడిచిపెట్టాక ఝూవోలిస్‌గోవ్‌లో కేంద్రకమిటీ సమావేశం జరిగింది. పొలిట్ బ్యూరోలో ఉన్న ఐదుగురు సభ్యుల మధ్య-మావో, చౌ-ఎన్-లై, ఛైటే, లీషావ్‌చి, రెన్‌బిషి-పని విభజన జరిగింది. 'పార్టీ ముందు బహుముఖ కర్తవ్యాలు ఉన్నాయి. అయితే చాంగ్‌కైషేక్‌ను సైనికంగా ఓడించడమే పార్టీ అత్యంత ప్రాధాన్యతా కర్తవ్యం' అని కేంద్ర కమిటీ తీర్మానించింది. పొలిట్ బ్యూరో స్టాండింగ్ కమిటీ మావోను మిలిటరీ వ్యవహారాల ఇన్‌ఛార్జిగా నియమించింది. తద్వారా మావో ప్రజావిముక్తి సైన్యం సుప్రీం కమాండర్ అయ్యాడు. మావోకు మిలిటరీ ఆపరేషన్స్‌లో సహాయకుడిగా చౌఎన్‌లైకు బాధ్యతలు అప్పచెప్పారు.

ప్రజా విముక్తి యుద్ధం కడదాకా నేను మావో, చౌఎన్‌లైలకు అత్యంత సన్నిహితంగా మెలిగాను. కీలకమైన, వ్యూహాత్మక అంశాలను మావో చౌతో చర్చించాకే నిర్ణయాలు తీసుకునేవాడు. దేశంలోని వివిధ ప్రాంతాలలో ప్రజా విముక్తి పోరాటానికి సంబంధించిన ప్రతి వివరాలన్నీ మావో క్షుణ్ణంగా అధ్యయనం చేసి మరీ పక్కాగా ప్రణాళిక రచించేవాడు. చౌ-ఎన్-లై ప్రతి విషయంలోనూ మావోకు సహాయకారిగా ఉండేవాడు.

ఒకసారి వాంగ్‌జెన్‌తో మావో ఇలా చెప్పాడు-'నేను ఎక్కడున్నా దేశంలో ఉన్న మనవాళ్ళు అందరితో రేడియో కాంటాక్టులో ఉంటా. యేనాన్‌లో ఉన్నప్పుడు కూడా మనవాళ్ళు అందరితో ఇలానే సంబంధాలు పెట్టుకున్నా', చైనాలో ఆనాడు జరిగిన ప్రజా విముక్తి పోరాటాలు అంతకంతకూ విస్తరించే కొద్ది రేడియో ఆపరేటర్లకు విపరీతమైన పనిభారం పడేది. ఈశాన్యంలో ఉన్న లియోగి-షెన్‌యాంగ్‌లో ప్రచార ఆందోళనలు, విముక్తి పోరాటాలు నడుస్తున్నప్పుడు మావో అక్కడ ఒక్కచోటికే డెబ్బై ఏడు టెలిగ్రామ్‌లు పంపించాడు. సందేశాలన్నీ మావోనే స్వయంగా రాసేవాడు. సందేశం అంటే రెండు మూడు వాక్యాలతో ముగిసేది కాదు. క్షుణ్ణంగా అన్ని వివరాలతో ఉపన్యాస ధోరణితో ఉండేది. ఏదన్నా పెద్ద ఎదురుదాడిని ఎదుర్కోవాల్సివస్తే ఆహారానికి కటకటలాడకుండా అవసరమైతే గుర్రాల్ని వధించి ఆహారంగా వాడుకోమని కూడా సలహా ఇవ్వడం నాకు బాగా గుర్తు.

ఉత్తర షాంగ్జీలో జరిగిన యుద్ధం తొలి ఆరు నెలల కాలంలో మావో కఠినమైన సవాళ్ళు అనేకం ఎదుర్కొన్నాడు. ఉన్న చోట్ల ఉండకుండా పన్నెండు కౌంటీలలోని ముప్పై ఏడు పల్లె పట్టణాల్లో మకాం మారుస్తూ రావాల్సి వచ్చింది. దాదాపు రోజూ హూ బలగాలతో ఎక్కడో అక్కడ తలపడాల్సి వచ్చింది. ఇక్కడ ఈ యుద్ధంతో పాటు,

దేశవ్యాప్తంగా జరుగుతున్న ప్రజావిముక్తి యుద్ధాన్ని ముందుకు నడిపించే బాధ్యత ఉన్నా మావో అత్యంత సమన్వయంతో రెండు బాధ్యతలూ నిర్వహించారు. యావత్ చైనాలోనే ఇలాంటి నాయకుడు దొరకడం అరుదైన విషయం. 'నాయకులు' అనే పుస్తకంలో అమెరికా అధ్యక్షుడు రిచర్డ్ నిక్సన్ 'శాంతి కాలంలోని నాయకుడికన్నా యుద్ధ కాలంలోని నాయకుడికే ఎక్కువ పేరు వస్తుందని' రాసాడు. పాక్షికంగా యుద్ధంలో అంతర్గతంగా ఇమిడి ఉండే నాటకీయ పరిణామాల మూలంగా అలా జరుగుతుంది అనుకుంటా. యుద్ధం విసిరే కఠిన సవాళ్ళ కాలంలోనే నాయకుడి సామర్థ్యం సహా అనేక నాయకత్వ లక్షణాలు అంచనా వేసేందుకు ఎక్కువ వీలు ఉంటుంది.

ఒకసారి మేము ఒక కొండ ప్రాంతంలో ఉన్న చిన్న గ్రామంలో మకాం వేసాం. ఒక వైపు సామాను సర్దుకుంటూనే ఇంకోవైపు 'వార్‌జోన్‌లకు సంబంధించిన 'మిలిటరీ మ్యాప్'లు పరిచేస్తూ ఉన్నాం. కాసేపటికి గదిలో ఉన్న గోడలు, కిటికీలు, బల్ల ఆఖరికి పచ్చళ్ళ జాడీల మీద కూడా 'మిలటరీ మ్యాప్'లు పరిచేసి ఉన్నాయి. మావో వాటిని పరిశీలిస్తూ తగిన ఆదేశాలు ఇస్తూ ఉంటే సెక్రటరీలు, స్టాఫ్ ఆఫీసర్లు ఎవరికి వాళ్ళు హడావుడిగా ఆ సందేశాన్ని రేడియో ట్రాన్స్‌మీటర్ ద్వారా పంపించడానికి వెళ్ళిపోయేవారు.

అంత చిన్న పల్లెటూళ్ళో నుండి రేడియో తరంగాలు వెలువడుతున్నట్లు పసిగట్టిన శత్రుసైనికులకు మా జాడ తెలిసిపోయింది. లియుకాన్ పగతో రగిలిపోతూ నాలుగున్నర బ్రిగేడ్ల భారీ బలగాన్ని మా మీదకి ఉసిగొల్పాడు. పహారా కాస్తున్న సెంట్రీలు ఘడియ ఘడియకూ వచ్చి శత్రువులు ముప్పై కిలోమీటర్ల దూరంలోకి వచ్చేసారు. పాతిక కిలోమీటర్ల దూరానికి వచ్చారు. ఇరవై, పదిహేను కిలోమీటర్ల దగ్గరికి వచ్చేసారు అన్న సమాచారం చెప్పి వెళ్తున్నారు.

ఏదన్నా పనిలో ఉండగా అంతరాయం కలిగిస్తే మావోకు చర్రున కాలుకొస్తుంది. అప్పటికే ఐదోసారో ఆరోసారో వచ్చి శత్రు సైనికులు ఎంత దగ్గరికి వచ్చారో చెప్పిపోయాడు సెంట్రీ. ఈ తడవ వచ్చి 'పది కిలోమీటర్ల దగ్గరికి' అని చెబుతుండగానే మావో 'ఏంటిది గోలా పాతికా, ఇరవై, పదిహేను, పది అంటూ తెగ నసబెడుతున్నావ్ ఇదిగో ఇక్కడ 96,00,000 చదరపు కిలోమీటర్ల గురించి నే ఆలోచిస్తున్నానా అంటే గదంతా పరిచి ఉన్న మ్యాపులకేసి చూయిస్తూ 'ఫో, నిన్ను డిస్మిస్ చేసేసా' అని అరిచాడు.

షాజియాదిన్ యుద్ధం అప్పుడు మేం లియాంగ్జియాచాకు కూతవేటు దూరంలో మకాం వేసాం. చౌఎన్‌లై సహకారంతో మావోనే స్వయంగా యుద్ధ ప్రణాళిక రచించాడు. జనరల్ పెంగ్‌కు తగిన ఆదేశాలిచ్చి యుద్ధం ఇంకా మొదలు అవకముందే మావో యాంగ్జిమా యువాన్జి నుండి లియాంగ్జియాచాకు చేరుకున్నాడు. ఈ యుద్ధం ప్రభావం

యావత్ ఉత్తర షాంగ్జీ మీద పడుతుంది. కాబట్టి మావో దీనిమీద మరింత శ్రద్ధ పెట్టాడు. జనరల్ పెంగ్‌లో నిరంతరం ఫోన్ ద్వారా చర్చలు నడుపుతూ, పరిస్థితి ఎలా ఉందో కనుక్కుంటూ ఎప్పటికప్పుడు తగిన సూచనలు సలహాలు ఇచ్చాడు. అవసరం పడితే కందకాలు (సైనికులు ఉండే ట్రెంచిలు) ఎక్కడ తవ్వాలో కూడా చెప్పాడు.

'ఇంకియావో ఓ చుక్కమందు పోద్దూ' అనడిగాడు మావో ఉన్నట్టుండి.

మావోకు ఎప్పుడన్నా 'వైన్' పుచ్చుకునే అలవాటు. అదీ ఒక గ్లాసు వైన్ పుచ్చుకోగానే తన మొహం ఎర్రబడి పోయేది. నిద్రమాత్రలు దొరకని రోజున ఒక గ్లాసు 'రెడ్ వైన్'గానీ బ్రాందీకానీ పుచ్చుకునేవాడు. మత్తులోకి జారిపోయేవాడు. నిద్రకోసమని వైన్ ఎలా పుచ్చుకునేవాడో, అలాగే యుద్ధాలు జరిగేటప్పుడో, ఏదన్నా రాయాల్సి వచ్చినప్పుడో రాత్రుళ్ళు మేలుకొని ఉండడానికి పుచ్చుకునేవాడు. నిద్రా, మెలకువా అనేది తీసుకునే వైన్ పరిమాణం బట్టి ఉండేది.

'స్పిరిట్స్ బ్రాండ్ ఇమ్మంటారా' అనడిగా.

'వొద్దొద్దు, అతగాడి పేరేంటీ ఆ ఝూంగ్‌సాంగ్, వాడికి నషాళానికి అంటించడానికి అది పరిపోదు అన్నాడు 'పోనీరైడ్ వైన్' అనడిగా.

ఒక్క నిమిషం ఆలోచించి తల అడ్డంగా ఊపుతూ' ఇది చాలా కీలకమైన పోరాటం. అతి చిన్న జాగాలో జరుగుతున్న యుద్ధం, ఒకవైపు శత్రు బలగాలు ఇంకోవైపు నది, మనవాళ్ళు చాల కష్టపడాలి. రాత్రి పొద్దంతా గడపాలి' అన్నాడు. 'బ్రాందీ దొరుకుతుందా' అనడిగాడు.

'ఉంది సీమ సరుకే అట్టిపెట్టా అవసరం పడుద్దని' అన్నా నేను.

'మరికనేం, కానీ ' అంటూ ఎదురుగా బల్లమీద ఉన్న మ్యాప్‌లో చుట్టూ ఎర్ర బాణాల గుర్తుతో ఉన్న నీలం రంగు సున్నాల మీద దరువు వెయ్యసాగాడు. అది చూస్తే నాకు మావో ఝూంగ్‌సాంగ్ నెత్తిమీద తబలా వాయిస్తూ ఎలా ఉంది కిక్కూ అని అడుగుతున్నట్లు అనిపించింది.

నేను బ్రాందీ ఓ గ్లాసులో పోసి మ్యాప్‌కి ఓ అంచున ఉంచా. ఆ గ్లాసు పక్కనే సిగరెట్ల ప్యాకెట్టు, అగ్గిపెట్టెలు పెట్టా. బల్లపై అంచున రెండు నూనె లాంతర్లు, మూడు కొవ్వొత్తులు వరుసగా పెట్టిన మూలాన మిలిటరీ మ్యాపు వాటి వెలుగులో స్పష్టంగా కనబడుతుంది. ఇవన్నీ నేనే స్వయంగా అమర్చిపెడతాను. మిలిటరీ మ్యాప్‌లను క్షుణ్ణంగా పరిశీలిస్తూ, ఎప్పటికప్పుడు 'వార్‌జోన్'లలో పరిస్థితులను సమగ్రంగా మదింపు చేసేవాడు మావో. ఆ రోజునయితే టెలిఫోన్ దగ్గరే ఎక్కువసేపు గడిపాడు. ముందు పీటీ (ఫ్రంట్‌లైన్)

దళాలతో నిరంతరం కాంటాక్టులో ఉన్నాడు. వాళ్ళు దగ్గర నుండి ఫోన్ రాని ఖాళీ సమయంలో తూర్పుచైనా, మధ్య చైనా, ఈశాన్య చైనా మిలిటరీ మ్యాప్‌లను పరిశీలిస్తూ మధ్య మధ్యన హెడ్ క్వార్టర్స్‌కు వచ్చిన టెలిగ్రాంలు చదువుతూ వాటికి తిరుగుజాబులు రాస్తూ గడిపాడు. ఇవన్నీ చక్కబెడుతూనే దృష్టింతా ఉత్తరషాంగ్సీ మిలిటరీ పటం మీదే పెట్టాడు. అలిసిపోయినప్పుడు ఓ గుక్కెడు బ్రాందీ మింగేవాడు. సిగరెట్ తరువాత సిగరెట్ వెలిగిస్తూనే ఉన్నాడు. కప్పుమీద కప్పు టీ అందిస్తూనే ఉన్నా నేను.

షాజియాదిన్‌లో పోరు మూడు పగళ్ళూ, రెండు రాత్రుళ్ళు నడిచింది. మావో ఆ గది నుండి బయలకు రాలా ఆ మూడ్రోజులూ... కంటిమీద కునుకు అనేది లేకుండా గడిపాడు మావో. డజన్ల కొద్దీ కప్పుల టీ తాగాడు. ఐదున్నర పెట్టెల సిగరెట్లు ఊదేశాడు.

చిట్టచివరికి షాజియాదిన్‌లో జరిగిన పోరులో ఝూంగ్‌సాంగ్ 36వ డివిజను సైన్యం తోకముడిచేసింది. ఆరువేల మంది శత్రు సైనికులు బందీలుగా చిక్కారు. జనరల్ పెంగ్ దెహూయిను అరివీర భయంకరుడు అని అభినందిస్తూ మావో టెలిగ్రాం పంపాడు.

కామ్రెడ్ మావో సవాళ్ళను ఎదుర్కొనే తీరు అది. విముక్తి పోరాటాలను, శత్రుదాడులను ప్రతిఘటించడంలోనూ తగు ఎత్తుగడలు వెయ్యడంలో బహునేర్పరి. హూనాన్నీ ఒక సామెత చెప్పేవాడు-సవాళ్ళను సవాలు చెయ్యాలే తప్ప, తలవొంచకూడదు' అని ... మావో కు ఈ సామెత అతికినట్లు సరిపోతుంది.

నేను ఇంతకు ముందు చెప్పాకదా-ఆ రోజున సిగరెట్ పీకను కసిగా విసిరేసి, కంచు కంఠంతో 'మనం ఇప్పుడు పచ్చనదిని దాటబోవడం లేదు' అన్నాడని. అక్కడ సగంలో ఆపేసాను. ఆ తర్వాత ఏంజరిగిందో మీకు చెప్పాలి కదా!

పచ్చనదిని దాటి వెళ్ళే ప్రసక్తి లేదని చెప్పాక నది ఒడ్డునే పడి నడుస్తూ ఎదురుగా ఉన్న కొండ దగ్గరికి చేరుకున్నాడు. ఆ కొండమీదనే తెల్ల 'డ్రాగన్' గుడి ఉంది. ఇంతలో రెన్‌బిషి ఒక స్టాఫ్ ఆఫీసర్‌ని కేకేసి 'మనవాళ్ళకి చెప్పి మనం ఇటుగా వెళ్ళిన ఆనవాళ్ళు ఏమి మిగలకుండా ఈ ప్రాంతం అంతా సాఫు చేసి రండి' అని చెప్పాడు. ఆ మాట విన్న మావో కొండ ఎక్కుతున్నవాడల్లా ఆగిపోయి చేతిలో కర్రను పోటుగా పెట్టి వెనక్కి తిరిగి" ఎందుకా కంగారు? ఏమవుతుందనీ? మావో ఈ దారెంబడే కొండమీదకి వెళ్ళాడని బోర్డు పాతిరండి ఏమవతుందో చూద్దాం' అన్నాడు. రెన్‌బిషి తదితరులంతా ఏక కంఠంతో 'అలా కాదులే కామ్రెడ్ మీరు పదండి' అని మావోకు సర్దిచెప్పి 'శత్రువు మన వెనకాలే వస్తున్నాడు ఆనవాళ్ళు లేకుండా చెయ్యండి' అని సభ్యులను ఆదేశించారు. 'అయితే ఎవడికి లెక్క? ముందు మీరు బోర్డు పాతండి' అన్నాడు మావో మంకుతనంగా'. చూద్దాం వాళ్ళ సంగతి ఏంటో' అని హుంకరించాడు.

మావో సగం కొండ ఎక్కాడు, ఇంతలో కొండకింద నుండి తుపాకులు పేలిన మోత వినిపించింది. దాంతో మావో అక్కడే నిలబడిపోయాడు. తలమీద ఉన్న రెల్లు దుబ్బ పుల్లలతో చేసిన టోపీ తీసి మొహాన విసురుకుంటూ ఎదురుగా ఉన్న రాయిమీద చతికిలపడి 'వచ్చేసారా, రానీ చూద్దాం' అన్నాడు. మనం పైకి పోదాం కామ్రేడ్' అని ఎవరు చెప్పినా వినిపించుకోలేదు. కాసేపటికి కింద నుండి సెంట్రీ వచ్చి' అవి మన మిలీషియా తుపాకి మోతలే, నది అవతల మనవాళ్ళు ఉన్నారు' అని కబురుచెప్పాక గానీ మావో అక్కడ నుండి కదల్లేదు.

శతృసైనికులు వెంటపడుతున్నా ఏ మాత్రం తొణకని ధీరగుణం మావో స్వంతం. లియూకాస్ భారీ బలగాలను వెంటేసుకుని ఒక ఏడాదిగా మావోకోసం జల్లెడపడుతూ, నీడలా వెంటాడుతూ చాలా చికాకు పెట్టాడు. ఆ తరువాత వైచువాన్ దగ్గర జనరల్ పెంగ్ నాయకత్వంలో లియూకాన్ మీద దాడి చెయ్యాలని పథకం వేసారు మావో. జనరల్ పోంగ్ మావోతో యుద్ధ వ్యూహం గురించి చర్చిస్తూ' మీకు ఆ లియూకాన్ గాడి తల తెమ్మంటారా, మనిషిని తెమ్మంటారా' అనడిగాడు. శతృవుని సజీవంగా తెమ్మంటారా, నిర్జీవంగానా అని పెంగ్ అడిగిన ప్రశ్నకు మావో 'చరిత్రలో ఏం జరిగిందో గుర్తు తెచ్చుకో జనరల్ పెంగ్. 'ది రొమాన్స్ ఆఫ్ త్రీ కింగ్‌డమ్స్' అనే పుస్తకంలో జనరల్ ఝూంగ్‌వైడ్ ఏం చెప్పాడు. యుద్ధంలో శతృవు మెడకాయ మీద తలకాయని మన జేబులోంచి ఏదన్నా వస్తువు తీసినంత తేలిగ్గా తీసెయ్యాలని కాదూ' అని బదులిచ్చాడు. 'ఐతే వాడి తలకొట్టి తెస్తా కామ్రేడ్ ఛైర్మన్' అని దృఢంగా చెప్పాడు జనరల్ పెంగ్. జనరల్ పెంగ్ మాటల మనిషి కాదని చేతల మనిషని ఈ తర్వాత కొద్ది రోజులకే రుజువయింది. వైచువాన్ దగ్గర జరిగిన యుద్ధంలో జనరల్ పెంగ్ అంటే ఒక విధమైన ఆరాధనా భావం ఉండేది. క్రీస్తు శకం 25-220 సంవత్సరాల్లో చైనాను పరిపాలించిన తూర్పుహాన్ రాజుల కాలంలో అరివీర భయంకరుడిగా ప్రసిద్ధి చెందిన ఝూంగ్‌వైడెతో పోలుస్తారు జనరల్ పెంగ్‌ను.

కొంతమంది విదేశీ రచయితలు మావోను 'దూకుడు మనిషి'గా అభివర్ణించారు. అది నిజమే కావచ్చు. ఈ 'దూకుడు' అనే పదానికి ఎవరు ఏ సందర్భంలో ఎలా వాడారు అనే దాన్నిబట్టి అర్థం తీసుకోవాలి మనం. మావోలో ఉన్న ఈ 'దూకుడు' లక్షణం ప్రపంచ ప్రఖ్యాత రచయిత గోర్కీ చెప్పినట్లు 'తుఫాను మరింత ఉగ్రంగా చెలరేగిపోతుంది' అనే మాటలకు అతికినట్లు ఉంటుందని మావోను అతి దగ్గర నుంచి పరిశీలించిన నా అభిప్రాయం.

నేనిలా భావించడానికి తగిన కారణాలు ఉన్నాయి

కొరియా యుద్ధం సహా అనేక క్లిష్టమైన యుద్ధాల్లో మావో విజేతగా నిలిచాడు. యుద్ధకాలంలో ఎదురయిన సవాళ్ళను ఎంత నిబ్బరంగా ఎదుర్కొన్నాడో శాంతి కాలంలో ఎదురయిన అనేక నాటకీయ క్లిష్టమైన సవాళ్ళనూ అంతే నిబ్బరంగా ఎదుర్కొన్నాడు. ఆయా సందర్భాలలో మావో ప్రత్యేకమైన వ్యక్తిత్వ లక్షణాలు మనం గుర్తించవచ్చు.

1955లో నేను సెలవు మీద ఇంటికి వెళ్ళడానికి వీలుచిక్కింది. మావోకు అంగరక్షకులుగా పనిచెయ్యడానికి దేశంలోని వివిధ ప్రాంతాల నుండి వచ్చిన వాళ్ళు ఉన్నారు. వాళ్ళకు కూడా సెలవు మీద ఇంటికి వెళ్ళడానికి పర్మిషను దొరికింది. 'సెలవు మీద మీ కుటుంబ సభ్యులను కలవడానికే వెళ్తున్నా, పన్లో పనిగా క్షేత్ర స్థాయిలో మన ప్రభుత్వ పనితీరు గురించి ప్రజలు ఏమనుకుంటున్నారనే సమాచారం కూడా సేకరించండి. ఉన్నది ఉన్నట్లు చెప్పాలి నాకు' అంటూ మావో మా అందరికీ చెప్పాడు.

నేను ఊరు నుంచి తిరిగి వచ్చాక నేను విన్నదీ, కన్నదీ యథాతథంగా మావోకు వివరించాను. మంచి విషయాలు చెప్పావ్ అని నన్ను అభినందించారు. క్షణం ఆగి రెండు నెలలపాటు నాకు కాస్త ఏకాంతం కావాలి. సందర్శకులను పెద్దగా అనుమతించవద్దు. పల్లెల్లో సహకార ఉద్యమం మీద శ్రద్ధ పెట్టాలి అన్నాడు.

ఆ తరువాత మావో ఎక్కువగా తనగదికే పరిమితం అయిపోయాడు. రాత్రి పొద్దుగూకులూ రాస్తూనే ఉండేవాడు. మధ్యాహ్నం పూట కాసేపు కునుకుతీసి తర్వాత మళ్ళీ రాత పనిలో పడిపోయేవాడు. బల్లమీద తెల్లారేసరికి కట్టలు కట్టలురాసిన కాయితాలు పోగుపడి ఉండేవి. అన్నీ సాపు ప్రతులే. దాదాపు రెండు వారాల పాటు తదేక దీక్షతో సహకార ఉద్యమం మీథ డాక్యుమెంటు రాసేపనిలో నిమగ్నమయిపోయాడు. నేను టీ తీసుకెళ్ళినప్పుడు కూడా కనీసం తలెత్తి నాకేసి చూసేవాడు కాదు. విపరీతమైన అలసట, ఏదో చెప్పలేని ఉద్వేగంతో కనబడుతున్నా అనుకున్న పని పూర్తి చేసే వరకు ఎక్కడా ఆపలేదు.

ఒకసారి పార్టీ సెంట్రల్ కమిటీ నాయకులంతా బెయిదైహీ అనే వేసవి విడిది ప్రాంతానికి వెళ్ళాలని నిర్ణయించింది. బెయిదైహీ సముద్రతీరాన ఉన్న విడిది ప్రాంతం. మావోకు ఆ విషయం చెప్పానేను. 'మంచిది. చైనాలో సోషలిస్టు సమాజ నిర్మాణం అతి తొందరలోనే సముద్రపు అలల ఎత్తుకు సాగుతుంది. కాబట్టి మనమూ పోయి సముద్రాన్ని దగ్గర నుంచి చూసొద్దాం' అన్నాడు. ఆ మాటలు అనేటప్పుడు మావో కళ్ళలో పసిపిల్లల సంతోషపు ఛాయలు కనిపించాయి. ఒక మార్మిక, అద్భుత ప్రపంచం తన కనులారా చూడబోతున్నానే గొప్ప ఆత్మవిశ్వాసం మావో కళ్ళలో తొణికిసలాడింది. ఆకలి, దారిద్ర్యం లేని ఒక సమ సమాజం సామాన్య ప్రజల అద్భుత కలల ప్రపంచం' చైనాలో ఆవిష్కరించడానికి, సోషలిస్టు

సమాజాన్ని నిర్మించడానికి మావో తన యావజ్జీవితాన్ని ధారబోసాడు.

అప్పటిదాకా సహకార ఉద్యమం మీద తాను రాసిన డాక్యుమెంటును చూయిస్తూ' ఇవన్నీ వరస చెదరకుండా సదిరి మనతో పట్రండి' అన్నాడు. మావో ఎక్కడికి బయల్దేరినా వెంట రెండు పెట్టెల నిండా పుస్తకాలు ఉండాల్సిందే. ఇవాళ కుర్రాళ్ళంతా 'వ్యాకింగ్ కేస్'లు అని పిలుచుకునేంత సైజుల్లో రమారమి ఒక చదరపు మీటరు వైశాల్యంతో ఉంటాయి ఆ పెట్టెలు. ఈసారి పుస్తకాలకు బదులు ఆ కాయితాలన్నీ ఒక వరుస క్రమంలో పేర్చి, ఎక్కడికక్కడ 'ఇండెక్స్' కాయితం అంటించి సదిరిపెట్టాను. మేం బెయిదైహీ చేరుకోగానే మావో గదిలో బల్లమీద ఆ కాయితాల కట్టలను వరుస క్రమంలో పేర్చాను. దేశంలోని వివిధ ప్రాంతాలలో, వివిధ ప్రావిన్సులలో సహకార ఉద్యమం గురించి తయారు చేసిన నివేదికలు అవి. అయితే విజయం సాధించిన తాలుకు మైకంలో ఆ నివేదికలో చాలా చోట్ల అతిశయోక్తులు చోటు చేసుకున్నాయి. ఆ రోజున నేనా విషయం గుర్తించలేదు. బహుశా మావో కూడా గుర్తించి ఉండదు.

సముద్ర తీరాన ఉన్న సరుగుడు తోటలోని ఒక భవంతిని మావోకు కేటాయించారు. ఝూంగ్ నాన్హైలో ఉన్నట్లుగానే ఇక్కడ కూడా తూర్పు వైపు గదిని ఎంచుకున్నాడు మావో. అప్పుడప్పుడూ సముద్రం ఈతకు వెళ్ళి రావడం మినహా రోజుల్లో ఎక్కువ సమయం సహకార ఉద్యమం డాక్యుమెంట్లు రాయడంలోనే గడిపాడు. లీషావ్‌చి, చౌ-ఎన్-లై, ఛూటేలు తప్ప వేరే వాళ్ళు ఎవరినీ మావోను కలవడానికి నేను అనుమతించేవాణ్ణి కాదు.

భావోద్వేగంతో ఉన్నప్పుడు మావో కూడా ఆపకుండా చాలా వేగంగా రాయడం, భావోద్వేగం మరింత తీవ్రంగా ఉన్నప్పుడు దానిని మాటల రూపంలో పెట్టడానికి హఠాత్తుగా బల్లముందు నుంచి లేచి కిటికీలోంచి సంఘర్షించుకుంటున్న సముద్రపు అలలకేసి కాసేపు తేరిపారా చూసి తిరిగి వచ్చి కూచుని రాయడం చేసేవాడు.

ఇలా ఉండగా ఒక రోజు హోరుగాలి మొదలయింది. వాతావరణంలో ఫోడి ఆవిరయిపోయింది. క్షణాల్లో నల్లటి చిక్కటి మబ్బులు ఆకాశం నిండా కమ్మేసాయి. ఉరుములు, ఉరుములు, మెరుపులతో కుండపోత వాన మొదలైంది. సముద్రపు గాలి ఈదురుమని వీస్తుంది. అలల తాడి ఎత్తున ఎగిసి పడుతున్నాయి. తుఫాను కావచ్చు అనిపించింది. బయట ప్రకృతి భయభీబత్సంగా ఉన్నా మావో రాతపనిలో నిమగ్నమై ఉన్నాడు.

ఉన్నట్టుండి తను పెన్ను పక్కన పడేసి ఛటాలున లేచి నిలబడి 'ఇంకియావో-పదా, అలా వెళ్ళి ఓ ఈత వేసి వొద్దాం' అన్నాడు నాకేసి చూస్తూ, నా నడినెత్తిన

పిడుగుపడినట్టయింది' ఏంటీ? ఈతకా? అదీ సముద్రం ఇంత పోటు మీద ఉన్నప్పుడా' అని నంగి నంగిగా అడిగానేను.

'ఏ కొట్టకూడదా? నేనేం మన పాతకాలం ఆడపిల్లల్లా తాళ్ళతో కాలివేళ్ళు కట్టేసుకుని లేనే' అన్నాడు మావో. అతి జాగ్రత్త పరుల్ని, నిత్య శంకితులను ఉద్దేశించి ఈ సామెత వాడుతుంటారు.

నేను పీడకలలోంచి లేచిన వాడిలా 'కుదర్దు. అస్సలు కుదర్దు అని కీచుగా అరిచాను. ఆ మాట అంటూనే మావో దారికి అడ్డంగా నిలబడ్డాను.

మేం ఏదన్నా ప్రమాదకరం అని భావిస్తే మావోను నిలవరించడానికి పార్టీ మాకు తగిన అధికారాలు ఇచ్చింది. 1949లో ప్రజా విముక్తి సైన్యం అంతిమ విజయం సాధించి 'నవచైనా' అవతరించిన నాటి నుండి మావో అంతకు ముందులా ఎక్కడికీ బడితే అక్కడికి ఎలా పడితే అలా వెళ్ళే స్వేచ్ఛకు బంధం పడింది. సెక్యూరిటీ విభాగాల అనుమతి లేనిదే మావో ఇంట్లోంచి గాని, ఝూంగ్ నాన్హి నుంచి కానీ కదిలే వీలు లేకుండా పార్టీ కట్టుదిట్టం చేసింది.

పార్టీ నిర్ణయాన్ని తు.చ తప్పకుండా అమలు పరిచేవాడిని నేను. ఈ విషయంలో నేను మావో మాట కూడా వినేవాణ్ణి కాదు. 'ల్యుయోర్యుకింగ్' సెక్యూరిటీ విభాగాల అధిపతి. కాబట్టి ఆయన మాట తప్పితే ఎవరి మాటా వినాల్సిన అవసరం లేదు నాకు'. ఇరవై నాలుగు గంటలూ మావోను కంటికి రెప్పలా కాపాడుకుంటూ ఉండండి. ఏమరుపాటునైనా సరే ఒక్కక్షణం కూడా ఆయన్ని విడిచి ఉండడానికి వీల్లేదు అని ర్యుకింగ్ ఇచ్చిన ఆదేశమే మాకు శిరోధార్యం.

మావో సముద్రంలో ఈతకు వెళ్తాం అంటున్నాడన్న సమాచారం ర్యుకింగ్‌కు చేరవేసాం. 'ఎట్టి పరిస్థితుల్లోనూ ఆయన్ని బయటకు అడుగుపెట్టనీయమాకండి. ఆరునూరైనా సరే ఆయన్ని కదలనీయమాకండి" అని ర్యుకింగ్ మాకు 'ఆర్డరు' వేసాడు.

మావో మా కళ్ళకు అసాధారణ శక్తివంతుడిగా తోచేవాడు. ఏకబిగిన నాలుగైదు రాత్రిళ్ళు నిద్దరలేకుండా గడిపేవాడు. గార్డు డ్యూటీలు చేసే మేం రోజుకు నాలుగు షిఫ్టులలో పనిచేసేవాళ్ళం. ఇప్పుడు మా అందరికీ ఇరవై నాలుగు గంటల డ్యూటీ పడింది. నాలుగు షిఫ్టలలో పనిచేసే అందరివీ పోగయితే తప్ప మావోను నిలవరించలేం అనుకున్నాం మేం. లేదంటే మేం ఏ కాస్త ఏమరుపాటుగా ఉన్నా మాకు టోకరా ఇచ్చిన చల్లగా బయటకు జారుకుని మావో అన్నంత పనీ చేస్తాడేమో అనే గుబులు కూడా మమ్మల్ని మహా చికాకు పెడుతుంది.

తుఫాను తీరం దాటిపోయి ఎండపొడ బయటపడింది. అయినా మా ఆందోళన పెరిగిందే తప్ప తరగలేదు. ఎండకూడా వచ్చేసిందిగా అనేసాకున సముద్రంలో ఈత కొట్టొదాం పదండి అని మావో మళ్ళీ కొత్త పల్లవి ఎక్కడ ఎత్తుకుంటాడో అని భయపడతా ఉన్నాం. తుఫాను సద్దుమణిగినా సముద్రపు గాలులు డెబ్బై మైళ్ళ వేగంతో వీస్తున్నాయి. అలల తీవ్రతా సద్దుమణగలేదు.

ఆ రోజుకి ఏం జరగలేదు కాని, మర్నాడు ఉదయం పదింటికి 'అబ్బాయిలూ నేను ఈతకు బయల్దేరుతున్నా ఎవరొస్తారో రండి' అనే సరికి మేం అందరము ఆయన దారికి 'చైనావాల్' మాదిరి అడ్డుగా నిలబడ్డాం. ఈ మాటు మావో వ్యక్తిగత వైద్యుడు డాక్టర్ సుటావోను అడ్డం వేసాం. విషయాన్ని ఎదుట వాళ్ళకు నచ్చచెప్పడంలో డాక్టరు గారు మహాదిట్ట. అలాంటి ఆయన కూడా మావో దగ్గర చివర్లో పప్పులో కాలేసాడు. 'ఇంకా నేచెప్పే మూడో కారణం ఏంటంటే, తుపాను సద్దుమణిగాక తీరం అంతా శంఖాలతో కుప్పపడిపోతుంది. అవి కాళ్ళకు గుచ్చుకుని గాయాలు అవుతాయి. ఒక్కోమాటు మనిషి బ్యాలన్స్ తప్పి ధభీమని పడిపోయేలా చేస్తాయి. మన లీవెయిహాన్‌కు అలానే జరిగింది. కిందపడి తుంటి విరగకొట్టుకున్నాడు. ఎందుకొచ్చింది మహాశయా, ఈ సారికి నా మాటవినండి ఇంకోసారి, సముద్రం ఇంకాస్త శాంతంగా ఉన్నప్పుడు ఈతకు పోదాం అందాకా శాంతించండి' అన్నాడు డాక్టర్ సుటావో మావోతో.

'మన లీవెయిహాన్ బొక్కబోర్లా పడి తుంటి విరగ్గొట్టుకున్నాడా?" అని డాక్టరును పరాచికంగా అడిగిన మావో, 'బావుందిది, ఎవరికో ఏదో జరిగితే నాకు అలానే జరగాలని రూలు ఎక్కడన్నా ఉందా? అదేం జరిగేది కాదు కానీ నాతోపాటు మీరు రండి చూద్దురు గానీ' అంటూ మావో గుమ్మంకేసి బయల్దేరాడు.

మేమంతా ఒకళ్ళ చేతులు ఒకళ్ళం గట్టిగా పట్టుకుని మావోకు అడ్డంగా నిలబడ్డాం. మళ్ళీ మావో మాకేసి గుర్రుగా చూస్తూ' వినబడ్లేదా? నే ఈతకి పోవాలి దారి వొదలండి అంటూ ఒక్క అడుగు వెనక్కి నడిచాం. మమ్మల్ని మనుషులుగా కాదు దారికి అడ్డం వచ్చిన ఏ ఇసుక దిబ్బలుగానే చూస్తున్నట్లు ఉన్నారాయన. మా జోరుగా, వేగంగా, వొచ్చే రైలులా మా మీదకి దూసుకు వచ్చేసాడాయన. ఆ పాటికే మేం గుమ్మం దాకా వెనక్కి వచ్చేసాం. దబ్బున మమ్మల్ని గుద్దుకుంటూ గుమ్మంలోంచి బయటపడిపోయాడు మావో.

అయిపోయింది. ఇంక మేం చెయ్యగలిగేది ఏముంది, ఆయన వెనుక పరుగులు తియ్యడం తప్ప. లైఫ్ జాకెట్లు పట్రండి, స్పిరిట్ ఒకళ్ళు తీసుకురాండీ, టవళ్ళు-టవళ్ళు మర్చిపోకండి అంటూ నేను నలుగురికీ నాలుగు పనులు పురమాయిస్తూ మావో వెనక

నేను, 'ఫస్ట్ ఎయిడ్ కిట్'తో నా వెనక డాక్టరుగారూ పరుగులు పెట్టాం. నిమిషాల్లో సముద్రానికి చేరువయిపోయాం.

సముద్రాన్ని ఆ పరిస్థితుల్లో అంత దగ్గర నుంచి చూడ్డంతోటే నా రోమాలు నిక్కబొడుచుకున్నాయి., బలంగా విశ్వసిస్తున్న నల్ల భూతంలా ఉంది సముద్రం, మీటర్ల కొద్దీ పొడవైన పెద్ద పెద్ద అలలు ఉవ్వెత్తున ఎగిసి తీరం మీదకు భీకరంగా విరుచుకుపడుతున్నాయి. వందల కొద్దీ తుపాకులు ఆగకుండా ఒకేసారి గర్జిస్తుంటే ఎలా ఉంటుందో, కారడవిలో వందల కొద్దీ క్రూరమృగాలు తొక్కిడి తొక్కిడిగా పరుగులు తీస్తే ఎలా ఉంటుందో ఎదురుగా ఉన్న సముద్రం ఘర్జిస్తుంటే అంత శబ్దం వస్తుంది. చెవులు దిబ్బళ్ళు పడిపోతాయెమో అనిపిస్తుంది. కెరటాలు తీరం మీదకు విరుచుకుపడినప్పుడు అలలు నురగ తీరం పొడవూతా తెల్లని మబ్బుల్ని పరిచినట్లు తయారవుతుంది. అంతలోనే మాయం అయిపోతుంది.

మావో బలంగా ఊపిరి పీల్చివొదుల్తున్నాడు. శత్రువుని ఢీ కొట్టేటప్పుడు కళ్ళు చికిలించినట్టు చిన్నవయి పోయాయి. మావో కనులు, సముద్రాన్ని అలా కాసేపు దీక్షగా చూసి తన చుట్టూ వలయంలా నిలబడ్డ గార్డులను పక్కకి నెట్టేసి ఎదరకొచ్చి నిలబడి జుబ్బా, పంట్లాం విప్పేసాడు. మావో అంత నిశ్శబ్దంగా ఉండడం చూసి బేజారైపోతున్నాం. ఇక అన్నిటికీ తెగించాం. మిన్నువిరిగి మీదపడినా, నరకమే ఎదురొచ్చినా ఎదురుగా ఉన్న సముద్రంలోకి దూకాల్సిందే అని అర్థం చేసుకున్న మేం కూడా వడివడిగా ఒంటినున్న యూనిఫారాలు విప్పి పక్కన పడేసి మావోను వెన్నంటి ఉండడానికి తయారయ్యాం. ఏదో తెలీని ఉద్వేగం, సముద్రపు శీతల పవనాల తాకిడి మమ్మల్ని గజగజ వణికించేస్తుంది.

మావో మా అందరినీ పరకాయించి చూస్తూ 'భయమేస్తుందా' అనడిగాడు.

'లేదు, లేదు' అని బదులిచ్చాం. కానీ అందరివీ ఏక కంఠంతో గట్టిగా అరిచి చెప్పలేకపోయాం ఆ ఒక్క మాటా.

'ఈత వొద్దనుకునే వాళ్ళు మొహమాటపడొద్దు. ఇంచక్కా ఒడ్డున నిలబడి చూస్తా ఉండండి. అంటూ తిన్నగా సముద్రంలోకి నడిచాడు. మాలో ఉన్నంతగా మావోనే పొడుగాటి మనిషి, పొట్ట ముందుకు తీసుకురావడం మూలాన మనిషి కాస్త వెనక్కి వొంగి నడుస్తాడేమో, అదో తమాషా తీరుగా ఉంటుంది. ఆయన నడక. డెబ్బై మైళ్ళ వేగంతో వీస్తున్న గాలులకు తొణక్కుండా, తడి ఇసుకలో పాద ముద్రలు, వొదుల్తా నీళ్ళలోకి నడిచాడు మావో.

దాంతో మాలోంచి ఏడెనిమిది మంది బలమైన కుర్రగార్డులు హడావుడిగా పరుగెత్తి మావోకు ఎదరగా దడికట్టి ఆయన కన్నా ముందు నడవసాగారు. మిగిలిన వాళ్ళం ఆయనకు కుడి, ఎడమలుగా కొంతమంది వెనకమాలగా నిలబడి ఆయనతో పోటీ ముందుకు నడవసాగం.

ఇంతలో ఒక పెద్ద అల నురగలు తేలుతూ, గాయపడిన జంతువులా గర్జిస్తూ, ప్రత్యర్థితో చెయ్యి కలిపి అతని సత్తా ఏమిటో అంచనావేసే వస్తాదుకు మల్లే మా వైపుకు దూసుకువస్తుంది.

'ఐసరబజ్జా, కాస్కోండి, కాస్కోండి' అని మావో హుషారుగా అరిచాడు.

మేం తేరుకునే లోగానే ఆ ఆకుపచ్చని సముద్రపు కెరటం మా మీదకు విరుచుకుపడిపోయి మమ్మల్ని మింగేసింది. మేమంతా ముద్దగా తడిచిపోయాం. చెవులు హోరు మంటున్నాయి. ఏం జరుగుతుందో అర్థం చేసుకునే లోపే సముద్రంలోకి జారిపోతున్న మమ్మల్ని ఇంకో పెద్ద కెరటం అమాంతం ఎత్తి ఒడ్డుకు విసిరిపారేసింది. ఒకళ్ళొకళ్ళవి దబ్బుదబ్బున ఇసుక మూటల్లా శబ్దం చేస్తూ ఒడ్డున పడిపోయాం.

'కామ్రేడ్ ఛైర్మన్, కామ్రేడ్ ఛైర్మన్' అన్న అరుపులు దగ్గరగా, దూరంగా వినిపించాయి నాకు. 'ఏం కాలేదు కదా మీకూ' అని ఎవరో అడుగుతున్నారు. దాంతో నే తేరుకుని హడావుడిగా లేచి మావో ఎక్కడున్నాడో చూసి ఆయన దగ్గరకు పరుగెత్తి 'ఏం కాలేదుగా' అనడుగుతూ ఆసరా కోసం చెయ్యి అందించా. మావో నా చేతిని పక్కకి నెట్టేస్తూ, నోట్లంచి పుడిశెడు నీళ్ళు తుపుక్కున ఉమ్మేతూ 'అదీ లెక్కంటే, తలపడితే ఇలాంటి ప్రత్యర్థితో తలపడాలి' అంటూ తనంతట తాను పైకి లేచి నిలబడ్డాడు. ఆ మాటలకు నా గుండె జారిపోయింది. ప్రత్యర్థి అనేమాట వాడాడంటే అవతలివాళ్ళ అంతు చూడందే వొదిలే రకం కాదు ఈ మనిషి. ఇప్పుడు ఏమిటీ గత్యంతరం అని మనసులోనే గొణుక్కున్నా నేను.

అప్పటికే దిమ్మెరపోయి ఉన్న మేం తేరుకోక మునుపే మావో మళ్ళీ సముద్రం కేసి నడవడం చూసి హడావుడిగా ఆయన వెనక పరిగెత్తాం. మళ్ళీ అదే తంతు. ఓ పెద్ద కెరటం నిలువునా మమ్మల్ని మింగెయ్యడం, మేం మరింత ముద్దగా తడిచిపోవడం, కాళ్ళకింద ఇసుక కదిలిపోతూ మేం జారిపడిపోతావేమో అనుకుంటూ ఉండగా అల వెంబడి అల వచ్చి మమ్మల్ని బలంగా ఎత్తి ఒడ్డునున్న ఇసుక మీద విసిరిపారెయ్యడం. తిరిగి మావో సముద్రం కేసి ఉరకడం, ఆయన వెనకే మేం ఉరకడం, మళ్ళీ అల మళ్ళీ ఒడ్డు–ఇలా ఏడెనిమిది సార్లు జరిగే సరికి మేమంతా రొప్పుతూ రోజు పూర్తిగా దస్సిపోయి ఒడ్డున పడిన చేపల మాదిరి అలా ఉసికలో ఉండిపోయాం.

మావో మా దగ్గరకొచ్చి 'ఏంట్రా అబ్బాయిలూ' ఏం ఇంకియావో మీ

పనయిపోయింది, దమ్ముపట్టెలేకపోతున్నారు కదూ.. లీయుకాన్ మన మీదకు ఎగదోసిన ఏడు బ్రిగేడ్ల సైన్యంతో పోలిస్తే ఈ నీళ్ళొక లెక్కా? ఈ మాత్రానికి చేతులెత్తేసారే ఇంక నా దగ్గర ఏం పన్జెయ్యగలరు. సుబ్బరంగా అందరూ సెలవు పుచ్చేసుకోండి. యుద్ధానికి నేనింకో కొత్త టీమ్‌ని తయారు చేసుకుంటా' అన్నాడు నవ్వుతూ.

దాంతో మాకు ఒక్కొక్కరికీ ఈ బారున రోషం పొడుచుకు వచ్చింది. దబదబా అందరం లేచి నిలబడ్డాం. ఒకళ్ళ చేతులు ఒకళ్ళు కలేసి పట్టుకుని బూమరాంగ్ ఆకారంలో నిలబడి 'మేం కూడా సైయ్యే, పదండి అయితే' అన్నాం మావోతో. మావో ఎదర మేం అలా దడికట్టి ఆయనకు నాలుగడుగులు ముందరగా నడవసాగాం. అలలు ధాటిగా మీదకొచ్చి పడుతున్నా మేం గొలుసు కట్టుగా నిలబడి కాళ్ళు ఇసుకలో బలంగా తన్ని ఉంచడం మూలాన నిలదొక్కుకుంటూ ఒక్కో అడుగే సముద్రంలోకి వేస్తున్నాం. అల వెనక్కి తగ్గినప్పుడల్లా ముందుకు జరుగుతూ, మీదకొచ్చినప్పుడల్లా కాళ్ళు ఇసుకలో తన్ని పెడుతూ నిలదొక్కుకుంటూ వచ్చాం. అప్పటికే నీళ్ళు మా గుండెలు దాటి పైకి వచ్చేసాయి. కాళ్ళ కింద నేల దొరికేలా లేదు ఇకపైన. ఏం చేస్తాం? అలానే మావో చుట్టూ దడిగా ఉండడానికి విశ్వ ప్రయత్నం చేస్తానే ఉన్నాం. కానీ అలల తాకిడికిమా వశం కావట్లా. ఇంతలో ఎవరో 'లైఫ్ జాకిట్ విసరండీ' అని అరిచారు. దేనికా అలా అరిచాడు అని చూస్తే వెనక నుండి ఒక పెద్ద అల భీకరంగా మా మీదకు దూసుకువస్తా ఉంది. ఒక్కసారిగామాకు అడుగు జారినంత పనయింది.

ఇంతలో మావో 'అవసరం లేదు' అని అరిచి ఏం కంగారు పడమాకండి. మహా అయితే ఆ అల మనల్ని ఒడ్డుకు విసిరేస్తుంది. కానీ అడుక్కి ముంచెయ్యదు' అన్నాడు మావో భరోసాగా. నిజంగా అలాగే జరిగింది.

అలా ఓ గంట గడిపాక గానీ మావో ఒడ్డుకు చేరలేదు. అప్పుడు చూడాలి ఆయన మొహంలో అనందం. షాజియాదిన్ యుద్ధంలో గెలిచినప్పటికన్నా ఎక్కువ సంతోషంతో మావో మొహం వెలిగిపోయింది.

సవాళ్ళు స్వీకరించాలన్నా, సవాలు విసరాలన్నా దేనికీ ఎప్పుడూ మావో వెనుకాడింది లేదు. గెలిచి తీరుతాం అన్న ఆత్మవిశ్వాసంతో ఉండేవాడు. అన్నిటికీ సదా సంసిద్ధంగా ఉండేవాడు. అవసరమయినప్పుడు కఠినంగా వ్యవహరించేవాడు. ఎక్కడన్నా పొరపాటు జరిగి అనుకున్నది సాధించలేకపోయినా తనతో వుండే క్యాడరు ఎక్కడా నీరసపడకుండా వాళ్ళందరికీ విశ్వాసంగా నిలిచేవాడు తనదైన శైలిలో. అందుకే జీవిత పర్యంతం మావో విజేతగా నిలిచాడు.అడపా దడపా కొన్ని రాజకీయ అంశాల్లో వైఫల్యాలు ఎదురైనా సవాళ్ళను ఎదుర్కోవడంలో తన మొక్కవోని ధైర్యమే మావోను అద్భుతమైన నాయకునిగా నిలిపింది.

# 3. లోహ విహంగాలు రెక్కలు చాచినప్పుడు

చావు ఎదురుగ్గా నిలబడ్డా కూడా మావో చలించేవాడు కాదు. ఏడు బ్రిగేడ్ల శత్రుసైన్యం తుపాకులు బారు చేసి నీడలా వెంటాడుతున్నా మావో ఇసుమంత చలించలేదు. శత్రు సైనికులు ఎక్కడో కిందన మైదానంలోనూ, మావో కొండమీదో ఉండగా భయపడేది దేనికీ? మావో ఏంటి ఎవరైనా ధైర్యంగా ఉండొచ్చు అని మీకు అనిపించవచ్చు. అయితే మీరు ఈ సంగతి తెలుసుకోవాల్సిందే.

మేం పచ్చునదికి తూర్పు దిక్కున ఉన్న సరిహద్దు ప్రాంతం షాంగ్జి–చహర్– హెబియీ చేరుకున్నాం. షాంగ్జి–చహర్–హెబియీ ప్రాంతీయ మిలిటరీ కమాండ్ ప్రధాన స్థావరమైన చెంగ్‌నాన్‌ఝుంగ్‌లో మావో సహా మకాం వేసాం. ఆ ఏడాది మే నెలలో పార్టీ కార్యదర్శుల ప్లీనం సమావేశం పదిరోజులపాటు జరిగింది. సమావేశాలు ముగిసాక మావోలో కొంగ్రొత్త ఉత్సాహాన్ని నే గమనించా. సమావేశాలు పూర్తయిన వెంటనే ఏ మాత్రం ఆలస్యం లేకుండా జాతీయ రాజకీయసలహా సమావేశ నిర్ణయాలు, తీర్మానాల మీద సర్క్యులర్ తయారుచేసాడు. డెంగ్ జియావోపింగ్‌కు పెద్ద టెలిగ్రాం పంపాడు. అప్పుడు డెంగ్ జియావోపింగ్ డబియో పర్వత ప్రాంతంలో విప్లవ స్థావరాన్ని ఏర్పాటు చేసే బాధ్యతలు చూస్తున్నాడు.

ఈ రెండు పనులూ పూర్తయ్యేసరికి తెల్లగా తెల్లారిపోయింది. ఆ వేకువఝామునే లేచి రాత్రి తెల్లార్లూ నిద్ర లేకుండా గడిపిన మూలంగా ఏర్పడిన బడలిక తీర్చుకోవడానికి అలా ఆరు బయట కాసేపు పచార్లు చేసివచ్చాడు. రావడమే రాతప్రతులు అన్ని సర్దేసి 'ఇంకియావో, కాసేపు పడకేస్తా' అన్నాడు.

నేను గ్లాసెడు మంచీళ్ళు రెండు నిద్దరమాత్రలు తెచ్చి ఇచ్చా. ఆ మాత్రలు వేసుకుని మంచం ఎక్కేసాడు. ఓ అరగంటపాటు పేపర్లవీ తిరగేసి తలగడ మీదకి చేరబడి అలా నిద్రలోకి జారుకున్నాడు. ఇంకో డోసు నిద్దర మాత్రలు అవసరం లేదని గ్రహించిన నేను నిశ్శబ్దంగా ఆ గదిలోంచి నిష్క్రమించాను.

జియాంగ్‌కింగ్ మావో గదికి ఆనుకుని ఉన్న గదిలో ఉండేది. ఆవిడా, నిద్రలేచి రోజువారీ పనిలో పడిపోయింది. జనరల్ నీరోంగ్జెన్ ఆ పాటికే ఉదయపు వ్యాహాళికి

వెళ్ళి తిరిగొస్తూ కనిపించాడు. జియాంగ్‌కింగ్‌ను పలకరించి కాసేపు హసుకుకొట్టి తన గదికేసి వెళ్ళిపోయాడు. జనరల్ నీ తన గదిని మావోకు ఇచ్చి తాను అవతలి గదిలోకి మారాడు.

వాళ్ళిద్దరూ ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్లిపోయాక నే ఒంటరిగా మిగిలా. ఇంతలో చెంగ్ నాన్‌ఝుంగ్ ఉత్తర దిక్కు నుండి సైరన్ మోగుతుంది. నాకు తెల్సు. దాంతో నే కళవెళ పడిపోయా. చెంగ్ నాన్‌ఝుంగ్‌కు యేనాన్‌ను పోలికే లేదు. యేనాన్‌లో అయితే శత్రువిమానాలు షాంగ్జి-నింగ్జియా సరిహద్దు ప్రాంతానికి వచ్చేపాటికి సైరన్ మోగేది. దాంతో సురక్షిత ప్రాంతానికి చేరుకోవడానికి మాకు కావల్సినంత సమయం చిక్కింది. కాని చెండ్ నాన్‌ఝుంగ్‌లో ఆ వెసులుబాటు లేదు. యుద్ధ విమానాలు కొండ ప్రాంతానికి వచ్చే దాకా వాటి రాకడ తెలిసే అవకాశం లేకపోవడంతో సురక్షిత ప్రాంతానికి తరలడానికి అట్టే సమయం దొరకదు. ఇటు చూస్తే సైరన్ మోగింది. మావోను చేర్చాల్సిన సురక్షిత ప్రాంతం అక్కడికి వందమీటర్ల దూరంలో ఉంది. ఏ మాత్రం జాగు చేసినా ఫలితం దారుణంగా ఉంటుంది. దాంతో నాకు మరింత గాబరాగా ఉంది.

నేను మావో గది ముందు కాళ్ళు తొక్కుకుంటూ ఉండిపోయా, మావో వ్యక్తిగత అంగరక్షకుడినయి ఉండి, సైరన్ మోత విని కూడా నేనింకా ఆయన్ని సురక్షిత ప్రాంతానికి తరలించకుండా అలా కాళ్ళు తొక్కుకుంటూ ఉండిపోవడం ఏంటి అని మీకు అనిపించవచ్చు. కానీ అది మీరు అనుకున్నంత తేలికపనికాదు. మావోకు ఓ పట్టాన నిద్దరరాదు. మావో ఎప్పుడైనా చికాకు పడినా, ఎవరినన్నా విసుక్కున్నా, కసుకున్నా నూటికి తొంభై తొమ్మిది పాళ్ళు అది నిద్రలేమి సందర్భం అని నాకు తెలుసు. ఇప్పుడు గానీ మావోను నిద్రలేపి అక్కణ్ణించి తరలించాక తీరా శత్రుదాడి జరుగలేదనుకోండి. అప్పుడు ఉంటుందీ నీనూ. చుక్కలు కనిపిస్తాయి. మనిషి కోపంతో నిలువెల్లా ఒణికిపోతాడు. ఎదుట ఉన్నది ఎవరైందీ కూడా పట్టించుకోకుండా 'ఏయ్, మోకాళ్ళ దండెయ్ అనవసరంగా బంగారం లాంటి నిద్రపాడు చేసావ్ కదరా మందబుద్ధీ' అని అరిచేస్తాడు. మంచి నిద్రలో ఉండగా అదాటున లేపితే ఆ తర్వాత కొద్ది రోజుల వరకు మావో అదో మాదిరి నీరసంగా ఉండిపోయేవాడు.

ఇంతలో మా గార్డ్ ప్లటూన్ లీడరు యాన్ చాంగ్లిన్ మునేళ్ళ మీద, ఏదో కొంపలు అంటుకుపోతున్నట్లు, హడావుడిగా నా దగ్గరకు పరుగున వచ్చాడు. 'ఇప్పుడు ఏంటీ చెయ్యడం, ముసలాయన్ని లేపుదామా' అని లోగొంతుకతో అడిగాడు. చాటుగా ఉన్నప్పుడు మా బాడీగార్డుల బ్యాచ్ మావోను అలా ముద్దుగా 'ముసలాయన' అని పిలుచుకునేవాళ్ళం.

'ఏంటీ మాట్లాడవ్' అని రెట్టించాడు యాన్ చాంగ్లిన్. నేను చేతులు నులుముకుంటూ

'నిద్దర మాత్రలు వేసుకుని ఇప్పుడే అలా పండుకున్నాడు. ఎలా లేపడమా అని ఆలోచిస్తున్నా' అన్నా నేను.

'అసలు బుద్ధుందా నీకూ, లేపకుండా ఏం చేద్దామనీ, అవతల బాంబర్లు వచ్చేస్తున్నాయ్' అన్నాడు చాంగ్లిన్.

'ఒక వేళ బాంబర్లు రాలేదనుకో, అప్పుడు కోరి కొరివితో, తలగోక్కున్నట్లు అవుతుంది. తెల్సుకదా' అని బదులిచ్చా నేను.

ఏం చెయ్యాలా అని మేం ఇంకా తర్జన భర్జనలు పడుతుండగానే మూడు శత్రువిమానాలు వచ్చేసాయి. ఆకాశంలో చక్కెర్లు కొడుతున్నాయి. మేం అలా నిట్రాడలా నిలిచిపోయాం. పక్కకి తప్పుకోవాలనే ఆలోచన కూడా తట్టలేదు. ఆ నిమిషాన, ఏం జరగకుండా చూడమని ఆ మార్క్సుని కోరుకోవడం మినహా మాకు గత్యంతరం లేకపోయింది. బాంబులు పడకుండా ఉంటే సరే. బాంబులు పడే పనే అయితే అవి తిన్నగా మా మీద పడాలని కోరుకున్నాం. లేకుంటే జీవితాంతం మా నిర్లక్ష్యానికి చెల్లించాల్సి వచ్చే మూల్యం గురించి ప్రతివాళ్ళూ మమ్మల్ని వేలెత్తి చూపుతారు. ఆ నింద భరించడం కంటే చావడం మేలు అనిపించింది.

నాలుగు చక్కెర్లు కొట్టి ఆ విమానాలు తిరిగి పకింగ్ (ప్రస్తుత బీజింగ్) వైపుకు వెళ్ళిపోయాయి. మా నెత్తి మీంచి వెయ్యి టన్నుల భారం దింపినంత ఆనందించాం. మార్క్సు మా మొర ఆలకించినందుకు కుశాలగా డాన్సు వెయ్యాలి అన్నంత ఉత్సాహం కలిగింది.

కానీ ఆ ఆనందం అట్టే నిలవలేదు. బహుశా ఇవి పైలట్ విమానాలయి ఉంటాయేమో. ఇవి వెళ్ళాయంటే వొచ్చేది బాంబర్లే అన్న ఆలోచనే మమ్మల్ని నిలువునా కుదిపేసింది. పౌరుల ఇళ్ళు అక్కడా ఇక్కడా విసిరేసినట్టున్నాయి కానీ మా మిలిటరీ కమాండ్ నివాసాలు వరసగా గీత గీసినట్లు బాతుల గుంపులా ఒకే దగ్గర ఉన్నాయి. బాంబర్ల కన్ను పడిందా ఒకే దెబ్బకు మన్నూ మశానం చేసేస్తాయి.

అయినా ఏం చెయ్యాలో మేం ఒక నిర్ణయానికి రాలేకపోయాం. మా సుపీరియర్ జియాంగ్‌కింగ్‌ను ముగ్గులోకి లాగాం. ఆవిడ జనరల్ నీ సెక్రటరీ ఫాన్‌ను కూడా కేకేసింది. ప్రస్తుతానికయితే మావోను నిద్రలేపొద్దు కానీ గది బయట ఎమర్జెన్సీ టీం స్ట్రెచర్‌తో సిద్ధంగా ఉండాలి. బాంబర్లు కనుచూపుమేరలోకి రాగానే మావోను ఉన్న పళాన అక్కడ నుండి తరలించాలని నిర్ణయించాం అందరం కలిసి.

అది మేం 'నాస్తా' తీసుకునే టైం. వంతులువారీగా ఒకళ్ళ తరువాత ఇంకొకళ్ళు

వెళ్ళి 'టిఫిన్' చేసి రావాలనుకున్నాం. అనుకున్నామే కానీ ఎవరూ అక్కణ్ణించి కదలడానికి సిద్ధంగా లేదు.

ఉదయం ఎనిమిది గంటలు అలా దాటిందేమో ఈలోగా సైరన్ మరోసారి మోగింది. ఇంక నేను ఒక్కక్షణం ఆలస్యం చెయ్యలేదు. 'పదండి', జనరల్ పెంగ్ వేసిన ఆర్డరే మనకి ఇప్పుడు శరణ్యం' అని యాన్ చాంగ్లిన్ అన్నదే తడవుగా నేను మావో నిద్రపోతున్న గదిలోకి దూకుడుగా పరిగెత్తాను.

మేం యేనాన్ విడిచి పెడుతున్న సందర్భంలో జనరల్ పెంగ్ మా అందరికీ వేసిన ఆర్డరు ఏమిటంటే - 'అత్యవసరం అని మీకు తోచితే ఏ మాత్రం తటపటాయించకుండా కామ్రేడ్ ఛైర్మన్‌ను సురక్షిత ప్రాంతానికి తరలించెయ్యండి. వొద్దు, రానూ అని మొరాయించినా మీరు లెక్క చెయ్యద్దు. ఆ తరువాత ఎందుకు అలా చెయ్యాల్సి వచ్చిందో, ఎంతటి ప్రమాదం నుండి తప్పించడానికో వివరించండి. ముందు కాస్త ధుమధుమలాడినా ఆయనే అర్థం చేసుకుంటాడు'.

నేను మావో దగ్గరకెళ్ళి 'కామ్రేడ్ ఛైర్మన్.. ఎమర్జన్సీగా లేవాలి మీరు' అన్నా నేను. 'ఏమయిందీ' అంటూ మగతగా కళ్ళు విప్పాడు ఆయన. అప్పటికే మావో కళ్ళలోంచి కోపం తొంగి చూస్తుంది. మావోకు మరో మాటకు అవకాశం ఇవ్వకుండా యాన్ చాంగ్టిన్ మావోను అమాంతం మంచం మీంచి లేవదీస్తూ' శతృ విమానాలు దాడి చెయ్యబోతున్నాయి. ఇందాకటే పైలట్ విమానాలు చక్కర్లు కొట్టిపోయాయి. మనవాళ్ళు డేంజర్ సైరన్ కూడా మోగించేసారు. ఏ క్షణానయినా బాంబర్లు రావొచ్చు. మనం షెల్టర్ మారుస్తున్నాం' అని చెప్పాడు.

ఏదయితేనేం విషయం ఆయన చెవిన వేసేసాం. మావో ప్రతిస్పందన కోసం చూడకుండా చకచకా ఆయనకు బట్టలు తొడిగేస్తున్నాం. మావో చెయ్యి చాచి ఏదీ ఒక సిగరెట్టు ఇటు పడేయండి' అన్నాడు. దాంతో నాకు నషాళానికి అంటింది. 'అంతటైం లేదు కామ్రేడ్ ఛైర్మన్। అని అరిచినట్లుచెప్పా.

మావో నొసలు చిట్లిస్తూ 'ఏంటీ అప్పుడే ఏదో బాంబులు పడుతున్నట్లు చెప్తున్నావే' అన్నాడు.

అప్పుడు చాంగ్లిన్ కల్పించుకుని 'అవును ఛైర్మన్ ఏ క్షణానయినా మ నెత్తిన బాంబులు పడొచ్చు. ఇప్పటికే మేం ఆలస్యం చేసాం. ఆ తరువాత ఒకరిననుకొని లాభం లేదు' అని ఇంకా ఏదో చెప్పబోతుండగా-'నాన్సెన్స్' నాకిప్పుడు అర్జంటుగా సిగరెట్ కావాలి' అన్నాడు మావో అసహనంగా.

గుమ్మం అవతల నుండి జియాంగ్‌కింగ్ 'తొందరగా... తొందరగా రండీ. బయల్దేరరేం 'అని కంగారుగా అరిచింది'. 'బాంబర్లు డైవింగ్ పొజిషన్ తీసుకున్నాయి. డైవింగ్ చేస్తున్నాయి' అంటూ అక్కణ్ణించి పరుగెడుతూ' తొందరగా.. తొందరగా రావాలి' అని అరిచింది.

ఇహ ఇట్లా లాభం లేదనుకున్నాం. 'ఐసరబజ్జా' అంటూ నేను వెనకపాటుగా మావో రెండు చంకల్లోంచి చేతులు దూర్చి ఆయన్ని చుట్టేసా. ఇంకో ఇద్దరు ఆయన్ని రెండు కాళ్ళూ పట్టారు. చాంగ్లిన్ ఆయన ఒంటిన చొక్కా గుండీలు ఇంకా పెడుతూనే ఉన్నాడు. మేం అమాంతం మావోను గాల్లోకి లేపి గది గుమ్మం దాకా తీసుకుపోయాం.

మేం అలా గుమ్మం బయటికి అడుగుపెట్టామో లేదో జుయ్‌మనే శబ్ధం వినబడింది. అప్రయత్నంగానే మేం మావోను అలానే పుచ్చుకుని వెనక్కు ఓ గెంతు గెంతి, ఆయన్ని అలాగే చేతుల్లో ఉంచుకుని నేలకు వొంగి కూచున్నాం. మా కాళ్ళ కింద భూమి కదిలిపోయింది. ఆ వెన్వెంటనే 'ఢఢ్' మనే శబ్ధంలో లోహపు ముద్ద నేలకు తాకింది. మేమంతా కర్రల్లా బిగుసుకుపోయాం.

'అయ్యో' అని దూరం నుంచి జియాంగ్ కింగ్ కీచుగా అరిచింది. అప్పుడు మాకు కాస్త తెలివి వచ్చింది. తలెత్తి చూశాం. ఎదురుగా చేతికందేంత దగ్గరల్లో మూడు బాంబులు అమర్చిన క్లస్టర్ కనబడింది. భయంతో అరవాలనిపించింది. అక్కణ్ణించి దూరంగా పారిపోవాలనిపించింది. కానీ అచేతనంగా ఉండిపోయాం. మావో మా పట్టు విడిపించుకుని ఎప్పుడు లేచాడో లేచి నిలబడి నేలమీద గింగరాలు తిరుగుతున్న ఆ బాంబులున్న క్లస్టర్‌కేసి ఆసక్తిగా చూస్తూ 'ఏమయింది వీటికి' అంటూ ముందు కొంగి చేత్తో దాన్ని తాకబోయాడు.

'బాంబులవి, బాంబులు, ముట్టుకోవద్దు' అని అరుస్తూ జియాంగ్ కింగ్ మా దగ్గరికి రయిన దూసుకువస్తూ ఉంది. అంతలోనే బాంబర్లు మరోసారి 'డైవ్' చెయ్యడం చూసి అలానే వెనక్కి తిరిగి షెల్టర్ కేసి పరిగెడుతూ వచ్చెయ్యండీ, వచ్చెయండీ, అని అరిచింది. దాంతో మేం కూడబలక్కుని 'లగెత్తండి, లగెత్తండి' అని అరుచుకుంటూ మావోను అమాంతం ఎగరేసుకుని షెల్టర్ వైపు పరుగులు తీసాం.

జనరల్ నీ షెల్టర్ గుమ్మం లోపలి నిలబడి 'రావాలి, రావాలీ త్వరగా, బాంబులు పడతన్నాయీ, రావాలీ, రావాలీ' అని అరుస్తూ ఉన్నాడు. మేం ఎక్కడా ఆగకుండా పరుగు తీస్తున్నాం. మావో నడ్డిన ఉన్న బట్ట జారిపోతుంటే నేను ఎగదోసి పట్టుకున్నా. తను ఉన్న పరిస్థితికి సిగ్గయిందో ఏమో 'వొదలండర్రా', నన్నొదలండి నేనొస్తాగా, ఎందుకీ పరుగులూ, మోత బరువునీ' అని అరిచాడు.

మేం ఆయన మాటలేం పట్టించుకోలేదు. మేం ప్రహరీగోడ వెనక ఉన్న గుమ్మం నుండి బయటకి వచ్చామో లేదో మరోసారి బాంబులు పడ్డాయి. నల్లటి పొగ సుడులు తిరుగుతూ ఆకాశానికి ఎగిసింది.

ఈ హడావుడిలో మా పట్టునుంచి తప్పించుకున్న మావో నేలకు నిలబడి 'ఇంకా ఎందుకూ ఓ ఆత్రపడిపోతున్నారూ మనం ప్రహరీ గోడ దాటి బయటికి వచ్చేసాంగా. ఆ బాంబర్ల టార్గెట్ అల్లా మన దాబాలే. కంగారు పడమాకండి' అన్నాడు నింపాదిగా.

పైకి చూస్తే ఆ బాంబర్లు మరోసారి 'డైవింగ్ పొజిషను' తీసుకున్నాయి. అందుకే మావో మాటలు పట్టించుకోకుండా ఆయన రెండు జబ్బలూ పుచ్చుకుని చెరొకరి భుజాల మీద వేసుకుని మనిషిని పైకి లేపి 'షెల్టర్' వైపుకు పరుగులు తీసాం. మా వెనగ్గా మరోసారి బాంబులు పేలిన శబ్దం వినిపించింది. ఎట్లాగో అట్లా మేం షెల్టర్ ముఖద్వారం దగ్గరికి చేరుకున్నాం. మావో కాళ్ళను నేలకు తన్ని అక్కడే ఆగిపోయి మా పట్టునుండి విడిపించుకున్నాడు. మేం ఇంకా ఆయన్ని వొత్తిడి చెయ్యకుండా 'లోపలికి వెళ్దాం కామ్రేడ్' అన్నాం.

"నన్ను సిగరెట్ తాగనీయరా ఇంకా' అనడిగాడు ఆయన.

నేను ఆయనకి సిగరెట్ అందించి వెలిగించా.

'కామ్రేడ్ ఛైర్మన్‌లోపలికి వచ్చెయ్యండి' అన్నాడు జనరల్ నీ

'కంగారు లేదు, ఇక్కడ ఏం కాదులే గానీ నన్ను కాస్త వాళ్ళు బాంబులు ఎలా వేస్తున్నారో చూడనీండి' అన్నాడు మావో తాపీగా సిగరెట్ తాగుతూ. బాంబర్లు కురిపిస్తున్న బాంబులు, అవి పేలిన మూలంగా పైకి ఎగిసిపడుతున్న మంటలూ, పొగ, మేఘాల కేసి అలా చూస్తూ ఉండిపోయాడు. సిగరెట్ తాగడం పూర్తయ్యాక 'పదండి' అంటూ షెల్టర్‌లోకి అడుగుపెట్టాడు.

బాంబర్లు తమ పని కానిచ్చుకుని వెళ్ళిపోయాక గార్డులం అందరమూ మావో ఉన్న దాబాకేసి పరిగెత్తాం. పెద్దపెద్ద శబ్దాలు, మంటలూ, పొగలూ వచ్చాయి కానీ భారీ నష్టం జరగలేదు. మావో గది దుమ్మూ, ధూళీ మట్టిపెళ్ళలు, రాళ్ళముక్కలతో నిండిపోయి ఉంది. థర్మాసుఫ్లాస్కులు పగిలిపోయి నీళ్ళుకింద ఒలికిపోయి ఉన్నాయి. మేం గనక ఆ క్షణాన మావోను బలవంతంగా బయటకు తీసుకు వెళ్ళకపోయి ఉంటే ఎంత ప్రమాదం జరిగి ఉండునో కదా అనుకున్నాం. అయితే ఆ బాంబులు ప్రాణ హాని కలిగించేంత తీవ్రత ఎందుకు కలిగిలేవో, కొన్ని పేలకుండా ఎందుకు ఉండిపోయాయో మాకు అర్థం కాలేదు.

ఆ తరువాత మాకు తెలిసింది. ఆర్డినెన్స్ ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికులకు చాంగ్‌కైషేక్ ప్రభుత్వం చేస్తున్న ఈ పౌర యుద్ధం నచ్చక బాంబులలో పేలుడు పదార్థాలతో పాటు ఇసుక దట్టించి కూరేసి వాటిని డమ్మీ చేస్తున్నారనీ, అందుకే శబ్దాలు, మంటలూ పొగలూ వచ్చినా ప్రాణ హాని కలిగించ లేకపోయాయని.

బాంబర్ల దాడి, జరిగిన తీరుచూస్తే అవి పథకం ప్రకారం జరిగినట్లు తెలుస్తుంది. 'ఇది ఎవరో కుట్ర చేసారు. వాళ్ళు ఎవరో ఆరా తియ్యండి, పబ్లికున విచారణ జరిపించి, కాల్చిపారెయ్యండి' అని జనరల్ నీ ఆదేశించాడు.

అయితే ఈ వ్యవహారం అంత తేలిగ్గా బయటపడలేదు. 'బావోడింగ్' ప్రావిన్సును ప్రజావిముక్తి సైన్యం కైవశం చేసుకుని విముక్తి ప్రాంతంగా ప్రకటించిన తరువాత శతృసేనల రహస్య డాక్యుమెంట్లు స్వాధీనం చేసుకుని క్షుణ్ణంగా పరిశోధించాక గానీ అసలు దోషులు బయటపడలేదు.

డాఫెంగ్ పొగాకు కంపెనీ, చెంగ్‌నాన్‌ఝుంగ్‌లో ఉన్న మా మిలిటరీ కమాండ్‌కు అవసరమైన 'లాజిస్టిక్' (మౌళిక అవసరాలు) సపోర్టు చేసేది. ఆ కంపెనీ డిప్యూటీ మేనేజర్లు మెంగ్ జియాండే కొమింటాంగ్ గూఢచారిగా పనిచేసాడని తేలింది. అతడే మా 'ఆఫీసర్స్ మెస్' మేనేజరుగా తన మనిషి అయిన లియు కాంగ్‌వెన్‌ను నియమించి, అతని సహకారంతో చెంగ్ నాన్ ఝుంగ్ సెంట్రల్ కమిటీ నాయకత్వాన్ని విషాహారం ఇచ్చి మట్టుపెట్టాలని పథకం వేసారు. కానీ ఈ ఎత్తు పారలేదు. మావో సహా నాయకులకు అందించే ఆహారాన్ని ముందుగా మేం రుచి చూసి పరీక్షించేవారం కాబట్టి ఈ పథకాన్ని విరమించుకుని మరో కుట్రకు తెరతీసారు. చెండ్ నాన్ ఝుంగ్‌లో ఉన్న పార్టీ నాయకత్వం వివరాలు ఆనుపానులు అన్నీ సేకరించి బావోడింగ్ ఇంటిలిజెన్సుకు, కొమబింటాంగ్ సెక్యూరిటీ బ్యూరోకు చేరవేసారు. అక్కణ్ణించి ఆ సమాచారం బీపింగ్‌లోని ఇంటిలిజెన్స్ సర్వీసుకు చేరింది. దాంతో బీపింగ్ నుండే బాంబర్ల దాడికి పథకం సిద్ధమయింది. మెంగ్ జియాండే, లియు కాంగ్‌వెన్‌లను పబ్లీకున విచారించి దోషులుగా తేలిన పిమ్మట కాల్చి చంపేసింది. చెంగ్ నాన్ ఝుంగ్ మిలటరీ కమాండ్.

మావో రక్షణ కోసం మేం తాపత్రయపడే క్రమంలోనే ఒక్కోసారి అతిగా కూడా స్పందించే వాళ్ళం అనుకుంటా. ఒకసారి మావో యాంగ్సీ నదిలో ఈతకొట్టడానికి సిద్ధపడుతుంటే లుఓరుయ్‌కింగ్ వొద్దని అడ్డేసాడు. 'అంటే ఏంటీ, నేను నీళ్ళలో మునిగి చచ్చిపోతానని భయమా, ప్రతిదీ సెక్యూరిటీ కోణంలో నుండి చూస్తే ఎలాగర్రా, చావాలని రాసిపెట్టి ఉంటే ఉన్న పళాన ఇక్కడ బాంబులు పడితే చచ్చిపోమా, భద్రంగా ఉన్నాం కదా అని రూంలో దాక్కున్నా బాంబులు పడవని గ్యారంటీ ఉందా తప్పుకో కామ్రేడ్'

అంటూ మావో యాంగ్సీనదిలో ఈతవేసి వచ్చాడు. ఆయన మాటలు విన్నాక అదీ నిజమేగా అనుకున్నాం మేం.

'లాంగ్‌మార్చ్'లో భాగంగా జింగ్‌గాంగ్ పర్వతాల్లో ఉన్నప్పుడు ఒకసారి, యేనాన్‌లో ఉండగా ఇంకోకసారి శత్రు విమానాల బాంబింగ్ నుండి మావో క్షేమంగా బయటపడ్డాడు. యేనాన్‌ల బాంబు దాడి జరిగినప్పుడు మావో ఉంటున్న గుహ మాదిరి ఇల్లు దాదాపుగా ధ్వంసం అయిపోయింది. చెంగ్‌నాన్ ఝుంగ్‌లో జరిగిన దాడి అంతకన్నా తీవ్రమయినది. నవచైనా ఏర్పడిన తర్వాత కూడా మావోను టార్గెట్ చేసి అలాంటి దాడులు చేసారు. రెండు సందర్భాలలో మాత్రం పర్యవసానాలు నాకు బాగా గుర్తున్నాయి.

1952లో మావో షాంగైను సందర్శించారు. అధికారిక పర్యవేక్షణలో భాగంగా షాంగైలో ఉండగా వైమానిక దాడి జరిగింది. చెంగ్‌నాన్ ఝుంగ్ మాదిరిగానే ఇది కూడా కోవర్టు ఆపరేషన్ అయి ఉండవచ్చని అనుమానించారు. చాలాకాలంపాటు ఇన్వెస్టిగేషన్ జరిగింది. 'పాన్-యాంగ్' కేసుగా ప్రసిద్ధి కెక్కింది. షాంగై మున్సిపల్ ప్రభుత్వంలో ఉన్నతాధికారిగా పనిచేస్తున్న పాన్‌హానియన్‌ను దోషిగా గుర్తించి జైలుకు పంపారు. కానీ అది తప్పుడు నిర్ధారణ అని ఆ తరువాత తేలింది. అయితే 'పాన్'ను జైలుకు పంపించడంలో మావో పాత్ర ఉందనే సణుగుడు ప్రచారం కూడా జరిగింది. కానీ అది శుద్ధ తప్పు.

ఆయనకు ఇదే పనా. దేశాధినేతగా ఇటు ప్రభుత్వ వ్యవహారాలు అటు పార్టీ బాధ్యతలతో తలమునకలుగా పనిచేసే మావో ఒక చిన్న కేసులో జోక్యం చేసుకునే తీరికా, అవసరం ఉందని నేను అనుకోను. నాది పునాది లేని వాదనకాదనే ఘటన 1956లో జరిగింది. 56లో మరోసారి మావో షాంగై వెళ్ళాడు. నేనూ ఆయనతో ఉన్నా. అక్కడ ఉండగా ఒక రోజు మావో ఈత కొడుతున్న సమయంలో లీలియాన్ చాంగ్ వచ్చాడు. అతను గతంలో లీషావ్‌చి అంగరక్షకుడిగా పనిచేసాడు. అక్కడ నుంచి షాంగై మున్సిపాలిటీలో పనిచేసే బాధ్యత మీద ఇక్కడకు వచ్చాడు. కుశల ప్రశ్నలూ అవీ అయ్యాక 'ఇప్పుడు ఏం పని మీద ఉన్నావ్' అని లీలయాన్‌చెంగ్‌ను అడిగాడు మావో, 'షాన్‌యాంగ్' కేసు దర్యాప్తు చేస్తున్నా అని బదులిచ్చాడు తను. అది దేనికి సంబంధించిన కేసో కూడా తెలియనట్టే ఉండిపోయాడు మావో.

1958 జనవరిలో నాన్జింగ్‌లో బసచేసాడు. 18వ తారీఖు మధ్యాహ్నం ఒంటిగంట ప్రాంతంలో కొమింటాంగ్ విమానాలు నాన్జింగ్ వైపు వస్తున్నట్లు రాడార్లు పసికట్టాయి. మావో అప్పుడు యాంగ్‌నదిలో ఈతకొట్టి తన రూంకి వచ్చి పని చూసుకుంటున్నాడు. కేంద్రకమిటీ సమావేశాలకు సన్నద్ధం అవుతున్నాడు. మావో ఇక్కడకు వచ్చినట్లు

కొమింటాంగ్ సైన్యం పసిగట్టిందా? ఇప్పుడెలా? ఇక్కడ ఎయిర్‌బేస్ కూడా లేదే అని వైమానిక దళ డిప్యూటీ కమాండర్ హెటింగ్యీ తెగ ఆందోళన పడ్డాడు. లియురుఘౌ మిలిటరీ ఎయిర్ ఫీల్డ్‌ను సంప్రదించి-'ఏం చేస్తారో. ఎలా చేస్తారో, ఎన్ని విమానాలు ఉపయోగిస్తారో మీ ఇష్టం శత్రు విమానాలను దార్లోనే అడ్డగించి తోకముడిచేలా చెయ్యాలి. ఆరునూరైనా సరే శత్రు విమానాల నాన్జింగ్ గగనతల సరిహద్దుల్లోకి రాకుండా చూడండి' అని ఆదేశించాడు.

నగరం అంతా 'బ్లాక్-అవుట్' ప్రకటించారు. మేం అంతా మావో దగ్గరకు వెళ్ళి విషయం చెప్పి 'దగ్గర్లోనే షెల్టర్ ఉంది రమ్మనమని' అడిగాం. 'నేను రాను, కావాలంటే మీరు వెళ్ళండి' అనేది మావో సమాధానం.

'మీరు అట్లా అంటే ఎట్లా? మీ రక్షణకు మేం పూచీకదా' అని హెటింగ్యీ అన్నాడు.

'చాంగ్ కైషేక్ నన్ను ఒకసారి నాన్జింగ్ వెళ్ళమన్నాడు. వెళ్ళా. ఏమైంది ఏం కాలేదుగా. తను ఏం చెయ్యగలిగాడు.

నేను అప్పటికన్నా ఇప్పుడు క్షేమంగా ఉన్నానని మీరు అనుకోమాకండి అంటూ నాకేసి చూస్తూ 'కొవ్వొత్తులు వెలిగించి పట్రా' అన్నాడు.

'అది కాదు కామ్రేడ్ ఛైర్మన్. వీళ్ళంతా ఎందుకు చెబుతున్నారో..' అంటూ నేనేదో చెప్పబోతుండగా మధ్యలో మావో కల్పించుకుని అసహనంగా 'వెళ్ళు.. వెళ్ళి కొవ్వొత్తులు వెలిగించు. నన్ను పేల్చేసే బాంబులు తయారుచేయగల సత్తా వాళ్ళకి లేదుగానీ వెళ్ళి పనిచూడు' అన్నాడు.

నేను కిమ్మనకుండా వెళ్ళి కొవ్వొత్తులు వెలిగించా. మావో తన ఎదరవేసుకున్న పుస్తకం చదువుతూ ఉండిపోయాడు.

ఆ పుస్తకం పేరు 'ఛూసి', ఛూ వంశస్థుల రాజ్యపాలన మీర రాసిన పాటల పుస్తకం అది. ఎంతో శ్రద్ధగా, ఇష్టంగా చదువుతూ ఉండిపోయాడు మావో.

# 4. దిగులు మేఘం కమ్మినప్పుడు

ఎదుటి మనిషి కళ్ళలో నీళ్ళు చూడలేకపోయేవాడు మావో. 'ఎవరన్నా ఏడుస్తుంటే నే చూడలేను. ఎదుటి మనిషి కళ్ళలో నీళ్ళు చూస్తే నాకు ఏడుపొస్తుంది' అంటుండేవాడు తరచూ.

మేం చెంగ్ నాన్ ఝుంగ్‌లో ఉండగా ఒకసారి అక్కణ్ణించి జిబైపో వెళ్ళాల్సి వచ్చింది. మావోతోపాటు జీపులో నేనూ బయల్దేరాను. అంతా కొండ రోడ్డు కావడం మూలాన ఆ ఎగుడు దిగుడు గతుకుల మార్గంలో మా ప్రయాణం కొనసాగుతోంది. మేం ఒక చిక్కటి చీకటి తోవకుండా వెళ్తుండగా దారి పక్కన ఉన్న పొదలో ఎవరో మనుషులు ఉన్న జాడ గమనించాం. వెంటనే మా చేతులు తుపాకి ట్రిగ్గర్‌ల మీదకు చేరుకున్నాయి.

తీరా దగ్గరపడే సరికి ఏడెనిమిదేళ్ళ వయసులో ఉన్న ఒక పాప నేలమీద పడుకోబెట్టి ఉంది. పక్కనే నడివయసులో ఉన్న ఒక రైతు స్త్రీ కూచుని ఉంది. మా జీవు వాళ్ళను దాటిపోతూ ఉండగా ఆ పిల్ల సోయ లేకుండా పడి ఉండడం, పక్కన ఉన్న ఆడమనిషి ఏకధారగా ఏడుస్తూ ఉండడం గమనించా నేను, వాళ్ళతో ఏం ప్రమాదం లేదుకదాని మేం తేలిగ్గా నిర్ధారించాం. మావో రక్షణ తప్ప మాకు ఆ సమయంలో ఇంకా ఏం తట్టలేదు.

ఇదంతా మావో గమనించట్టున్నాడు. 'కారు ఆపండి' అని గట్టిగా అరిచాడు. దాంతో కీచుమను శబ్దంతో కారు ఆగింది. మావో జీవులోంచి కిందకి దిగాడు. మేం కూడా ఆయన వెనకే కారు దిగాం. పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ నేల మీద పడుకోబెట్టి ఉన్న పాప దగ్గరకు వెళ్ళి అరచేత్తో నుదురుతాకి చూస్తూ 'ఏమయింది' అనడిగాడు.

బుగ్గలన్నీ కన్నీటి చారికలతో ఉన్న ఆ నడివయసు స్త్రీ 'జబ్బుపడిందయ్యా పిల్ల' అని చెప్పింది.

'ఏమిటి తేడా' అనడిగాడు మావో.

' మా చెడ్డ జలుబు, ఉష్ణం అని చెప్పాడయ్యా డాక్టరు. ఏవో మందులిచ్చాడు. జబ్బేం నిదానించలా, జొరంతోపాటు మూర్ఛలు వొస్తున్నాయయ్యా పిల్ల ఊపిరి కూడా తీసుకోలేకపోతుంది' అని భోరున ఏడవసాగింది.

అది చూసి మావో కళ్ళలో కూడా గిర్రున నీళ్ళు తిరిగాయి. తమాయించుకుని ఆగి

ఉన్న జీపుకేసి చూసాడు.

మావో చూపు తనమీద పడిందని గ్రహించిన డాక్టర్ సై 'ఒస్తున్నా' అంటూ జీపు దిగి చకచకా మా దగ్గరకు చేరుకున్నాడు.

'చూడండి, పసిదానికి ఏమయిందో' అన్నాడు మావో

డాక్టర్ ఆ పిల్ల నాడి చూసాడు. జ్వరం ఎంత ఉందో కొలిచాడు. స్టెతస్కోప్‌తో పరీక్ష చేస్తూ వాళ్ళమ్మను వివరాలు అడిగి తెలుసుకున్నాడు.

'పాపకి ఏం కాదు కదా' అనడిగాడు మావో ఆర్ద్రత నిండిన కంఠంతో.

'ఏం కాదు' అన్నాడు డాక్టర్.

'సరే అయితే పాప కోలుకోవడానికి ఏం చెయ్యాలో చెయ్యండి అన్నాడు మావో.

'కానీ మందూ' అని ఆగిపోయాడు డాక్టర్.

'ఏ దొరకదా' అని ఆందోళనగా అడిగాడో మావో.

'కాదూ, మన దగ్గర ఒకటే సీసా ఉంది' అని చెప్పాడు డాక్టరు.

'ఏంటది' అని మావో అడిగిన దానికి 'పెన్సిలిన్' అని బదులిచ్చాడు డాక్టర్.

'మరింకేం, ఆలోచిస్తారు దేనికీ వాడండీ' అన్నాడు మావో.

'అదీ దిగుమతి చేసుకున్న ఖరీదైన మందు. కొత్త స్టాకు ఇప్పుడిప్పుడే దొరికేలా లేదు. మీకోసంకూడా వాడలా ఇప్పటిదాకా. మరీ ప్రాణం మీదకు వస్తే, అవసరానికి ఉంటుందని జాగ్రత్తగా కాపాడుకు వస్తున్నా' అన్నాడు డాక్టర్.

'ఇప్పుడు ప్రాణం మీదకు వచ్చిన అవసరమేగా. ముందు ఆ పిల్లకు సూది మందు ఇవ్వండి ప్లీజ్' అని ఖరాఖండీగా అన్నాడు మావో.

పెన్సిలిన్ అప్పట్లో తిరుగులేని యాంటీబయాటిక్ మందు. అదీ సీమ నుంచి తెప్పించింది. మావో అంత ఖచ్చితంగా చెప్పేసరికి డాక్టర్ సూ ఆ పాపకు ఇంజక్షన్ ఇచ్చాడు. కాసేపాగి కాసిన్ని మంచినీళ్ళు తాగించాడు. అప్పుడు ఆ పిల్ల కళ్ళు తెరిచి నీర్సంగా 'మాం' అనే పిలిచింది వాళ్ళమ్మని.

అప్పుడు ఆ తల్లి కళ్ళలో వెలుగు, ఆ వెంబడే కన్నీళ్ళు తొణికిసలాడాయి. ఉన్నట్టుండి ఆ తల్లి మావో కాళ్ళకు మొక్కుతూ వెక్కిళ్ళ మధ్యన 'నువ్వు నా బిడ్డకు బతుకునిచ్చిన బుద్ధుడివయ్యా, బుద్ధుడివి' అంది.

మావో కళ్ళుచెమర్చాయి. ఆ తల్లిని అనునయించి, 'డాక్టర్ ఈ తల్లీ బిడ్డల్ని తీసుకొని

వేరే కార్లో వాళ్ళింటికి వెళ్ళండి. పిల్లకు నిదానించేదాకా గమనించుకుని ఆనక వొచ్చి మాతో కలవండి' అని సూతో చెప్పాడు. వాళ్ళను వేరేకార్లో పంపించాక మేం మాదారిన బయల్దేరాం.

ఆ సంఘటన తలపుకు వచ్చినప్పుడల్లా మావో కళ్ళు తడిగామారేవి. 'మనం ఆ పిల్ల దగ్గర ఆగి ఉండకపోతే తన గతి ఏమయిఉండునో కదా'!.

అస్సలు ఆ పిల్లను ట్రీట్‌మెంటు కోసం మనతోపాటు తీసుకురావాల్సిందేమో' అంటూ మదనపడేవాడు. 'అసలు పల్లెపట్టుల్లో జబ్బులొస్తే వైద్యం చేసే నాధుడే లేకపోయాడే. బక్కచిక్కిన రైతులు వైద్యం కోసం మైళ్ళకు మైళ్ళు నడిచిపోవాల్సిందేనా, అప్పుడయినా డాక్టరు దొరకుతాడని గ్యారంటీ ఉందా, లాభం లేదు. పరిస్థితులు ఇలా ఉండడానికి వీల్లేదు. ప్రతి పల్లెకు వైద్య సేవలు అందేలా చూడ్డానికి మనం ఏదో ఒకటి చెయ్యాలి. మనం తినే ప్రతి గింజా రైతు పండించేదే. అలాంటి రైతుకు అన్నింటిలో వైద్యం అందించే బాధ్యత డాక్టర్‌లది. అందేలా చూసే బాధ్యత మనదీ' అని దృఢచిత్తంతో అనేవాడు.

**మావోను కలవరపరిచే మరో అంశం రక్తపాతం**

'పోదూ, బడాయి కాకపోతేనో' అని మీకు అనిపించవచ్చు. కానీ ఇది ముమ్మాటికి నిజం. దేశం, నలుచెరగులా చెలరేగిన విముక్తి యుద్ధాలకు సర్వసేనానిగా నిలిచి నడిపించిన మావో, శతృమూకల రాక్షసహింసకు ఏనాడూ వెరవని మావో, అప్తుల్ని, హితుల్ని, స్నేహితుల్ని ఎందరినో యుద్ధాల్లో పోగొట్టుకున్న మావో, తన కళ్ళ ముందు జరిగిన రక్తపాతం చూసి చూసి హృదయం మొద్దుబారిపోయిన మావోనే ఇతరత్రా సందర్భాల్లో రక్తం చూస్తే చలించిపోయేవాడు.

బీపింగ్ కేపి ప్రజావిముక్తి సైన్యాన్ని నడిపించి ఆ నగరాన్ని కూడా విముక్తం చేసాక ఫ్రోగ్రాంట్ కొండల్లో ఒక దేశవాళీ ఇంట్లో మకాం పెట్టాడు మావో. అయన్తోపాటు ఇంకొంతమంది జనరల్స్ కూడా ఆ చుట్టుపక్కలే మకాం వేసారు. నిశ్శబ్ధంగా ఉండాల్సిన ఆ కొండ ప్రాంతం తరచూ తుపాకీ మోతలతో దద్దరిల్లుతూ ఉండేది. ఆ శబ్ధాలు వినీవినీ మా గార్డుల చేతులు కూడా దురదపెట్టేవి. ట్రిగ్గర్ మీదకు వేళ్ళుపోయేవి.

ఆ కొండల్లో పక్షుల వేట తెగసాగేది. ఎక్కడెక్కడి వాళ్ళో వచ్చి వేట సాగించేవారు. అది చూసి మేమంతా తుపాకులకు పని చెప్పేవాళ్లం అప్పుడప్పుడూ. అప్పట్లో వన్యప్రాణ సంరక్షణా చట్టాలు, గ్రీన్ పీస్ కార్యకర్తల ఉద్యమాలు లేవు కదా. అదీగాక అప్పుడే రెండో ప్రపచ యుద్ధం ముగిసింది. దక్షిణ చైనా అంతటా విముక్తి యుద్ధాలు ఉవ్వెత్తున సాగుతున్నాయి. ఈ యుద్ధాల్లో అమూల్యమైన లక్షలాది మానవ ప్రాణాలు మట్టిలో కలిసిపోయాయి. కాబట్టి పిట్టల్ని పిట్టల్లా కాల్చేస్తే ఏం పోయిందిలే అనే లెక్కలేని తనం

మాలో ఉండేది.

ఒక రోజు నేను మావోతో పాటు ఏదో సమావేశానికి వెళ్ళి తిరిగివచ్చాం. ఇంటి ముందుకురాగానే మావో కిందికి దిగి నిలబడ్డాడు. అప్పుడే కొంత మంది మా వాళ్ళు పిచ్చుకల వేటకు వెళ్ళి నవ్వుతూ, తుళ్ళుతూ మాట్లాడుకుంటూ అటుగా వచ్చారు.

మావో యథాలాపంగా వాళ్ళకేసి చూసి ముందుకు వెళ్ళబోతున్న వాడల్లా ఆగిపోయాడు. మావో తమకేసి చూడ్డంతో సోల్జర్స్ వినయంగా గొంతు తగ్గించేసారు. మావో కనుబొమలు ముడిపడ్డాయి. అలవాటుగా కిందపెదవి కొరుక్కుంటూ 'ఏంటయ్యా మీ చేతుల్లో' అనడిగాడు.

తీగకు వేలాడేసిన పిచ్చుకలని మావోకు చూపిస్తూ 'పిచ్చుకలు' అన్నాడు ఒక గార్డు. గుండు వేసి కొట్టిన మూలాన నిలువెల్లా రక్తంతో తడిసిపోయి ఉన్నాయవి. ఆ గార్డు తీగను ఎత్తినమూలాన వాటి శరీరాలు కదిలి రక్తపు బొట్లు మావో కాళ్ళ దగ్గర టపటపా రాలాయి.

మావో బాధగా నొసలు చిట్లిస్తూ, ఒకడుగు వెనక్కివేసి కుడి చేతిని కళ్ళకు అడ్డంగా పెట్టుకుని 'తీసుకుపోండి, తీసుకుపోండి, నా కళ్ళముందు ఉండమాకండి, పోండి' అని అరిచాడు.

దాంతో ఖంగుతిన్న ఆ గార్డు, అతనితో ఉన్న సోల్జర్స్ వేటాడి తీగకు వేలాడదీసి తీసుకువస్తున్న పిచ్చుకల్ని తమ వెనక దాచే ప్రయత్నం చేసారు. రక్తంబొట్లు టపటపా నేలమీత రాలిపడుతున్నాయి.

'వాటిని చంపడానికి మీకు పర్మిషను ఎవరిచ్చారు' అని కోరగా వాళ్ళ వంక చూస్తూ అడిగాడు మావో. 'వాటి మానాన అవి బతుకుతున్నాయి కదా. అవి మీకేమన్నా హాని చేసాయా? ఈ భూమ్మీద బతికే హక్కు మనకు ఎంత ఉందో వాటికి అంత హక్కు ఉంది కదా? అవునా కాదా' అనడిగాడు.

దాంతో సోల్జర్స్ బిత్తరపోయారు. నోటమాట లేకుండా ఉండిపోయారు. 'పోండి' అని మావో అనడంతోనే 'బతుకుజీవుడా' అనుకుంటూ వాళ్ళు అక్కడ్నించి పరుగెత్తుకుంటూ వెళ్ళిపోయారు.

'ఈ క్షణం నుండి ఈ చుట్టుపక్కల ఎక్కడా వేట సాగడానికి వీల్లేదు. ఈ తప్పు మరోసారి జరుగకూడదు' అన్నాడు మావో నాతో ఆదేశపూర్వకంగా.

'అసలు ఇది మన పెద్ద తలకాయలే మొదలుపెట్టారు తొలిగా.. వాళ్లను చూసి వీళ్ళూ తయారయ్యారు' అన్నా నే విషయం బయటపెడుతూ.

'పెద్దా, చిన్నా చూడొద్దు. నా మాటగా చెప్పండి. ఎవ్వరూ ఇక్కడ పక్షుల్ని, పిట్టల్ని వేటాడకూడదు అంతే' అన్నాడు మావో.

ఇహ ఆ మరుసటిరోజు నుండి ఎవరన్నా వేట ఊసు ఎత్తితే ఒట్టు. మళ్ళీ ఆ కొండ కోనలు పక్షుల కిలకిలారావాలతో, వాటి మృదుమధుర సంగీతంతో కళకళలాడాయి.

1958లో మావో పల్లె ప్రాంతాల్లో పర్యటిస్తూ ఉండగా అనేక చోట్ల రైతులు 'ఈ పిచుకలు ఒకటి మా ప్రాణానికి వచ్చిపడ్డాయి. పండిన పంటలో పదో వంతు గింజని అవి కృష్ణార్పణం చేస్తున్నాయి. ఇంకో పదో వంతు గింజ నేల రాలిపోతుంది. ఉత్తిపుణ్యానికి, మా చెడ్డ చిక్కొచ్చిపడింది. దేవరా ఈ పిచుకలతో' అని ఫిర్యాదు చేసారు. పక్కనే ఉన్న సైంటిస్టుల్లో ఒకరిద్దరు' అవి తిన్నదానికంటే నేలపాల్జేసి నాశనం చేసే పంట ఎక్కువ' అన్నారు మావోతో. ధాంతో మావో 'అయితే వాటికి మందు పెట్టండీ' అని సలహా ఇచ్చా. అప్పట్నించి ఎలుకలు, పంట నాశించే పురుగులకు మందు పెట్టినట్లే పిచుకలకూ మందు పెట్టి చంపడం మొదలుపెట్టారు రైతులు.

ఆ తరువాత ఒక సమీక్షా సమావేశంలో సైంటిస్టులు 'పిచుకలు కొంత పంటని నాశనం చేసినా అవి చేసే కీడుతోపాటు మేలూ తక్కువది కాదు. పంట పొలాలను మిడతల దండు ఆశించకుండా నిలవరించగలిగేది పిచుకలే'అని స్పష్టం చేసారు. దాంతో పిచుకలను దుంపనాశనం చేసే కార్యక్రమానికి తెరపడింది.

నేను ఇంకో ముచ్చట కూడా చెప్పాలి మీకు బహుశా ఇది 1964 నాటి సంగతి అనుకుంటా..

ఝూంగ్ నాన్హైలో ఓ నాట్య ప్రదర్శన చూడడానికి వెళ్ళాం. నృత్య ప్రదర్శన మధ్యలో ఒక పాప మావో కూచుని ఉన్న సోఫా దగ్గరకు వచ్చి మాటలు కలిపింది. మావో ఉత్సాహంగా ఆ పాపను వివరాలు అడుగుతా ఉన్నాడు. 'అవునూ ఈ నృత్యం చాలా కష్టంగా ఉంది కాదా. చూస్తుంటేనే తెలిసిపోతుంది. మీరెంత కష్టపడి ఉంటారో శిక్షణ కఠినంగా ఉంటుందా, ఏమన్నా ఇబ్బందులు ఉంటాయా' అనడిగాడు ఆ పాపని.

'ఇబ్బందులని చిన్నగా అడుగుతారే.. ఒక్కోసారి దెబ్బలు తగిలేస్తాయి తెల్సా' అంది ఆ పాప.

'బాగా తగుల్తాయా' అనడిగాడు మావో.

'అం నాకు తెలిసీ టియాన్‌జిన్ థియేటర్ వాళ్ళు ఇలానే ప్రాక్టీసు చేస్తుండగా ఒకతను పిల్లి మొగ్గలు వెయ్యబోతూ బ్యాలన్స్ తప్పి దభీమని నేలకూలిపోయాడు. మెడ ఎముకలు విరిగాయట అతనికి. దాంతోపాటే వెన్నెముక కూడా దెబ్బతిని'.. అంటూ ఇంకా ఏదో

చెప్పబోతునాన్న పాపని.

'అహ్' అని బాధగా నొసలు చిట్లిస్తూ 'వొద్దొద్దు, ఇంక చెప్పమాకు పాపా' అని వారించాడు మావో. ఆ విషాద సంఘటన అప్పుడే తన కళ్ళ ఎదుటే జరిగినంత తీవ్ర వేదనకు లోనయ్యాడని ఆ మొహం చూస్తేనే తెలుస్తుంది.

ఇంతలోనే మళ్ళీ నృత్యంలో మరో అంకం మొదలయింది. పాప వెళ్లిపోయింది. మావో నిస్తేజంగా, బాధగా ఉండిపోయాడు.

అలాగే ఎవరన్నా బతుకు కోరడం చూస్తే మావో కరిగిపోయేవాడు.

మావో ఒక సాధారణ రైతు కుటుంబం నుండి వచ్చాడు. చైనా నీతి కథల్లో ఒక చోట చలికి గడ్డకట్టి చచ్చే పరిస్థితుల్లో ఉన్న ఒక పామును తన గుండెల్లో వెచ్చగా దాచుకుని ప్రాణం పోసిన రైతునే కాటేసి చంపిన వైనం గురించి మావో ఎరుగుదును. అందుకే శత్రువు ఎవరైనా సరే–ఆఖరికి చియాంగ్-కై-షేక్ సహా, రాజకీయంగా గానీ, నైతికంగా గానీ మావో చేతుల్లో ఓటమి అంచున ఉన్నా సరే చివరాఖరి దెబ్బతీసి ఖతం చేసే వరకూ ఒదిలిపెట్టేవాడు కాదు. చావుదెబ్బ కొట్టాల్సిన తరుణంలో అనవసరమైన దయాదాక్షిణ్యాలకు పోయి వోటమి అంచున ఉన్న శత్రువు చేతిలోనే 'ఛూ' వంశ యువరాజు యుద్ధంలో పరాజయం పాలయిన చారిత్రక ఉదంతం మావో మదిలో ఎప్పుడూ మెదలాడుతూ ఉంటుంది. మావోయే తరచూ ఈ రెండూ ఉదహరించేవాడు.

అలాంటి మావోయే ఒక్కొక్కప్పుడు 'నన్ను చంపొద్దని' వేడుకుంటే కరిగిపోయేవాడు.

మేం ఉత్తర షాంగ్జీలో అష్టకష్టాలు పడ్డాం. ఆ బాధలు పడలేక ఒక గార్డు సైన్యం వదిలిపారిపోయాడు. సైనిక బలగాల్లోంచి ఎవరాన్న పారిపోయినా, క్వాస్త ఉదాసీనంగా చూసీ చూడనట్లు వొదిలేసే వారేమోగానీ, గార్డులలో ఎవరన్నా పారిపోతే ఇక వాళ్ళకి మూడినట్లే. ఎందుకంటే గార్డులు నాయకత్వానికి దగ్గర మెసలడం మూలాన వారికి పార్టీకి చెందిన అనేక రహస్యాలు తెలిసే అవకాశం ఉంటుంది.

అందుకే పారిపోయిన గార్డు కోసం వేట మొదలయింది. చచ్చీ చెడి మొత్తానికి ఎలాగయితేనేం అతన్ని పట్టుకున్నాం.

ఇలా పారిపోయినవాళ్లను పట్టుకోవడానికి మేం పడే కుక్కపాట్లు మూలంగా మావో అసహనం హద్దులు దాటేది. ఈసారి అందుకు మినహాయింపు లేదు. అందుకే అతగాడిని పెడరెక్కలు విరిచి బంధించి పట్టుకొచ్చాం.

'చిత్తుగా గుజ్జుకింద చితక్కొట్టండి' కాల్చి పారెయ్యండి కుక్కని' అంటూ ఎవరికి తోచిన విధంగా వాళ్ళం కోపంగా కేకలు పెట్టసాగాం. ఈ హడావుడికి మావో బయటికి

వచ్చాడు. మేం బందీని ఆయన దగ్గరకు ఈడ్చుకువెళ్లాం. బట్టలు చిరిగిపోయి ఒళ్ళు దుమ్ముకొట్టుకుపోయి, బుగ్గలనిండా కన్నీటి చారికలతో, చావు భయంతో మొహం తెల్లగా పాలిపోయి ఉన్న ఆ లేత వయసు కుర్రాడి కేసి చూస్తూ ఉండిపోయాడు. 'కాల్చిపారెయ్యాలి కుక్కల కొడుకుని' అని ఎవరో అరిచారు. దాంతో ఆ కుర్రాడు బోరున విలపిస్తూ 'నన్ను-చంపొద్దు. దయచేసి నా మాట వినండి. మీరు అనుకున్నట్టు నేను ప్లేటు ఫిరాయించేవాణ్ణి కాదు. నేను మా ఇంటికి పోవాలనుకున్నానంతే. దిగులుపడి తప్పుచేసా. ఈ ఒక్కసారికీ నాతప్పు కాయండి ప్లీజ్' అని దీనంగా వేడుకున్నాడు.

నమ్మక ద్రోహుల పట్ల కఠినంగా వ్యవహరించే మావో కళ్ళు చెమరించాయి. ' ఆ కుర్రాడి కట్లు విప్పండి ' అన్నాడు.

'వీడు మనకు టోకరా ఇచ్చాడు కామ్రేడ్'

'వాడో విషపురుగు కామ్రేడ్' అని ఎవరికి తోచినట్లు వాళ్ళు తిట్టారు.

'విషపురుగా? వాడి మొహం చూడండి ఎంత లేతగా సాధు జంతువుమాదిరి ఉందో, ఊరికే వాణ్ణి భయపెట్టకండి. కట్లు విప్పండి' అన్నాడు మావో. మావో మాటలు రుచించని ఒక ఆఫీసరు. 'ఇలాంటి వాళ్ళను ఊరికే వధలకూడదు. ఇట్లా అయితే ఇక సైన్యంలో క్రమశిక్షణ ఎక్కడ ఏడుస్తుంది' అన్నాడు.

'నీ ఒక్కడికే తెల్సు సైన్యంలో క్రమశిక్షణ గురించి' అని మావో ఆ ఆఫీసరుని గదమాయించి, అంతలోనే నచ్చచెప్పే ధోరణిలో 'చూడండి, వీడు ఇంకా పాలబుగ్గల పసివాడికి మల్లే ఉన్నాడు. విప్లవ శ్రేణులలో ఎలా మెలగాలో తెలిసీ తెలియని తనం మూలాన తప్పు చేసాడనిపిస్తుంది నాకయితే. ఇంత కష్టం ఉంటుందని ఊహించి ఉండడు. అందుకే ఇంటి మీద దిగులుపెట్టుకున్నాడు. వాణ్ణిలా కట్టేసి ఇంకా బెదురుగొడ్డుగా చెయ్యమాకండి. వదిలేయండి. సరైన తిండి తిప్పలు ఉంటే ఇంటి గురించిన ఆలోచన ఎందుకు వస్తుంది. వాడికి సుబ్బరంగా మూడు పూటలా తిండి దొరికేలా చూడండి. మళ్ళీ ఇంటి ఊసు ఎత్తుతాడేమో చూద్దాం సర్లా' అన్నాడు.

తంతే గారెల బుట్టలో పడినట్లయ్యింది ఆ కుర్రాడి పరిస్థితి. ఎలాంటి శిక్ష లేకుండా క్షమించి వదిలిపెట్టిందిగాక ఆ కుర్రాడిని ఆఫీసర్స్ మెస్‌లో ఉంచాం పోషణకోసం. ఆ తరువాత మావో అన్నట్లు ఆ కుర్రాడు ఇంటి ఊసుఎత్తితే ఒట్టు.

విప్లవ కారుడిగా ఎంతగా రాటుదేలినా మావో మనసులో దయాగుణం, క్షమాగుణం ఉండేవి. ఉక్కు వంటి దృఢ చిత్తంతో ఉండే మావోకు వెన్నవంటి మనసూ ఉండడమే అయనలోని గొప్ప గుణం.

# 5. కనుల నీరు తొణికిసలాడినప్పుడు

"నేనంత తేలిగ్గా ఏడిచే రకం కాదు. కానీ అదేంటోగానీ పేదవాడి కళ్ళల్లో నీరు చూస్తే చాలు కన్నీరు ఆపడం నా తరం అయ్యేది కాదు. నా దగ్గర పనిచేసే ఆర్డర్లీ సహా ఎవరైనా సరే నన్నిడిచి పెట్టి వెళ్ళిపోతున్నారంటే నా గుండె బరువెక్కిపోయేది. నాకు చెప్పకుండా, కనబడకుండా పొమ్మని చెప్పేవాణ్ణి. వీళ్ళలో ఎవరన్నా చనిపోయారని తెలిసినప్పుడు భోరున విలపించా. నా గుర్రం ముసలిదయి చనిపోయినా, పెన్ను పాతబడి విరిగిపోయినా వాటి బదులు వేరేది వాడాలనిపించదు. ఎందుకో, అంతెందుకు 'గుయిరుఝౌ'లో నీవు తీవ్రంగా గాయపడ్డావని తెలిసినప్పుడు ఎంతగా ఏడ్చానోతెల్సా' అని మావో స్వయంగా 'జిజెస్'తో అన్నాడు.

మావో ఏ విషయంలోనయినా సరే నిజాయితీగా మాట్లాడేవాడు. నా పదిహేనేళ్ళ సావాసంలో ఇలాంటి ఉదాహరణలు ఎన్నో ఉన్నాయి.

నిజానికి మావో చాలా నిబ్బరమయిన మనిషి. ఎంతటి దురదృష్టం వెన్నాడినా, ఆప్తులను కోల్పోయినా ఏనాడూ కంటతడి పెట్టలేదు. కొరియా యుద్ధంలో మావో కన్నకొడుకు మావో అనీయంగ్ చనిపోయాడు. ఆ విషాదం మావోను తీవ్రంగా కలచివేసింది. నిద్రాహారాలు లేకుండా గడిపాడు ఎన్నో రోజులు. ఒంటరిగా కూచుని అదేపనిగా సిగరెట్లు ఊదిపారేసేవాడు. ఆయన కళ్ళలో విషాదం ఉండేది. కొడుకు కోసంపడే తపన ఉండేది. కోపం తొంగి చూసేది. కానీ కన్నీరు మాత్రం వచ్చేది కాదు.

అట్లా అని జీవితంలో మావో ఏనాడూ కన్నీరు పెట్టలేదా అంటే– పెట్టేవాడుఅనేదానికి నేనే సాక్ష్యం. నేను మరిచిపోలేని అలాంటి మూడు సంఘటనలను మీకు ఇప్పుడు నే వివరిస్తా.

'అర్ధాంగికి రాజుగారి కడపటి వీడ్కోలు' అనే బీజింగ్ ఒపేరా అంటే మావోకు చాలా ఇష్టం. గైక్సియా దగ్గర శత్రుసేనలు 'ఛూ' వంశ యువరాజును చుట్టుముడతాయి. శత్రుముట్టడిని ఛేదించి బయటపడడానికి వీలుగా యువరాణి ఆత్మహత్య చేసుకుంటుంది. ఆ తర్వాత యువరాజు శత్రు సైనికులను ఛేదించుకుని వుజియాంగ్ నది ఒడ్డుకు చేరుకుంటాడు. గెలుచుకోవాల్సిన యుద్ధంలో ఓడిపోయిన యువరాజు నదీ తీరంలో

ఆత్మహత్య చేసుకుంటాడు. ఇదీ స్థూలంగా ఒపేరా కథ. చాంగ్-కై-షేక్‌ను ఓడించడానికి ముందూ, తరువాత కూడా మావో ఈ ఓపేరాను చాలాసార్లు చూసాడు. ఒకోసారి పార్టీ ప్రధాన నాయకత్వాన్ని, క్యాడర్‌ను తనతోపాటు తీసుకువెళ్ళేవారు. మావో ఎంత సున్నిత మనస్కుడో నేను ఇంతకు ముందే చెప్పా. యువరాజు, రాణి ఇహ ముందు ఒకరినొకరు చూసుకునే అవకాశం లేదని తెలిసి వాళ్ళ మొహాల్లో ఆ బాధను వ్యక్తం చేసినప్పుడు మావో రెప్పల మాటున కన్నీళ్ళను అదివి పట్టుకునేవాడు. ఒక సందర్భంలో అయితే పక్కకి తిరిగి నా కోటు గుండీను సవరిస్తూ లో గొంతుకతో చూసావుగా, జన్మలో ఎప్పుడూ ఆ యువరాజు చేసిన తప్పు చెయ్యమాకు. ఇది మనకు ఒక గుణపాఠం కావాలి' అని చెప్పాడు.

బీజింగ్ ఒపేరాలు అంటే మావోకు మా చెడ్డ ఇష్టం. అయితే ఒక్కోసారి ఒక్కో ఒపేరాను ఎక్కువగా ఇష్టపడేవాడు. ఉత్తర షాంగ్జీలో విముక్తి యుద్ధం నడుస్తున్నప్పుడు 'రక్షణ లేని నగరం' 'విల్లమ్ముల అప్పు' అనే రెండు ఒపేరాలను ఇష్టంగా చూసేవాడు. ఎంత ఇష్టం అంటే ఆ ఒపేరాలలో నేపధ్య గీతాలను గుర్తు తెచ్చుకుని పాడుకునేవాడు. క్రీ.శ.220-280 దశకాల్లో పరిపాలించిన మూడు శత్రు రాజ్యాలకు సంబంధించిన కథలే ఆ రెండూ ఒపేరాలు. 'రక్షణ లేని నగరం' అనే ఒపేరా కథను నాలుగు వాక్యాల్లో మీకు వివరిస్తా. వుయూ రాజ్యాధిపతి సిమాయి షు రాజ్యానికి చెందిన బీజింగ్‌ను జయించి అటునుంచి అటే జియాచెంగ్‌ను కూడా ఆక్రమించుకోవడానికి బయలుదేరతాడు. షు రాజ్యాధిపతిగా ఉన్న ఝూగే లియాంగ్‌కు ఈ వర్తమానం అందినా ఆ నగరాన్ని రక్షించడానికి చేతికింద తగినంత సైన్యం లేని నిస్సహాయ పరిస్థితిలో ఉంటాడు. సిమాయి సేనలు నగర సరిహద్దులకు చేరే సమయానికి కోటగోడ మీద నుంచి వేయితంత్రుల వాయిద్యాన్ని పలికిస్తూ సైన్యం కోలాహలం చేస్తున్నట్లు భ్రమింపచేస్తాడు. కోటలోపల సైన్యం ఉందేమో అని భావించి సిమాయి సైన్యం వెనక్కి తగ్గుతుంది. అదను కోసం వేచి ఉంటుంది. ఈలోగా లియాంగ్ సైన్యాన్ని కూడగట్టుకొని నగరాన్ని రక్షించుకుంటాడు.

'విల్లమ్ముల అప్పు' కథ కూడా లియాంగ్‌కు సంబంధించిందే.కావోకావో తన సంకీర్ణ సేనలయిన లియుబి, సన్ క్యువాన్ దళాలతో కలిసి యాంగ్సీ నది ఒడ్డున ఉన్న చిబి నగరం కైవశం చేసుకోవడానికి లియాంగ్ సేనలతో తలపడతాడు. పొగమంచు దట్టంగా కమ్మిన రోజున లియాంగ్ గడ్డిపుల్లలతో పడవలు తయారు చేయించి వాటితోపాటు చెక్కడమ్మలను శత్రుసేనలవైపు వదులుతాడు. నదీ మార్గంలో పడవల మీదుగా దాడి చేస్తున్నాడని భ్రమించి శత్రుసేనలు శరంపరంపరగా బాణాలు కురిపిస్తాయి. ఆ బాణాలన్నీ గడ్డిపుల్ల పడవలకి, చెక్కడమ్ములకు గుచ్చుకుని ఉండిపోతాయి. లియాంగ్ వాటిని వెనక్కి మళ్లించి విల్లమ్ములన్నీ తన వద్ద పోగేస్తాడు. శత్రువుల అమ్ముల పొదిలు ఖాళీ

అయిపోతాయి.

జిబైపోలో ఉండగా మావో ఒకేసారి మూడు చోట్ల -లియోక్సిషెన్సాంగ్, బీపింగ్ - తియాన్జిల్, హురియ్‌హోయ్-జరిగే విముక్తి యుద్ధాల్ని పర్యవేక్షించాల్సి వచ్చింది. ఆ సమయంలో మావో తరచూ పై రెండు ఒపేరాలను గ్రామ్ ఫోన్ రికార్డులో వింటూ ఉండేవాడు. అలాగే కథానాయకుల సమావేశం' అనే ఒపేరాలో పాటలూ అంతే ఆసక్తిగా వినేవాడు. దీనిలో కథా నాయకులు ఝుగేలియాంగ్, ఝువోయులు. యుద్ధంలో వీరు ప్రదర్శించిన చతురత వ్యూహం, ఎత్తుగడలు, సమాయత్తతలను మావో మెచ్చుకునేవాడు.

అక్కణ్ణించి బీజింగ్‌కు మారాక, 'అర్ధాంగికి రాజుగారి కడపటి వీడ్కోలు' అనే ఒపేరాను విపరీతంగా ఇష్టపడ్డాడు. నవ చైనా ఆవిర్భవించిన కొన్నేళ్ళ వరకూ అదే తన ఫేవరేట్ ఒపేరా. 1953-54 మధ్య కాలంలో 'తెల్లపాము కథ' అనే ఒపేరా చూసాడు. అప్పణ్ణించి ఓ ఐదారేళ్ళపాటు ఆ ఒపేరాను తెగచూసేవాడు. చైనా పురాణగాథను ఆధారం చేసుకుని ఈ ఓపేరా రూపొందించారు. ఒక పాము వెయ్యేళ్ళపాటు ఘోర తపస్సు చేసి మానవ అవతారం పొందుతుంది. మానవ లోకం లోకి అడుగుపెట్టిన ఆ యువతి జుజియాన్‌తో ప్రేమలో పడుతుంది. కాని అప్పటి ఫ్యూడలిజానికి ప్రతినిధిగా ఉన్న ఒక బౌద్ధ గురువు ఫహాయీ ఆగ్రహానికి గురయి జీవిత పర్యంతం ఒక 'పగోడా'లో బందీ అవుతుంది. ఈ విషాద గాథను చూసినప్పుడల్లా మావో కన్నీరు పెట్టుకునేవాడు.

1958లో షాంగై పర్యటనలో ఉండగా కమ్యూనిస్టు పార్టీ కమిటీ నాయకులు మావోకు వినోద ప్రదర్శన ఏర్పాటు చెయ్యాలనుకున్నారు. 'ఏ ఒపేరా చూస్తారు' అని వాళ్ళు మావోనే అడిగారు. 'తెల్లపాము కథ' అయితే బాగుంటుంది అని వెంటనే బదులిచ్చారు మావో.

షాంగై ప్రభుత్వ ఉద్యోగుల ఆడిటోరియంలోకి ఆ రోజు రాత్రి మావో అడుగు పెట్టినప్పుడు అక్కడ ఉన్న జనాలంతా లేచి నిలబడి హర్షధ్వానాలు చేశారు. మావో వాళ్ళకేసి పలకరింపుగా చెయ్యి ఊపుతూ వెళ్ళి ముందరి వరుసలో తనకు కేటాయించిన సీట్లో కూచున్నాడు. ఆ వరుసలోనే షాంగై పార్టీ అధినాయకత్వం, ప్రభుత్వ ఉన్నతాధికారులూ కూచుని ఉన్నారు. వాళ్ళు కూడా మావోను చూసి లేచి నిలబడి గౌరవ వందనం చెయ్యబోతే మావో వాళ్లను వారించారు. తనసీట్లో కూచునే ముందు మరోసారి జనాలకు అభివాదం చేస్తా. నేను ఆయన పక్కసీట్లో కూచున్నా. మావో కూచున్నప్పుడు పొట్ట మరింత ముందుకు సాగి నడుముకు ఉన్న బెల్టు ఇబ్బందిగా మారకూడదనే ఉద్దేశ్యంతో నేను బకిల్ ఊడదీశాను.

మావో తన సీట్లోకూచోవడంతోటే ఒపేరా ప్రారంభం అయింది. నేను మావోకు సిగరెట్ అందించి వెలిగించాను. మావో శ్రద్ధగా ప్రదర్శనను ఆలకిస్తున్నాడు. సిగరెట్ పూర్తిగా తాగకుండానే దాన్ని నులిమిపడేశాడు. మళ్ళీ సిగరెట్ అడగలేదు. వరుసగా సిగరెట్లు ఊదేసే మావో ప్రదర్శనలో అంతగా లీనమయిపోయాడు. ఇదే ఒపేరా గ్రామ్‌ఫోన్ రికార్డు మీద వినేటప్పుడయితే వేళ్ళతో దరువు వెయ్యడమో, పాటతో తనూ గొంతు కలపడమో చేసేవాడు. కానీ ఇప్పుడు కుదురుగా కూచుని ఒళ్ళంతా కళ్ళు చేసుకుని మరీ ప్రదర్శన చూస్తా ఉన్నాడు. కథ ముందుకు సాగుతున్న కొద్దీ తన మొహంలో హావ భావాలూ కథకు అనుగుణంగా మారుతున్నాయి. ఒక్కోసారి ఆ కళ్ళు మెరిసేవి. ఇంకోసారి ఉద్వేగంగా మారేవి. మరోసారి ఆ కళ్లలో బాధ తొంగి చూసేది. ఒపేరాలో ఏదన్నా దృశ్యం గొప్పగా పండితే అందరికన్నా ముందు మావోనే అభినందన పూర్వకంగా చప్పట్లు చరిచేవాడు.

రంగస్థలం మీద ఫహోయీ పాత్రధారి కనబడగానే మావో మొహంలో రంగులు మారాయి. అసహనంగా కుర్చీలో మెదిలాడు. నోరు తెరుచుకుని మధ్యమధ్యన ఆ పాత్రపట్ల ఉన్న ప్రతికూల భావం రీత్యా పళ్ళునూరతా ఉన్నాడు. నాటకం చరమాంకానికి చేరుకుంది. మానవ కన్యగా అవతారం ఎత్తిన తెల్లపామును తన భర్తనుండి వేరు చేసే దృశ్యం అది. ఆ తరువాత ఏం జరుగుతుందో నాకు అనుభవమే కాబట్టి నేను మావోకేసి చూసి పొడిగా దగ్గాను. ఆయన్ని ఈ లోకం లోకి లాక్కురావడానికి అప్పటికే ఆలస్యం అయిపోయింది. ఊహకు, వాస్తవానికి మధ్య ఉన్న సరిహద్దు రేఖ చెరిగిపోయింది. నాటకంలో పూర్తిగా సంలీనం అయిపోయిన మావో ముక్కు పుటాలు అదురుతున్నాయి. కళ్ళలో నీళ్ళు ఊరిపోయాయి. చూస్తుండగానే కన్నీటి బొట్లు బుగ్గల మించి జారి మావో ఛాతిమీద పడి చొక్కామీద తడితడిగా అవుతుంది.

చుట్టుపక్కల జనాలు మావోను ఇలా చూస్తే ఇబ్బందే అని నేను కింద మీద అవుతున్నా ఓర కంట అటూ ఇటూ పరకాయించి చూశా. వాళ్ళ దృష్టిని ఇటు ఆకర్షించకుండా ఉండడానికి నానా తంటాలు పడ్డాను. కాని అదృష్టం–అందరూ చాలా శ్రద్ధగా వేదిక మీద జరుగుతున్న నాటకాన్ని చూస్తూ ఉండిపోయారు. హమ్మయ్య. వేదిక కింద జరుగుతున్న 'మినీ డ్రామా' ఎవరికంటా పడ్లేదు అని తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నారు.

కానీ నా ఆనందం అట్టేసేపు నిలవలేదు. మావో కన్నీళ్ళు కారుస్తూనే భారంగా ఊపిరి పీల్చుకోసాగారు. గొంతులో బాధ ధ్వనించడంతో అటూ ఇటూ కూచున్నవాళ్ళు 'ఏం జరుగుతుందా' అని ఆసక్తిగా ఓరగా మాకేసి చూశారు. మావో పరిస్థితి గమనించారు. అయినా ఏం ఎరగనట్లు మొహం తిప్పేసుకుని నాటకం చూస్తా ఉండిపోయారు. నాకు

తలకొట్టేసినట్లయింది. మావో అంతటి గొప్ప నాయకుడు ఒక నాటకం చూసి కన్నీళ్ళు పెట్టుకోవడం ఛూస్తే ఆయనకి ఎంత అప్రతిష్టా అని మదనపడిపోతూ మరో రెండు మూడు సార్లు పొడి దగ్గుదగ్గా, మావోను ఈ లోకం లోకి లాక్కురావడానికి నా ప్రయత్నం అసలుకే మోసం తెచ్చింది. మావో ఈ లోకంలోకి రావడంకాదు గానీ అందాకా అసలేం జరుగుతుందో తెలీని వాళ్ళు కూడా నాకేసి తలతిప్పి చూడ్డంతో వాళ్ళు మావోను ఏ పరిస్థితిలో చూడకూడదని తలచానో ఆ పరిస్థితుల్లో కళ్ళారా చూసే అవకాశం నేనే కల్పించినట్టయింది. దాంతో నేను గుమ్మునుండిపోయా.

మధ్య మధ్య బెక్కుతూ మావో కళ్ళు, ముక్కు తుడుచుకోసాగారు. ఇక ఆ పరిస్థితుల్లో చెయ్యగలిగిందేం లేదని అర్థమై నాటకం ఎప్పుడు అయిపోతుందా అని నే ఎదురుచూస్తా కూచున్నా. నాటకం కూడా చివరికి వచ్చేసింది. ఫహాయియా మానవ కన్యగా మారిన తెల్లపాముని తప్పుపడుతూ శిక్షవేపే దృశ్యం వచ్చింది.

అప్పుడు జరిగింది ఆ అనూహ్యా సంఘటన. మావో కోపంగా కుర్చీ కోడు మీద చేత్తో మోదుతూ లాభం లేదు, తిరగబడాలి. తిరుగుబాటు చెయ్యాలి. ఇలాంటి వెధవల మీద తిరగబడూ, బుద్ధి చెప్పు' అని అరుస్తూ లేచి నిలబడ్డాడు హఠాత్తుగా.

నేను బిత్తరపోయా ఒక్క క్షణం, కూర్చున్నప్పుడు పొట్ట బిగుసుకుని ఇబ్బందిగా ఉంటుందని నడుముకున్న బెల్టు బకిలునే ఊడదీసిన మూలాన మావో అలా హఠాత్తుగా నిలబడడంతో పంట్లాం కిందకి జారిపోయింది. నేను షాక్ తిన్నా తేరుకుని గబగబా పంట్లాంపైకి ఎగలాగి ఎట్లానో తంటాలు పడి బెల్టు బకిలు పేట్టేసా. నేను భయంతో సిగ్గుతో వొణికిపోయా, మావోకు ఇంతటి అవమానం జరగడానికి నేనే కారణం కదా అని చానాళ్ళు కుమిలిపోయా.

కానీ జరిగినదానికి మావో నన్ను ఏనాడూ తప్పుబట్టలేదు. అసలు అది పెద్ద విషయంగా భావించినట్టు లేదు. నాటకం అయిపోవడంతోటే వేదిక మీదకు వెళ్ళాడు. జనాలు చప్పట్లు కొడుతూ ఉండడంతో నాటకం తాలూకు మైకం నుండి బయటపడినట్లున్నాడు.

జియావోకింత్ పాత్ర పోషించిన నటి చేతిని రెండు చేతుల్తో పట్టుకుని అభినందించాడు. భర్త పాత్ర పోషించిన నటుడికి షేక్‌హ్యాండ్ ఇచ్చాడు. మతిమరుపు పాత్ర వేసిన నటుడికేసి కన్నెత్తయినా చూడలేదు. మావో మనసు అంతమెత్తనిది.

మావో కంట నీరు పెట్టుకున్న ఇతర సందర్భాలు సామాజిక పరమయినవి. నవ చైనా నిర్మాణానికి సమాజం సంక్లిష్టమయిన మార్పులకు లోనయిన కాలం అది. సోషలిస్టు

నిర్మాణం, కమ్యూన్ల ఏర్పాటు, భవిష్యత్తులోకి పెద్ద గెంతు (గ్రేట్ లీప్ ఫార్వార్డ్) - ఈ మూడు లక్ష్యాల సాధనకు మొత్తం సమాజం అనేక ఏళ్లపాటు కఠోరంగా శ్రమించాల్సి వచ్చింది. చైనా రూపురేఖల్ని సమూలంగా మార్చడానికి దేశవ్యాప్తంగా ఉద్యమగతిని పై లక్ష్యాల అమలుకు పూనుకున్న కాలం అది. ఆ చరిత్ర పట్ల నా అవగాహన పరిమితమైనది. కానీ నాకు గుర్తున్న కొన్ని విషయాలు ఇప్పుడు మీకు వివరిస్తాను.

ఝూంగ్‌నాన్హైలో 1955 మే 14వ తేదీన మావో మా గార్డులు అందరినీ సమావేశపరిచారు. 'గార్డులుగా మీ పనితనం ఏంటో నిరూపించుకున్నారు. ఈ దేశ పౌరులుగా కూడా మీరు అంత మంచిగా మెలుగుతారనే నమ్మకం నాకుంది. ఇపుడు నాకు కావల్సిందల్లా మీరు సెలవులకు మీమీ ప్రాంతాలకు వెళ్ళినప్పుడు అక్కడి సామాజిక పరిస్థితులు ఎలా ఉన్నాయో సమగ్రంగా అధ్యయనం చెయ్యాలి. సామాజిక అధ్యయన శీలురుగా మిమ్మల్ని మీరు నిరూపించుకోవాలి. మీరు వెనక్కి తిరిగి వచ్చాక మీరు మీ కళ్ళతో చూసింది. చెవులతో విన్నదీ తు.చ.తప్పకుండా నాకు చెప్పాలి' అంటూ సమగ్ర అధ్యయనం అంటే ఏమిటో సోదాహరణంగా వివరించాడు మాకు.

ఈ పని కోసం మావో దేశంలోని వివిధ ప్రాంతాల నుండి మరీ ముఖ్యంగా గ్రామీణ నేపథ్యం నుంచి వచ్చిన గార్డులను ఎంపిక చేసి ఈ బాధ్యత అప్పచెప్పాడు. సెలవు మీద వెళ్ళిన గార్డులు తిరిగి రాగానే వారు అందించే సమాచారం ఆధారంగా అప్పటికే ఆయా ప్రాంతాల నుండి వచ్చిన నివేదికలను సరిచూసి తగిన మార్పులు చేర్పులూ చేసేవాడు.

1957-58 మధ్య కాలంలో అలా సేకరించిన సమాచారం ద్వారా గ్రామీణ ప్రాంతాల్లో ధనిక-పేద ప్రజానీకం మధ్య పెరిగిపోతున్న అంతరాలు, మారుతున్న బలాబలాల సమీకరణాలు మావోను ఆందోళనకు గురిచేసాయి. ఈ సమస్యల పరిష్కారం కోసం తీవ్రంగా ఆలోచించేవాడు.

1957 డిసెంబర్ నెల ప్రాంతంలో మావియా అనే గార్డు ఊరు నుండి తిరిగివస్తూ తనతోపాటు ఒక బన్ను రొట్టె తెచ్చాడు. జొన్న రొట్టె అన్న పేరేగాని పిండి తక్కువ పీచు ఎక్కువతో చేసిందని చూస్తేనే తెలిసిపోతుంది. నల్లగా, రాయి ముక్కలా కనిపిస్తుంది. 'ఇదీ మా ఊళ్ళో పేద రైతులు తినేది. మీరు నమ్మండి నమ్మకపోండి. ఇదే వాళ్ళ తిండి అంటూ మావోకు ఆ రొట్టె అందించాడు.

ఆ రొట్టెను చూస్తూ మావియా చెప్పింది విని మావో చలించిపోయారు. మావో కనుబొమ్మలు ముడిపడ్డాయి. రొట్టె అందుకునేప్పుడు మావో చెయ్యి సన్నగా వొణికింది. కష్టం మీద రొట్టె ముక్క విరిచి నోట్లో పెట్టుకున్నాడు. నవిలి తినే ప్రయత్నంలో మావో కళ్ళలో నీరు తొణికిసలాడింది.

'తినండి, మీరూ రుచి చూడండి' అంటూ చుట్టూ ఉన్నమా అందరికీ ఒక్కో ముక్క తుంపి ఇచ్చాడు. మనిషి చాలా కలతపడి పోయి కనిపిస్తున్నాడు. తినండి, తిని చూడండి ఇదీ మన రైతులు తింటున్న తిండి, మనందరికీ వంట వండించి మన ఆకలి తీర్చే బక్క రైతు ఏం తిని బతుకుతున్నాడో మీకూ తెలుస్తుంది తినండి అన్నాడు ఉద్వేగంగా.

ఆ చిన్న రొట్టె ముక్క తినడానికి మాకు చుక్కలు కనబడ్డాయి. మావో కళ్ళు తడిగానే ఉన్నాయి. మాతో పాటే ఉన్న మావో ఆహార వ్యవహారాలు ఎలా ఉండాలో, చూసే 'న్యూట్రిషన్ స్పెషలిస్ట్' కేసి అలా కాసేపు చూస్తుండిపోయాడు. 'న్యూట్రిషన్ స్పెషలిస్టు ' ఉన్నాడు అంటే మావో గొప్పగా తిండి తింటాడు అనుకోబాకండి. స్పెషలిస్టు ఏం చెప్పినా మావో తినేది ఉడకేసిన ఉప్పుడు బియ్యం, ఒక కప్పు పప్పు. మనదేశంలో ప్రతి వాళ్ళకీ ప్రస్తుతం ఈ మాత్రం భోజనం దొరికితే చాలు' అని అంటుండేవాడు మావో తరచుగా.

ఆ రోజంతా మావో భోజనం ముట్టలేదు. పోరగా పోరగా అర్థరాత్రికి కాస్త 'నాస్తా' ఎంగిలిపడ్డాడు. రోజంతా తిండి లేకుండా ఉన్న మూలాన మర్నాడు పెందరాడే 'నాస్తా' టైంకి భోజనం వడ్డించానేను. భోజనం అయ్యాక కాసేపు నడుం వాల్చాడు. నేను పక్కనే కూచుని కాళ్ళు ఒత్తసాగాను. మావో నిర్వికారంగా ఏదో ఆలోచిస్తూ ఉండిపోయాడు చాలాసేపు. నిన్నటి సంఘటన తనను ఇంకా వెంటాడుతుందని ఊహించగలిగా నేను 'మనది సోషలిస్టు సమాజం కదా. మన రైతులు ఇంకా ఆ చచ్చుపుచ్చు తిండి తినడమా? ఊహూ, లాభం లేదు. మనం ఏదో ఒకటి చెయ్యాలి. సోషలిజంలో శ్రీఘాభివృద్ధికి ఏం చెయ్యాలి. ఏం చెయ్యాలి. అని జనాంతికంగా గొణుగుతున్నా నాకు వినబడనే వినబడింది.

ఆ తరువాత చాలా రోజులపాటు మావో నోటివెంట అవే వాక్యాలు పలుమార్లు విన్నాను. పార్టీ సెంట్రల్ కమిటీలోని ప్రధాన నాయకుల దగ్గర మావో ఈ విషయాన్ని ప్రస్తావించడం వాళ్ళతో లోతుగా చర్చిండం నే గమనిస్తూ ఉన్నాను.

1958 జనవరి 28న జరిగిన జాతీయ వ్యవహారాల సుప్రీం సమావేశంలో 'అందరూ కదలండి, అత్యున్నత లక్ష్య సాధనకు కంకణబద్ధులు అవండి, రాబోయే పదిహేనేళ్లలో మనం బ్రిటీష్ సామ్రాజ్యం సాధించిన అభివృద్ధిని సాధించాలి' అని పిలుపు ఇచ్చారు మావో.

అదే ఏడాది మార్చి నెలలో 'చెంగ్‌డు'లో జరిగిన సమావేశంలో 'సుప్రీం' పిలుపును వివరిస్తూ 'అందరూ కదలండి. అత్యున్నత లక్ష్య సాధనకు శ్రమించండి. వేగవంతమైన, మెరుగైన, అద్భుతమైన ఆర్థికాభివృద్ధి సాధించి సోషలిస్టు సమున్నత సమాజాన్ని నిర్మించండి' అని చెప్పాడు మావో. మరో రెండు నెలల తర్వాత జరిగిన పార్టీ 8వ మహాసభ ఇదే నిర్ణయాన్ని జనరల్ లైనుగా ప్రకటించింది.

అప్పుడు గానీ మావోలో మునుపటి హుషారు చూడలేదు నేను. 'చైనా పేద దేశమే. కానీ మనం సోషలిస్టు పంథాను ఎన్నుకున్నాం. చూస్తా ఉండు చైనా ప్రజానీకం మిగిలిన ప్రపంచ దేశాల ప్రజానీకం కన్నా మెరుగైన జీవితాలను త్వరలోనే, అతి త్వరలోనే ఆస్వాదిస్తారు' అన్నాడు ఆ రోజున. ఆ మాటలు సత్యదూరం కాదనేది ఆ తరువాత చరిత్ర నిరూపించింది.

ఏ స్థాయి కామ్రేడ్ చెప్పేది అయినా మావో శ్రద్ధగా వినేవాడు. ఝుంగ్‌నాన్హైలో ఉండగా ఒక రోజు జరిగిన ఘటన ఇది. సందర్శకులను కలిసాక మావో సెంట్రల్ కమిటీలోని ఒక సీనియర్ నాయకుడితో కలిసి పిచ్చాపాటీ మాట్లాడుతూ నడుస్తున్నారు. నేనూ పక్కనే ఉండి వారిని అనుసరిస్తున్నాను. వాళ్ళు మధ్య మధ్యన చెణుకులు వేసుకుంటున్నారు. ఉన్నట్టుండి ఆ కామ్రేడ్ మావోతో 'ఇప్పుడు మనం చేపట్టిన ఉద్యమానికి గొప్ప ముందడుగు ((గ్రేట్ లీప్ ఫార్వార్డ్') అని నామకరణం చేసారు. చాలా బాగుంది. అతికినట్టు సరిపోయింది' అన్నాడు.

'గొప్ప ముందడుగా' అన్నాడు మావో సాలోచనగా

అవును కామ్రేడ్ ఇవాళ పేపర్లో అలాగే వేశారు' అన్నాడు. 'ఏ పేపరు' అనడిగాడు మావో.

'పీపుల్స్ డెయిలీలో' అని బదులిచ్చాడు సెంట్రల్ కమిటీ నాయకుడు.

'నేనింకా ఇవాల్టి పేపరు చూళ్ళేదే' అంటూ మాకేసి తిరిగి 'ఇంకియావో ఇవాల్టి పేపరు పట్రా చూద్దాం' అని తిరిగి ఆ నాయకుడితో కబుర్లలో పడిపోయాడు. నేను పేపరు తెచ్చిచ్చా మావో ఆ వ్యాసం అంతా క్షుణ్ణంగా చదివి 'బాగుంది' అన్నాడు.

ఆ తరువాత కొద్ది రోజులకి సెంట్రల్ కమిటీకే చెందిన మరో నాయకుడు వచ్చి మావోను కలిసి–'హేనాన్ ప్రావిన్సులోని క్విలియింగ్‌లో 'ప్రజా కమ్యూన్లు' అనే ప్రయోగం చేసారు. మంచి ఫలితాలు వచ్చాయి. మీరోమాటు వచ్చి చూడాలి' అని ప్రతిపాదించాడు. మావో సరే అన్నాడు. క్విలియింగ్‌లో పర్యటన సాగుతున్నంతసేపు ఆ సెంట్రల్ కమిటీ నాయకుడు, ప్రావిన్షియల్ పార్టీ కార్యదర్శి పక్కనే ఉండి 'ప్రజా కమ్యూన్ల' గొప్పతనం గురించి ఒకటే ఊదరగొట్టారు. మావో వాళ్ళు చెబుతున్న విషయాలు చాలా శ్రద్ధగా వింటూ సంతృప్తిగా అనిపించిన సందర్భాల్లో 'అలాగా... బాగుంది' 'మంచిది' 'వెరీ ఫైన్' అన్నాడు. చివరికి ' ఈ ప్రజా కమ్యూన్లు అనే కాన్సెప్టు బాగుందే' అని వ్యాఖ్యానించాడు.

ఆ తరువాత క్విలియింగ్‌కు వచ్చిన ప్రత్యేక రైలు కూపే లోనే విశ్రాంతి తీసుకోవడానికి వచ్చేసాడు మావో బడలిక తీరడానికి కాసేపు నడుం వాల్చాడు. లేవగానే వేడివేడి టీ,

టీతోపాటే సిగరెట్ తాగుతూ పేపరు చదవడం మావో అలవాటు. ఆరోజు కూడా అలానే లేచి టీ తాగుతూ, సిగరెట్ ఊదేస్తూ పేపరు అందుకున్నాడు. పేపరు హెడ్‌లైన్ చూడగానే పక్కమీద చరుస్తూ 'ఏంటిదీ, ఎలా అచ్చేసారు ఇలా' అని అరిచాడు. పక్కమీంచి విసురుగా లేచి నిలబడి చేతిలో పేపరుతో అరచేతిలో కొట్టుకుంటూ 'తప్పుడు సమాచారం కాదూ, ఇలా ఇవ్వొచ్చా' అని అసహనంగా గొణిగాడు.

'ప్రజా కమ్యూన్ల వ్యవస్థ భేష్-మావో' అని హెడ్డింగ్ పెట్టారు. అంతకుముందు రోజు మా పర్యటనలో మాతోపాటు ఉన్న సిన్హువాన్యూస్ ఏజెన్సీ రిపోర్టరు ఉన్నాడు. మావో బావుంది మంచిది భేష్ అన్న మాటలు విని దానిని ఆధారంగా వార్తా కథనం పంపించనట్లున్నాడు. 'పొలిట్‌బ్యూరోలో దీన్ని గురించి చర్చించనేలేదు ఒక నిర్ణయం అంటూ చెయ్యలేదు. అప్పుడే మావో ఈ వ్యవస్థ బాగుందని అన్నాడంటే ఈ మాదిరి అచ్చోత్తి వదిలితే ఇది ప్రజలకు ఏం సంకేతం ఇస్తుంది. పార్టీలో పొలిట్ బ్యూరోలో నేనేం సమాధానం చెప్పుకోవాలి' అని గొణుగుతూ ఆ కాస్త కూపేలోనే తెగ పచార్లు చేసాడు.

హెడ్ క్వార్టర్‌కు తిరిగి రాగానే మావో ఊహించినట్లే పార్టీ ప్రధాన నాయకులు మావోను వచ్చి కలిసినప్పుడు 'పేపర్లో ముందుగా అలా వచ్చి ఉండాల్సింది కాదు' అని అభ్యంతరం వ్యక్తం చేశారు. 'దీనికి నేనే పూర్తి బాధ్యత వహించాలి. మన కామ్రేడ్స్ ఒక ప్రయోగం చేసారు. వాళ్లను కాస్త హుషారు చేద్దాం కదాని మాట వరసకు బాగుంది. భేష్ అన్నా . దాన్ని రిపోర్టరు అలా అర్థం చేసుకుని ఉంటాడు. పొరపాటు నాదే' అన్నాడు.

అప్పటికే వార్తా పత్రికల ద్వారా విశేష ప్రాచుర్యం పొందింది ఈ విషయం.. దాంతో ఈ అంశాన్ని చర్చిందానికి బెయిడైహిలో పార్టీ పొలిట్ బ్యూరో విస్తృత సమావేశం వేశారు. పొలిట్ బ్యూరో ఈ అంశాన్ని సమగ్రంగా చర్చించి 'ప్రజా కమ్యూన్ల వ్యవస్థ'ను ఏకగ్రీవంగా ఆమోదించింది.

పార్టీలో అగ్రనాయకత్వం, సహా క్యాడరు వరకూఅందరిలోనూ దేశంలో సోషలిజం త్వరితగతిన ప్రజలకు ఫలితాలు అందించాలనే భావం బలంగా పాదుకుని ఉంది. ఒకరకంగా చెప్పాలంటే ఫలితాల కోసం కొంత అసహనంగా కూడా ఉన్నారు. అయితే నాయకత్వం అంతా గొప్ప దూరదృష్టితో ఆలోచించేది. కాలంతోపాటు ఎదురయిన కఠిన పరీక్షలను తట్టుకుంటూ చైనా బలమైన, సంపద్వంతమైన దేశంగా ముందుకు తీసుకువెళ్ళాలనే ఆశయంతో పనిచేసేవారు. పనిలో నుంచి, అనుభవాల నుంచి తమ ఆశయ సాధనకు తగిన మార్గ నిర్దేశనం లభిస్తుందనే విశ్వాసంతో ఉండేవాళ్ళు.

ఒక మాటు ఇన్‌స్పెక్షన్ టూరు మీద వూహాన్ వెళ్ళాం. అక్కడ బాధ్యుడుగా ఉన్న ప్రధాన నాయకుడు ప్రజలందరికీ అందుబాటులో ఉండేలా 'పబ్లిక్ క్యాంటీన్'లు నిర్వహించాలనే ఆలోచన చెప్పాడు మావోతో. రకరకాలుగా ఆ విషయమై మావోను ఒప్పించే ప్రయత్నం చేసాడు. ' మీ ప్రతిపాదనలు రాత పూర్వకంగా ఇవ్వండి, పార్టీ పరిశీలించి నిర్ణయం చేస్తుంది' అని బదులిచ్చాడు మావో. బహుశా ఇది గత అనుభవాన్ని దృష్టిలో ఉంచుకుని మావో తీసుకున్న జాగ్రత్త అనిపించింది. నాకు. మావో సూచన మేరకు హుబెయి ప్రావిన్సు పార్టీ డిప్యూటీ సెక్రటరీ జనరల్ 'పబ్లిక్ క్యాంటీన్'ల నిర్వహణ మీద సమగ్ర ప్రతిపాదన రాత పూర్వకంగా పంపించాడు. మావో ఆ నివేదికను ఆమూలాగ్రం పరిశీలించి పార్టీ నాయకత్వానికి సర్క్యులేట్ చెయ్యమని చెప్పాడు. అలాగే హేనాన్ ప్రావిన్సు పార్టీ సెక్రటరీ నాయకత్వానికి సర్క్యులేట్ చెయ్యమని చెప్పాడు. అలాగే హేనాన్ ప్రావిన్సు పార్టీ సెక్రటరీ వ్యవసాయం, ఉక్కు పరిశ్రమ, పబ్లిక్ క్యాంటిన్లు, జాతీయ రహదారుల నిర్మాణం మీద ఒక ప్రతిపాదన పంపించాడు. అది కూడా పార్టీలో చర్చకు సర్క్యులేట్ అయింది.

వివిధ ప్రావిన్సుల నుండి పార్టీ నాయకత్వం శాఖలు పంపిన రకరకాల ప్రతిపాదనలను మావో స్వయంగా పరిశీలించేవాడు. 'చూడు. మన కామ్రేడ్స్ పనితీను ఎంత హుషారుగా ఉందో, మంచి మంచి ప్రతిపాదనలు పంపిస్తున్నారు. షనిమీద శ్రద్ధ పెట్టారు. ఎటొచ్చి పెంగ్ దెహూయి నుండి ఇప్పటిదాకా ఇలాంటి ప్రతిపాదన ఒక్కటీ చూళ్ళా నేను' అని వ్యాఖ్యానించాడు.

వివిధ స్థాయిల్లో పనిచేసే నాయకులు, క్యాడరు చూపించే చొరవ, తెగువ, నిర్భయంగా పనిచేసుకోవడం, వాళ్ళ వాళ్ళ సృజనాత్మకత ఆలోచనలను మావో మెచ్చుకునేవారు. స్వయంగా వాళ్ళకు అభినందనలు తెలియచేసేవారు. వ్యక్తిగతంగా కలిసినప్పుడు వెన్నుతట్టి ప్రోత్సహించేవాడు. దాంతో వాళ్ళు మరింత ఉత్సాహంతో పనిచేసేవాళ్ళు.

1958 చివరి నాటికి పార్టీ ఒక పాలసీ ఖరారు చేసింది. పార్టీ ముందున్న మూడు లక్ష్యాలనుంచింది. 'మూడు రెడ్ బ్యానర్లు' 'ముమ్మారు వర్ధిల్లు' అనే పిలుపులకు రూపకల్పన జరిగింది. 'గ్రేట్ హాల్ ఆఫ్ పీపుల్'లో రిసెప్షన్ రూం.నెంబరు 18లో జరిగిన సెంట్రల్ కమిటీ సమావేశం ఈ పిలుపులను ఉద్యమ స్థాయిలో కింది స్థాయి శాఖల వరకూ తీసుకువెళ్ళాలని నిర్ణయించింది. అప్పటికి సోవియట్ రష్యాలో నికితా కృశ్చేవ్ నాయకత్వంలో పొడసూపిన రివిజనిస్టు ధోరణులను ఎండగడుతూ, పార్టీ తీసుకున్న నిర్ణయం అందుకు ఏ రకంగా భిన్నమయిందో వివరిస్తూ పొలిట్ బ్యూరోను ఉద్దేశించి మావో ప్రసంగించారు.

పార్టీలో పెరుగుతున్న పెడధోరణులను 1959నే మావో గమనించి ఒకింత ఆందోళనకు లోనయ్యాడు. క్షేత్రస్థాయిలో ఏం జరుగుతుందో ప్రత్యక్షంగా చూసి ఒక అంచనాకు రావాలనే ఆలోచన చెప్పాడు. కాని అది అనుకున్నంత తేలిగ్గా అయ్యే పనిలా లేదు. ఎందుకనో నేను తరువాత వివరిస్తా. ప్రస్తుతానికి మీకు క్లుప్తంగా చెప్పాలంటే – మావో భద్రత దృష్ట్యా ఆయన కదలికలు పరిమితం అయిపోయాయి. మావో ఎంత గింజుకున్నా ఈ ఆంక్షలను పార్టీ సడలించలేదు. చివరికి పార్టీ సెంట్రల్ కమిటీ మావో విమాన ప్రయాణం చెయ్యడానికి వీల్లేదని కూడా నిర్ణయించింది.

మొత్తానికి ఎలాగయితేనేం మావో 'టూరు' ఖరారయింది. మొదట హేనాస్‌లో పర్యటించాం. నిజ నిర్ధారణ సమావేశం వేసారు అక్కడ. వచ్చిన వాళ్ళందరినీ 'పబ్లిక్ క్యాంటీన్‌లు ఎలా నడుస్తున్నాయి, మీకు బాగుంది అనిపిస్తుందా. మొహమాటానికి పోవద్దు, నన్ను ఉబ్బేయడానికి నిజం దాచొద్దు. మీరేం అనుకుంటున్నారో నిక్కచ్చిగా చెప్పండి' అని అడిగి మరీ అక్కడి జనాల అభిప్రాయాలు తెలుసుకున్నాడు. అక్కడ చేరుకున్న వాళ్ళంతా క్యాంటీన్లు బాగున్నాయని చెప్పారు. గతంలో వాళ్ళు తినే తిండితో పోల్చి కొంతమంది చెబితే ఇంకొంతమంది ఆ రోజు క్యాంటీన్‌లో తయారుచేసిన రొట్టెలు, ప్యాకేజీ ఆహారం చూపించారు. మావో ఒకరి దగ్గర రొట్టె అందుకుని తుంపులు చేసి మా అందరికీ తలా ఒక ముక్క పంచాడు. తనూ ఒక ముక్క రుచి చూసాడు. నిజంగానే రుచిగా ఉన్నాయవి. 'పబ్లిక్ క్యాంటీన్‌లలో మన రైతులందరికీ ఇదే తిండి అందిస్తూ ఉన్నాయంటే, నిజంగానే ఇవి బాగా నడుస్తున్నట్లే' అని మావో వ్యాఖ్యానించాడు.

అయినా మావో కళ్ళలో ఇంకా ఏదో సందేహం మెదుల్తూనే ఉండడం నే గమనించా. పల్లె ప్రాంతాల్లో పరిస్థితులను ఇంకాస్త లోతుగా అంచనా.వెయ్యడానికి ఆకస్మిక పర్యటనలు చెయ్యాల్సిందే అన్నాడు. ఆ తరువాత కొన్నాళ్ళకు మేం రైలు ప్రయాణంలో ఉండగా దార్లో కనబడ్డ చిన్న గ్రామాన్ని చూసి 'ఇంకియావో రైలిక్కడ ఆపించు. మనం ఆ కనిబడుతున్న ఊళ్ళోకి వెళ్ళ బోతున్నాం. చూద్దాం అక్కడ పోర్కు దొరుకుతుందేమో' అన్నాడు. నేను రైలు ఆపించా. ఆ ఊళ్ళో అధికారులకు మేం వస్తున్నట్లు వర్తమానం పంపించాం. మావో అడిగినట్లు మేం వెళ్ళే సరికి అక్కడ రుచిగా పండిన పోర్కు (సీమ పంది మాంసం) సిద్ధంగా ఉంది. ఆయన పోర్కు తోనే సరిపెట్టుకున్నాడు కానీ అడిగితే 'పిగ్ రోస్టు' కూడా వడ్డించేవాళ్ళు.

1959 వేసంగి నాటికి ఆర్థిక వ్యవస్థ క్షీణించింది. అబద్ధాలు చెప్పో మభ్యపెట్టో ఆర్థిక క్షీణతను దాచిపెట్టే పరిస్థితి దాటిపోయింది. గొప్ప ముందడుగు, ప్రజా కమ్యూన్లు – ఈ రెండు అంశాల మీద పార్టీ సెంట్రల్ కమిటీలో భిన్నాభిప్రాయాలు తలెత్తాయి. మావో

షావోషాన్ నుండి లూషన్ పర్వత ప్రాంతానికి వచ్చాడు. పరిస్థితులను మదింపు చెయ్యడానికి అక్కడే సెంట్రల్ కమిటీ సమావేశం వేశారు. వాడిగావేడిగా చర్చలు జరిగాయి. చివరికి 'పరిస్థితి మెరుగ్గానే ఉంది. మరింత మెరుగైన అభివృద్ధికి అవకాశాలు ఉన్నాయి. అయితే సమస్యలూ తీవ్రంగా ఉన్నాయి' అని సెంట్రల్ కమిటీ నిర్ణయించింది.

జులై చివరి నెలలో జరిగిన ఈ సమావేశాల్లో చివరి సెషన్‌లో మావో ప్రసగించారు. వేదిక మీద పొలిట్ బ్యూరో స్టాండింగ్ కమిటీ సభ్యులు కూచుని ఉన్నారు. మిగతా పొలిట్ బ్యూరో సభ్యులు ఎదురుగా ముందు వరుసలో, ఆ తరువాత వరసల్లో సెంట్రల్ కమిటీ సభ్యులు ఆసీనులై ఉన్నారు. అందరూ వచ్చినట్లేనా అని అంచనా వెయ్యడానికి మావో హాలంతా నిశితంగా పరిశీలించాడు. అయితే పెంగ్ దెహుయి వచ్చాడా, లేదా అని తెలుసుకోవడానికే మావో హాలంతా కలియ చూసాడని నేగ్రహించాను. కొత్త పాలసీను వ్యతిరేకిస్తూ పెంగ్ దెహుయి మావోకు ఒక రిపోర్టు పంపించాడు. ఆ నివేదిక పెంగ్ వ్యక్తిగత అభిప్రాయం అయి ఉంటుందని, ఇలాంటి బూర్జువా ఊగిసలాటలు సహజమేనని తేలిగ్గా తీసుకున్నాడు మొదట్లో. అంతటితో ఆ విషయం అక్కడితో ఆగిపోయింది. 'మార్షల్ పెంగ్ రాలేదా' అనడిగాడు మావో తన ప్రసంగానికి ముందు. నేను ఆయన ఎక్కడ కూచుందీ చూపించాను. నున్నగా గుండు గీయించుకుని ఉన్నాడు పెంగ్. మొదటి వరసను వదిలేసి ఎక్కడో చివరి వరసలో కూచుని కనిపించాడు. పెంగ్ అలా గుండు చేయించుకుని కనబడడంతో మావో మొహంలో అసంతృప్తి కదలాడింది. (గుండు గీయడం అవహేళనకు గుర్తు. సాంస్కృతిక విప్లవం కాలంలో వర్గ శత్రువులను, విప్లవ ప్రతీఘాతకుల రివిజనిస్టులని, చెడు నడత కలిగిన వాళ్ళని 'గుండు' గీసి సత్కరించేవాళ్ళు).

ఆ రోజు మావో ప్రసంగంలో ప్రధానమైన దాడి 'లెఫ్టిజమ్' (జవాబుదారీతనం లేకుండా తప్పుకోవడం) మీదే ఎక్కుపెట్టాడు. ప్రధాన నాయకులలో ప్రొదసూపిన ప్రాప్తకాలజ్ఞత, డాంబికాల ధోరణులను ఉతికి ఆరేసాడు. ఆ క్రమంతో పరుష పదజాలమే వాడాడు. సమిష్టితత్వం లోపించడం వల్లనే ఇలాంటి వ్యక్తిగత ధోరణులు చోటు చేసుకున్నాయని చివరికి ఒక స్వాంతన వాక్యం చెప్పాడు.

ప్రసంగం మధ్యలో ఛూటే కేసి చూస్తూ "పబ్లిక్ క్యాంటీన్‌లు ఎత్తేయ్యాలంటున్నారు. కానీ అన్నీ మూత పెట్టలేం. సజావుగా నడుస్తున్న వాటిని మూత పెట్టడం వలన ప్రయోజనం ఏమిటి. కొంతమందికి ఈ క్యాంటీన్ల 'కాన్సెప్టే నచ్చలేదు. కాని దీని మీద పార్టీలో భిన్నాభిప్రాయాలు ఉన్నాయి' అన్నాడు.

ఆ తరువాత సమావేశంలో చర్చకు వచ్చిన మితవాద ధోరణుల గురించి ఎత్తిపొడిచాడు. ప్రధానంగా కామ్రేడ్ పెంగ్ వాదనలు దృష్టిలో పెట్టుకుని విమర్శ చేశాడు.

మావో ప్రసంగం ఆసాంతం అటు పార్టీ ఎంచుకున్న పంథాలో సానుకూల పార్శ్వాలను తడుముతూనే ఇటు లోపాలను ఎత్తిచూపుతూ సమతూకంగా సాగింది. ఒక దశలో సైన్యానికి నా అవసరం లేదనకుంటే, నేను ఈ క్షణాన మళ్ళీ జనాల్లోకి వెళ్ళడానికి సిద్ధంగా ఉన్నాను. ప్రజా గెరిల్లాలను తయారు చేస్తా కొత్త సైన్యాన్ని నిర్మిస్తా' అని మావో అనడం నాకు బాగా గుర్తుండి పోయింది.

సమావేశం ముగిసిన తరువాత కొద్ది మంది ఇంకా హాల్లోనే ఉండిపోయారు. మావో కామ్రేడ్ పెంగ్‌ను రమ్మనమని కేకేసాడు. కాని అతను బయటకు వెళ్ళిపోయాడు. మరి అతనికి వినిపించలేదో, కోపంతో లెక్కలేని తనంగా వెళ్ళిపోయాడో నే అంచనా వెయ్యలేకపోయాను.

మీటింగ్ హాల్ నుండి మావో బయటకు వచ్చాడు. తనతోపాటు నలుగురైదుగురు సెంట్రల్ కమిటీ సభ్యులు ఉన్నారు. ఇంతలో పెంగ్ దెహుయి దేని కోసమో వెతుకుతున్నట్లు మెట్లు ఎక్కుతూ పైకి వస్తున్నాడు. మావో పక్కకు ఉన్న నలుగురయిదుగురిలో ఆ చివర అతను పెంగ్ ఎదురుబొదురు పడ్డారు. పెంగ్‌కు దారి ఇవ్వడానికి అతను పక్కకు తొలిగాడు.

పెంగ్‌ను చూడగానే మావో 'మార్షల్' అని పిలిచాడు. 'నీతో మాట్లాడేది ఉంది ఆగు' అన్నాడు. పెంగ్ ఎర్రబడిన మొహంతో 'మాట్లాడడానికి ఏం ఉంది ఏం లేదు' అని పుల్లవిరిచినట్లు సమాధానం చెప్పాడు.

'టేకిట్ ఈజీ' 'మన మధ్య అభిప్రాయ భేదాలు ఉంటే చర్చించి పరిష్కరించుకోవచ్చుకదా' అన్నాడు మావో.

'ఏముంది ఇంకా మాట్లాడడానికి, ఏం లేదు, మాట్లాడుకోవాల్సిన అవసరం లేదు' అంటూ విసురుగా వెళ్ళిపోయాడు పెంగ్. పెంగ్ అంత పెడసరంగా వ్యవహరిస్తాడని మావో ఊహించి ఉండడు.

అక్కడ్నించి తిన్నగా మావోకు కేటాయించిన గదికి వచ్చేసాం. 'పెట్టె బేడా సర్దెయ్ పోదాం' అన్నాడు మావో. కానీ ఒకళ్ళిద్దరు ప్రధాన నాయకులు వచ్చి 'అలాకాదు... పెంగ్‌ను పిలిపించి మాట్లాడదాం. ఈ విషయం నాన బెట్టడం మంచిది కాదు. ఫైసలా చేసేద్దాం మీరు ఉండాల్సిందే కామ్రేడ్ ఛైర్మన్' అన్నారు. వాళ్ళ సూచన మేరకు మేం ఆ రోజు అక్కడే దిగబడిపోయాం. సెంట్రల్ కమిటీ ప్లీనరీ సమావేశం వేశారు. అజెండా మాత్రం పెంగ్‌తో ఏర్పడిన విభేదాలు చర్చించడానికే పరిమితం చేసారు. సింగిల్ పాయింట్ అజెండా. అంతకు ముందు జరిగిన సమావేశానికి హాజరుకాని పిబి, సిసి సభ్యులు కూడా ఈ మీటింగ్‌కు వచ్చారు. అలా వచ్చిన వాళ్ళలో లిన్‌పియావో కూడా ఉన్నాడు.

ఆ రోజు సమావేశం చాలా వాడిగా వేడిగా జరిగింది. మావో ఆ మీటింగ్‌కు హాజరుకాలేదు. రాత్రి చాలా పొద్దు పోయింది. మీటింగ్‌లో ఉచ్చ స్వరంతో మాట్లాడుకుంటున్న మూలాన మావోకు రణ గొణ ధ్వనులు వినిపిస్తున్నాయి. 'ఏంటిఆ గడబిడా పోయి చూసిరా' అని ఆదేశించాడు మావో నన్ను. నేను పరుగు పరుగున మీటింగ్ దగ్గరకు వెళ్ళా కొంతమంది పెంగ్ మీద అరుస్తున్నారు. తనుకూడా బదులుగా అరుపులూ, కేకలూ పెడుతున్నాడు. నే వెనక్కి తిరిగివచ్చి చూసింది చూసినట్లు మావోకు చెప్పా. మావో అసహనంగా లేచి కూచొని ఓ కాయితం మీద బరబరా ఏదో రాసిచ్చి 'మీటింగ్ ఛైర్మన్‌కు ఇచ్చిరా పో' అన్నాడు.

ప్లీనరీ సమావేశం మధ్య మధ్యన పొలిట్ బ్యూరో సభ్యులు విడిగా కలిసి మాట్లాడుకుని వస్తున్నారు. పార్టీలో పెంగ్ నడతను గురించి చర్చకు వచ్చింది. జింగ్‌గాంగ్ పర్వత ప్రాంతాల్లో పనిచేసేటప్పటి నుండి పెంగ్ ధోరణులు ఎలా ఉండేవో సమీక్షకు పెట్టారు. పెంగ్ ఎప్పుడూ మాటవినేవాడు కాదు. తరచూ సహాయ నిరాకరణకు దిగేవాడని లిన్ పియావో ఆరోపించాడు. చర్చ ప్రజా కమ్యూన్లు, గొప్ప ముందడుగు అంశాలకే పరిమితం కాలేదని, రెడార్మీ కొరియా యుద్ధం వాటి కాలం వరకూ లోతుగా నడుస్తుందని అప్పుడు నాకు అర్ధమైంది. పెంగ్ పనితీరు ముప్పై శాతం సహకరించే ధోరణిలో ఉంటే డెబ్బై శాతం సహాయ నిరాకరణ ధోరణిలో సాగిందని సమావేశం నిర్ధారించింది. ప్లీనరీ సమావేశం చర్చల ఆధారంగా పెంగ్‌ను జాతీయ భద్రతా మంత్రిత్వ బాధ్యతలు, మిలిటరీ కమిషన్ ఉపాధ్యక్ష బాధ్యతల నుండి తప్పించాలని పొలిట్ బ్యూరో నిర్ణయించింది. అయితే పొలిట్ బ్యూరోలోను, ప్రభుత్వ ఉపాధ్యక్ష పదవులలో కొనసాగుతాడని, జీత భత్యాలు, హోదాల్లో మార్పులు ఏమి ఉండవని పొలిట్‌బ్యూరో ప్రకటించింది.

ఆ తరువాత మేం బీజింగ్‌కు తిరిగి వచ్చేసాం. కొన్ని రోజులు గడిచాక పెంగ్ దెహుయి హఠాత్తుగా మావో నివాసంలో ప్రత్యక్షం అయ్యాడు. వెనక ఉన్న స్టడీ రూం గుండా లోపలికి వచ్చాడు. ఈ సారి గుండుతో కాకుండా ఒత్తయిన జుత్తుతో ఉన్నాడు. 'అసలు విషయాలన్నీ మొదట్నించీ మీతో చర్చించాలని వచ్చా' అన్నాడు మావోతో.

'అబ్బాయ్ నేను ముసలాణ్ని అయిపోయా. అంత దూరం నేరాలేను కానీ విషయాన్ని ఇక్కడితో వొదిలేయ్. పాతవి తవ్వుకుంటూ పోవడం దేనికి గాని అధ్యయనం మీద బాగా కేంద్రీకరించు లేకుంటే నీకే నష్టం' అన్నాడు మావో. కానీ పెంగ్ పట్టువదలని విక్రమార్కుడిలా మావోను పోరిపోరి మొత్తానికి ఎలాగైతేనేం మావోతో 'సరే' అనిపించాడు.

వాళ్ళిద్దరి మధ్యన సుదీర్ఘమైన చర్చలు జరిగాయి.

1958లో భౌతిక వాస్తవాల పట్ల సరిగ్గా దృష్టి పెట్టకపోవడం, దూకుడుతనం వంటి

ధోరణులదే పై చెయ్యి కావడం, ప్రకృతి వైపరీత్యాలు సంభవించడంతో 1959-61 మధ్య కాలంలో దేశం తీవ్రమైన ఆర్థిక ఒడిదుడుకులకు లోనయింది. దేశవ్యాప్తంగా క్షుద్బాధ పెరిగిపోయింది.

1959 చివర్లో కొంతమంది గార్డులు సెలవులకు పల్లె ప్రాంతాల్లో ఉన్న తమ ఇళ్ళకు వెళ్ళారు. వాళ్ళు తిరిగివస్తూ అక్కడ నెలకొన్న పరిస్థితుల గురించి క్షుణ్ణంగా వాకబు చేసారు. వస్తూ వస్తూ అక్కడ రైతులు ఆహారంగా తీసుకుంటున్న రొట్టెలు తెచ్చారు. చూస్తేనే రొట్టెలు పాడయిపోయినట్లు కనిపిస్తున్నాయి. మావో ఆ రొట్టెల్ని చూసి కదిలిపోయాడు. మా అందరికీ తలా ఒక ముక్క తుంచి ఇచ్చి 'తినండి, మన రైతులు తిన్న తిండి ఇది. మనమూ తిని చూడాలి తినండి' అన్నాడు.

నాకు ఇచ్చిన రొట్టె ముక్కను నోట్లో పెట్టుకుని అలా ఉండిపోయా. మావో నాకేసి చూసే సరికి నమిలా కానీ దాన్ని మింగాలేక కక్కాలేక నానా చావు చచ్చా. గతంలో మావో వాళ్ళ ఊరి నుంచి తెచ్చిన రొట్టె ఇంతకన్నా వందరెట్లు నయంగా ఉంది అనిపించింది నాకు.

మావో ఒక రొట్టే అంతా తినే ప్రయత్నం చేసాడు. ఒక్క ముక్క తినగానే మావో కళ్ళు ఎర్రబడ్డాయి. ఇంకో ముక్క తినేసరికి తన కనుగుడ్లు విపరీతంగా చలించాయి. వాంతికి వస్తుంటే ఆపుకున్నాడు. మావో కళ్ళలో నీరు ఊరింది. రెప్పలు తడిసిపోయాయి. మరో ముక్క తినేసరికి తన కళ్ళ నుండి నీళ్ళు ధారాపాతంగా కారిపోయాయి.

కేవలం రైతాంగం ఎలాంటి దుస్థితిలో ఉందో ఊహించినంత మాత్రాన మావో ఇలా కన్నీరు పెట్టాడనుకోవడంలేదు నేను. హేనాన్‌లో ప్రజా క్యాంటిన్లలో తిన్న రొట్టె జనాలు చెప్పిన అభిప్రాయాలు, మార్గమధ్యంలో రైలు ఆపించి దగ్గర్లో ఉన్న మారుమూల పల్లెలో దొరికిందని చెప్పి తెప్పించిన పోర్కు గుర్తొచ్చి – వాస్తవాలకు ఆచరణకు మధ్య ఇంత అంతరం ఎలా ఉంది? నాయకుడిగా తను సాధించింది ఏమిటి? అని కన్నీరు పెట్టుకున్నాడు మావో.

కరువు తాండవించిన మూడేళ్ళలో 1960వ సంవత్సరం మరీ గడ్డుగా గడిచింది. మావో మాంసాహారం తీసుకోవడం పూర్తిగా మానేసాడు. సాదాసీదా భోజనం తోటకూర పులుసుతో సరిపెట్టేసేవాడు. ఆయన కాళ్ళు ఒత్తినప్పుడు మడమ చుట్టూ ఉన్న చర్మం లోతుకుపోయి పైకి పూడుకోవడానికి టైం పట్టేది. అది 'ఎడిమా' అని గ్రహించానేను. చౌ-ఎన్-లై చాలా సార్లు 'కాస్త పోర్క్ అదీ తింటుండండి కామ్రేడ్ ఛైర్మన్ లేకపోతే ఎలా' అని అడిగాడు. 'మీరు ఎవరన్నా పోర్కు తింటున్నారా? మన రైతులు తింటున్నారా లేదు కదా ఏం ఫర్లా. మీతో పాటే నేనూ' అని బదులిచ్చేవాడు మావో. ఒకసారి మావోను చూడ్డానికి

సన్-ఎట్-సేన్ విధవరాలైన భార్య చింగ్‌లింగ్ వచ్చింది. పెద్దావిడ వస్తూ వస్తూ ఒక బుట్టెడు పీతలు తెచ్చి మావోకు ఇచ్చింది. ఆవిడ మీద ఉన్న గౌరవం కొద్దీ ఆ బుట్ట తీసుకున్నాడు మావో. ఆవిడ వెళ్ళిపోయాక బాడీగార్డులను పిలిచి వాళ్ళకు ఇచ్చేసాడు ఆ బుట్టెడు పీతలు.

ఆ ఏడాది చివర్లో ఒక రోజున పొద్దున్నే లేవగానే నాస్తా అదీ ఏం తీసుకోకుండా సిగరెట్టు మీద సిగరెట్టు ఊదిపారేస్తూ కూచుండిపోయాడు మావో. 'యాష్‌ట్రే' సిగరేట్ పీకల్తతో నిండిపోయింది. ఆ రోజు డ్యూటీలో ఉన్న ఫెంగ్ యావో సాంగ్‌ను పిలిచి 'మనవాళ్ళ - టెల్ జిలాంగ్, ఇండియావో, గావోజి, జిగ్జియాన్, లిసకీ, డాంగ్ జింగ్, వీళ్ళందర్నీ పిలుచుకురా నే రమ్మనమన్నానని చెప్పు. అర్జెంట్ అని చెప్పి పంపించాడు.

అప్పటికి చీకటి పడిపోయింది. కూచోండి అన్నాడు మావో మాతో. ఆయనతోపాటు భోజనానికి కూచోపెట్టాడు. మా అందర్నీ, ఉప్పులేని చప్పడి భోజనం అది. మావో 'ఛాప్ స్టిక్స్' తో పింగాణి పాత్రలోంచి భోజనం తీసుకు తినబోతూ ఆగిపోయాడు. ఆయన తినకుండా ఏంటని మేం కూడా తినకుండా ఉండిపోయాం.

'మన జనాలు ఏమేం బాధలు పడుతున్నారో నాకు పూర్తిగా తెలియాలి. పొరబాటు ఎక్కడ జరిగిందో మీరు చూసొచ్చి నాకు చెప్పాలి. పబ్లిక్ క్యాంటీన్లు, ప్రజా కమ్యూన్లు బాగానే నడుస్తున్నాయో, లేకపోతే వాటి లోటుపాట్లు గురించి జనాలు ఏమనుకుంటున్నారో నాకు వివరంగా తెలవాలి' అన్నాడు మావో.

మేమంతా తలాడించాం.

యేజిలాంగ్‌కేసి, నాకేసి చూస్తూ 'మీరు షాంగ్‌డాంగ్ వెళ్ళండి. క్షుణ్ణంగా అక్కడి పరిస్థితులు ఏంటో తెలుసుకుని రండి' అన్నాడు.

'అలాగే కామ్రేడ్ చైర్మన్' అన్నాం మేమిద్దం కోరస్‌గా.

మావో ఫెంగ్‌యావో సాంగ్‌కేసి తిరిగి 'నువ్వూ వాళ్ళతో వెళ్తావా' అనడిగాడు.

'తప్పకుండా కామ్రేడ్' అన్నాడు ఫెంగ్.

'మంచిది అని మా కళ్ళలోకి సూటిగా చూస్తూ 'ఏ విషయమూ దాచిపెట్టొద్దు. తప్పుడు సమాచారం ఇవ్వొద్దు. మెహర్బానీలు వొద్దు. పక్కా నిజాలు ఏంటో తెలియాలి నాకు అర్థమైందా' అనడిగాడు మావో. మేం అంతా తలూపాం.

ఆ రోజు రాత్రి గార్డు డ్యూటీలో ఉన్నాడు. 'నాకు చాలా బాధగా ఉంది ఫెంగ్.

వాళ్ళు చెప్పినవన్నీ అబద్ధాలేగా. నేను వస్తున్నాని తెలిసి ముందుగానే ఏర్పాట్లుచేసి అంతా సజావుగా ఉందని నన్ను నమ్మించే ప్రయత్నం చేసారు. కానీ మీరు మాత్రం ఆ పని చెయ్యకండి నిజాలు ఏంటో తెలుసుకుని నాకు చెప్పండి' అన్నాడు మావో ఫెంగ్‌తో.

రెండు ఝాములు గడిచినా నిద్రపోలేదట. మధ్యలో లేచి కూచొని జువాన్ కాయితం (కాలీగ్రఫీకు వాడే పేపరు) మీద పెన్సిల్‌తో ఒక ఉత్తరం రాసి ఇచ్చాడు. ప్రయాణానికి సిద్ధమైన మమ్మల్ని ఉద్దేశించి ముందుగా చెప్పినట్లు మీరు షాన్‌డాంగ్ పోకండి. జిన్‌యాంగ్ ప్రాంతంలో సర్వే చేసిరండి. నాకు తెలిసి అక్కడికి నిత్యావసర సరుకుల్ని పంపి సహాయ కార్యక్రమాలు చేపట్టినట్టున్నారు. కనీసం మీరు తిండికి మాడకుండా సర్వే చేసి రావచ్చు. ఈ రోజుతో నాకు అరవై ఏడేళ్ళు వచ్చాయి. మీకు ఇంకా చాలా భవిష్యత్తు ఉంది' అని రాసి సంతకం చేసి ఆ రోజు తేది – 1960 డిసెంబరు 26 వేసాడు. ఆ రోజు మావో పుట్టిన రోజు.

మావో పుట్టిన రోజు సంగతి మేం ఎలా మర్చిపోయామో మాకు అర్థం కాలేదు. ప్రతి ఏటా మావో అనుమతి తీసుకుని మరీ ఆయన పుట్టినరోజు కోలాహలంగా, సంబరంగా జరుపుకునే వాళ్ళం. అలాంటిది ఆ ఏడాది కిమ్మన్నాస్తిగా ఉండిపోయాం.

వాస్తవ పరిస్థితులు ఏంటో పెంగ్ దెహుయి చెప్పినప్పుడు మావో లక్ష్య పెట్టలేదు కానీ మా మాటలు పూర్తిగా విశ్వాసంలోకి తీసుకున్నాడు. అప్పట్లో ప్రయివేటు పరిశ్రమలను జాతీయం చెయ్యాలని పార్టీ నిర్ణయించింది. మాతో పాటు పనిచేసే టియాన్‌యున్‌యు వాళ్ళ తాతగారికి ఒక లఘు పరిశ్రమ ఉండేది. యున్‌యు వాళ్ళ నాన్న ఒక ఫ్యాక్టరీలో కార్మికుడు. ఒక రోజు మావో యున్‌యును పిలిచి – 'అవునూ, పరిశ్రమలను జాతీయం చెయ్యాలనే పార్టీ నిర్ణయం మీ తాతగారికి అంతగా రుచించినట్లు లేదనుకుంటాగా. మీ నాన్నగారు మాత్రం మన పార్టీ నిర్ణయాన్ని గట్టిగా బలపరిచాడని విన్నా. ఇంతకీ నువ్వు మీ నాన్న పార్టీనా, మీ తాత జట్టా? అని అడిగాడు. యున్‌యు 'నేను మా తాత జట్టే' అని టకీమని చెప్పాడు. అప్పుడు మావో 'నచ్చావ్‌రా అబ్బీ. నీ మనసులో ఉన్నది ఎంతో వెరపు లేకుండా చెప్పావ్. అలా ఉండాలి. రాజకీయ అభిప్రాయాలు ఒక్కోసారి కలవవు. అయినా మనం కలిసే పనిచెయ్యాలి. ఆ క్రమంలోనే భేదాభిప్రాయాలు పరిష్కరించుకోవాలి' అన్నాడు మెచ్చుకోలుగా.

1951 నుండి 56 వరకూ అమలయిన పంచవర్ష ప్రణాళికలో దేశవ్యాప్తంగా సహకార ఉద్యమాన్ని పెద్ద ఎత్తున చేపట్టారు. వ్యక్తిగత ఆస్థి స్థానే సహకార క్షేత్రాలను ఏర్పాటు చేసారు. నేనా మధ్యన ఊరు వెళ్ళి వచ్చాను. రాగానే నేను చూసిన విశేషాలు నోటి మాటగా మావోకు చెప్పాను.

'జిల్లా కమిటీ వాళ్ళు రైతులు అందరినీ ఒక చోట పోగేసి ఎవరైతే చాంగ్-కై-షేక్ నమూనా, అంటే సొంత ఆస్తులు కొనసాగాలని కోరుకుంటున్నారో వాళ్ళంతా అసుంటా వెళ్ళండి, ఎవరైతే చైర్మన్ మావో నమూనా, అంటే సహకార క్షేత్రాలు కావాలని కోరుకుంటున్నారో వాళ్ళు ఇక్కడ ఉండండి అనే పద్ధతిలో అభిప్రాయ సేకరణ జరిపారు అని నే చూసింది చూసినట్లు చెప్పా. అది వినగానే మావో 'అట్లా ఎట్లా చేస్తారు. అది బలవంతంగా మన అభిప్రాయాల్ని జనాల మీద రుద్దడమేగా' అన్నాడు. వెంటనే హెబెయీ ప్రావిన్సు పార్టీ కమిటీకి ఒక ఉత్తరం రాసాడు. "ప్రజాస్వామిక ప్రక్రియను అతి సాధారణీకరించడం, గత్యంతరం లేని పరిస్థితులు కల్పించే పద్ధతులు తప్పు. అటువంటి తప్పులు జరగకుండా చూడండి' అంటూ ఘాటుగా పార్టీ కమిటీని హెచ్చరించాడు.

మావో సూచన మేరకు మేం ఏడుగురం హెనాన్ ప్రావిన్స్‌లోని జిన్‌యాంగ్ వెళ్ళాం. ఆర్నెల్లు అక్కడే గడిపాం. మేం చూసింది చూసినట్లు మావోకు రిపోర్టు చేసాం పబ్లిక్ క్యాంటిన్‌లు కొన్ని చోట్ల ఎంత గొప్పగా నడుస్తున్నాయో, ఎక్కువ చోట్ల అంతకు అంతా అధ్వాన్నంగా ఉన్నాయని చెప్పాం. ఆ తరువాత మేం జియాంగ్జీ ప్రావిన్సులో ఆర్నెల్లపాటు సహకార వ్యవసాయ క్షేత్రంలో పని చెయ్యడానికి వెళ్ళాం. మేం అక్కడ ఉండగానే పార్టీ సెంట్రల్ కమిటీ పబ్లిక్ క్యాంటిన్లను రద్దుచేస్తూ నిర్ణయం తీసుకుంది.

మావో దగ్గర పని చేస్తున్న నాకు ఆ తర్వాత వేరే బాధ్యతలు అప్పజెప్పింది పార్టీ. కొత్తగా అప్పగించిన బాధ్యతలు చేపట్టేందుకు వెళ్ళే ముందు నేను మావోను కలిసినప్పటి సంగతి మళ్ళీ ఒకసారి గుర్తు చేసుకుంటాను. నేను వెళ్ళిపోతున్నా అని చెప్పగానే మావో కన్నీళ్ళతో నన్ను కావాలించుకున్నాడు.

'ఆఖరిసారిగా మీ తలకు మాలిష్ చెయ్యనీండి కామ్రేడ్ చైర్మన్' అని అడిగా నేను. మావో విపరీతమైన పని ఒత్తిడిలో ఉన్నప్పుడు కాస్త ఉపశమనంగా ఉండడానికి తలలో రక్త ప్రసరణ సాఫీగా ఉండడానికి నేను అప్పుడప్పుడు అలా ఆయన తలకు 'తేల్ మాలిష్' చేసేవాణ్ణి. నేనాయన జుత్తు పైకి వెనక్కి దువ్వుతుండగా కన్నీటి పొరతో నా దృష్టి మసక బారింది కాసేపు. పాత సంగతులు జ్ఞాపకం వచ్చాయి.

'ఇంకియావో తల దువ్వు కాస్త, ఓ కునుకు వేద్దామని ఉంది' అని అడిగి మరీ మావో నాతో తల దువ్వించుకునేవాడు. నేను తల దువ్వుతుండగానే నిద్రలోకి జారుకునేవాడు. అప్పట్లో మావో జుత్తు నల్లగా, ఒత్తుగా నిగనిగలాడుతుండేది. దువ్వెన పళ్ళ మధ్య నుండి పట్టులా జారిపోతుండేది దువ్వుతుంటే. ఒక రోజు అట్ల దువ్వుతుంటే తెల్లగా వెండిలా మెరిసిపోతున్న వెంట్రుక కనిపించింది. 'అరరే...అప్పుడే మీ జుత్తు నెరిసిపోతుందే. బోడీ మొదలయ్యింది' అన్నా నేను 'అవునా' అన్నాడు మావో. 'పీకేయమంటారా' అనడిగా నేను.

రెణ్ణిమిషాల మౌనం తర్వాత 'కానీ' మన్నాడు మావో. నేను ఆ 'తెల్ల వెంట్రుక పీకి మావోకు చూపించా' 'మొత్తానికి గట్టిదే' అన్నాడు తను. ఆ తరువాత ఈ ఘనకార్యం మా ఆవిడకు తెలసి 'ఎంత ధైర్యమయ్యా నీకు. మావో తల మీద వెంట్రుక పీకుతావా' అని గయ్యిమంది నామీద.

ఇదంతా నిన్నా, మొన్నన జరిగినట్లు అనిపిస్తుంది. ఎంతలో ఎంత మార్పు అనుకోకుండా ఉండలేకపోయానేను. చెంపల దగ్గర వెంట్రుకలు నెరిసిపోయాయి. మూడేళ్ళలోనే జుత్తు చాలా తెల్లబడిపోయింది. వార్ధక్యం మీద పడుతోంది.

'ఆరోగ్యం జాగ్రత్త కామ్రేడ్.. వేళకు తిండి తిప్పలు లేక మీ జుత్తు అప్పుడే ఎంతలా మెరిసిపోయిందో' అన్నా నేను. రెణ్ణిమిషాలు మావో మౌనంగా ఉండిపోయాడు. తలపైకెత్తి నా కళ్ళలోకి చూస్తూ' ముసలాణ్ణి అయిపోలా! రేపు నేపోతే, ఏటా ఒక్క సారయినా నువ్వు నా సమాధిని చూసిపోవాలి, సరేనా' అన్నాడు.

ఏం సమాధానం చెప్పాలి నేను? ఆయన బతుకు కోరేవాణ్ణి కానీ చావు కోరేవాణ్ణి కాదు నేను. అందుకే మాట మార్చేసా.

'మీ గుర్తుగా నా కోసం ఏమన్నా రాసి ఇవ్వకూడదా కామ్రేడ్ ఛైర్మన్' అనిడిగాను.

'కొత్తగా ఏం రాయలేదు కానీ, పాత కవిత ఒకటి నీ కోసం ఇస్తా గానీ రేపు శనివారం నువ్వు మీ భార్యా పిల్లల్ని తీసుకురా. ఫోటోలు దిగుదాం' అన్నాడు మావో.

'లాంగ్ మార్చ్' కవితను నా కోసం స్వదస్తూరితో ఇంకో ప్రతి రాసి, దాని మీద సంతకం పెట్టి ఇచ్చాడు. ఒక పెద్ద ఫోల్డర్ మీద ఆ కవితను అతికించా. నాలుగువైపులా ఖాళీలో సెంట్రల్ కమిటీ నాయకుల సంతకాలు చేయించాను. వెనుక వైపున చెయ్యి తిగిరిన చిత్రకారులు బొమ్మలు గీసారు. నును టియాన్జిన్‌లో కొత్త బాధ్యతలు స్వీకరించడానికి వెళ్ళాక హెబెయి ప్రావిన్సు పార్టీ కమిటీ 'ఫస్ట్ సెక్రటరీ' చూపిస్తా అని ఆ ఫోల్డర్ తీసుకున్నాడు. అది మళ్ళీ నా చేతికి రాలేదు. అడిగితే ఎక్కడో పోయింది.. కనబడట్లా అన్నాడు. ఏం చేస్తానిక..?!

# 6. కోపాల్, తాపాల్...

మావో చూడ్డానికి మహా గంభీరంగా ఉంటాడు గానీ మాంచి చతురుడు కూడా. అప్పుడప్పుడూ ఆయన నోట్లోంచి 'సంస్కృతం' దొర్లేది. అదీ బహు అరుదనే చెప్పుకోవాలి. సరదాగా ఉన్నప్పుడు ఎదుటివాళ్ళు చేసిన తప్పుల్ని తేలిగ్గా తీసుకునేవాడు. మంచిగా నచ్చచెప్పేవాడు. అదే నిద్రలేని రాత్రుల మూలంగా టెన్షన్‌గా ఉన్నప్పుడు అలాంటి తప్పే ఎవరన్నా చేసినట్టు తెలిస్తే చూడాలి. మావో అగ్గిరాముడయిపోయేవాడు. అప్పటి కథే వేరుగా ఉండేది.

ప్రజా యుద్ధం సాగినంత కాలం ఎలాంటి మినహాయింపు లేకుండా నాయకులు అందరూ, మరీ ముఖ్యంగా మిలిటరీ కమాండర్లు ముక్కోపంతో కాపురం చేసినవాళ్ళే. ఆ ముక్కోపంలో కొందరు బూతులు తిట్టేవాళ్ళయితే, కొందరు తనతో పనిచేసే వాళ్ళని కూడా చూడకుండా నాలుగైదు రోజులు, ఒంటరి ఖైదు పడేసేవాళ్ళు. ఇంకొందరయితే చెయ్యి చేసుకునే వాళ్ళు కూడా, అలాంటి వాళ్ళందరితో పోలిస్తే మావో వెయ్యి రెట్లు నయం అనిపించేవారు. మహా అయితే ముక్కోపంలో 'రోజంతా నిలబడమని' – అదే శిక్ష అనేవాడు.

మావో నోటివెంట 'సంస్కృతం' దొర్లిందంటే నూటికి తొంభై పాళ్ళు నిద్రలేని మూలంగా వచ్చే చికాకులోంచే అని నే స్వయంగా గ్రహించాను. యేనాన్‌లో ఉన్నప్పుడూ అంతే, జిబైపోలో ఉన్నప్పుడూ అంతే. మాంచి నిద్దరలో ఉండగా లేపినందుకు గార్డులకు 'అక్షింతలు' పడ్డాయి. చివరిగా నాకు గుర్తున్నంతలో బీజింగ్‌లోని 'ఫ్రాగ్రంట్ హిల్స్' లో ఉన్నపుడు ఇలానే నిద్దర చెదరగొట్టినందుకు అక్షింతలతో సరిపెట్టకుండా, నిలువు కాళ్ళేసుకుని రోజంతా నిలబడి ఉండమని గార్డు మీద కేకలేసాడు.

ఒకసారి ఇలానే మావో మూడు, నాలుగు రోజులు రాత్రిళ్ళు నిద్రలేకుండా గడపాల్సి వచ్చింది. ఒక పక్కన ప్రజా విముక్తి సైన్యం దక్షిణ చైనాలో ఎలా ముందుకు పోవాలో పర్యవేక్షిస్తూ, ఇంకో పక్కన రాజకీయ పరిణామాల మీద చర్చ కోసం జాతీయ సదస్సు నిర్వహించే పనులలో తలమునకలుగా ఉన్నాడు. నేను పోరి, రెండు నిద్ర మాత్రలు ఇచ్చి మొత్తానికి ఎలాగైతేనేం మావోను నిద్రలో పడేలా చేశాను.

మావో సన్నగా గురుకపెట్టేదాకా అక్కడే ఉన్నా. తర్వాత అక్కడి ఉన్న గార్డుకు 'జాగ్రత్త' అని చెప్పి వేరే పని మీద వెళ్ళా.

నేను జాగ్రత్త అన్నానంటే అదేదో ఆషామాషీ వ్యవహారం కాదని ఆ గార్డుకు తెలుసు. చివరికి పిట్టల గోలకు మావోకు నిద్రా భంగం కలగకూడదనే ఉద్దేశంతో ఇంటి చుట్టు కాస్త దూరంగా వెదురు బొంగులు పాతి ఎర్ర గుడ్డ పీలికలు ఎగురుతూ ఉండేలా ఏర్పాటు చేశాం. ఆ రోజున స్నానాల గదిలో మావో కోసం స్నానాల తొట్టి బిగించే పని కూడా జరుగుతూ ఉంది. అందుకే గార్డు వాళ్ళ దగ్గరకు వెళ్ళి 'చాల్చాలు, ఇవాల్టికి ముగించండి అవతల ఛైర్మన్ మావో నిద్రపోతున్నాడు అని హెచ్చరించాడు.

కానీ వాళ్ళు ఒక పట్టాన వినే రకమా? అదే ఏ రైతుకో చెప్పి చూడండి, ఆ పని ఆ క్షణాన చేస్తేగాని వీలుకాదయినా ఒక మాట చెబితే చాలు ఆపేస్తారు. నగరాల్లో ఉండే కార్మికుల పరిస్థితి అలా కాదు. ఆకలివేస్తేనో, అలిసిపోతేనో తప్ప పని ఆపేకరం కాదు. ఏ కాడికీ పని త్వరగా తెముల్చుకుని బయటపడాలని చూస్తారు. 'నిద్రలేమితనం' (ఇన్‌సోమ్నియా) అంటే ఏంటో వాళ్ళు ఎరగరు. మావో నిద్దర సంగతి అంతకన్నా తెలీదు. అందుకే గార్డు పని చాలించమని చెప్పినా వాళ్ళు 'ఎంతా చిటికెలో అయిపోతుంది. చివరికి వచ్చేసింది' అంటూ గబగబా పనిచేస్తా ఉన్నారు.

ఆ గార్డుకు ఏం చెయ్యాలో పాలుపోలేదు. రైతు కుటుంబం నుండి వచ్చాడేమో పనివాళ్ళను అదిలించే బెదిరించే సాహసం చెయ్యలేదు. అంతా మన వాళ్ళే కదా అని వర్గ దృష్టితో చూసినట్లున్నాడు. వాళ్ళకి ఎలా నచ్చ చెప్పాలా అని సతమంత అయిపోతా ఉండగానే ఏం జరగరాదని కోరుకుంటున్నాడో అదే జరిగింది. పెరట్లోకి తీసుకువచ్చిన పైపును సరి చూస్తుండగా అది విసురు మీద లోన బాత్రూంలో ఉన్న స్నానాల తొట్టికి తగిలి 'ధనేల్' మని పెద్ద శబ్దం అయింది. దాంతో ఆ గార్డు, అక్కడ ఉన్న మిగిలిన బాడీ గార్డులు ఊపిరి బిగపట్టి ఉండిపోయారు ఏం జరగనుందో అనే భయంతో, పనివాళ్ళు మాత్రం ఇదేం పట్టనట్లు, తర్వాత ఏం జరగబోతుంది అనేది తెలీదు కాబట్టి యథావిధిగా తమ పని చేసుకుపోతున్నారు.

హఠాత్తుగా తలుపు విసురుగా తీసుకుని మావో బయటికి వచ్చాడు. మనిషిలో కోపం తన్నుకు వస్తున్నట్లు చూస్తేనే తెలిసిపోతుంది. విసవిసా పెరట్లోకి నడిచాడు. అక్కడ పిట్టాడలా ఉలుకూపలుకూ లేకుండా నిలుచుండిపోయిన గార్డు కేసి చూసి 'నీకు బెత్తం దెబ్బలు పడాలి' అని అరిచాడు. 'చిత్తం' అన్నట్లు గార్డు ఒక శెల్యూట్ కొట్టి అలా ఉండిపోయాడు.

మావో భారంగా ఊపిరి పీల్చుకుంటున్నాడు. కోపాన్ని అదుపులోకి తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు. హఠాత్తుగా నిద్రలోంచి లేచి వచ్చిన మూలాన మొహం కాస్త పాలిపోయినట్లయింది. కళ్ళు మాత్రం కోపంతో ఎర్రబారాయి. పెదవి కొరుక్కుంటూ, కోపాన్ని

అదుపు చేసుకుంటూ 'మిలిటరీ డిసిప్లిన్‌లో బెత్తం దెబ్బలు ఉండవుగా, నేను మళ్ళీ నిద్రలేచి బయటికి వచ్చేంత దాకా నువ్విలా ఎండలోనే నిలబడి ఉండు, అప్పటికి గానీ ఎండ నీ తిక్కతిన్నగా కుదర్చదు' అన్నాడు.

ఈసారి గార్డు 'అటెన్షన్'లో నిలబడి మళ్ళీ 'శెల్యూట్' చేశాడు. మావో గిర్రున తిరిగి ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

ఇదంతా తెలిసి పరిస్థితి చక్కదిద్దడానికి జియంగ్‌కింగ్ మాత్రమే సమర్థురాలని నేను గబగబా ఆవిడ దగ్గరకు పరిగెత్తాను. ఆవిడ వచ్చి 'ఫర్లా, నే సర్ది చెపుతాకానీ నువ్వెళ్ళు' అంది గార్డుతో. కానీ అతగాడు తల అడ్డంగా ఊపాడు. అలానే ఎండకు కాగుతా నిలబడ్డాడు. జియాంగ్‌కింగ్ మావో గదిలోకి తొంగి చూసింది లోపల మావో నిద్దర పట్టక పక్కమీద అటూ ఇటూ మెసులుతున్నాడు. జియాంగ్‌కింగ్ లోపలికి వెళ్ళింది 'పాపం అర్భకుడు, ఇందులో తను కావాలని చేసింది ఏం లేదు. వదిలేద్దురూ' అనడిగింది మావోను. మావో కిటికీలోంచి బయటికి చూస్తూ గార్డుకు వినిపించేలా పెద్దగా 'ఇహ నువ్వు వెళ్ళొచ్చు. తప్పు ఎందుకు జరిగిందో ఆత్మ విమర్శ చేసుకో' అని అరిచి చెప్పాడు.

ఆ తరువాత జరిగినదానికి చాలా బాధపడ్డాడు. 'నెపం మీ మీద వెయ్యడమూ సరికాదు. ఒక్కోసారి నాదీ తప్పు ఉందనిపిస్తుంది. ఆత్మ విమర్శ చేసుకో అని నిన్న ఆ గార్డుకు చెప్పాగానీ, ఆ సూత్రం నాకూ వర్తిస్తుంది. ఏం చేస్తా? పండుకున్న కాసేపయినా ప్రశాంతంగా ఉండాలని అనిపిస్తుంది నాకు. నిద్దర మీకు ఎంత అవసరమో నాకూ అంతే అవసరం కదా! అంత మాత్రానికే నేను పుంజాలు తెంపుకునేంత కోపం చేసుకోవాల్సిన అవసరంలేదు. తప్పే. కానీ ఏం చెయ్యను. వరసాగ్గా నాల్రోజులు పాటు నిద్దరలేకుండా గడిపా. దాంతో గొప్ప చికాగ్గా అనిపించి అరిచేసా. అతనికి చెప్పండి జరిగింది ఏమీ మనసులో పెట్టుకోవద్దనీ' అని మావో మా అందరి ఎదురుగా చెప్పాడు.

మావో కోపం మంచులా ఇట్టే కరిగిపోతుంది. కోపం లేని మనిషిలో ప్రేమించే స్వభావమూ ఉండదనేది జీవితానుభవం నుండి నే నేర్చుకున్న సత్యం. మావో దగ్గర పని చేసిన వాళ్ళందరిమీ తర్వాత కాలంలో మళ్ళీ ఒక దగ్గర కలిసి గడిపేందుకు నిర్ణయించుకున్నాం. అలా కలిసినపుడు ఒకరొకరుగా మా అనుభవాలు కలబోసుకున్నప్పుడు ఆశ్చర్యకరంగా ప్రతి ఒక్కరూ మావో తనని కసురుకున్న సందర్భాన్నే గుర్తుకు తెచ్చుకున్నారు. అలా కోపం చేసుకున్న సందర్భాలు ఉన్నా మావో ఆ తర్వాత తర్వాత ఎంత ప్రేమగా అభిమానంగా చూసుకున్నాడో జ్ఞప్తికి తెచ్చుకున్నారు అందరూ. చిత్రంగా, మావో ఎదుటి మనిషి మీద కోపం చేసుకున్న ప్రతి సందర్భం కూడా ఆయన నిద్రలేని రాత్రులు గడిపిన తరువాతే కావడం గమనించదగ్గ అంశం అని మాకు బోధపడింది. అలాంటికొన్ని సంఘటనల

గురించి ఇప్పుడు మీకు వివరిస్తా.

మేం అప్పుడు బెయిడైహీలో ఉన్నాం. మావో వరుసగా రెండు పగళ్ళు మూడు రాత్రులు మేలుకొని ఏకబిగిన రాత పనిలో మునిగిపోయాడు. మూడో రోజు తెల్లవారాక గానీ రాతపని పూర్తవలేదు. అప్పుడు గార్డు డ్యూటీలో ఉన్న లీలియాన్ చింగ్ నిద్దర మాత్రలు ఒకటికి రెండు డోసులు ఇచ్చాక కానీ మావో విశ్రమించలేదు. మావో నోటివెంట గురకశబ్దం వినవచ్చే వరకూ లీ అక్కడే ఉన్నాడట. మొదట చెట్ల ఆకుల మధ్యనగాలి దూరి చేసే సవ్వడిలా సుతిమెత్తగా మొదలయిన ఆ గురక క్రమేపీ సాగర ఘోషలా పెరిగి పెద్దది అయ్యేదాకా ఉండి, మావో ఇక నిద్రకు పడినట్టే అన్న ధీమాతో లీ ఆ గదిలోంచి నిశ్శబ్దంగా బయటకు వస్తుండగా గదిలోకి వచ్చి పడుతున్న కాంతి రేఖ ఒకటి లీ దృష్టిని ఆకర్షించింది.

కిటికీ తలుపు పగులులోంచి సూర్యకాంతి ఒకటి కోణంగా తీక్షణంగా లోపలికి పడుతుంది. ఇంకో ఘడియకో గంటకో ఆ కిరణం తిన్నగా మావో కళ్ళ మీద ప్రసరించే ప్రమాదం ఉందని లీ పసికట్టాడు. మావోకు నిద్రాభంగం కాకూడదనే ఉద్దేశంతో లీ ఆ కిటికీలకు ఉన్న వెదురు బద్దల తెరని కిందకి దించాలని అనుకుని గుమ్మం దాకా వచ్చేసినవాడల్లా తిరిగి అడుగులో అడుగు వేస్తూ కిటికీ దగ్గరకు చేరుకున్నాడుట. ఊపిరిబిగబట్టి శబ్దం కాకుండా వెదురు బద్దల తెరచి నిమ్మళంగా అంగుళం అంగుళం చొప్పున కిందకి దించుతూ ఉన్నాడుట. అంతసేపు ఊపిరి బిగబట్టి ఉంచడం అతని వల్ల కాకపోవడంతో నోరు తెరచేసి గసకపోసుకుంటూ ఊపిరి తీసుకుంటూ ఉండగా చేతుల్లోని వెదురుబద్దల తెర దభాల్మని కిందకి జారిపోయిందిట.

మామూలుగా అయితే అది పెద్ద శబ్దం కిందకు లెక్కరాదు. కానీ గుండు సూది కింద పడినా వినిపించేంత నిశ్శబద్దంగా ఉన్న ఆ గదిలో వెదురు బద్దల తెర జారిన మూలంగా శబ్దం పెద్దగా వినిపించి మావోను తుళ్ళి పడి లేచేలా చేసింది. 'ఎవరదీ? ఏమయిందీ?" అని అరుస్తూ మావో లేచి కూచున్నాడు.

లీ గిర్రున వెనక్కి తిరిగి చూసేసరికి మావో ఎర్రబడిన కళ్ళలో తనవంక చూస్తూ 'ఏమయిందంటే మాట్లాడవే' అని గద్దించాడుట. లీ తత్తరపడుతూ "నేనే...కిటికీ..తెర దించుదామనీ' అని చెబుతుండగానే మావో మధ్యలోనే కల్పించుకుని ' ఆ పని ముందే ఎందుకు చెయ్యలేదు. బుర్ర తక్కువ పన్లని బుర్ర తక్కువ పన్లు...పో ...నాకు నీ మొహం చూయించమాకు' అని అరిచేసాడుట. దాంతో లీ ఒక్క గెంతులో మావో గదిలోంచి బయటకి వచ్చి గుమ్మం వారగా నిలబడ్డాడట. మావో తల వంచి బయటకి చూస్తూ 'నువ్వింక ఇక్కడ డ్యూటీ చెయ్యనక్కర్లా. వెళ్ళు. వెళ్ళి ఇంకియావోను నేను ఉన్న పళాన రమ్మనమన్నానని చెప్పి పంపు' అన్నాడట.

లీ పడుతూ లేస్తూ నేను ఉన్న దగ్గరికి వచ్చి జరిగిందంతా నాకు పూస గుచ్చినట్లు వివరించాడు. నేను హడావుడిగా మావో దగ్గరకు పరిగెత్తా, ఇహ అప్పుడు పడుకోమని ఆయనకు చెప్పి కూడా లాభం లేదని తెలుసు కాబట్టి నేను మావో తలకు మర్దనా చేసి సుతారంగా తలవొత్త సాగాను.

కాసేపటికి చికాకు సర్దుకున్నట్టుంది మావో 'చాలింక' అన్నాడు. 'ఒక మారు లీను పంపించు' అని చెప్పాడు. బయటికి వచ్చేస్తున్న నాతో.

నేను లీకు కబురు పంపాను. తను వచ్చేసరికి మావో మంచానికి తలకట్టున వీపు ఆనించి కాళ్ళు బార్లా జాపుకు కూచుని ఏవో డాక్యుమెంట్లు తిరగేస్తూ ఉన్నాడు.

లీ లోపలికి వెళ్ళడమే వొంగి సలాం చేస్తూ 'క్షమించండి కామ్రేడ్ ఛైర్మన్' అన్నాడు.

అప్పుడు మావో తేటపడిన మొహంతో 'సర్లే అయిందేదో అయింది నీ మూలంగా చిన్న పొరబాటే జరిగిందే అనుకో దానికి నేను అంత ఇదిగా రెచ్చిపోవాల్సిన అవసరం లేదు కదా. ఏదో ఆదాటున అలా జరిగిపోయింది. మనసులో ఏం పెట్టుకోమాక అన్నాడు. మావో అలా క్షమాపణ పూర్వకంగా మాట్లాడేసరికి లీ కళ్ళ నీళ్ళ పర్యంతం అవుతూ లేదు ఛైర్మన్ నాది తప్పే అన్నాడు.

దానికి మావో ' ఆ మాట అని మళ్ళీ నా తప్పుని ఎత్తి చూపుతున్నావ్ లీ. ఏం చెయ్యను? తలకు మించిన పనులు మీద పడిపోతున్నాయి. చూస్తూ చూస్తూ ఆ పనులూ పక్కన బెట్టలేను. అట్లా అని బొత్తిగా నిద్ర కాయకుండా ఉండలేని పరిస్థితి. నాకు నిద్దర పట్టేదే తక్కువ. అలాంటపుడు ఇలా ఏదన్న జరిగితే నాకు పట్టరాని కోపం వచ్చేస్తుంది. అది నా బలహీనత. అంతే తప్ప మిమ్మల్ని కించపరచాలనే ఉద్దేశం మాత్రం కాదు. ఇవన్నీ ఏం మనసులో పెట్టుకోమాకు లీ. నేను కూడా మానవ మాత్రుణ్ణే కదా. అందుకే ఈ వెర్రి కోపం. మనిషన్నాక ఒకరితో ఒకరం సర్దుకుపోవాలి గదా. ఈ ఒక్క విషయంలో నాతో సర్దుకుపోండి లీ' అన్నాడు.

దాంతో లీ భోరున ఏడ్చేసాడు. జరిగిందానికన్నా, మావో నిజాయితీగా, నిష్కల్మషంగా మాట్లాడిన తీరు లీ ను కదిలించివేసింది. అయితే లీ ఎందుకు ఏడుస్తుంది మావోకు అర్థం గాక 'పొరబాటు నాదే లీ. నన్ను క్షమించు' అనడిగాడు. అంతేకాదు ఆ తర్వాత కూడా ' ఆరోజు విషయం నువ్వేం మనసులో పెట్టుకోలేదు కదా. అసలేం జరిగిందంటే అంటూ' పాత సంగతిని లీకు అర్థం చేయించేందుకు మరోసారి కథంతా చెప్పుకు వచ్చేవాడు మావో. వారంలో రెండు మూడు సార్లయినా ఆ కథ వినాల్సి వచ్చింది మాకు చాలా కాలం.

మావో 'సంస్కృతం' మాట్లాడేటపుడు చూసి తీరాల్సిందే, గొప్ప నవ్వులాటగా ఉంటుంది. నేను పదిహేనేళ్ళపాటు మావో దగ్గర పనిచేసా. ఒకసారి ఆయన్తో తిట్లు తినాల్సి వచ్చింది.

అది 1958లో అనుకుంటా. మావోతో పాటు నేను షాంగై వెళ్లాను. మా బస మేం ప్రయాణించిన స్పెషల్ రైలులోనే. ఒక రోజు మధ్యాహ్నం పూట మావో అలా నిద్రకు పడగానే నేనలా ఊళ్ళోకి వెళ్ళి వద్దామని బయల్దేరాను. ఎంత లేదన్నా కనీసం మూడు నాలుగు గంటలయినా మావో పడుకుంటాడు కదా అని నా ఉద్దేశం. నేను ఊళ్ళోకి వెళ్ళి పనులన్నీ చక్కపెట్టుకుని తీరిగ్గా తిరిగివచ్చా. నేను వచ్చేసరికి 'నీ కోసమే ఎదురు చూస్తా ఉన్నా. మావో లేచి చాలా సేపయింది నీ గురించి అడిగాడు' అని చెప్పాడు అక్కడ డ్యూటీలో ఉన్న గార్డు 'చాలా సేపయిందా' అనడిగా నేను బిత్తరపోతూ! మరే...టౌన్లో ఏదో మీటింగు ఉన్నదంట, వెళ్ళి చానా సేపయింది' అన్నాడు తను. నేను పడుతూ లేస్తూ ఆ మీటింగ్ జరిగే దగ్గరికి వెళ్ళా. మీటింగ్ అయిపోయి భోజనాలకు లేచారు అప్పుడే అక్కడంతా అక్కణ్ణించి మావో ఒపేరా చూడ్డానికి వెళ్తాడని తెలుసుకుని నేను వెళ్ళి కారు దగ్గర కాపు కాసా.

మావో బయటకు రావడం చూసి నేను కారు తలుపు తెరిచి పట్టుకు నిలబడ్డా నన్ను చూడగానే మెట్లుదిగేవాడల్లా అక్కడే ఆగిపోయి 'నీ డ్యూటీ ఎంటో నీకు తెల్సా' అంటూ కోపంగా ఓ సంస్కృతం మాట వాడాడు మావో.

నేను హడావుడిగా మెట్లు ఎక్కి మావోకు నా చెయ్యి ఆసరాగా అందించి తనతోపాటే కిందకి దిగివచ్చా. కార్లో కూచోబెట్టి నేను పక్కనే కూచుని తలుపు మూసా. మావో మొహం చూస్తే కోపాన్ని అదివి పెట్టినట్టుగా అనిపించి నేను కిమ్మనకుండా ఉండిపోయా దారి పొడుగూతా.

ఒపేరా జరిగే థియేటర్‌లోకి వచ్చి చేరాం. నేను యథా ప్రకారం మావో పక్క సీట్లో కూచున్నా. కళ్ళాద్దాలు తుడిచిఇచ్చి, నడుముకు ఉన్న బెల్టు ఒదులు చేసా. ప్రదర్శన మొదలయ్యేంతవరకూ మావో 'మూడీ'గా ఉండిపోయాడు.

తిరిగి వెనక్కి వచ్చే దారిలో నేను నెమ్మదిగా విషయం కదిపా. 'ఎందుకని కామ్రేడ్ ఇవాళ మీరంత ముభావంగా ఉన్నారు' అనడిగా.

'దేనికా? నా అంగిలి కాలిపోయింది ఇవ్వాళ. చాలా! తృప్తేనా?' అన్నాడు మావో పుల్లవిరుపుగా.

ఆ తరువాత అసలు విషయం ఏంటో రాబట్టా. భోజనం అయ్యాక వేణ్ణీళ్ళతో పుక్కిలించడం మావోకు అలవాటు. ఆ రోజున కూడా యథా ప్రకారం గార్డు అందించిన నీళ్ళు నోట్లో పోసుకున్నాడట. అదే నేనయితే ఆ నీళ్ళ పుక్కిట పట్టేంత గోరెచ్చగా ఉన్నాయో లేదో చూసి మరీ మావోకు అందించేవాడిని. ఆ రోజు డ్యూటీలో ఉన్న గార్డుకు అది తెలీక వేడివేడి నీళ్ళు ఇవ్వడం, చల్లార్చి ఇచ్చి ఉంటాడేమోలే అనుకుని మావో గిన్నెడు నీళ్ళను పుక్కిటపట్టి వేడిగా ఉండడంతో గబాలున ఉమ్మేసాడట. ఈలోగానే మావో అంగిలి ఆ వేడికి చుర్రున కాలి నా మీద సంస్కృతం దండకం విసిరాడట. నా పదిహేనేళ్ళ సర్వీసులో మావోతో సంస్కృతంలో అక్షింతలు వేయించుకోవడం అదే తొలిసారి. అదే ఆఖరుసారి.

మావో మా దిటవైన గుండెగల మనిషి. పాత సంప్రదాయాలు, విశ్వాసాల పొడగిట్టేది కాదు. జీవితం పట్ల గొప్ప దార్శనికతగల మనిషి. తన దోవకు అడ్డు తగులుతున్న మనిషి ఎంతటివాడైనా సరే సహించేవాడు కాదు. అవసరమైతే నిర్దాక్షిణ్యంగా దండించే వాడు.

అది 1956 వేసవి కాలం. ముచ్చెమటలు పోయించేలా ఎండలు కాస్తున్నాయి. ఉన్నట్టుండి మావో 'పదండి నాకు ఇప్పుడు యాంగ్సీ నదిలో ఈత వెయ్యాలని ఉంది' అన్నాడు.

యాంగ్సీ నదిలో ఈతా? ఇప్పుడా అని మేం నోరు వెళ్ళబెట్టాం. వాంగ్ డాంగ్ జింగ్, లుయోరుయికింగ్, వాంగ్ రెన్ జాంగ్ తదితరులంతా ఆ మాట విని తాల్, వీలు కాదంటే కాదన్నారు. బెయిడెయిహీ కన్నా ఇక్కడ యాంగ్సీ నది మహా ప్రమాదకరమైన వేగంతో, సుడి గుండాలతో ప్రవహిస్తూ ఉంటుంది. పొరబాటున ఏదన్నా జరగరానిది జరిగితే అటు పార్టీకి ఇటు దేశ ప్రజానీకానికి ఏమని సమాధానం చెప్పుకోవాలి అని తెగ గింజుకున్నారు.

కుదరదు అని మావోకు నచ్చచెప్పే బాధ్యత లుయో తీసుకున్నాడు. మీరు ఇప్పుడు ఈత వెయ్యడానికి నేను పర్మిషను ఇచ్చే పరిస్థితుల్లో లేను కామ్రేడ్ ఛైర్మన్. దయచేసి అర్థం చేసుకోండి. నేను మీ రక్షణ చూసుకోవాల్సిన టాణ్ణి. అంతేకానీ మిమ్మల్ని ఈతకు పంపినాకు నేను ఆత్మ రక్షణ చేసుకోవాల్సిన చిక్కులు తెచ్చుకోవడానికి నే సిద్ధంగా లేను' అన్నాడు మావోతో.

కానీ మావో పట్టిన పట్టు విడపలేదు. 'గార్డు డ్యూటీలో నీకన్నా శెభాషయిన మొనగాడు లేడు లుయో, కానీ నువ్వు కొమింటాంగ్‌కు రక్షణంగా నిలబడు, యాంగ్సీ నదికి కూడా నీ రక్షణ కావాల్నా' అంటూ విషయాన్ని తేలిక చేసి తన పంతం నెగ్గించుకోవాలని చూశాడు.

అయినా లుయో తన పట్టు విడపలేదు. 'మీరేవైనా చెప్పండి కామ్రేడ్...దీన్ని మీ ప్రయివేటు విషయంగా నే భావించలేదు. పార్టీ పర్మిషను లేనిదే నేను మిమ్మల్ని ఇలాంటి సాహసకృత్యాలకు అనుమతించలేదు. క్షమించండి' అన్నాడు మావోతో కరాఖండిగా.

'అదా నీ ఇబ్బందీ.. నేను ఒక వేళ నీట్లో మునిగి ఛస్తే పార్టీకి ఏం సమాధానం చెప్పుకోవాలనేగా నీ ఆలోచనా' అన్నాడు మావో.

లుయో సహా అక్కడ ఉన్న అందరి మనసుల్లో ఉన్న భయం అదే. అయినా మనసులోని మాట. మావో నోటి వెంట వినరావడంతో ఉలిక్కిపడ్డారు అందరూ. లుయో మాత్రం తేరుకుని 'నా ఉద్దేశం అది కాదు కామ్రేడ్. మీ విషయంలో 'ఛాన్స్' తీసుకోవడానికి నే సాహసం చెయ్యలేను' అన్నాడు.

'ఎందుకయ్యా అలా ప్రతి దానికీ భయపడతారు. నీళ్ళలో మునిగే చస్తామా? ఏం కాలుమీద కాలేసుకుని ఇంట్లో కూచుని ఉండగా నడినెత్తిన బాంబులు పడితే చావమా, ఏ భూకంపం వచ్చో ఇల్లు కూలి చావమా. చాల్లెద్దురూ. ఈ మీటింగ్ అంతా దేనికీ నన్నో ఈత వేసి రానీండి' అంటూ మావో నదికేసి నడపసాగాడు.

లుయో నిస్సహాయంగా నిలబడిపోయాడు. ఈసారి మావోకు అడ్డుపడి ఆయనకు నచ్చచెప్పే పని వాంగ్ డాంగ్ జంగ్, వాంగ్ రెన్‌జాంగ్‌లు తలకెత్తుకున్నారు. వాళ్ళకు మధ్యలో డాక్టరు కూడా తోడయ్యాడు. ఒకళొకళ్ళుగా తన దారికి అడ్డంగా నిలబడుతుంటే సరికి మావోకు చిర్రెత్తుపోయి 'ఏహె, చాలు పక్కకి తప్పుకోండి, మరీ బుద్ధి తక్కువగాళ్ళు బుర్ర తక్కువ గాళ్ళూ అయిపోయారే' అంటూ వాళ్ళని కసురుకున్నాడు.

ఇహ ఇలా లాభం లేదనుకున్నాడో ఏమో మావో రూటు మార్చాడు. ఫస్ట్‌గార్డ్ కంపెనీ కమాండర్ హాన్‌ను పిలిచాడు. 'నువ్వో పన్జెయ్ కామ్రేడ్, మన వాళ్ళంతా నదిలో ఈతవెయ్యడం ప్రమాదం అంటున్నారు కదా, అవునో, కాదో చూసి చెప్పు' అన్నాడు.

హాన్ కూడా మావోను ఈతకు వెళ్ళనీకుండా అడ్డుపడినవాడే మావో అలా అడిగేసరికి 'ఏదయితేనేం ఛైర్మన్ దారికొచ్చాడు. ఇలా అయినా ఆయన ఉత్సాహానికి గండికొట్టవచ్చు' అనుకుని హుషారుగా నది ఒడ్డు వెంబడే ఇక్కడ నుండి అక్కడదాకా చెక్కర కొట్టాడు. 'మధ్యమధ్యన ఆ 'పాయింట్' దగ్గర ఉన్న గార్డులను 'ఇక్కడ ఎట్లా ఉంటుందంటావ్, ప్రమాదకరంగానే ఉండి ఉంటుంది కదూ' అని వాకబు చేస్తూ వాళ్ళతో అవునని అనిపించుకుని మావో దగ్గరికి తిరిగి వచ్చి 'లాభం లేదు కామ్రేడ్ ఛైర్మన్ – అంతా ప్రమాదకరమే అంటున్నారు. అదిగో అక్కడ సుడిగుండాలు ఉండొచ్చుట, అల్లక్కడ మా వడిగా ఉందట' అంటూ తను విన్నవన్నీ పొల్లుపోకుండా చెప్పాడు.

మావో తను చెప్పిందంతా శ్రద్ధగా విన్నాడు. భృకుటి ముడివేసి 'ఈ'ట'కారం మాట వొదిలే, నువ్వు చూసొచ్చావా? నిజంగానే అక్కడ సుడిగుండాలు ఉన్నాయా?' అనడిగాడు.

'లేదు కామ్రేడ్...మన వాళ్ళు చెప్పారు' అన్నాడు హాన్ నసుగుతూ.

'చెప్పడం కాదు, నువ్వు ఈతవేసి వస్తేకదా తెలిసేదీ ఇంతకీ నువ్వు ఈతవేసావా' అనడిగాడు మావో.

'అది కాదు కామ్రేడ్ ఛైర్మన్' అని హాన్ ఏదో సర్ది చెప్పడానికి చూసాడు. కానీ మావో 'చాలింకా ఏం చెప్పొద్దు. చెప్పిన పని చెప్పినట్లు చెయ్యడం రానివాడివి నీకీ ఉద్యోగం అనవసరం' అన్నాడు రకీమని. తలపక్కకి తిప్పి 'సన్‌యాంగ్ ఎక్కడున్నాడూ' అనడిగాడు.

'ఛైర్మన్' అంటూ సన్‌యాంగ్ మావో ఎదరకు వచ్చి నిలబడ్డాడు.

'మనోళ్ళంతా భయపడుతున్నట్లు నదిలో ఈత వెయ్యడం ప్రమాదమో కాదో నువ్వు చూసి చెప్పగలవా' అనడిగాడు మావో.

'చెప్తా కామ్రేడ్' అంటూ సన్‌యాంగ్ చరచరా నది ఒడ్డుకు వెళ్ళి బట్టలు విప్పి నదిలో దూకాడు. కాసేపు ఈతకొట్టి బయటకు వచ్చాడు.

'ప్రమాదం ఏంలేదు ఛైర్మన్' అని చెప్పాడు మావోతో.

'నే చెప్తానే ఉన్నానా..వీళ్ళు అసలు నా మాట వింటేగా. ఇంకేముందీ అరటిపండు వొలిచి పెట్టినంత సుకరంగా నువ్వు బారీతి వేసి వొచ్చావుగా. ఇపుడు నా వంతు..పదా' అన్నాడు మావో. అప్పటిదాకా తనను ఈతకు వెళ్ళొద్దని వారించిన వారికేసి చూస్తూ 'యాంగ్సీ నదిలో ఈత వెయ్యడం ప్రాణాంతకం అన్న వాళ్ళంతా ఒళ్ళంతా కళ్ళు చేసుకు చూడండి. మన సన్‌యాంగ్ బేపర్వాగా ఈత కొట్టి వచ్చాడు' అన్నాడు.

ఇహ మావోను ఆపడం ఎవరితరం కాదని తేలిపోయింది. వాన్ రెన్ జాంగ్ గబగబా వుహాన్ దగ్గరకు పరిగెత్తాడు ఇపుడు ఏం చెయ్యడమా అని. వాళ్ళిద్దరూ కూడబలుక్కుని గార్డులు అందరినీ నదిలో తలా ఒక చోట ఉండేలా ఏర్పాటు చేసారు. ఆ 'లైఫ్ గార్డులు' ఉన్న ప్రాంతంలోనే మావో ఈత సరదా తీర్చుకునేలా చూడాలనేది వాళ్ళ ఆలోచన.

'చూసి రమ్మంటే కాల్చి వచ్చేలా ఉండాల్సిన కుర్రాళ్ళు. నదిలో ఈత వెయ్యచ్చో, కూడదో చూసిరమ్మంటే కనీసం పాదాలు కూడా తడవకుండా వచ్చి ఆ హాన్ నదిలో ఈత యమా డేంజరని చెబుతాడా? అక్కర్లేదు. అలాంటి వాళ్ళు మనతో వొద్దు. గట్టునే ఉండమని చెప్పండి తనకి' అన్నాడు మావో ఈతకు వెడుతూ. అంతే ఆ రోజుతో ఫస్ట్ గార్డ్ దళం నుండి హాన్‌కు ఉద్యోగం తీరిపోయింది.

ఇలాగే ఇంతకుముందు ఒకసారి 'వుహాన్'కు విమానంలోనే వెళ్తానని మావో పంతం పట్టాడు. 'కుదరదు, సెంట్రల్ కమిటీ మీకు విమానయానానికి అనుమతి ఇవ్వకూడదని నిర్ణయించింది' అని అక్కడ ఉన్న బాధ్యులు ఖండితంగా చెప్పారు. 'అంటే నేనెలా మెలగాలో నిర్ణయించుకునే హక్కు కూడా లేదా నాకు' అనడిగాడు మావో. 'పార్టీ నిర్ణయం అది' అని బదులు రావడంతో - 'సరే, ఈ ఒక్క మాటుకీ మినహాయింపు ఇవ్వొచ్చు కదా, అని పంతం పట్టి మరీ సాధించుకున్నాడు.

గువాంగ్ ఝౌలో విమానం ఎక్కాడు. చాంగ్సాలో ఆగి అక్కడ జియాంగ్ సింగ్ నదిలో ఈత కొట్టాడు. అక్కణ్ణించి మరలా విమానంలో వుహాన్ చేరుకున్నాడు. నిజానికి అది చాలా చిన్న ట్రిప్పు. భోంచేసేంతలో ప్రయాణం పూర్తయిపోయింది. అప్పుడే మావో ఒక చిన్న కవిత రాసాడు. పూర్తిగా గుర్తులేదుగానీ 'చాంగ్సాలో నీళ్ళు తాగి, వుంచాంగ్‌లో చేప తిని..' అనే పదాలతో మొదలవుతుంది ఆ కవిత.

ఇప్పుడూ అలాగే తన పంతం నెగ్గిందనే హుషారు కొట్టొచ్చినట్లు కనబడుతుంది మావోలో. అందరం కలిసి స్టీమరు ఎక్కాం. నదిలో మధ్యకు వెళ్ళాక స్టీమరు నిలిపేసి పై నుండి తాళ్ళనిచ్చెన నీళ్ళలోకి జారవిడిపెట్టి అందరికన్నా ముందు సిన్‌యాంగ్ దిగాడు. ఆ వెనుకే మావో, మావో వెనకగా నేను, ఆ నిచ్చెన మీద నుండి నది నీళ్ళలోకి జారాం. చుట్టూతా తెడ్డు పడవల్లో గార్డులు సిద్ధంగా ఉన్నారు. 'రామాకండి. దూరం దూరం' అని ఆ పడవలని దూరంగానే నిలేసాడు మావో. డాక్టరుగారున్న తెడ్డు పడవ మాత్రం మా వెనక కాస్త ఎడంగా వస్తా ఉంది.

సన్‌యాంగ్ ముందు ఈత కొడుతూ ఉంటే ఆ వెనగ్గా మావో ఈదనారంభించాడు. సరిగ్గా ఆ చోటే ఆ తరువాత కాలంలో యాంగ్సీనది మీద (వుహాన్) వంతెన నిర్మించారు.

మావో అలవోకగా నాలుగు మైళ్ళు వాలీత కొట్టాడు. మధ్యమధ్యన చెణుకులు వేస్తూ మాతో హుషారుగా గడిపాడు. ఈత కార్యక్రమం అయ్యాక మేం దోంగ్ హు సరస్సు దగ్గర ఉన్న గెస్ట్ హౌస్‌కు చేరుకున్నాం.

'చెప్పొద్దూ, హాన్ మంచి కుర్రాడే - నిదానస్తుడు, నమ్మకస్తుడూ. కానీ తప్పు చేసాడు. చూసావా' అన్నాడు మావో దారిలో. 'డ్యూటీ నుంచి తప్పించినందుకు బాధగానే ఉంది' అన్నాడే కానీ మావో తన నిర్ణయాన్ని అంత తేలిగ్గా వెనక్కి తీసుకునే రకం కాదు. 'టియాన్‌ను చూడు, పెట్టుబడిదారుడైన తన తాత అభిప్రాయాన్నే సమర్ధించాడు. రాజకీయంగా టియన్ ఆలోచన తప్పే, కానీ తన మనసులో ఉన్నది ఉన్నట్టు చెప్పాడు. మంచి పనిచేశాడు. కానీ మన వాన్ ఏం చేశాడు. లుయో ఏదంటే అదే చెప్పాడు. రాజకీయంగా తన ఆలోచన

సరైనదే కావచ్చు, కానీ సత్యం ఏమిటో చెప్పలేక పోయాడు. అందుకే నాకు నచ్చలా, ఎవరైనా సరే, ఎప్పుడైనా సరే ఉన్నది ఉన్నట్టు సత్యంగా చెప్పాలి. అదీ నా పాలసీ' అన్నాడు మావో. హాన్ గురించి తను తీసుకున్నా నిర్ణయం సరైనదో కాదో అలా రెండు ముక్కల్లో తేల్చి చెప్పాడు.

ఆ తరువాత అక్కడ ఉన్న ప్రొవిన్షియల్ పార్టీ కార్యదర్శులతో సమావేశం జరిగింది. అక్కణ్ణించి తిన్నగా బీజింగ్ వచ్చేసాం. విదేశీ పర్యాటకులతో ఒక సమావేశం ఉండింది. వాళ్ళు రావటానికి ఇంకాస్త సమయం ఉందనగా మావో కుర్రాడి మాదిరిగా లుయోను కాసేపు ఆటపట్టించాడు. 'ఏమండి మంత్రిగారూ! ఈత వేస్తానంటే రాక్ కాదు పొమ్మంటారా. ఏమయ్యిందీ మీ పంతం నెగ్గిందా, నా మాట నెగ్గిందా - హన్నాన్నా. తెలివితేటలు మీ ఒక్కరికే సొంతం అనుకున్నారా. చూస్తూ ఉండండి రేపు జూన్‌లో మళ్ళీ పందెం పెట్టి నేను యాంగ్సీ నదిలో ఈత వెయ్యకపోతే అప్పుడడగండి' అని సతాయిస్తానే ఉన్నాడు. ఇంతలో విదేశీ పర్యాటకులు రావడంతో అంతా గప్‌చిప్ అయిపోయాం. మావో ఎప్పట్లా ధీరగంభీరంగా అహుతులకు స్వాగతం పలికాడు.

అవసరం పడితే అటు పార్టీలో ఉన్న నాయకులనుగానీ, సైన్యంలో - ప్రభుత్వంలో ఉన్న ఉన్నతాధికారులనుగానీ మావో పరుషంగా విమర్శించడం నా కళ్ళారా చూసాను. ఒక్కోసారి అదుపు తప్పినంత కోపంగా మాట్లాడేవాడు. మావో అలా అగ్గిమీద గుగ్గిలం అయిపోయినపుడల్లా సైన్యంలో ఉన్న వాళ్ళయితే పెదవి కదపకుండా అటెన్షన్‌లో నిలబడి ఉండిపోయేవాళ్ళు. పార్టీ-ప్రభుత్వంలోని వాళ్ళయితే నీళ్ళునవుల్తూ ఏదో ఒక సమాధానం చెప్పడానికి ప్రయత్నించేవాళ్ళు. పార్టీలో నాకు తెలిసిన నాయకులు అందరిలో కల్లా మావో ఒక వ్యక్తిగా తన ఇష్టానిష్టాలు, భావోద్వేగాల గురించి బాగా ఎరిగిన మనిషని నే ఘంటాపథంగా చెప్పగలను. 'నేనంటే నేనుగానే ఉండాలి కానీ కాలం చేతిలో తోలు బొమ్మలా మారకూడదు కదా' అంటుండేవాడు తరుచూ మావో.

1948 జులై 1వ తారీఖు అది. మావోను కలుసుకోవడానికి వాంగ్ మింగ్ వచ్చాడు. ఆ రోజు డ్యూటీలో నేనే ఉన్నాను. చైనా కమ్యూనిస్టు పార్టీ చరిత్రను తరచి చూస్తే వాంగ్ మింగ్‌ది ప్రముఖ పాత్రే. పార్టీ సైనిక నాయకత్వాల నుంచి మావోలను పక్కన పెట్టడంలో వాంగ్‌మింగ్ తనదైన పాత్ర పోషించాడు. అతను అనుసరించిన పిడివాద ధోరణుల మూలంగా పార్టీ తీవ్రంగా నష్టపోయింది కూడా. చరదపు మొహం, మంచి రంగుతో ఉన్నా ఎందుకో ఆ మనిషి అట్టే అనేవాడు కాదు నా కంటికి 'పని మీద వచ్చినట్టున్నారు' అన్నా నేను. 'ఛైర్మన్‌ను కలవాలి' అన్నాడు తను. అప్పటికి మావో అంత ముఖ్యమై పనిమీద లేడని తెలుసు కాబట్టి నేను వాంగ్ మింగ్‌ను తిన్నగా మావో దగ్గరకు తీసుకువెళ్ళాను.

వాంగ్‌మింగ్‌తో వినయంగానే వ్యవహరించా కానీ ఎందుకో అతనంటే పట్టీపట్టనట్టుగా ఉండేవాణ్ణి. 'నన్ను చంపించాలని చూసిన పెద్ద మనిషి కాదూ' అని మావో వాంగ్ మింగ్‌ను ఉద్దేశించి ఎప్పుడో ఒకసారి నాతో అన్నమాటలు నా మనసులో బలంగా నాటుకుపోయాయి.

మేం వెళ్ళేసరికి మావో ఏదో డాక్యుమెంట్లు ముందేసుకుని చదువుతూ కనిపించాడు. అలికిడికి తలెత్తి చూశాడు. ఎదురుగా వాంగ్ కనపబడడంతో కరణం బల్ల ముందు నుంచి లేచి వచ్చి షేక్ హ్యాండిచ్చి కూచోమని సోఫా చూయించాడు. వాంగ్ ఎదురుగా ఉన్న కుర్చీలో కూచున్నాడు మావో. అదే ఛూటేనో, చౌఎన్‌లై, పెంగ్ దెహుయి, లిన్పఇయావో లాంటి వాళ్ళు వస్తే మావో ఇలాంటి 'ఫార్మాలిటీస్' పాటించడు. 'దా..దా...' అని ఆప్యాయంగా పిలుస్తాడు.

వాళ్ళు కుశల ప్రశ్నల్లో ఉండగానే వెళ్ళి టీ తయారుచేసి తీసుకువచ్చాను. నేను గదిలో అడుగుపెడుతున్నప్పుడు వాంగ్ గొంతు వినబడుతుంది. 'అటువంటి చారిత్రక అంశాల మీద పార్టీ ఇలాంటి నిర్ధారణలకు ఎలా వచ్చిందీ? నేనీ విషయమ్మై ఏం ఆలోచిస్తున్నానో సెంట్రల్ కమిటీ తెల్సుకోవాలి. ఈ విషయమ్మై నీతో కూడా మాట్లాడాలనుకుంటున్నా' అంటున్నాడు అతను.

వాంగ్ చెప్పేది గదిలో కూచుని మావో నేను టీ కప్పులు పెట్టాక నాకేసి చూశాడు. నేను అక్కడ ఉండవల్సిన అవసరం లేదన్న విషయం ఆ చూపులో గమనించిన నేను ఆ గదిలోంచి బయటకు వచ్చేసా.

ఎదర ఆఫీసు గదిలో కూచుని ఉన్నా. లోపల గదిలోంచి వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటున్న విషయాలు పెద్ద పెద్దగా వినబడుతున్నాయి. దాంతో ఆసక్తిగా నేనా మాటలు ఆలకించాను. రకరకాల విషయాల మీద, వ్యక్తుల మీద, సంఘటనల మీద, సోవియట్ యూనియన్, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ వంటి అనేక అంశాల మీద వాళ్ళిద్దరి మధ్యన వాడిగా వేడిగా చర్చ జరిగింది. ఒక దశలో మావో హూనాన్ యాసలో తీవ్రమైన కంఠంతో 'ఇప్పటికీ నువ్వు అర్థం చేసుకోవైతివి, అడుగు దూరంలో విజయం వేచి ఉన్నా ఇప్పటికీ నువ్వు నీ తప్పులు సరిదిద్దుకోడానికి సిద్ధంగా లేవు' అని వాదించడం నాకు బాగా గుర్తు.

1949 మార్చి 25న మావో బీపింగ్ కేసి బయల్దేరాడు. మేం ఎక్కిన రైలు ఝూవోజియాన్ కౌంటీని సమీపిస్తుండగా, ఒకప్పుడు రాజధానిగా వెలిగిన ఆ నగరపు శోభను రైలు కిటికీలోంచి తిలకిస్తూ మావో తీవ్రమైన భావోద్వేగానికి లోనయ్యాడు. 'ముప్పై ఏళ్ళయింది, నేనీ నగరానికి వచ్చి ముప్పై ఏళ్ళు. మన దేశం, మన ప్రజానీకం ఎదుర్కొంటున్న సవాళ్ళకు ధీటైన జవాబు కోసం వెతుకులాడుతూ దేశం అంతా తిరిగా నేను. క్రూర

పరిహాసమే తప్ప పరిష్కారం దొరకలా నాకు. అదిగో అలాంటి పరిస్థితులలో నేనిక్కడ కామ్రేడ్ లిడజావోను కలిశాను. నాకు గురువు, మార్గదర్శి, నా శక్తీ అయనే. తనే లేకుంటే నేనివాళ ఈ స్థితిలో ఉండేవాణ్ణికాదు' అన్నాడు

కింగ్ హుయాన్‌లో రైలు దిగగానే మావో తిన్నగా 'సమ్మర్ ప్యాలెస్'కు బలల్దేరాడు కార్లో.

మేం వెళ్ళే సరికి ప్యాలస్ తోట అంతా నిరామయంగా ఉంది. అక్కడ ఉండే సన్యాసులు. ప్యాలస్ ఉద్యోగులను పౌర వ్యవహారాల అధిపతి లొకెన్నాంగ్ భద్రతా కారణాల రీత్యా ఖాళీ చేయించాడట. అంతకుముందే బీపింగ్‌ను ఎర్ర సైన్యం విముక్తి చేసింది. దాంతో కొమింటాంగ్ అండర్‌కవర్ ఏజెంట్లు, గూఢచారులు, హంతక ముఠాల అలికిడి ఆ ఊళ్లో ఎక్కువగా ఉందట. అందుకే అంత పకడ్బందీగా సెక్యూరిటీ ఏర్పాట్లు చేశారట. సెక్యూరిటీ మాటేమోగానీ టయానికి మావోకు తిండీ తిప్పలు కూడా సరిగా ఏర్పాటు చెయ్యలేదు.

నగరంలో విజయోత్సవ పెరేడ్ జరుపుతున్న సందర్భంగా బియువాన్ ఎయిర్‌ఫీల్డ్‌లో ప్రజా విముక్తి దళాలను ఉద్దేశించి ఆ మధ్యాహ్నం మావో ప్రసంగించాల్సి ఉంది.

ప్యాలెస్‌లో వ్యవహారం చూసి మావోకు చిర్రెత్తుకు వచ్చింది. 'ఏంటింత సుందర వికారంగా చేసారు? ఇక్కడ ఉండాల్సిన జనాలంతా ఏమేపోయారు' అనడిగాడు కరుగ్గా. పౌర వ్యవహారాలు చూసే బాధ్యులు 'సెక్యూరిటీ కామ్రేడ్స్' అని బదులిచ్చారు. 'చెత్త చెప్పమాకండి. సెక్యూరిటీ అంటే ఇట్లానే? నీళ్ళు లేకుండా చేపని రక్షించడం అయ్యేపనేనా? ఇప్పుడు మీరు చేసుకున్న ఏర్పాట్లు ఆత్మహత్యా సదృశ్యం తెలుసా? తిండి తిప్పలు లేకుండా మలమలమాడిపోతారు. మీరు, పరిస్థితులు ఇలానే ఉంటే' అన్నాడు.

నిజంగానే అక్కడి పరిస్థితి అదే. జనాల దగ్గరకు పోయి వాళ్ళు పెట్టిన ముద్ద తెచ్చుకు తినాల్సి వచ్చింది. అక్కడి వాళ్ళకి. మావో నా కేసి తిరిగి 'నువ్వు నాతో పెరేడ్‌కు రానక్కర్లేదు. తిన్నగా ఫ్రాగ్రాంట్ హిల్స్‌కి వెళ్ళి మనకు బస, తిండికి ఏర్పాట్లు చూడు. ఇక్కడ నీ తమ్ముళ్లు చేసిన తప్పులు పొరబాటున కూడా నువ్వు చెయ్యమాకు ఎప్పుడూ' అన్నాడు.

* * *

# 7. హిమం, ధనం, మనం

పుస్తకాలు, ఈత బీజింగ్ ఒపేరాలు, కఠిన సవాళ్ళతోపాటు మావోకు మంచు అన్నా కూడా మహా ఇష్టం.

మావో రాసిన కవితలో 'మంచుకు ఓ కవిత' అనే కవిత నాకు చానా ఇష్టం. తెల్లటి దూది పింజెల్లా, మబ్బు తునకల్లా కురిసే మంచు ముద్దలు మావోలో కవితాత్మను కరిగించేసాయంటే అతిశయోక్తి కాదు. మావో భావ ప్రపంచాన్ని విస్తృత పరిచింది కురిసే వెండి వెన్నెల నుంచే.

మృదు కఠినంగా, అతిశయంగా, స్వచ్ఛంగా, మెరవణిగా అంటూ మంచు గురించి వర్ణించాడు మావో. మావోలో కూడా మంచుకు ఉండే ఈ లక్షణాలే ఉన్నాయి.

అవినీతికి, బ్యూరోక్రసీకీ, దుబారాకు వ్యతిరేకంగా దేశవ్యాప్తి ఉద్యమానికి పిలుపునిచ్చింది 1951వ సంవత్సరం శీతాకాలంలోనే ప్రభుత్వ యంత్రాంగం, ఆర్థిక రంగాలు, వాణిజ్య వ్యాపారాల్లో అవినీతిని ఎండగట్టడానికి మావో మంచుకురిసే శీతాకాలాన్ని ముహూర్తంగా ఎంచుకున్నాడు.

ఒక రోజున మావో రాత్రి తెల్లవార్లూ తన వద్దకు వచ్చిన ఫైళ్ళను చదువుతూ, వాటి మీద తగిన ఆదేశాలు రాస్తూ గడిపేసాడు. సూర్యోదయం అవుతుందనగా కలం మూతపెట్టి పైకి లేచి ఒళ్ళు విరుచుకున్నాడు. అరచేతుల్లో మొహం రుద్దుకుని గది బయటకు వచ్చాడు. అలా అడుగుపెట్టాడో లేదో అప్రతిభుడై నిలబడిపోయాడు. కొత్త బంగారు లోకం ఏదో కళ్ళ ముందు సాక్షాత్కరించినట్టు చూస్తూ ఉండిపోయాడు. తెలి ఎండలో ఆకాశం నుండి కురుస్తున్న మంచు ధవళ కాంతిలో మెరిసిపోతా ఉంది. గాల్లో ముద్దలు ముద్దలుగా తేలివస్తా ఉంది. నిటారు సైప్రస్ చెట్ల చిటారు కొమ్మల్లో, ఇళ్ళపై కప్పుల మీదా మబ్బులు వాలినట్లు మంచు పేరుకుని ఉంది. కనుచూపు మేర నేలంతా మంచు పరచుకుని ఉంది. చెవి యొగ్గి మంచు గుసగుసలు వింటున్నవాడికి మల్లే మావో నిశ్చలంగా ఉండిపోయాడు.

ఇంతలో కాస్త ఎడంగా ఉన్న గార్డు వచ్చి మావో నడిచి వెళ్ళడానికి వీలుగా దార్లో ఉన్న మంచును పొరకతో అటూ ఇటూ నెట్టే ప్రయత్నం చేస్తుండగా, 'ఏం పనదీ వొదిలే' అన్నాడు మావో.

'లేదు ఛైర్మన్, ఇంతకు ముందు ముమ్మారు ఊడ్చా. అంతలోనే మళ్ళీ పేరుకు పోయింది. అని సంజాయిషీగా చెప్పాడు ఆ గార్డు.

'తెలివి తక్కువ పని. చేతిలోని ఆ పొరకని పక్కన పడెయ్. పూడుకుంటున్న గాయాల్ని మళ్ళీ ఎవరన్నా అలా తెరుస్తారా' అనడిగాడు మావో.

'గాయాలా' అని గొణుక్కుంటా ఆ గార్డు పక్కకి తప్పుకున్నాడు.

వరండాలోంచి మావో కిందకి దిగాడు. నాలుగు అడుగులు వేసాడు. భూమి కంటున్న కల ఎక్కడ చెదురుతుందో అన్నతం సుకుమారంగా వేసాడు ఆ అడుగులు వెనక్కి తిరిగి మంచులో పడిన తన పాద ముద్రలకేసి, తన పాదాల ఒత్తిడికి పడిన మంచుదోనెలో తిరిగి మంచు పూడుకోవడాన్ని పసిపిల్లాడి మాదిరి చూసుకుంటా ఉన్నాడు. అప్పుడు మావోను చూస్తే - ఇతనేనా బలమైన ఫ్యూడల్ సమాజాన్ని కూకటివేళ్ళతో కూల్చేసి నవ చైనా నిర్మాణానికి బాటలు వేసిన మొనగాడూ, ఇతనేనా కమ్యూనిస్టు పార్టీ నేతగా ప్రజా రంగాల్లో పాదుకొన్న అవినీతిపరుల భరతం పట్టడానికి కఠినాత్ముడిగా వ్యవహరించిందీ అని నాకు అనిపించింది. కురిసే మంచును చెదరగొట్టడం ఇష్టంలేక తను ఇందాకటి నడిచిన చోట ఏర్పడిన అడుగుల్లోనే అడుగులు వేసి వెనక్కివచ్చి నిలబడ్డాడు. 'ఎంత తేటగా ఉందీ గాలీ' అంటూ గుండెల నిండుగా శ్వాస తీసుకున్నాడు. తర్వాత చేతులు చాచి వెన్నముద్దల్లా కురుస్తూన్న మంచు అరచేతుల్లో పేరుకుంటూ ఉంటే తన్మయత్వంతో ఆ మంచుకేసి చూస్తూ ఉండిపోయాడు కాసేపు.

'కామ్రేడ్ ఛైర్మన్, రొంప జేసుద్దో ఏమో..చాలింకా వరండాలోకి పదండి' అన్నాడు పక్కనే నిలడి ఉన్నగార్డు.

మావో అతని మాట వింటేగా. చేతుల్లో కురిసిన మంచు కరిగి తొణికిసలాడుతూ బిందువుల్లా జారి పడతా ఉంటే వాటికేసే చూస్తూ ఉన్నట్టుండి రెండు బిందువులు తన నోట్లో రాలిపడేలా చెయ్యి పైకెత్తి పట్టుకున్నాడు. నాలుక మీద రాలిన మంచు బిందువులు ఆస్వాదించిగానీ మావో వెనక్కి రాలేదు.

కాసేపు వరండాలోనే నిలబడి కురుస్తున్న మంచుకేసి రెప్పార్పకుండా చూస్తూ ఉండిపోయాడు. తరువాత వెనక తలుపుకుండా పెరట్లోకి వెళ్ళాడు. పేరుకున్న మంచు మీద తన పాద ముద్రలు వేస్తూ, పైన్ చెట్ల మీద పేరుకున్న మంచును చూస్తూ తనదైన లోకంలో చాలా సేపు గడిపాడు. మంచుకురిసే వేళల్ని ఆస్వాదించడంలో మావోది గొప్ప స్వార్థబుద్ధి అని నేను పళ్ళు నూరుకుంటూ అలా నిలబడిపోయా.

మావో బుర్ర పాదరసమే. తను ఏక్షణాన ఏమి ఆలోచిస్తుందీ కనిపెట్టడం కష్టమే. గోడల మీద, ఇంటిపై కప్పు మీద పేరుకున్న మంచును పరికిస్తూ మావో ఉన్నట్టుండి 'ఇంకియావో..నువ్వు ఎప్పుడన్నా సర్కారు సొమ్ము నొక్కేసావా' అనడిగాడు నన్ను ఉరిమి ఉరిమి మంగళం మీద పడినట్లు ఈ టైంలో ఇదేం ప్రశ్న, నా ప్రారబ్ధం కాకపోతే అనుకుని 'లేదు ఛైర్మన్' అన్నా పైకి గట్టిగా.

'ఇక ముందు ఎప్పుడన్నా నొక్కాలనే ఆలోచన ఉందా' అనడిగాను. 'నా బొందిలో ప్రాణం ఉండగా అలాంటి పని చెయ్యను' అన్నా నేను. 'మంచిది. ఆ మాట మీదే ఉండు ఇంకియావో. నువ్వు నా దగ్గర చేరినపుడు ఈ మంచు అంత స్వచ్ఛంగా ఉన్నావు. ఇక ముందూ అలానే ఉండు. అవినీతి మకిలి అంటించుకోమాకు. పరుగెత్తి పాలు తాగాలనుకుని ఎండమావుల వెంబడి పరుగులు తీయకు. కాస్తంత పిసినారి తనంగా ఉండడం నేర్చుకో. ఎలాగంటే బట్టలు ఉతుక్కోవాల్సి వస్తే సబ్బు కాలర్‌కి, కఫ్స్‌కి (చేతుల అంచులు) పట్టించు చాలు. మిగతా బట్టను నుసిమితే చాలు మురికిపోద్ది ఇలా కాస్త పిసినారితనంగా ఉంటే డబ్బుల కోసం వెంపర్లాడాల్సిన అవసరం రాదు' అన్నాడు మావో.

'అలాగే కామ్రేడ్ ఛైర్మన్' అన్నా నేను ఆ మాటల్ని పూర్తిగా తలకి ఎక్కించుకుంటూ ఇది నీకే కాదు నాకూ వర్తిస్తుంది. నా ఫ్యామిలీ ఖర్చులకని డబ్బు విరజిమ్మమాకు. తిండి ఖర్చు బడ్జెట్‌లోనే ఉండాలి. నన్ను అడగకుండా నా కోసం కొత్త బట్టలవీ కొనబాకు' అన్నాడు మావో.

'అలాగే కామ్రేడ్' అన్నా నేను.

అప్పటికి ఇంకా యుద్ధ కాలంనాటి 'రేషన్' పద్ధతి కొనసాగుతుంది. మావోకు జీతంగా కొంత సొమ్ము, కొంత సరుకుల రూపంలో వచ్చేవి. నెలకు రెండు వందల యువాన్లు ముట్టేవి మావోకు. జియాండ్ కింగ్‌కు వంద యువాన్లు. నాకు ఓ యాభై యువాన్లు వచ్చేవి. డబ్బు వ్యవహారం అంతా నేనే చూసేవాణ్ణి. మావో చెప్పిన ప్రకారం ఆ తర్వాత నేను నెలసరి బడ్జెట్ తయారు చేసా. అన్నీ సర్దుబాటు చేస్తే భోజనానికి రోజుకి మూడు యువాన్లు ఖర్చు పెట్టొచ్చని లెక్క తేలింది. నా లెక్కలవీ చూసి భోజనం ఖర్చు ఎక్కువే అబ్బాయ్' అన్నాడు మావో. 'అది మిమ్మల్ని చూడవచ్చే వాళ్ళ కోసం చేసి ఇచ్చే టీ ఖర్చులు సహా లెక్క కామ్రేడ్' అని నే చెప్పాక గానీ నా బడ్జెట్‌ను ఓకే చెయ్యలేదు మావో. ఆ బడ్జెట్ ఏనాడూ దాటలేదు.

'నీకు మంచంటే ఇష్టమేనా' అనడిగాడు మావో ఇంకా మంచులో అటూ ఇటూ తిరుగాడుతూ.

'ఇష్టమే' అన్నా నేను.

'రైతనే ప్రతివాడూ మంచుని ఇష్టపడతాడు అనుకుంటా. పంట నాశించే పురుగుల్ని దెబ్బ తీసి పంటను కాపాడుతుంది కదా. అందుకేనేమో నాకు ఈ మంచంటే అంత ఇష్టం అయితే నీకూ ఇష్టమే అన్నమాట. బావుంది మన ఇష్టాలు భలే కలిసాయె' అన్నాడు మావో.

ఆ రోజు నుండి నడవాలో, పెరట్లో కురిసిన మంచును ఊడ్వకుండా అలానే అట్టేపెట్టేసే వాళ్ళం. నడిచేటపుడు పాదాలకింద మంచు మెత్తగా నలిగి విరుగుతున్న చప్పుడుని మావో తెగ ఇష్టపడేవాడు. మంచును అలా ఊడవకుండా ఉంచేసిన మూలాన ఒక్కసారి మావోను

కలవడానికి వచ్చినవాళ్ళు అడుగులు తడబడి జారిపడిన సందర్భాలూ చాలా ఉన్నాయ్. మావోకు మంచు అంటే ఎంత ఇష్టమో కామ్రేడ్ చెన్‌యికు తెలుసు కాబట్టి ఎప్పుడు వచ్చినా మంచు తొక్కకుండా చుట్టూ తిరిగి వచ్చేవారు. మిగిలిన వాళ్ళు మాత్రం 'ఈ గార్డులకు ఒళ్ళంతా బద్ధకం పట్టేసింది. ఈ మంచు ఇలా పేరుకుపోతుంటే ఊడవకుండా ఎవడన్నా ఇలా వదిలేస్తాడా' అని అరుస్తూ ఉండేవాళ్ళు.

ఎంత పనిలో ఉన్నా మంచుకురుస్తుంటే చాలు మావో ఆ పని కాసేపు పక్కనబెట్టి కురిసే మంచుకేసి చూస్తూ ఆనందించేవాడు.

1953 శీతాకాలంలో ఒక రోజున జాంగ్‌నాన్హిలోని హుయేరియన్ హాల్‌లో ఏదో మీటింగ్‌కు వెళ్ళి బయలుదేరా. ఆఫీసు దగ్గరికి వచ్చేసాం. ఈ లోగా పై నుంచి హఠాత్తుగా మంచు కురవడం మొదలయింది. నడుస్తూ నడుస్తూ ఉన్న మావో ఆగిపోయాడు. తలపైకెత్తి చూసాడు. మావో మొహంలో కొట్టొచ్చినట్లు ఆనందం కనబడుతుంది. 'ఇంకియావో కాసేపు అలా నడిచొద్దామా–ఎంతా ఓ పది నిమిషాలు చాలు' అనడిగాడు నన్ను, 'అలాగే' అన్నా నేను. 'వాచీలో టైం పెట్టుకో, పది నిమిషాలు సరేనా' అన్నాడు మావో. 'జీ' అన్నా నేను.

మావో అలా మంచులో తడుస్తూ పెరట్లో హుషారుగా నడుస్తూ ఉన్నాడు. కురుస్తున్న మంచు ధృతితో పాటే మావో నడక వేగం పెరిగింది. భుజాలు కదిలిస్తూ, చేతులు ఆడిస్తూ నడుం పై భాగం అటూ ఇటూ కదుపుతూ డాన్సు చేస్తున్నట్లు నడుస్తూ ఉన్నాడు హుషారుగా. మధ్యలో నాకేసి చూసి 'ఎంతసేపయిందీ' అనడిగాడు.

ఆయన హుషారు చూసి అప్పుడే ఆయన సరదాకు గండికొట్టడం దేనికి అనిపించివాచీ చూసి 'ఎనిమిది నిమిషాలు' అని చెప్పా. కాని నిజానికి అప్పటికే నేనూ ఆ వెనకే లోపలికి అడుగుపెట్టా.

'నీ గడియారం పాడయిపోయినట్లుంది. టైం సరిగ్గా చూసావా! అనడిగాడు మావో. నేను ఇంకో పది నిమిషాలు ఎక్కువసేపు గడపనిచ్చానని తను పసికట్టాడేమో అనే కంగారుతో నేను 'నీ వాచీ స్లోగా నడుస్తున్నట్లుంది ఇవాళ' అన్నా.

'కాదు స్పీడుగా నడుస్తుంది. ఇంతలోనే పది నిమిషాలయిపోయిందా' అనడిగాడు మావో.

'చచ్చింది గొర్రె, అసలు నేను ఇంకో పదినిమిషాలు ఎక్స్‌ట్రాగా ఇచ్చా తెల్సా కామ్రేడ్' అన్నానేను అసలు విషయం బయటపెడుతూ. మావో నిండుగా నవ్వేసాడు.

మావో ఇష్టాల సంగతి సరే, మావోకు పడనివి ఏంటో? మావో దేన్ని ఎక్కువగా ద్వేషించాడో అనే కదా మీ సందేహం. ఒక్కొక్కళ్ళూ మీకు ఒక్కో రకమైన జవాబు ఇస్తారు. చాంగ్–కై–షేక్ అని ఒకళ్ళు చెబితే, బూటు నాకుడుగాళ్ళు, భజంత్రీగాళ్ళు అని ఇంకొళ్ళు చెబుతారు. 'మనం వెయ్యి మాటల్లో చెప్పేదాన్ని మావో ఒక్క మాటలో చెబుతాడు' వంటి

మెరమెచ్చు మాటలు చెప్పే వీర విధేయులన్నా 'ఛైర్మన్ మావో అధికారాన్ని సుస్థిరపరచండి' అని నినాదాలు ఇచ్చే భజంత్రీగాళ్ళన్నా మావోకు మా చెడ్డ మంట. ఇలాంటివే నూటొక్క జవాబులు మీరు వినొచ్చు. నాకు తెల్సినంతలో అన్నింటికన్నా ఎక్కువగా మావో ద్వేషించేది 'డబ్బు'ని.

జపాన్ దురాక్రమణదారులను ఎదిరించే క్రమంలో మావో చాంగ్‌కైషేక్‌తో చెయ్యి కలిపాడు. కానీ అతను ఇవ్వచూపిన డబ్బును తిరస్కరించాడు.

యేనాన్‌లో ఉన్నప్పుడుకానీ, ఉత్తర షాంగ్సీలో యుద్ధం నడిపినప్పుడుగానీ అక్కణ్ణించి బీజింగ్ వచ్చిన తర్వాత కానీ మావో డబ్బు ముట్టడం నేను ఎన్నడూ చూళ్ళేదు. రా్రానూ డబ్బు పట్ల వైముఖ్యం పెంచుకున్నాడు మావో. అట్లా అని ఎదుటివాళ్ళ డబ్బు అవసరాల్ని తాను ఎన్నడూ నిర్లక్ష్యం చెయ్యలేదు.

1950లో అనుకుంటా ఝూంగ్ ఝుయికీ డబ్బుకు కటకటగా ఉందని మావోకు ఉత్తరం రాశాడు. ఝూంగ్ ఉత్తర షాంగ్సీ నివాసి. అక్కడ జరిగిన యుద్ధంలో ప్లాటూన్ గార్డుగా పనిచేసాడు. ఉత్తర షాంగ్సీని విముక్తి చేసి మావో తన జైత్రయాత్రను బీజింగ్ దిశగా నడిపించాక వయోభారం రీత్యా సైన్యంలో కొనసాగలేనని చెప్పి ఝూంగ్ వ్యవసాయంలోకి దిగాడు. తనతోపని చేసిన వాళ్ళ అవసరాలను ఎప్పుడూ ఓ కంట కనిపెట్టి ఉండే తత్వం మావోది. ఆ ఉత్తరం అందగానే అవసరానికి సరిపడినంత సొమ్ము ఝూంగ్‌కు అందే ఏర్పాటు చేశాడు.

ఎవరికన్నా కటకటగా ఉండి అడిగితే లేదనకుండా మావో తనకు ఉన్నంతలో సాయం అందించేవాడు. నెలసరి బడ్జెట్‌లో ఇలాంటి అవసరాల కోసం నేనూ కొంత సొమ్ము పక్కన పెట్టడం అలవాటుగా చేసుకున్నా. ఒకవేళ అలా కేటాయించిన సొమ్ము అయిపోతే నా జేబులోంచి తీసిచ్చేవాణ్ణి. లేదంటే మావో రచనల మీద వచ్చే రాయల్టీలోంచి తీసి ఇచ్చేవాడు ఆ లెక్కలు చూసే సెక్రటరీ.

ఝూంగ్‌కు అవసరం పడిన కొన్ని వందల యువాన్లను నేను ఒక చిన్న చెక్క పెట్టెలో భద్రంగా మడిచి పెట్టి 'మీరు పంపించమన్న సొమ్ము లెక్క చూడండి ఛైర్మన్' అని మావో ఎదురు బల్లమీద పెట్టాను. అంతే క్షణాల్లో మావో మొహంలో రంగులు మారిపోయాయి. 'తీసెయ్ ఇదిక్కడి నుంచి. నేనే నాడూ నా చేత్తో డబ్బు ముట్టలా గుర్తుంచుకో' అన్నాడు నాతో విసుగ్గా.

తర్వాత ఉత్తర షాంగ్సీ నుండి లీ ఎర్టింగ్ ఇలానే డబ్బు అవసరంపడిందని సాయం కోసం మావోకు ఉత్తరం రాసినపుడు గానీ, ఆ తర్వాత ఇంకెవరి దగ్గర నుంచి అలా సాయం కోరుతూ ఉత్తరం వచ్చినా గానీ ఎంత డబ్బు పంపాలో మావో చెప్పేవాడు నాకు నేనుగా ఆ డబ్బు సదరు కామ్రేడ్స్‌కి నేరుగా పంపేవాణ్ణి. మావోకు డబ్బు ముట్టే అవసరం

పడనీలా నేను అప్పజించి.

చైనాలో నెలసరి వేతన పద్ధతి ప్రవేశపెట్టాక మావో దగ్గర పనిచేసే టాయన్‌యున్‌యు అనే గార్డుకి మాత్రం ఎందుకో ముప్పై ఏడున్నర యువాన్లు జీతంగా నిర్ణయించారు. ఆ జీతంతో అతనికి గడపడం కష్టమే. పరిస్థితి గమనించి 1956లో అతనికి ఆ తరువాతి రెండు గ్రేడ్ల జీతం వచ్చేలా ఏర్పాటు చేసారు. కానీ ఆ ముచ్చట ముందుకు సాగలేదు. ఇతర పార్టీ నాయకుల దగ్గర పని చేసే గార్డులకి ఏ గ్రేడ్ జీతం అందుతుందో సరిపోల్చి టియాన్‌కు రెండు గ్రేడ్ల జీతం అనవసరంగా పెంచారనీ, మావో దగ్గర పని చేస్తున్నందుకే అలా చేసి ఉంటారేమో, నిజానికి ఒక గ్రేడు జీతంపెంచితే సరిపోతుందని సమీక్షించి ఆ మేరకు జీతం సవరించారు. టియాన్ గగ్గోలు పెట్టాడు తన జీతం తెగ్గోయద్దని. కళ్ళ నీళ్ళు పెట్టుకున్నాడు ఒక సందర్భంలో కానీ ఫలితం లేకపోయింది.

1957లో చేపట్టిన మితవాద వ్యతిరేక ఆందోళనప్పుడు మా సర్కిల్లో టియాన్‌యన్‌యును తెగ ఆటపట్టించేవాళ్ళు. మావో దగ్గర పని చేసే వాళ్ళలో వదింతలు మెరుగైన వాణ్ణనే ఉద్దేశంతో టియాన్ రెండు గ్రేడ్ల జీతం పెంచమని అడిగాను అని ఓ పోస్టరు తయారు చేసారు. జీతం విషయంలో టియాన్ కన్నీళ్ళు పెట్టుకున్నాడని విన్న మావో 'ప్రేమ విఫలం అయినవాళ్ళే కన్నీళ్ళు పెట్టుకుంటారని విన్నా, జీతం పెరగకపోతే కూడా కన్నీళ్ళు పెడతారా..జీతం మీద అంత ప్రేమేమో మరి' అన్నాడు హాస్యంగా.

మరుసటి రోజు టియాన్ డ్యూటీ ఎక్కినప్పుడు మావో తనను అదోలా చూసాడని, మేం తయారుచేసిన పోస్టరు చూసి మావో తనను ఎగతాళిగా చూసాడని తెగ ఫీలయిపోయాడు.

'టియాన్ నీతో మాట్లాడేది ఉంది రా' అని పిలాచాడు మావో.

'ఇప్పుడు నీకు ఎంత ముడుతుంది' అనడిగాడు మావో.

'నలభై మూడు యువాన్లు' అని చెప్పాడు టియాన్.

అరవై యువాన్లు ఈయితే సరిపోతయ్యా! అనడిగాడు మావో.

'మాహద్భాగ్యం' అని ఒప్పేసుకుందాం అనుకున్నాడు టియాన్ ముందు. కానీ తర్వాత వేరే ఆలోచన వచ్చింగత. వొస్తుంది గదా అని మావో దగ్గర అరవై యువాన్లు పుచ్చుకోవడం వరకూ బాగానే ఉంటుంది. ఆయన బతికి ఉన్నన్నాళ్ళు బాగానే సాగుద్ది ఆ తరువాత తన పరిస్థితి ఏంటి? సర్కారు జీతాల లెక్కల్లో లేకపోతే తనను ఎవరు ఆదుకుంటారు అవి ఆలోచించాడట. అందుకో ఏదో వంకతో 'ఆఫర్'ను పక్కన పెట్టాలనుకుని 'అట్లా అయితే నన్ను మీరు ఉద్యోగానికి పెట్టుకున్నట్లు అవుతుంది కదా ఛైర్మన్' అన్నాడు.

'అవును కదూ' అంటూ మావో అలా ఆలోచిస్తూ ఉండిపోయాడు కాసేపు.

'నిజమే కదూ. ఈ డబ్బుంది చూసావ్ మా చెడ్డది దాన్ని ఎవరు మాత్రం ఏం చెయ్యగలరు? నేనే కాదూ లెనిన్ కూడా ఏం చేయలేదు. నిజంగానే దాన్ని 'మేనేజ్' చెయ్యడం ఎవరి తరం కాదు. నేను బీజింగ్‌లో పనిచేసే రోజుల్లో నాకు నెలకు ఎనిమిది యువాన్లు ముట్టేవి. నెలకి ఒక్క మాటూ కైమా వడలు తింటే అక్కడికి అదే పెద్ద పండగ్గా ఉండేది. నెలలో ఆ ఒక్క రోజుకోసం ఎంతగానో తపించిపోయేవాణ్ణి. ఇవాళ మీ పరిస్థితి అదికాదుగా. నేనోసారి షాంగై వెళ్ళాల్సి వస్తే నా దోస్తు దగ్గర నుండి చేబదులు తీసుకున్నా టికెట్టు కొనుక్కోడానికి. రైల్లో నిద్ర పోతుండగా నా బూట్లు ఎవరో కొట్టేసారు. జేబులో టిక్కెట్టూ కొట్టేసారు. ఫుకువో స్టేషన్లో దిగిపోవాల్సి వచ్చింది. అక్కడ ఇంకో స్నేహితుణ్ణి పట్టుకుని కాళ్ళకి నాసిరకం బూట్లు, షాంగై వరకూ మళ్ళీ టిక్కెట్టు కొనిపించుకు వెళ్ళా. చేతిలో చిల్లిగవ్వ లేక నానా ఇబ్బందులూ పడ్డా. డబ్బు తెచ్చిన కష్టాలవి' అన్నాడు పాత జ్ఞాపకాలు గుర్తుకు తెచ్చుకుంటూ.

అక్కడితో టియాన్ జీతం పెంచే సంగతికి ఫుల్‌స్టాప్ పడింది. ఆ తరువాత అవసరంపడి ఇంటికి డబ్బు పంపించాల్సి వస్తే ఆ డబ్బు మావోనే సర్దాడు. అప్పుడూ తన చేత్తో ఆ డబ్బు ముట్టలా.

1964 వేసవి కాలంలో నేను మావోను వచ్చి కలిసా. అప్పటికే నేను టియాన్‌జిన్‌లో వేరే బాధ్యతలు చూస్తున్నా. ప్రకృతి వైపరీత్యాల మూలంగా నా కుటుంబం కష్టాల్లో ఉందని తెలుసుకున్న మావో నన్ను చూడగానే సెక్రటరీని పిలిచి తన రాయల్టీగా వచ్చే సొమ్ములో మంచి వెయ్యి యువాన్లు తెచ్చి నాకివ్వమని చెప్పాడు. ఆ సెక్రటరీ చిన్న చెక్కపెట్టెలో డబ్బు తెచ్చాడు. 'తీస్కో' అన్నారు మావో.

నే చాలా మొహమాటానికి పోయా. ఇంతకు ముందు ఆయన దగ్గర పని చేసేటపుడు చాలా మార్లు ఇలాంటి సహాయాలు పొందా. ఆయన దగ్గర నుండి వెళ్ళిపోయాక కూడా మళ్ళీ సాయం పొందాలంటే చిన్నతనంగా అనిపించింది నాకు.

'ఒద్దు ఛైర్మన్..ఫర్లా నేను ఏదోలా సర్దుబాటు చేసుకుంటా' అన్నా.

'ఏంటి నీ ఉద్దేశం? నా చేత్తో నేనిస్తేగానీ తీసుకోవా? అనడిగాడు మావో. ఆ సొమ్ము నాకు ఇచ్చి తీరాల్సిందే అన్న పట్టుదల కొద్దీ డబ్బు ముట్ట కూడదనే తన నిర్ణయాన్ని పక్కనపెట్టి ఆ పెట్టె నాకు ఇచ్చేందుకు ముందుకు వచ్చేడు.

దాంతో నే కంగారుగా 'వొద్దు కామ్రేడ్. నే తీస్కుంటా' అంటూ ఒక్క గెంతులో ముందుకు దూకి ఆ పెట్టే అందుకున్నా.

'భేష్ ఇంకియావో. నే డబ్బు ముట్టననే విషయం బాగానే గుర్తుంచుకున్నావ్' అంటూ మావో నా భుజం తట్టాడు.

'ఎందుకో ఈ డబ్బంటే నాకు పరమ అసహ్యం' అన్నాడు.

# 8. మావో వర్ధిల్లాలి - వర్ధిల్లాలి

ఈ నినాదం విన్నప్పుడల్లా ఒక్కోసారి మావో సంతోషపడినా, అంతకు అన్ని మాట్లు చిరాకుపడేవారు కూడా.

అయన దగ్గర పనిచేసేవాళ్ళం, రోజులో ఎక్కువసేపు ఆయన దగ్గరే గడిపేవాళ్ళమే అయినా ఎందుకో ఎప్పుడన్నా మేమంతా కలిసి ఉన్నప్పుడు హఠాత్తుగా మావో తారసపడితే బిగుసుకుపోయేవాళ్ళం. అది చూసినప్పుడల్లా 'నేను మీకు లీడర్నే కానీ, నన్ను చూసినప్పుడల్లా మీరలా బి(ర)బిగుసుకుపోనక్కర్లా' అనేవారు మావో.

మావో వర్ధిల్లాలి అన్న నినాదం నే మొదటి సారిగా విన్నది 1947 వేసవి కాలంలో. అదేదో ర్యాలీలో ఇచ్చిన నినాదం కాదు. హఠాత్తుగా మావో జనాల మధ్య కనబడేసరికి హర్షాతిరేకంతో వాళ్ళంతా అలా అరిచారు.

అప్పుడు కేంద్ర కమిటీ బలగాలు ఉత్తర షాంగ్సీలో పయనిస్తున్నాయి. ఏడు బ్రిగేడ్ల సైన్యంతో లియూకాన్ ఈ బలగాలను వెంబడిస్తున్నాడు. మిజీహి ఇంకా ఇరవై 'లీ'ల దూరంలో ఉందనగా కేంద్ర కమిటీ బలగాలు ప్రధాన మార్గాన్ని విడిచిపెట్టి తూర్పు వైపున ఉన్న ఇరుకు సందుబాట పట్టాయి. జింగెర్‌పింగ్, చెన్‌జియాగువోలు దాటుకుని ఒక కొండ ఎక్కి గిది మిజీహి, జియాడిన్ కౌంటీల మధ్య ఉన్న మైదాన ప్రాంతానికి చేరుకున్నాం. ప్రధాన మార్గం అంతా నిర్మానుష్యంగా ఉంది. మేం తిరిగిన ఇరుకు సందులో మాత్రం జనం తొక్కిడి తొక్కిడిగా ఎవరి పనులు మీద వాళ్ళు హడావుడిగా తిరుగుతున్నారు. రైతులు పొలాల్లో పని చేసుకుంటున్నారు. బారాటి బాదులకు సామాను వేలాడదీసుకుని ఆ కొస, ఈ కొసా భుజాల మీద మోపుకుని పరుగులెత్తేవారు పరుగులు తీస్తున్నారు. దానికితోడు ఆ రోజు సంత కూడా ఉన్నట్లుంది. జనమే జనం. అమ్మేవాళ్ళూ కొనేవాళ్ళతో అంతా మా జోరుగా ఉందక్కడ. అంతే లియూకాన్ సైన్యం ఇంకా ఆదాపుకి రాలేదని మాకు అర్థం అయింది.

కానీ మావో ప్రమాదం ఏదో ముంచుకొస్తుందని పసిగట్టాడు. లియుకాన్ సైన్యం ముప్పై లీల దూరంలో ఉంది. కాబట్టి ఏ క్షణానయినా ఇక్కడికి విరుచుకుపడొచ్చు అని ఊహించాడు. వెంటనే ఒక ప్లాటూన్ లీడర్‌ను పిలిచి 'మనవాళ్ళందరినీ పన్లోదించు. ఏ క్షణానయినా చాంగ్‌కైషేక్ సైన్యం ఇటొచ్చి పడొచ్చు. తిండి, నీళ్ళకు సంబంధించి వాళ్ళకి

ఏం దొరక్కుండా చూడు. ఇక్కడ ఉన్న జనాన్ని జాగ్రత్త పడమని ప్రతి ఒక్కరికీ కబురు అందేలా చూడు. జనాలు అందరికీ తెలియాలి. కానీండి' అన్నాడు. చీఫ్ స్టాఫ్ ఆఫీసర్‌ను పిలిచి 'మనం వేరే దారి చూసుకోవడం మంచిది. మన మూలంగా ఇక్కడి జనాలకు ఇబ్బంది కలగకుండా చూడాలి' అని ఆదేశించాడు.

మేం మార్కెట్ దగ్గర నుండి తప్పుకుందాం అని బయల్దేరే లోగా జనాలకు విషయం తెలిసి మమ్మల్ని దగ్గర నుండి చూడాలనే ఆత్రంతో వచ్చి పడివడిపోతున్నారు. అప్పటికి దేశంలో ప్రచార, ప్రసార సాధనాలు పెద్దగా లేకపోయినా మావో పేరు పల్లె పల్లెలో, ఇంటింటా మారు మోగిపోతా ఉంది ఆ పాటికే. పేరు వినడమే తప్ప మనిషి ఎలా ఉంటాడో ఎరిగిన జనాలు అతి కొద్ది మంది మాత్రమే. ఆఖరికి విముక్తి ప్రాంతాల్లో కూడా గీసిన బొమ్మల్లో మావోను చూడ్డమే తప్ప, ఫోటోలు చూసింది కూడా బహు అరుదు. దేషెంగ్ అనే మారు పేరుతో వ్యవహరించే వాళ్ళం మావోను మేమంతా. ఒక్కోసారి ఎలాంటి పరిస్థితి ఎదురయ్యేదంటే – ఆతిథ్యం ఇచ్చిన ఆసాములే ఎదురుగా మావోను కూచోపెట్టుకొని మావో గురించి తాము విన్నదీ కన్నదీ కథలు కథలుగా ఆయనకే చెప్పేవాళ్ళు. ఏ మనిషిని కళ్ళారా చూద్దామని తహతహలాడిపోతున్నారో అతను తమ ఎదురుగానే ఉన్నాడనే విషయం వాళ్ళకు తెలియకపోయేది.

కానీ ఈసారి పరిస్థితి అందుకు భిన్నంగా ఉంది. గుంపులోంచి ఎవరో 'అరె మన మావో అనుకుంటాన్రా' అనరిచాడు. గుర్రం మీద కూచున్న మావో తల తిప్పి అటుకేసి చూసాడు. దాంతో ఆయనే మావో అని అక్కడి జనం పసిగట్టేసారు. 'అవును ఛైర్మన్ మావోయే, మావో వర్ధిల్లాలి, వర్ధిల్లాలి' అని గొంతెత్తి నినదించారు.

ఒక్కసారిగా ఆ మార్కెట్ ప్రాంతం ఉద్వేగ భరితంగా మారిపోయింది. దూరాన ఉన్న జనాలు కూడా తమ చేతుల్లో ఉన్న పనులు ఎక్కడిక్కడ వదిలేసి ఉన్న పళాన ఉరుక్కుంటూ వచ్చి ఆ గుంపుతో చేరిపోతున్నారు. మావో వర్ధిల్లాలి, వర్ధిల్లాలి అంటూ అక్కడ ఉన్న వాళ్ళతో గొంతు కలుపుతున్నారు. లయగా, హోరెత్తి పోయింది అక్కడ ప్రజలిచ్చిన నినాదాలతో.

అన్ని వైపుల నుండి జనం మమ్మల్ని చుట్టేసారు. మావో చాలా ఉద్వేగానికి లోనయ్యాడు. ఆ క్షణాన మాలో ప్రతి ఒక్కరి శరీరం పులకరించిపోయింది. మావో అంటే ఒక వ్యక్తిగా గాక సామూహిక శక్తిగా, ప్రజా విముక్తి సైన్యానికి దాని ఆశయానికి ప్రతీకగా కొలిచారు ఆనాటి ప్రజానీకం. మావో నలువైపులా చూస్తూ పలకరింపుగా చెయ్యి ఊపాడు. అక్కడ ప్రజలు చూపిస్తున్న ఆదరాభిమానాలకు మావో కళ్ళు చెమ్మగిల్లాయి.

పిల్లలు కేరింతలు కొడుతున్నారు. యువకులు చేతులెత్తి నినదిస్తున్నారు. ఆడవాళ్ళు, ముసలివాళ్ళు ఒకరినొకరు తోసుకుంటూ మెడ ముందుకు సాచి మరీ ఆసక్తిగా మావోను చూస్తున్నారు. మావో గుర్రంతో నెమ్మదిగా ముందుకు అడుగులు వేయిస్తుంటే వలయాకారంలో ఉన్నజనాలు పక్కకి వొదిగి దారి ఇస్తూ సాంప్రదాయపూర్వకంగా వొంగి వొంగి సలామ్‌లు చేస్తున్నారు. కొంత మంది కుర్రాళ్ళు ముందుకు దూసుకువచ్చి మావో ఎక్కిన గుర్రాన్ని తాకుతూనో, మావో ఒంటి మీద ఉన్న కోటుని తాకుతూనో ఉద్వేగ భరితులు అయిపోతున్నారు.

'ఛైర్మన్ మావో అధికారాన్ని సుస్థిరం చెయ్యండి' అంటూ ఆనాడు ఎవరూ ప్రచారం చేసింది లేదు. పై పెచ్చు చాంగ్‌కైషేక్ ఆధీనంలో ఉన్న ప్రచార, ప్రసార మాధ్యమాలు మావోను 'బందిపోటుగా' 'ముఠా నాయకుడిగా' 'సైతాను'గా చెడవర్ణిస్తూ పెద్ద ఎత్తున ప్రచారం చేస్తూ వచ్చాయి. ఈ విష ప్రచారాన్ని మావో తన మాటలతో చేతలతో బలంగా తిప్పికొట్టాడు. ప్రజల మనస్సులో ఎలాంటి సందేహాలు ఉన్నాయి, వాళ్ళ చైతన్య స్థాయి ఏమిటి అనేవి గుర్తెరిగి మావో అతి సరళమైన ప్రజా భాషలో వాస్తవాలు ఏమిటో వాళ్ళకు తెలియచెప్పేందుకు పెద్ద ఎత్తున కృషిచేశాడు. సునిశితమైన ఆలోచనలతో, సైద్ధాంతిక అంశాల మీద గట్టి పట్టుతో, అసాధారణమైన నిర్మాణ దక్షతతో, ప్రతిభావంతమైన నాయకత్వ లక్షణాలతో చురకత్తుల్లాంటి, మెరికల్లాంటి యువతీయువకులను ఆకర్షించి, వారిని నికార్సయిన కమ్యూనిస్టు కార్యకర్తలుగా మలిచి, వారి అండతోనే విస్తృత ప్రజా బాహుళ్యాన్ని విప్లవానికి అనుకూలంగా కదిలించిన గొప్ప నాయకుడు, మన కాలపు నవయుగ వైతాళికుడు మావో. ప్రజారాశుల ప్రేమ, గౌరవాభిమానాలు చూరగొన్న జాతీయ నాయకుడు మావో.

ఆ రోజున అక్కడ పోగయిన అంతమంది జనాలూ ఒకపెట్టున మావో వర్ధిల్లాలి అని నినదిస్తుంటే అదంతా తన వ్యక్తిగత ప్రతిభ అని మావో ఏనాడూ భావించలేదు. కమ్యూనిస్టుపార్టీ, పార్టీ అనుసరించే విధానలు ప్రజా ప్రయోజనాలకు పట్టంకట్టే విధంగా ఉన్నాయి కాబట్టి జనాలు ఆ రకంగా తమ మద్దతును తెలియచేస్తున్నారని నాతో సహా మేమంతా గ్రహించాం. మావో వర్ధిల్లాలి అంటే కమ్యూనిస్టు పార్టీ వర్ధిల్లాలి, దాని ప్రజానుకూల విధానాలు వర్ధిల్లాలి అని అక్కడి ప్రజానీకం తమ అభిప్రాయాల్ని వ్యక్తం చేశారు.

మావో బీజింగ్‌లో అడుగుపెట్టిన రోజున కూడా ఇలానే జనాలు వర్ధిల్లాలి, వర్ధిల్లాలి అని జయజయధ్వానాలు చేసారు. ఆ రోజు మావో జీపులో ఒక కాలుంచి రెండో కాలు నేల మీద మోపుతూ తన పక్కనే ఉన్న లిన్‌పియావ్‌తో 'చూద్దాం, మన గురించ ఇక్కడి జనాలు ఏమనుకుంటున్నారో మనకిది పరీక్ష. మనం లీజిచెంగ్ (1644లో మింగ్ రాజుల అధికారాన్ని రైతాంగ తిరుగుబాట్లలో కూలదోసినవాడు) వంటి వాళ్ళమో, కాదో జనాలు

తేల్చేస్తారు. పద" అన్నాడు. మావో బయటకు అడుగుపెట్టగానే ప్రజలు మావో వర్ధిల్లాలి, వర్ధిల్లాలి' అంటూ మిన్నంటేలా నినాదాలు ఇచ్చారు.

అప్పట్లో మావో రకరకాల బాధ్యతలు చూస్తూ నిండా పనిలో మునిగిపోయి ఉండేవాడు. నాన్‌జింగ్ దగ్గర యాంగ్సీ నదిని దాటినలుదిశలకూ రెడార్మీని నడిపించడంలో, రాజకీయ తీర్మానం రూపొందించడానికి సదస్సు కోసం ఏర్పాట్లుచేస్తూ, ఆర్థిక వ్యవస్థను పునరుజ్జీవింపచేసే పథకాలు రచిస్తూ – మొత్తంగా తీవ్రమైన నిర్మాణాత్మక కృషిలో నిమగ్నమై ఉన్నాడు. ప్రముఖ సాంస్కృతిక వేత్తగా అప్పటికే బాగా పేరొందిన లియుయాజితో కలిసి మే 2వ తేదీన సమ్మర్ ప్యాలెస్ దర్శించాడు. అక్కడ తోటలో ఉన్న కున్మింగ్ సరసులో బోటు షికారు చేసారు.

ఆ రోజు 'సమ్మర్ ప్యాలస్'కు సందర్శకుల తాకిడి ఎక్కువగానే ఉంది. జనాలు మావోను చూసి 'మావో' అనుకోవడం అందరూ ఒక దగ్గర పోగయి అభినందన పూర్వకంగా చప్పట్లు కొట్టడం అనుకోకుండా అలా జరిగిపోయింది. వాళ్ళెవరూ 'మావో వర్ధిల్లాలి, వర్ధిల్లాలి' అని నినాదాలు ఇవ్వలేదు.

లియుతో కలిసి బోటు షికురుచేసి ఒడ్డుకు వస్తుండగా వచ్చేది మావో అని తెలుసుకున్ని జనాలు పోగడిపోయారు ఒడ్డున. అందుకని బోటును ఐమూలగాపోనిచ్చి జనాలులేని వైపున ఒడ్డుకు చేరదామని నే సూచించాను. 'ఏముంది ఇందులో? జనాల్ని తప్పించుకు ఎందుకు తిరగాలీ,పోనీండి' అన్నడు మావో. దాంతో బోటు యధాప్రకారం ఒడ్డుకు చేరింది.

జనాలు గుంపుగా దడికట్టేసి 'మావో వర్ధిల్లాలి, వర్ధిల్లాలి' అని నినాదాలు ఇస్తూ, షేక్ హ్యాండ్ ఇవ్వడానికి తోపుళ్ళాడుకుంటున్నారు. కానీ మావో తనకన్నా లియుయాజీకే ప్రజలు ప్రాధాన్యత ఇవ్వాలనే ఉద్దేశ్యంతో లియుకన్నా ఒక అడుగు వెనగ్గా నడిచాడు. కారు దగ్గరకి వెళ్ళాక కూడా ముందు లియుయాజీ ఎక్కే వరకు ఆగి ఆ తర్వాత ఆయన వెనగ్గా తన కారు ఎక్కాడు. 'మనిద్దరం కలిసి సమ్మర్ ప్యాలస్‌కు రావడం ఇదే మొదటిసారి. ఇంతమంది జనాల్ని పబ్లిక్‌ను కలవడం మీకు హ్యాపీయేగదా' అనడిగాడు మావో లియునూ.

అలాగే మే 12న ఛూటేతో కలిసి ఫ్రాగ్రాంట్ హిల్స్ పర్వత పాదాల దగ్గర ఉన్న 'స్క్వేర్' లో జరిగిన తొలి జాతీయ యువజన సదస్సుకు హాజరయ్యాడు మావో. అక్కడకి ఎనిమిది ట్రక్కులలో ప్రతినిధులు వచ్చారు. వాళ్ళంతా అక్కడికొస్తూ 'తూరుపు దిక్కున తెల్లవారెను, నవచైనా మావోకు జన్మనిచ్చెను అదిగదిగో సూర్యోదయం, అల్లదిగో అరుణోదయం' అనే పాట పాడడం నాకు బాగా గుర్తు.

అంతకు ముందు మహిళా సదస్సు జరిగింది. వాళ్ళయితే 'మావో వర్ధిల్లాలి, వర్ధిల్లాలి'

అంటూ విడవకుండా ఉద్వేగ భరితంగా నినాదాలు ఇచ్చారు. అయితే వాళ్ళు తనతోపాటు ఛూటేకూ సమాన గుర్తింపు ఇవ్వాలనే ఉద్దేశంతో మావో నింపాదిగా ఛూటెతన పక్కనే ఉండేలా చూసుకుంటూ నడిచారు. కాస్త వెనగ్గా నడుస్తున్నాడని ఛూటేతో సమంగా నడవడానికి మావో రెండుమూడుమార్లు ఆగిపోయి ఛూటే వచ్చాక ముందుకు కదిలాడు.

దాంతో అక్కడి ప్రతినిధులు 'మావో వర్ధిల్లాలి' అని నినాదాలతోపాటు 'కమాండర్-ఇన్-చీఫ్ ఛూటే వర్ధిల్లాలి' అని కూడా నినాదాలు చేసారు.

ఆ సదస్సులో ప్రసంగించిన వాళ్ళలో చాలా మంది దాదాపు ఒకే భావాన్ని వ్యక్తం చేశారు. 'చుట్టూ చీకట్లు ఆవరించిన దశలో కామ్రేడ్ ఛైర్మన్ మేం మీ ఆసరాతో ఈ వెలుగులకు ప్రయణిస్తున్నాం, మాలో చిగురించే ఆశ మీరు. మాకు సగం బలం మీరు' అన్నారు.

ఆ రోజు మీటింగు నుండి తిరిగివస్తూ మావో 'జనాలు నేను తమ బలం అనుకుంటున్నారు. కాని నిజానికి ఈ జనమే నా బలం. వాళ్ళు లేనిదే నేను లేను' అన్నాడు.

'మావో వర్ధిల్లాలి, వర్ధిల్లాలి' అని జనాలు నినదించడంలో నాకు ఆ రోజున వ్యక్తి పూజ కనిపించలేదు. అదొక స్వాభావిక స్పందనగా ముందుకు వచ్చేది.

దేశం కోసం మావో చాలా చేసాడు. దాన్ని ఎవ్వరూ కాదనలేరు. నూతన జనతా ప్రజాస్వామిక విప్లవం విజయవంతమయిన ప్రతి దశలో మావో అద్భుత కృషి మనకు కనబడుతుంది. మావో ఒక గొప్ప జాతీయ నాయకుడు. ప్రజలు ఎంతగా నీరాజనాలు పట్టినా ఏనాడూ తన ప్రాధాన్యతను అవసరానికి మించి అంచనా వేసుకోలేదు. అలా వ్యవహరించనూలేదు. తియాన్‌మెన్ స్క్వేర్‌లో లక్షలాది ప్రజానీకం ఉత్తుంగ తరంగంలా 'మావో వర్ధిల్లాలి' అని పదే పదే నినదించిన రోజున కూడా ఆయనలో కించిత్తు గర్వాన్ని కూడా నే చూడలేదు.

మాతృదేశాన్ని ఫ్యూడల్ శృంఖాలాల నుండి విముక్తి చేసిన కొద్దికాలానికే (1950లో) కొరియా గడ్డమీద అమెరికన్ దళాల దురాక్రమణను ఎదిరించడానికి ప్రజా వలంటీర్ సైన్యాన్ని పంపాలని మావో నిర్ణయించారు. అది పిచ్చిపని అని చాలామంది విమర్శించారు. నవచైనా అప్పుడే పురుడు పోసుకుంటుంది. ఇరవై ఏళ్ళుగా సాగిన యుద్ధ గాయాలు ఇంకా పూర్తిగా మానుపట్టలేదు - ఇలాంటి పరిస్థితుల్లో శక్తివంతమైన సామ్రాజ్యవాద అమెరికన్ దళాలూ, దానిక వెన్ను దన్నుగా ఐక్యరాజ్యసమితి పనువున మరో పన్నెండు దేశాల దళాలను కొరియాగడ్డ మీద ఎదుర్కోవాలని నిర్ణయించడం శ్రామికవర్గ అంతర్జాతీయత మాటేమోగానీ ఆత్మహత్యా సదృశ్యంగా మారడం ఖాయం అని విశ్లేషించారు. మింగ్ రాజరిక

పరిపాలనను రైతాంగ సాయుధ తిరుగుబాట్లతో కూలదోసిన లీజిచెంగ్ అనుసరించిన పోరబాటు వ్యూహం మూలంగా ఆ తరువాత ఎన్‌యుచెన్‌ల చేతుల్లో ఓటమి పాలయిన చరిత్రే మళ్ళీ పునరావృతం కాబోతుందని జోస్యం చెప్పారు.

దాదాపు మూడు రోజులపాటు నిద్రలేని రాత్రులు గడిపాడు మావో ఈ నిర్ణయం తీసుకోవడానికి. మూడో రోజు నేను నిద్రమాత్రలు డోసు పెంచి ఇచ్చినా అది పనిచెయ్యలేదు. లేచి కూచుని కప్పు మీద కప్పు టీ తాగుతూ, సిగరెట్లు తెగపీకుతూ చివరికి ఆ నిర్ణయం చేశాడు.

ఉన్న పరిస్థితుల్లో చెయ్యాలా అని పీకుళ్ళాడినా ఒక్కోసారి మావో నిర్ణయం తీసుకున్నాక పార్టీ, ప్రభుత్వమూ తన వెనక గట్టిగా నిలిచాయి. తమ మంచి చెడుల గురించి తమకన్నా మావోనే సరైన నిర్ణయం తీసుకోగలడని ఆనాడు ప్రజలు నమ్మారు. సమిష్టిగా నిర్ణయాలు చెయ్యాల్సిన పార్టీ వేదికలు కూడా ఒక్కపారి నిర్ణయ భారాన్ని మావో మీదకే నెట్టేసేవి. చాలా సందర్భాల్లో పార్టీ కమిటీల్లో మావో వాదన మైనారిటీలో ఉండేది. కానీ పనిలో దిగాక ఫలితాలు మాత్రం మావో సరైన నిర్ణయం చేసాడని రుజువు చేసాయి. కొరియా యుద్ధం కూడా మావో మీద ఉన్న గుడ్డి నమ్మకం ఆధారంగానే నిర్ణయం జరిగింది. సంధి ఒప్పందంతో యుద్ధం ముగిసింది. ఆ కాలంలో జాతీయ ఆర్థిక వ్యవస్థ అతి కొద్ది కాలంలోనే అద్భుతమైన ప్రగతి సాధించింది.

కానీ తర్వాతర్వాత మావో మీద ఉన్న గుడ్డి నమ్మకం గుడ్డి భక్తిగా మారి నవచైనా నిర్మాణంలో తీవ్రమైన తప్పిదాలు చోటు చేసుకోవడానిక ఆదరువుగా మారింది. అయితే ఇందులో మావో ఒక్కణ్ణే తప్పుబట్టడం నా ఉద్దేశం కాదు. చైనాలో కొన్ని వందల ఏళ్ళుగా పితృస్వామిక భావజాలం బలంగా వేళ్ళూనుకుంది. ఈ ఫ్యూడల్ సమాజ భావజాలాన్ని రాత్రిక రాత్రే రూపు మార్చే పరిస్థితీ, శక్తీ రెండూ లేవు. అందు మూలంగానాఏ నవ చైనాలో సోషలిస్టు నిర్మాణ క్రమంలో కూడా పాత వాసనలు అంటి వచ్చేవి. వ్యక్తిపూజ, ఏకస్వామ్య నిర్ణయాలు వంటి పెడధోరణులు చోటు చేసుకున్నాయి.

మావోకు అత్యంత సన్నిహితంగా పనిచేసిన వాణ్ణి కాబట్టి నేను పార్టీలో చాలా మంది పెద్దలు మావోను ఆకాశానికి ఎత్తుతూ మాట్లాడడం నాచెవులారా విన్నాను. 'అబ్బో మావోకా ఏం తెలివి ఏం తెలివి' ఎంత గొప్ప మేధావో' 'ఎవరికన్నా సలాం చెయ్యాలంటే అది మావోకే' 'మనలో ఎవరన్నా ఆయన కాలిగోటికి సరితూగుతామా' 'అద్భుతమైన వ్యక్తి', 'మొక్కాల్సిన మనిషి కదూ' – ఇలా నూటొక్క విశేషణాలు వాడడం నాకు తెలుసు. అదీ అలాంటి ఇలాంటి పార్టీ సభ్యులు కాదు, జనతా ప్రజాస్వామిక విప్లవంలోకీలక పాత్ర పోషించిన ఝూంగ్‌లాన్, లీజిషెన్, షెన్‌జున్‌రు, చెన్‌షటింగ్, హెజియాంగ్జిన్, మా జులున్

వంటి హేమాహేమీలు మావో గురించి అలా పొగిడేవారు. ఈ హేమాహేమీల్లాంటి వాళ్ళు వచ్చినపుడల్లా మావోయే స్వయంగా వాళ్ళను దగ్గరుండి కారు ఎక్కించడం, విమానం మెట్లు ఎక్కేవరకూ తీసుకెళ్ళడం చేసేవాడు మళ్ళీ. అయినా ఈ శృతి మించిన భజన మావో తలకెక్కి ఉంటుందనే నిజాన్ని నేను కాదనలేను.

అట్లా అని కళ్ళు నెత్తికి ఎక్కాయా అంటే కాదని స్పష్టంగా చెప్పగలను. తన కింద పనిచేసే వాళ్ళం కదా అని మమ్మల్ని ఏనాడూ చిన్న చూపు చూడలేదు. చాలా అభిమానంగా మసిలేవాడు మాతో.

కొరియా యుద్ధం ముగిసిన రెండేళ్ళ తరువాత అనుకుంటా కిమ్-ఇల్-సంగ్ మావోకు ఇరవై నాలుగుక్రేట్ల యాపిళ్ళు పంపాడు బహుమానంగా. మామూలుగా అయితే దేశ, విదేశీయులు ఎవరన్నా మావోకు బహుమతులు, జ్ఞాపికలు అందచేస్తే అవి ప్రజల పరం చేసేందుకు ఒక డిపార్టుమెంటే నడిచేది. అయితే కిమ్ పంపించింది విగ్రహాలో, ఫలకాలో కాదయ్యే ప్రదర్శనకు ఉంచడానికి, నిలవవుంటే దెబ్బతినేసే ఆపిల్ పళ్ళయ్యే. ఏం చెయ్యాలో అని ఆలోచిస్తూ ఉంటే 'మన కుర్రాళ్ళంతా తలా ఒక పండు లాగించండ్రా అబ్బాయిలూ' అన్నాడు మావో.

మాకు పండగ అయింది. సూర్యనామ సంవత్సరానికి ఒకటి రెండు రోజుల ముందుగా మాకు అవి దక్కడం పరమానందం అనిపించింది. అందరం క్రేట్ల చుట్టూ చేరి ప్యాకేజీలు విప్పి తలా రెండు పళ్ళు దక్కించుకున్నాం. తీరా చూస్తే నిండుగా, నిగనిగలాడుతున్న ఆ ఆపిల్ పళ్ళ మీద 'మావో వర్ధిల్లాలి' అన్న అక్షరాలు కనిపించాయి. ప్రతి పండు మీదా అవే అక్షరాలు. ఇంకెలా తినడం? ఎవరో చెప్పారు. పిందెలుగా ఉన్నప్పుడే నక్షాగా ఈ అక్షరాలు చిత్రించిన మూలాన అవి పండుగా మారేసరికి ఇలా కనబడుతున్నాయని, ఏం చెయ్యాలని తర్జన భర్జనలు పడి చివరికి 'ఉన్నవాళ్ళూ ఉండనిద్దాం. ఆ వాసన పీలుస్తూ తృప్తిపడదాం' అనే నిర్ణయానికి వచ్చాం.

ఆ విషయమే నేను మావోకు చెప్పాను. అప్పుడు తను మొహం అసంతృప్తిగా పెట్టి 'ఏం వెర్రిరా నాయానా మీకు? నాకు ఈ మొహర్బాణీలు నచ్చవ్. ఎల్లకాలం ఎవడన్నా బతికి ఉంటాడా. మనిషన్న వాడికి సాధ్యం కాదు. పోయి ఆ పళ్ళు లాగించెయ్యండి' అన్నాడు.

సాంస్కృతిక విప్లవం జోరుగా సాగుతున్న ఆ రోజుల్లో మావోను దైవ సమానుడిగా కీర్తించిన ఆ రోజుల్లో 'మావో వర్ధిల్లాలి' అని అక్షరాలు చెక్కి ఉన్న ఇరవై నాలుగు క్రేట్ల ఆపిల్లు మేం ఆరగించడం నిజంగా పెద్ద వైచిత్రే.

ఎవరన్నా కొండెక్కి కూచున్నాడనుకోండి అది వారి స్వయం కృతం. కానీ ఎవరన్నా భుజాల మీద మోసి మరీ కొండమీద కూర్చోపెట్టారనుకోండి అది ఎక్కించిన వాళ్ళ పాపం. మావో విషయంలోనూ ఇదే జరిగింది. అందరూ కలిసి ఆయన్ని కొండ ఎక్కించారు. దీనికి లిన్‌పియావోనో, 'గ్యాంగ్ ఆఫ్ ఫోర్'నో మావోనో తప్పు పట్టాల్సిన పనిలేదు. పితృస్వామిక భావజాల అవశేషాలు అందుకు కాళ్ళు తెచ్చాయి. 'మావో వర్ధిల్లాలి' అని నినాదం ఇచ్చిన వాళ్ళంతా కెరీరిస్టులో కుట్రదారులో అని మనం తీర్మానించలేం. వ్యక్తి పూజ ప్రమాదాన్ని గుర్తెరిగి వ్యవహరించేవాడు మావో. తియాన్‌మెన్ స్క్వేర్‌లో తన కాంస్య విగ్రహాన్ని నెలకొల్పాలనే నిర్ణయాన్ని మావో వ్యతిరేకించాడు. 'ఆ నిర్ణయం పెద్ద బూతు' అన్నాడు.

ఇలాంటివే ఇంకా అనేకం ఉదాహరణలు చెప్పగలను. నాది పొరబాటు కావచ్చేమో. కానీ ఈ విషయంలో నేను మావోను గట్టిగా సమర్థిస్తాను. వేల సంవత్సరాల మానవజాతా చరిత్రను తరిచిచూస్తే జయజయధ్వానాలూ, కీర్తిగానాల ప్రభావం పడనటువంటి మనిషి (అతను ఎంత గొప్ప తెలివైన వాడయినా సరే) లేనేలేడు. ఆదర్శాన్ని అభిమానించే దానికి నిదర్శనంగా మొదలయ్యే నినాదాలే క్రమంగా ఒక క్రతువుగా మారిపోతాయి.

అదిగో అప్పుడే మానవుణ్ణి దేవుడుగా కొలవడం మొదలవుతుంది. ఒకసారి ఎవరినైతే ప్రత్యక్ష దైవంగా కొలవడం మొదలవుతుందో సదరు వ్యక్తి క్రమంగా ప్రజా సమూహం నుండి పరాయీకరించబడతాడు, వేరు పడిపోతాడు. చివరికి విషాదంతో నిందారోపణలకు బలి అవుతాడు. ఇదొక కాల చక్రం. ఈ మాయాజాలంలో పడకుండా ఉండడం దుస్సాధ్యం కాదు గానీ కష్టసాధ్యమే.

1952లో మావో విహారార్థం గుయి,వుహాన్‌లకు వెళ్ళాడు. హుయాంజీ టవర్ చూడాలని మావో కోరిక. ఉత్తర షాంగ్సీలో విముక్తి యుద్ధం నడుస్తున్నప్పటిలా ఇపుడు మావోకు స్వేచ్ఛగా జనాలను కలిసే అవకాశం లేకపోయింది. చలికాలంలో తొడుక్కునే మంకీ క్యాప్‌తో కళ్ళు, ముక్కు నోరు మినహా మొహమంతా కప్పుకుని బయటకు రావాల్సి వచ్చేది. సెక్యూరిటీ కారణాలు మరి. అట్లా అయితే జనాలు గుర్తుపట్టకుండా ఉంటారని, అది సూర్యనామ సంవత్సరం రోజు మూలాని టవర్ దగ్గర గడపడానికి జనాలు బాగా వచ్చారు. ఉన్నట్టుండి ఓ పిల్లాడు మావోను గుర్తుపట్టేసి 'అదిగో ఛైర్మన్ మావో వచ్చాడు' అని అరిచేసాడు.

అంతే జనాలు బిలబిలమని మావో చుట్టూతా పోగడిపోయారు. లుయోరుయికింగ్, లిజినియన్, వాంగ్ రెన్‌జాంగ్, యాంగ్‌కి కింగ్‌లు మావో చుట్టూతా దడికట్టారు. ఆ చుట్టూతా మేం రక్షణ వలయంలా నిలబడ్డాం. విపరీతమైన తోపులాట మధ్యన మావోను అక్కడ నుంచి తరలించడానిక బ్రహ్మ ప్రళయం అయిపోయింది. చెమటికి తడసి ముద్దయిపోయాం.

వది ఒడ్డున తీసుకువచ్చి మావోను బోటు ఎక్కించేసరికి మా తలప్రాణాలు తోకకు వచ్చాయి.

మావో మంకీకాప్ తీసేసి జనాలకేసి చూస్తూ చెయ్యి ఊపాడు. చుట్టూ ఉన్న జనాలు అది చూసి 'మావో వర్ధిల్లాలి, వర్ధిల్లాలి' అని ఊపిరితిత్తులు తెగిపడతాయో అన్నంత ఉచ్ఛస్వరంతో నినదించారు.

ఆ సంఘటన మూలంగా లుయో తదితరులంతా పొలిట్ బ్యూరో ముందు చేతులు కట్టుకోవాల్సి వచ్చింది. సెక్యూరిటీ లోపాలకు జవాబుదారీ అవాల్సి వచ్చింది. 'హుయాంజీ టవర్ దగ్గర జనాల్లో ఇరుక్కుపోవడం అంటే ఏంటో ఈ విధంగా తెలిసి వచ్చింది నాకు' అన్నాడు మావో దాన్ని చిన్న విషయంలా తీసుకుంటూ.

వుహాన్ నుండి బోటులో నాన్ జింగ్ చేరుకున్నాం. షాంగై నుంచి చెన్‌యి, జాంగ్ ఐపింగ్‌లు మావోను ప్రత్యేకంగా కలవడానికి అక్కడకి వచ్చారు. నాన్‌జింగ్‌లో రెండు రోజులు ఉండాల్సి వచ్చింది. షెడ్యూల్ ప్రకారం మేం షాంగైలో ఉండాలి. మావో షాంగై చేరుకుని ఉంటాడనే ఉద్దేశంతో కొమింటాంగ్ వైమానిక దాడులకు తెగబడింది. అప్పట్నించి మావోకు విమానం ఎక్కడానికి కూడా వీలులేకుండా సెంట్రల్ కమిటీ నిర్ణయం తీసుకుంది.

ఇలా నానాటికీ ప్రజల నుండి వేరుపడిపోవడాన్ని మావో అరాయించుకోలేకపోయడు. కానీ సమిష్టి నిర్ణయానికి తలొగ్గి ఉండిపోయాడు. అయినా తరచూ జనాలను కలవడానికి సెక్యూరిటీతో తగాదా పెట్టుకునేవాడు కాదు, కూడదని అడ్డుచెబితే కోపం తెచ్చుకునేవారు. కోపంవస్తే మావోకు ఆరోగ్యపరంగా ఎదురయ్యే చిక్కులు ఎరిగి ఉన్న వాళ్ళు కాబట్టి అంతదాకా తెచ్చుకోకుండా రకరకాల షరతులతో బయటకు కదలనిచ్చేవాళ్ళు.

ఒక మాటు ఇలానే బెయిదైహీలో ఉండగా మావో మరీ పట్టుబట్టే సరికి రైతులతో మాట్లాడేందుకు బయల్దేరాం. మావోను ఆనవాలు పట్టకుండా ఉండడానికి తలకు మొహానికి కప్పేసేలా మంకీ కాప్ పెట్టి, ఇంతింత పెద్ద చలవ కళ్ళద్దాలు తొడిగారు. ఆ అవతారంలో రైతుల దగ్గరికి వెళ్ళి మావో అడిగిన ప్రశ్నలకు జవాబు ఇవ్వడానికి వాళ్ళు నోరు విప్పితేనా? మొహానికి తొడుగు తొడుక్కుని చుట్టూతా అంతమందిని వేసుకువచ్చిన వాళ్ళతో రైతులు మాత్రం ఏం మాట్లాడతారు. దాంతో తిక్కపుట్టి మావో కళ్ళద్దాలు, మంకీకాప్ తీసేసి ఇప్పుడు చెప్పండర్రా' అన్నాడు. మావోను చూడ్డంతోటే ఆ రైతులు 'మావో వర్ధిల్లాలి వర్ధిల్లాలి' అని హుషారుగా అరిచారు. వాళ్ళ హుషారు చూసి చుట్టుపక్కల కళ్ళాల్లో ఉన్న రైతులు కూడా పోలోమంటూ పరిగెత్తుకు వస్తున్నారు. మావో వర్ధిల్లాలి అని అరుస్తూ అన్ని వైపుల నుండి జనాలు పోగవుతుండడంతో బాడీ గార్డులు మావోను బలవంతంగా అక్కణ్ణించి తప్పించారు. అలా చేసినందుకు మావో చాలా చికాకుపడ్డాడు. ఇలా ఎన్నో సంఘటనలు.

మావో దగ్గర పనిచేసే గార్డులం మేమంతా ఎప్పుడన్నా ఒక చోట కూచుని మాట్లాడుకున్నామంతే అప్పుడల్లా ఎటూ పోవడానికి వీల్లేకుండా అయిపోయిన మావో జీవితం గురించి తలుచుకుని జాలిపడేవాళ్ళం. ఒక అంతరిక్ష యాత్రికుడి పరిస్థితే తీసుకోండి. ఈ భూమండలం అంతా చుట్టేస్తాడు. రోదసీలో లక్షల మైళ్ళు ప్రయాణం చేస్తాడు. కానీ అంతా ఒక భారరహిత అంతరిక్ష నౌకలో బందీగా ఉండి చేసే ప్రయాణమే. సరిగ్గా మావో పరిస్థితి కూడా అంతే. దేశమంతా తిరిగాడు- పటిష్టమైన రక్షణ వలయంలో స్వేచ్ఛగా వీధిలోకి పోవడానికి లేదు, ఒక పార్కుకి వెళ్ళడం లేదు, ఓ సినిమా హాలుకీ, వారాంతపు సంతకీ వెళ్ళే వీలులేదు. 'మావో వర్ధిల్లాలి వర్ధిల్లాలి' అంటూ ప్రజలు ఉత్సాహంగా నినాదాలు ఇస్తున్నప్పుడు వాళ్ళ సంతోషాన్ని పాలుపంచుకోవడానికి చెయ్యి ఇద్దామన్నా అడ్డంకులే, ఎవరికన్నా కలవాలన్నా - దానికీ ఓ టైం కేటాయింపు, సెక్యూరిటీ చెకప్.. ఇలా రకరకాల అవాంతరాలు. మా గార్డుల పర్మిషను లేనిదే చివరికి రైల్లో అటెండెంట్ కూడా మావో దగ్గరకు పోయేందుకు లేదు. ఈ రకమైన కట్టుదిట్టమైన రక్షణ కల్పించడానికి ముందు మావో జీవితమే వేరుగా ఏండేది. మాటమాత్రంతో సువిశాల చైనా దేశపు చరిత్రను, గతిని మార్చివేసిన మావో, కార్మికుల, కష్టజీవుల, రైతుల విముక్తి కోసం, దోపిడీ నుండి స్వేచ్ఛ కోసం అహరహం శ్రమించిన మావో వ్యక్తిగత స్వేచ్ఛకు ఆమడదూరంలో ఉండిపోవాల్సి రావడం చైనా దుఃఖదాయిని 'యెల్లో' నదికన్నా గొప్ప విషాదం.

1955లో ఇండోనేషియా అధ్యక్షుడు సుకర్ణో చైనా పర్యటనకు వచ్చాడు. పర్యటన ముగిసాక వీడ్కోలు పలకడానికి మావో విమానాశ్రయానికి వచ్చాడు. ఆ కార్యక్రమం అవగానే 'ఇండియావో ఇక్కడ దగ్గర్లో ఎక్కడో మంచి రెస్టారెంట్ ఉండాలి. బన్ను, మటన్‌సూప్ తింటే అక్కడే తినాలి. పోదాం పదా, తిని ఎన్నాళ్ళయిందో' అన్నాడు.

తీసుకెళ్ళాం. రెస్టారెంట్ అయితే తెరిచే ఉంది కానీ సర్వీసు ఇంకా మొదలు అవలేదు. ఒకటీ అరా తప్ప కస్టమర్లు కూడా లేరు. దాంతో అక్కడ సెక్యూరిటీ ఇబ్బందులు ఉండవులే అన్న ధీమాతో ఉన్నాం. మావోకు తినడానికి ఆర్డరు ఇచ్చాం. సూపు, బన్ను రొట్టెలు వొచ్చాయి. మాంసం ముక్కలు ముట్టకుండా సూపుతో బన్ను ముంచుకు తింటూ అద్దాల్లోంచి బయటకి చూస్తూ ఉంటే మావో ఏవో పాత జ్ఞాపకాలు గుర్తుకు తెచ్చుకుని నింపాదిగా టైం వెళ్ళదీస్తున్నాడని నేగ్రహించాను. కావల్సినంత సేపు అక్కడ గడపనిచ్చాం. ఆ రోజున అలాగే ఇంకో రోజున 'డింగ్' అనే పెద్దాయన పెంచుతున్న తోటను చూడాలని ఉందని అడిగాడు. తీసుకువెళ్ళాం. తోటంతా కలయ తిరుగుతూ కళ్ళారా ఆ అందాల్ని ఎంతసేపు ఆస్వాదించాడో. ఇలా ఒకటి అరా తప్పితే స్వేచ్ఛగా మావో ఎక్కకు వెళ్ళాలనుకుంటే అక్కడికి పోయేదానికి వీలయ్యేది కాదు.

కార్యక్రమం ఉంది. నాన్‌కీని సందర్శించడం అయిపోయింది. అక్కడ నుండి టియాన్‌జిన్ బయల్దేరాం. మధ్యాహ్న భోజనం అక్కడ ఏర్పాటుచేసారు. కానీ మావో ఛాంగ్ చున్ రోడ్డులో ఉన్న జెంగ్‌యాంగ్ చ్వాంగ్ రెస్టారెంట్‌కు వెళ్దామని పట్టుపట్టాడు. ముందుగానే మావో వస్తున్న సమాచారం పంపాం ఆ రెస్టారెంటుకు. మావో వచ్చే సమయానికి అక్కడ కస్టమర్లు ఎవరూ లేకుండా చూసుకోమని, మా బందో బస్తుకు సహకరించమని రెస్టారెంటు వాళ్ళకు కబురు పంపాం. మావో కిటికీ పక్కగాకూచుకున్నాడు. అలా బయటికి చూస్తూ ఉన్నాడు. రెండు నిమిషాలన్నా గడపకముందే ఒక ఆడ మనిషి బయట నుంచే మావోను గుర్తుపట్టేసినట్టుంది సంభ్రమాశ్చర్యాలతో 'అదిగో మావో' మావో వర్ధిల్లాలి అని కీచుగొంతుకతో అరిచేసింది.

అంతే క్షణాల్లో జనాలు రెస్టారెంటు ముందు పోగడిపోయారు. మావో వర్ధిల్లాలి అన్న నినాదం మోతెక్కించేస్తున్నారు. అందులో వెనకాతలగా ఉన్నజనానికి మావో కనిపించనన్నా కనిపించి ఉండదు. ఉత్తర షాంగ్సీలో జనాల స్పందనతో పోల్చి చూస్తే ఆ గుంపులో చాలా మంది యాంత్రికంగా అలా నినాదాలు ఇస్తున్నారనిపించింది నాకు.

వీధి అంతా జనం పోగడిపోయారు. ట్రాఫిక్ స్తంభించిపోయింది. చివరికి ట్రాఫిక్ పోలీసులు కూడా జనంతోచేరిపోయి మావోను చూడడానికి తాపత్రయ పడిపోయారు. మావో అక్కడ ఉన్న జనాలకు అభివాదం చేయడానికి బయటకి వచ్చాడు. యథావిధిగా మా గార్డులందరిమీ కలిసి అడ్డం పడిపోయాం ఆయనకి. దేవుడు వరమిచ్చినా పూజారి అడ్డుపడ్డాడు అనే సామెతగా తయారయింది. మనిషికి దేవుడికి మధ్యన అనుసంధానంగా నిలిచేదే ప్రార్థన. కానీ మనిషికీ మనిషికీ మధ్యన అనుసంధానంగా ఉండేది సంభాషణ. మావోకు ప్రజానీకానికి మధ్యన రాన్రానూ అటువంటి సంభాషణకే అవకాశాలు సన్నగిల్లిపోయాయి. ఉత్తర షాంగ్సీలో ఉన్నప్పుడు మావో రేకు ముక్కతో పేడకళ్ళు తియ్యడం, రైతులతో కలిసి గోధుమ పంట నూర్పిళ్ళలో పాల్గొనడం నా కళ్ళారా చూసా. అప్పట్లో జనాలలో ఒకడిగా ఉండిపోయాడు మావో.

దాదాపు ఆరుగంటలపాటు-ఉదయం పదకొండుంపావు నుండి సాయంత్రం ఐదింటివరకూ అలానే జనాల మధ్యన దిగడిపోయాం. దగ్గర్లో ఉన్న అశ్విక దళ కమాండ్ నుండి ఒక ప్లటూన్ సైనికలు, గుర్రపు బగ్గీ వచ్చాయి. మావోను ఆ బగ్గీలో ఎక్కించి జనాల మధ్య నుండి ఇవతలికి తీసుకురావడానికి ఒక పటాలం సైన్యం చెమటోడ్చాల్సివచ్చింది, జనాల తోపుళ్ళాటలో తెగపడిన చెప్పులు టోపీలూ అన్నీ ఎత్తితే ఏడు బుట్టలకు సరిపోయాయట ఆ రోజున అక్కడ.

ఆ తరువాత ఇంకో మాటు బెయిదైహీలో కూడా ఇలాంటి అనుభవమే ఎదురయింది.

'మావో వర్ధిల్లాలి' అనే నినాదాల మధ్యన మావో ఆ రోజున ఎవరితోనో మట్లాడుతూ 'అస్సలు మాట్లాడడానికి లేకుండా పోయిందే' అని చికాకు పడడం నాకు గుర్తు. కానీ ఆ తరువాత సదురుకున్నాడు. జనాలకేసి చూస్తూ 'మొత్తానికి హుయాంజీ టవర్ దగ్గర యవ్వారం మళ్ళీ మొదలయ్యేట్టుంది' అన్నాడు నవ్వుతూ. మావోకు అది నచ్చినట్లో, నచ్చనట్లో అర్థం కాలేదు మాకు.

అప్పట్నించీ ఎప్పుడు బయటకు వెళ్ళాల్సి వచ్చినా 'ఏంటి ఇవాళ హుయాంజీ టవర్ గ్గర సీను రిపీట్ అవుతుందా లేక టియాన్‌జిన్ రెస్టారెంట్ దగ్గర సీను రిపీట్ అవుతుందా' అని అడిగేవాడు నవ్వుతాలకి. జీవిత పర్యంతం మావో విజేతగా నిలిచాడు. సాధారణ మానవుడిగా ఉండి తను సాధించిన అసాధారణ విజయాలకు గాను ఇదిగో ఇలాంటి చిన్న చిన్న మూల్యాలు చెల్లించుకోవాల్సి వచ్చింది. విప్లవ విజయానంతరం మావో వ్యక్తిగత స్వేచ్ఛ నానాటికీ ఇరుకయిపోయింది. రాన్రానూ మావో ఆ జీవితానికి అలవాటుపడిపోయాడు.

1949లో ప్రముఖ సాహిత్యకారుడు లియుయాజీతో కలిసి కుమ్మింగ్ సరస్సులో బోటు షికారు చేసేటపుడు – "ఇపుడు చాంగ్-కై-షేక్ రాజ్యం కూలిపోయింది. మీరింకా తెరమరుగున ఉండాల్సిన పన్లేదు, మీ రచనా వ్యాసంగాన్ని స్వేచ్ఛగా కొనసాగించవచ్చు. మీ అభిప్రాయాలకు నవచైనా ప్రభుత్వం సముచిత గౌరవాన్ని ఇస్తుంది. మీకు అన్ని విధాలా రక్షణ కల్పిస్తుంది." అని చెప్పాడు.

పదేళ్ళ తరువాత లూషన్ పర్వతం దగ్గర జరిగిన పార్టీ సమావేశంలో పెంగ్ దెహుయీ మావో మీద విమర్శలు ఎక్కుపెట్టినపుడు 'సైన్యానికి నేను అక్కర్లేదని మార్షల్ పెంగ్ భావిస్తుంటే, నేను కొత్తగా సైన్యాన్ని తయారుచేసుకోగలనని నాకా సత్తా ఉందని తను గ్రహించడం మంచిది' అన్నాడు మావో. అంతటి గొప్ప విశ్వాసంతో ఉండేవారు తను. ఒక్కోసారి సమిష్టి నిర్ణయం కన్నా తన ఆలోచనల మీదే మొక్కవోని విశ్వాసం ప్రదర్శించేవాడు. ఆచరణలో తను సరైన దారిలోనే ఉన్నానని చాలాసార్లు రుజువు చేసుకున్నాడు కూడా. ఒక్కోసారి పార్టీ నిర్ణయాన్ని హైజాక్ చేసినంత పనిచేసేవాడు. సర్వకాల సర్వావస్థలయందూ ప్రజానీకం మీద గొప్పుగా ప్రభావం చూపేవాడు.

'మావో వర్ధిల్లాలి' అనే నినాదాన్ని ఎంతగా ఆస్వాదించాడో అంతగా అయిష్టపడ్డాడు తను. కడకంటా ఆ ద్వైదీభావం మావోలో నే గమనించాను. మావో చివరి రోజుల్లో నేను తన దగ్గర లేను. కానీ రాన్రాను 'మావో వర్ధిల్లాలి' అనే నినాదం పట్ల తన అభ్యంతరాలు సన్నగిల్లిపోయాయి. తెలిసీ చేసినా తెలియక చేసినా మొత్తానికి వ్యక్తిపూజ (పర్సనాలిటీ కల్ట్) ఊడలు వేసేసింది. మావోను 'దైవం'గా మలిచేసింది ఫలితంగా పదేళ్ళపాటు సాంస్కృతిక విప్లవం పేరిట జాతీయ విషాదం చోటు చేసుకుంది.

# 9. పల్లెటూరి బైతు 'మావో'

పల్లెటూరి బైతు అంటే సినిమాల్లో చూపించే వాజమ్మలను గుర్తుకు తెచ్చుకోమాకండి మావో పుట్టి పెరిగింది రైతు కుటుంబం నుంచి కావడం, ఆ తర్వాత విప్లవకారుడుగా మారడంతో తన దైనందిన జీవితపు అలవాట్లు, ఆహార వ్యవహారాల మీద ఆ ప్రభావం ఎక్కువగా ఉండేది. ఆ రీత్యా నేను మావోను పల్లెటూరి బైతు అని అంటున్నా. చైనా జాతి చరిత్ర, సాంస్కృతిక మూలాలు గ్రామీణ నేపథ్యంలోనూ, విప్లవ క్రమంలోనూ ఉన్నాయి.

మావో దుస్తులు ధరించే తీరు మీద వచ్చిన కథనాల గురించి నే మొదటగా ప్రస్తావిస్తా. ఒంటి మీద ఉన్న బట్ట, ఆ బట్ట కట్టిన తీరును బట్టి కదా ఆ మనిషి 'జంటిల్మెనో' 'కాదో' మనం అంచానా వేసేదీ?

నాకు తెలిసి మావో ఏనాడూ కొత్త బూట్లు తొడగలేదు. తన కోసం తెచ్చిన కొత్త బూట్లను ముందు గార్డుల్లో ఎవరో ఒకరికి ఇచ్చి తొడుక్కోమనేవాడు. అవి వాడకంలో కాస్త నలిగినట్లు అనిపించాక తీసుకొని తన కాళ్ళకు వాడుకునేవాడు.

ప్రజా విముక్తి యుద్ధం కొనసాగుతున్న కాలంలో అయితే లెక్కలేనన్ని సార్లు మావో తన కాలి బూట్లు తీసి వేరు ఎవరికన్నా ఇవ్వడం నే కళ్ళారా చూసా. 'క్యాడర్ అవసరాలకు నాయకుడు పట్టించుకోకపోతే ఎలా' అంటూ తనకు ఉన్నా లేకపోయినా కాలిబూట్లు అవసరం అయిన వాళ్ళకు తొడుక్కోమని ఇచ్చేవాడు. ఎక్కువమంది అభిప్రాయం ఏంటంటే కొత్త బట్టలు, బూట్లు, కొత్త టోపీ పెట్టుకుంటే మనిషి కొత్తగా కనిపిస్తాడని. కానీ మావో ఆలోచనలు ఇందుకు విరుద్ధం. 'సౌకర్యం ముఖ్యం కానీ సోకు కాదు' అనేవాడు. అలానే సౌకర్యంగా ఉండే బట్టలు వాడడానికే ఇష్టపడేవాడు. 'కుర్రాళ్ళకు కొత్త బట్టలు అవసరం కానీ నాలాంటి ముసలాళ్ళకు దేనికోయ్' అనేవాడు. రైతు కుటుంబ నేపథ్యం, యుద్ధంలో ఎదుర్కొన్న కొరతల ప్రభావం తను బట్టలు తొడుక్కునే తీరు మీద చాలానే ఉంది. బదాబదలు అయిపోయిన గ్రామీణ ఆర్థిక వ్యవస్థ – యుద్ధం ఈ రెండిటి మూలంగా చైనాలో తలెత్తిన సంక్షుభిత పరిస్థితులకు మావో ఇట్టే సర్దుకుపోయేవాడు.

మావోకు వ్యవసాయం చెయ్యడం మీద మంచి పట్టు ఉంది. వ్యవసాయక విప్లవం ఎలాంటి ఫలితాలు ఇస్తుందో అంచనావెయ్యడానికి ముమ్మరంగా క్షేత్ర స్థాయి అధ్యయనాలు చెయ్యడానికి ప్రాధాన్యత ఇచ్చాడు మావో. 1958లో టియాన్‌జిన్ పరగణాలోని జిన్‌లీ

అనే గ్రామానికి వెళ్ళాం. అక్కడి పరిస్థితులను స్వయంగా మావోయే పర్యవేక్షించాడు. అక్కడ ఉన్న స్థానిక బాధ్యుడు. ఆ పరగణాల నుండి సెంట్రల్ కమిటీలో ప్రాతినిధ్యం వహిస్తున్న ఓ నాయకుడు కలిసి ఎకరం పాతిక భూమిలో యాభై టన్నుల ధాన్యం పండించినట్లు చెప్పారు. 'ఆపండి బడాయి' అన్నాడు మావో తకీమని. కృత్రిమ సాగు, బ్లోయర్ల ఫాడకం -వీటన్నింటి మూలంగా అంత దిగుబడి సాధ్యం అయిందని వాళ్ళు మావోను నమ్మించే ప్రయత్నం చేసారు. కానీ మావో వాళ్ళ మాటల్ని కొట్టిపారేసాడు. 'అదివల్ల అయ్యేపనికాదు. మీరు గొప్పలు చెప్పడానికి చూసే కొద్దీ అవి మీకు తిప్పలు తెచ్చి పెడతాయి. నీకసలు వ్యవసాయం గురించే తెలీదని నాకు అర్ధమవుతుంది. లేకపోతే ఎక్కడన్నా ఎకరం పాతిక భూమిలో 50 టన్నులు దిగుబడి వస్తుందా. నన్ను వెర్రికుంకను చెయ్యాలని చూడకండి' అని నిర్మొహమాటంగా చెప్పాడు మావో. ఆ రోజు మావో చాలా సాదాసీదా బట్టలు తొడుక్కున్నాడు. 'కొత్తది వేసుకుందురు' అని మేం అడిగినపుడు 'పొలం పన్లు ఎలా సాగుతున్నాయో చూడాలని మనం వెళ్తున్నప్పుడు అలా మడత నలగని బట్టలు ఎవరాన్న తొడుక్కుంటారా. పొలంలోకి వొంగాల్సి వస్తుంది. అరక దున్నాల్సి వస్తుంది. మడి మీదకూర్చోవాల్సి రావచ్చు. మనం వెళ్ళే సరికి రైతు ఎరుపు తోల్తా ఉండోచ్చు. నీళ్ళు పారించిన మూలంగా బురదగా ఉండొచ్చు. కట్టేతల కావచ్చు. ఈ పనుల చూడ్డానికి కొత్త బట్టలకీ పొత్తుకుదురుతుందా' అని ఎదరడిగారు మావో మమ్మల్ని. నిజమే కదా, రెండూనీ.

మావో తొడుక్కునే పంట్లాం, చొక్కాలకు రకరకాల రంగుల గుడ్డ ముక్కలు అతుకువేసి ఉంటాయని ప్రతీతి. అయితే ఇలాంటి అతుకులు లోపట తొడుక్కునే నిక్కరుకు, కాళ్ళకు తొడిగే సాక్సులకు ఎక్కువగా ఉండేవి. ఈ అతుకులు రకరకాల సైజుల్లో రంగురంగుల ముక్కలతో ఉంటాయి. ఒక్కో మాటు గుడ్డముక్క దొరకకపోతే బ్యాండేజి క్లాతు కూడా వాడేవాడు తను. చేతికి ఏది దొరికితే దానితో చిల్లులకు అతుకులు వేసేవాడు. 'ఎందుకలా' అని మేం అభ్యంతరంగా గొణిగితే ఒక్కసారి ఒక్కో సమాధానం చెప్పేవాడు మావో. 'దిగులు పడమాకండి, ఈ అతుకులు బయటికి కనిపించేవి ఏం కాదుగా' 'నాకు లేని ఇబ్బంది మీకేందుకర్రా' 'ఒళ్ళు కప్పుకున్నామా లేదా అనేది ముఖ్యం కానీ అతుకులు ఉంటే ఎవరుచూడొచ్చాడు లేద్దూ' 'ఇదో రకం పొదుపు అనకోండీ, నే ఆదా చేసిన బట్టతో శతృవుకు తినిపించడానికి ఒక బుల్లెట్ ఖర్చుకు వస్తుందేమో కదా' 'మనది పేద దేశమే ఇంకా, పై పై డాబులు ఎందుకూ మనకూ' 'కమ్యూనిస్టు అనేవాడు అన్నిటికీ అలవాటుపడాలి-దేశం అభివృద్ధి కానీయండి, జనంతో పాటే మనమూ మంచి గుడ్డ, మంచి తిండి చవిచూద్దాం'..ఇలా సమర్ధించుకునేవాడు.

అయితే పై బట్టకు - పంట్లాంకో, చొక్కాకో - అతుకులు వెయ్యాల్సి వచ్చినపుడు మాత్రం 'మ్యాచింగ్‌గా ఉండే ముక్కలనే వాడేవాడు. 'బయటకు కనబడేలా వేసే అతుకులు

గదా. చూడ్డానికి ఎబ్బెట్టుగా ఉంటే ఏం బావుంటుందీ, జనాలు ఏవన్నా అనుకోరూ' అనేవాడు.

బీజింగ్ చేరుకున్నాక, వివిధ ప్రజాతంత్ర పార్టీల నాయకులు, పుర ప్రముఖులు, వివిధ సెక్షన్లకు ప్రాతినిధ్యం వహించిన పెద్దలతో సమావేశం కావాలని మావో నిర్ణయించాడు. చైనా డెమొక్రటిక్ లీగ్ వ్యవస్థాపకుడు, కేంద్ర ప్రజా ప్రభుత్వంలో ఉపాధ్యక్ష పదవిలో ఉన్న ఝూంగ్‌లా కూడా వారిలో ఉన్నాడు. 'ప్రజా విముక్తి యుద్ధానికి ఝూంగ్‌లాన్ ఎంతగానో తోడ్పడ్డాడు. గొప్ప ప్రజాస్వామికవాది' అలాంటి పెద్ద మనిషిని కలవబోతున్నాం కదా. ఉన్నంతలో కాస్త మంచి డ్రెస్సు తీసిపెట్టు ఇంకియావో. ఆయనకు ఆ మాత్రం అన్నా గౌరవం ఇవ్వొద్దు' అనడిగాడు మావో నన్ను.

నేను బట్టల బీరువా అంతా తిరగామరగవేసాను. టాకా వెయ్యనిది, అతుకులేని దుస్తుల జత ఒక్కటంటే ఒక్కటి దొరికితే ఒట్టు. 'పెద్ద పరీక్షలు రాయడానికి పట్నానికి వచ్చిన పేద విద్యార్థిలా ఉందా మన పరిస్థితీ' అనడిగాడు మావో నా అవస్థ చూసి. 'అవును కామ్రేడ్' అన్నా నే నిస్పృహతో.

"మరేం ఫర్లా. మనం తొడుక్కునే బట్టలు చూసి మార్కులు వెయ్యరుగా. మనలో సరుకును బట్టి మనకు మార్కులు వస్తాయి. లేమితనాన్ని చూసి కుమిలిపోనివాడినే విజయం వరిస్తుంది. మానవ జీవితంలో ఏదీ అసాధ్యం అనుకోకూడదు. దుంపలు తిని బతకాల్సి వచ్చినా అది నా తలరాతని, ఖర్మని సరిపెట్టుకోకుండా ఉండాలి. పోట్లాడాలి, సాధించాలి. అప్పుడే ఫలితం వస్తుంది" అన్నాడు మావో నాకు సర్ది చెప్పే ధోరణిలో.

'ఇప్పటికిప్పుడు కొత్త జత తీసుకునేచ్చే పరిస్థితి లేదు ఎవరిదన్నా అరువడిగా తెద్దునా' అనడిగానేను.

'ఏం ఫర్లా...నొదిలేయ్. అతుకులు ఉంటే ఏంగానీ ఉన్నంతలో సుబ్బరంగా మన్నికగా కనిపించే జత తియ్యి. ఝూంగ్‌లాన్ లాంటి పెద్ద మనిషి సహృదయంతో అర్థం చేసుకుంటాడులే' అన్నాడు మావో.

ఉన్నతంలో కాస్త మెరుగ్గా ఉన్న, తక్కువ అతుకులు ఉన్న జత తీసి ఇచ్చానేను. అవి తొడుక్కునే ఝూంగ్‌ను కలిసాడు. షెన్ జున్రు, లీజిషెన్, గువో మోరువో, బెన్ షుటుంగ్ వంటి ప్రముఖులను కలిసినపుడు కూడా అదే జత బట్టలు వాడాడు మావో.

నవచైనా అధ్యక్షుడూ, చైనా కమ్యూనిస్టు పార్టీ అధినాయకుడు అయిన మావోకు పదిమందినీ కలిసేటప్పుడు కనీసం ఒక కొత్త జత బట్టలయినా లేకపోయే కదా అనినేచాలా గింజుకున్నా. తియానన్‌మెన్ స్క్వేర్‌లో చైనా రిపబ్లిక్ అవిర్భావ ప్రకటన రోజుకి మాత్రం నేను మావోకు కొత్త జత బట్టలు ఏర్పాటు చెయ్యగలిగాను.

వాంగ్‌ఫూజింగ్ వీధిలో ఉన్న వాంగ్ జికింగ్ దగ్గర కుట్టించి తెప్పించా ఆ కొత్త జత బట్టలు.

సహజంగా మావో తను వాడే వస్తువులను అంత తేలిగ్గా వదిలేవాడు కాదు. చాలా కాలం పాటు పడి ఉండేవి అవి మావో దగ్గర. బట్టలు కూడా పాతబడినా పారెయ్యమని అనడానికి మావోకు నోరు వచ్చేదికాదు. పాత బట్టలను అతుకుముక్కలుగా వాడేవాడు.

ఉత్తర షాంగ్సీ ప్రాంతంలోని యుంగ్జియావోలో ఉన్న రోజుల్లో ఒకసారి ఏం జరిగిందంటే – మావో యూనిఫారం తీసుకురమ్మని చెప్పాడు. ఉన్న ఒకే ఒక బూడిద రంగు యూనిఫాం దారాల పోగులు వేలాడుతూ అట్టకట్టుకుపోయి ఉంది. నేను ఆ యూనిఫారం తీసుకువచ్చి 'చూడండి కామ్రేడ్ దీని అవతారం ఎలా ఉందో. ఇదింకా తొడుక్కునేందుకు ఏ మాత్రం పనికిరాదు. ఇది వేసుకుంటే మీరు కంగాళీ మదుసుల్లా అవుతారు. కాదు కూడదని తొడుక్కున్నారు – మీరు ఏ చెయ్యి లేపినపుడో, కాలు చూపినపుడో చంకల్లోనో, కిస్తా దగ్గరో పిగిలిపోవడం ఖాయం వొదిలెయ్యండి దీన్నిక' అన్నా నేను.

'కాదు ఇటియ్' అని అడిగి తీసుకుని ఆ యూనిఫారంని తొడ మీద పెట్టుకుని ఆప్యాయంగా నివురుతూ గాయపడిన సైనికుడి గాయాల్ని మృదువుగా తడివినట్లు మడత పడిన చోట్ల సరిచేస్తూ 'ఇది నేను లుఓచువాన్ మీటింగ్ రోజున వేసుకుంది.' అని మార్మికంగా గొణిగాడు. 1930 ఆగస్టులో లుఓచువాన్‌లో పార్టీ పొలిట్‌బ్యూరో విస్తృత సమావేశం జరిగింది. ఆ రోజు నుండి ఎప్పుడెప్పుడు, ఎక్కడెక్కడ తను ఆ 'డ్రెస్' వేసుకుందీ గుర్తుకు తెచ్చుకున్నారు. ఆ యూనిఫారం చేసిన సేవలను ప్రశంసించాడు. 'ఓపని చేద్దాం. నీ మాట కాదనడం దేనికీ, దీన్ని ఇక ముందు అతుకులు వెయ్యడానికి వాడుకుందాం ఉంచే' అంటూ పదిలంగా మళ్ళీ దీన్ని నా చేతికి అందించాడు చివరగా. పాత మిత్రుడితో సంభాషించినంత తృప్తి చూసా నేనా రోజు మావో కళ్ళలో.

వయసుతోపాటు మావో బరువూ పెరిగింది. ఉన్న బట్టలు చాలా మటుకు బిగుతయిపోయాయి. మావో ఆ బట్టల్ని అనీయింగ్‌కు ఇచ్చాడు వాడుకోమని. అందుకే అనీయింగ్ కూడా కొత్త బట్టలు తొడుక్కోగా చూడడం కద్దు. జియాంగ్‌కింగ్ కూడా 1960 వరకూ చిరిగిన బట్టలకు అతుకులు వేసి వాడుకునేది. ఆ తర్వాత తర్వాత 'డ్రెస్‌సెన్స్' అలవాటు చేసుకుంది. మావో యూనిఫారంకు చిరుగులు పడితే వాంగ్ ఫుజింగ్ వీధిలో ఉన్న దర్జీ దగ్గరకు పంపించి డార్నింగ్ చేయించేవాణ్ని. సాక్సులకి, లో నిక్కర్లకీ ఇంటి దగ్గరే అతుకులు కుట్టేవాళ్ళం.

ఒకసారి ఒక విదేశీ అతిథిని మావో కలవాల్సి వచ్చింది. 'జాగ్రత్త కామ్రేడ్ మన

రహస్యం బయటపడకుండా చూస్కోండి కాళ్ళు రెండు దగ్గర పెట్టుకు కూచోండి' అని నే హెచ్చరించాను ఆ రోజున. చిరిగిన అతికిన సాక్సులు తొడుక్కున్నాడు మావో ఆరోజు. ఆ 'రహస్యం' బయటపడకుండా చూస్కోమని చెప్పింది అందుకు. 'రహస్యం' అనో, కాకపోతే, 'మన బంగారం బయటపడకుండా చూస్కోండి' అంటూనో కోడ్ భాషలో మావోను హెచ్చరించడం మా గార్డుల అలవాటు.

రాజకీయపరమైన, సైనిక పరమైన విషయాలనే కాదు ఆఖరుకు వ్యక్తిగత జీవితంలోనూ ప్రాధాన్యతలను గుర్తించడంలో మావోకు ఎవరూ సాటిరారు.

నేను గార్డుగా చేరిన కొత్తల్లో విషయం ఇది. మావో మొహం తుడుచుకోవడానికీ కాళ్ళు తుడుచుకుకోవడానికీ ఒకే తువ్వాలు వాడడం నే గమనించాను. అది కూడా రంగు వెలిసిపోయి, చివికేసినట్లు ఉండేది. 'అలా ఎందుకు?' ఇంకో తువ్వాలు తెప్పిస్తాను ఉండండి. దీన్ని మీ కాళ్ళు తుడుచుకోవడానికి వాడుకోండి కామ్రేడ్' అన్నా నేను.

దానికి మావో స్పందిస్తూ 'నువ్వు చెప్పింది మరీ దుర్మార్గంగా ఉంది. యుద్ధం జరుగుతున్న ఈ రోజుల్లో రోజు కాళ్ళకు ఎంత పనుంటుందో నాకు తెలీదు. మొహం కన్నా కాళ్ళకే ఎక్కువ పనుంటుంది. నువ్వు చెప్పినట్లు చేస్తే మొహానికేమో కొత్త తువ్వాలూనూ కాళ్ళకేమో పాత తువ్వాలా అని కాళ్ళు గింజుకోవూ' అనడిగాడు.

'అయితే ఓ పని చెయ్యండి ఛైర్మన్ కొత్త తువ్వాలు కాళ్ళకే వాడండి. పాతదాన్తోనే మొహం లాగించొచ్చు' అన్నా నే నవ్వుతూ.

'లాగించొచ్చుకానీ, లెక్క తప్పుతుందే. ఇపుడు ఉన్న పఠాన అందరికీ జత తువ్వాళ్ళు అందించాలంటే ఎంత ఖర్చు. ఆ డబ్బు పెడితే మనం ఇంకో షాజియాదిన్ యుద్ధం గెలవొచ్చు" అన్నాడు మావో. రెండో తువ్వాలు ప్రతిపాదనకు ఆ లెక్కన గండిపడింది.

పక్క మాత్రం సుబ్బరంగా ఉండాలని కోరుకునేవాడు మావో. ప్రతి మనిషీ జీవితంలో మూడోవంతు పక్కమీదేగా గడిపేస్తాడు. అందులోనూ నాలాంటి వాడు ఇంకో పిసరు ఎక్కువే గడుపుతాడు. ఆ మాత్రం శుభ్రంగా ఉంచుకోవద్దూ' అనేవాడు. 'ఎక్కువ సేపు గడుపుతాను' అని మావో చెప్పాడంటే అందరికన్నా ఎక్కువ నిద్రపోయేవాడని అర్థం కాదు. మావో నిద్దర పోయేది తక్కువసేపే. కాకపోతే పేపరు చదవడం, డాక్యుమెంట్లు చూడడం ఎక్కువగా మంచం మీద కాళ్ళు బార్లా చాపుకుని నడుం తలకట్టున ఆనించికూచుని చేసేవాడు పడుకునేటపుడు పక్క గట్టిగా, చల్లగా ఉంటే ఇష్టపడేవాడు. ఉత్తర షాంగ్సీలో ఉన్నపుడు అందరూ 'కాంగ్' (మట్టితో తయారుచేసిన పక్క) మీద పడుకోవడానికే ఇష్టపడేవారు. చలికాలంలో ఆ 'కాంగ్' మీద పడుకుంటే వెచ్చగా ఉండేది. కానీ మావో మాత్రం 'కాంగ్'

మీద పడుకోవడానికి ఇష్టపడేవారు కాదు. గట్టిదనం కోసం గుమ్మానికి ఉండే తలుపులను మంచం మీద పరిపించుకుని వాటి మీద పక్కవేస్తే పడుకునేవాడు. ఒకసారి ఇట్లానే ఓ రైతు ఇంట్లో తలదాచుకోవాల్సి వస్తుంది. ఆ ముసలి జంట మావోకు ఓ గదిలో పక్క ఏర్పాటుచేశారు. కాని రాత్రి పొద్దు పోయేదాకా మావో మెసికింతలాడతానే ఉన్నాడు. ఎప్పుడో అర్ధరాత్రి అవుతుండగా ఆ రైతు కొడుకు కౌంతీ ప్రభుత్వ ఉద్యోగి ఇంటికొచ్చి విషయం తెలుసుకుని 'ఇట్లా అయితే మావో నిద్దరపోయినట్టే ఉండండి చెప్తా అంటూ తలుపులు ఊడబీకాడు. ఆ హడావుడికి మావో లేచి వచ్చి 'తలుపులు విరిగిపోతాయో, ఫర్లా ఉండనిద్దూ అబ్బాయ్ ఒక్క రాత్రికేగా సర్దుకుంటాలే' అని వారిస్తున్నా వినకుండా ఆ కుర్రాడు తలుపులు లాగి లోపల పక్క మీద పరిచివచ్చాడు. బలవంతానా లాగిన మూలాన బందులు ఎక్కడన్నా విరిగిపోయాయేమో అని చూసి అలాంటి ప్రమాదం ఏదీ జరగలేదనిపించాక మావో వెళ్ళి పడుకున్నాడు. క్షణాల్లో నిద్రపోయాడు. బీజింగ్ వచ్చాక కూడా అదే అలవాటు కొనసాగింది. కొంత మార్పుతో స్ప్రింగ్ పరుపులు వెయ్యనిచ్చేవారు కాదు. చెక్క మీద తాపడం చేసిన పరుపు మీదే పండుకునేవాడు. వేసవి కాలం పక్క మీద పల్చటి బట్ట వేసేవాడు. చెవట కారి దిండ్లు పాడయిపోకుండా వాటికి కాయితాలు చేర్చేవాడు.

మంచం మాత్రం విశాలంగా ఉండేలా కోరుకునేవాడు. బీజింగ్‌లో 5.4 అడుగుల వెడల్పున ఉండేది మావో వాడే మంచం. సగం మంచానికి పైగా పుస్తకాలే పేర్చి ఉండేవి. ఒక్కసారి అడుగు ఎత్తున కూడా ఉండేవి. మావో విపరీతమైన చదువరి. నిద్రపోవడానికి ముందు కూడా పుస్తకాలు చదవాల్సిందే. ఆ రోజు పేపర్లు అందుకున్నాడంటే ఇహ నిద్రకు వచ్చాడనేది మాకు కొండ గుర్తు. పేపర్లు ఎక్కువగా రాత్రుళ్ళే చదివేవాడు మావో. ఝూంక్ నాన్హిలో ఉన్నమాదో పాత ఇంట్లో ఇప్పటికీ తన మంచం మీద బోలెడు పుస్తకాలు ఉండడం మీరు గమనించవచ్చు.

అప్పట్లో ఎక్కువగా పక్షి ఈకలతో చేసిన పరుపుల వాడకం ఉండేది. కానీ మావో మాత్రం దూది పరుపు అదీ కాటన్ గుడ్డతో కుట్టిన పరుపే వాడేవాడు. రబ్బరు, సింథటిక్ వాడకాన్ని అస్సలు ఇష్టపడేవాడు కాదు. దుప్పట్లు లేలిక రంగులవి ఇష్టపడేవాడు. రెండు జతల పైజమాలు, పల్చటి తువ్వాలు – ఇదీ మావో చనిపోయేదాకా వాడిన బెడ్డింగు.

మావో దగ్గర 'ఆర్మీ బ్లాంకెట్' ఒకటి ఉండేది. ఆ దుప్పటి అంటే మావోకు మహా ప్రీతి. తలగడల మీద ఆ దుప్పటి మడతపెట్టి మోపు చేసి దానికి నడుం ఆనించి కాళ్ళు బార్లా జాపి కూచుని మంచంలో చదువుకునేవాడు తను. చింగ్‌లింగ్ ఇది గమనించి మావో కోసం అని ఖరీదైన తలగడలు తెప్పించి ఇచ్చింది. అవి మూణ్నాళ్ళ ముచ్చటగా వాడి తరువాత స్టోర్‌రూంకి పంపించేసాడు. 'పాత దిండ్లే బాగా అలవాటయిపోయాయి,

మార్చొద్దులే' అనేసాడు.

నమ్మండీ, నమ్మకపోండీ-ఇంతకన్నా చిత్రమైన విషయాలు ఇంకా ఉన్నాయి. 1953 నుండి 1962 వరకూ దాదాపు తొమ్మిదేళ్ళుగా మావో కొత్త బట్టలనేవి కొనకుండా గడిపేసాడు. మొహం రుద్దుకోవడానికి పెంటు సోపు వాడగా నేను చూళ్ళేదు. చేతులకి ఎప్పుడయినా ఇంకుమరకలో, గ్రీజు మరకలో అయితే బట్టల సబ్బుతో శుభ్రం చేసుకునేవాడు. ఫేస్ క్రీములు, ఆయిల్సూ అసుంటా పెట్టేవాడు. పేస్టుకు బదులు పళ్ళపొడి వాడేవాడు. 'అందరూ ఇవే వాడాలని, నాలాగే ఉండాలని నేను అనను. మార్కెట్లోకి వచ్చిన వాటిని జనాలు కొని వాడుతుంటేనే కదా వాటికి గిరాకీ ఏర్పడేది. ఎందుకనో నాకు నా పాత అలవాట్లతోనే సౌకర్యంగా ఉంది. బండి ఇలానే లాగించనీండీ అనేవాడు ఎవరన్నా అడిగితే తినడానికి వెదురు 'చాప్‌స్టిక్స్' మాత్రమే వాడేవాడు. దంతంతో చేసినవి ఇస్తే 'రెస్టారెంట్‌లలో వాడతారు కదూ. బాగా ఖరీదు కదా, వొద్దు నాకు వెదురువే ఇవ్వండి. నాకు వాటితోనే వాటం కుదురుతుంది అని అడిగిమరీ వెదరు 'చాప్ స్టిక్స్' వాడేవారు.

తిండికి సంబంధించి మావోవి అన్నీ ముతక అలవాట్లే. మావో టీ విపరీతంగా తాగుతాడు. నిద్రలోంచి లేచినా పొద్దున్నే మంచం దిగేవాడు కాదు. పరగడుపునే, పలకరి చెయ్యకుండానే టీ తాగుతూ నింపాదిగా పేపర్లు తిరగేసేవాడు. టీ ఆకులు కొత్తవి వేసినపుడల్లా పాత ఆకులు కప్పులోంచి తీసి నోట్లో వేసుకుని నమిలిమింగేసేవాడు.

ఉప్పుడు బియ్యం, కాయగూరల పంటలనే ఇష్టపడేవాడు. ఒక్కోసారి అడవిదుంపలు కూడా రుచి చూసేవాడు. సోయాబీన్స్, చిలకడదుంపలతోనో వండిన గోధుమ అన్నం రోజూ ఉండాల్సిందే. మధ్యాహ్నం సరిగ్గా తిండి వేళకు భోజనానికి కూచుంటే మాత్రం ఘాటైన మిరియాల పొడి, బీన్స్, పెరుగు, ఏదన్నా సూపు, గిన్నెలు శుభ్రం చేసుకునేందుకు నీళ్ళు ఉంచాల్సిందే. కానీ భోజనం టైంకి తిండికి కూచోవడం మావోకు వారానికో వర్జ్యానికో గానీ వీలుపడేది కాదు. వేళకు తిండీ తిప్పలు తినడం బహు అరుదు.

కుదురుగా, పద్ధతిగా ఒక చోట కూచుని భోంచేసి అలవాటు లేదు తనకు. ఎప్పుడు ఆకలి అనిపిస్తే అపుడు తినడానికి తెమ్మనమనేవాడు. ఎక్కడ ఉంటే అక్కడే తినేసేవాడు. ఒక్కోసారి రెండుపుటలా భోంచేసేవాడు. ఒక్కోసారి ఒక పూట భోజనంతో సరిపెట్టుకునేవాడు. ఏకబిగిన ఆరేడు రోజులు పనిచెయ్యాల్సి వచ్చినపుడు మాత్రం రోజుకి ఐదారు మార్లు తినడానికి ఏమన్నా పట్రామని అడిగేవాడు. అందుకే మేం గార్డు ఆఫీసులో కరెంటుకుక్కరు, ఎనామిల్ మగ్గు రెడీగా పెట్టుకునేవాళ్ళం. మావో అలా అడిగినపుడల్లా బార్లీ ఉడికించో,

నూడుల్స్ ఉడకబెట్టో తీసుకెళ్ళి ఇచ్చేవాళ్ళం. యుద్ధకాలంలో మొదలయిన అలవాటు ఇది. 'యేజిలాంగ్' ఈ ఏర్పాట్లు చూసేవాడు.

మావో తిండి తినే తీరు మాత్రం తన రాతలోని అక్షరాల్లా కుదురుగా ఉండేది. మావో ఏనాడూ అక్షరాలను గడిలో ఇరికించి రాయగానే చూసిన పాపాన పోలేదు. స్వేచ్ఛగా, హొయలు ఒలికిస్తూ కొట్టొచ్చినట్లుగా ఉండేది మావో చేతి రాత. అసలు ఆ స్టయిలే వేరు. 'కాలీగ్రాఫర్' రాసినంత అందంగా కుదురుగా ఉండేవి అక్షరాలు.

బీజింగ్‌కు వచ్చాక కూడా మావో తిండి అలవాట్లలో నేను పెద్ద మార్పులు ఏమీ గమనించలేదు. సోయాబీన్స్ వేపుడు, ఉడకబెట్టిన చిలకడదుంపలు, రాగి జావ ఏది పెడితే అది తినేవాడు ఆకలేసినపుడు.

1957 ఫిబ్రవరి 27 నుండి దేశీయ వ్యవహారాల పదకొండవ జాతీయ సదస్సు జరగనున్నది. ప్రజల మధ్య వైరుధ్యాలను పరిష్కరించడం ఎలా అనే అంశం మీద ఆ సదస్సులో మావో మాట్లాడాల్సి ఉంది. చౌ-ఎన్-లై సూచన మేరకు ఆ సదస్సును వారం రోజులకు కుదించారు. మావోకు తగిన విశ్రాంతి దొరికేలా షెడ్యూలు ఖరారు చేశారు.

రెండు రోజుల తర్వాత నాకు డ్యూటీ పడింది 'రెండ్రోజులుగా మీటింగ్ నడుస్తూ ఉంటే మావో చేసింది ఒక్కపూట భోజనమా' అనడిగా నేను అప్పటిదాకా డ్యూటీ చేసిన టియాన్‌యున్యుని 'రెండు కప్పుల రాగి జావ కూడా ఇచ్చా' అని చెప్పాడు జాంగ్ జియాన్‌పెంగ్ పక్క నుంచి.

'గార్డు డ్యూటీ ఎవరిదీ అనడిగా 'నాది' అంటూ ఫెంగ్ ముందుకు వచ్చాడు.

'అయితే నీదే బాధ్యత...మావో ఇట్లా రెండ్రోజులకు ఒకపూట భోజనంతో సరిపెట్టుకుంటే ఆయన ఆరోగ్యం ఏంగానూ? ఎలా చేస్తావో ఎలా చెందుతావో నీ ఇష్టం. అవకాశం దొరకబుచ్చుకుని మావోకు వేళకు తిండి అందేలా చూడు' అని ఫర్మాయించా అతనికి 'జాగ్రత్త సుమా, తేడా వొస్తే నువ్వు ఖర్చుయిపోతావ్' అని హెచ్చరించా చివరగా. ప్రతి షిఫ్టులో ఇద్దరు గార్డులు ఉండేవాళ్ళు. ఒకొళ్ళకొకళ్ళు సాయంగా అప్పటికి ఫెంగ్ డ్యూటీ ఎక్కి ఎనిమిది గంటలయింది. ఆ పాటికి ఏడెనిమిది కప్పుల టీ ఇవ్వడంతోనే సరిపోయింది. తిండి గురించి ఎత్తడానికి అవకాశం చిక్కలేదు.

అర్ధరాత్రి రెండు గంటలు దాటాక మావో రాయడం ఆపేసి చేతిలో పెన్ను పక్కన పెట్టి, నోరావలించి, ఒళ్ళు విరుచుకుని రెండు చేతుల్తో నుదురు కాసేపు రుద్దుకున్నాడు.

అది అవకాశంగా తీసుకుని 'పొద్దుట్నించి మీరేం తినలేదు. భోజనం తెమ్మంటారా ఛైర్మన్' అనడిగాడు ఫెంగ్.

మావో ఒళ్ళు విరుచుకుంటూనే ఫెంగ్ కేసి చూసాడు. ఆ కళ్ళలో నిద్రలేమి మూలంగా ఏర్పడిన ఎరుపు జీరలు, మొహంలో అలసట. అదేపనిగా వొస్తున్న ఆవులింతలను ఆపుకుంటూ 'భోజనం వొద్దుగానీ తినడానికి ఏమన్నా పట్రా, చిలకడదుంపలు రోస్టు చేసి తేగలవా' అనడిగారు. 'అదికాదు' అని ఫెంగ్ భోజనం తెస్తానని చెప్పడానికి ప్రయత్నిస్తే మావో ఓ చేత్తో అతన్ని వారించి ఇంకో చేత్తో కలం పట్టాడు.

ఫెంగ్ కిచెన్‌లోకి వచ్చేసాడు. చిలకడదుంపలు రోస్టు చేసే పనిలో పడ్డాడు. రాత్రిళ్ళు ఏమన్నా తినాల్సివస్తే గార్డులనే ఆ ఏర్పాటు చూడమనేవాడు మావో. వంట పనివాళ్ళు పడుకుని ఉంటారు కాబట్టి లేపవద్దని చెప్పేవాడు. ఫెంగ్ పొయ్యి దగ్గర పని చూస్తుండగా వంట మాస్టారు నిద్దర కళ్ళతో లేచి ఏం చేస్తున్నావ్ అనడిగాడు. మావోకు తినడానికి అన్న ఫెంగ్ సమాధానంతో 'ఏంటీ ఈ నాలుగు దుంపలతో సరిపెడదామనా, ఆయన పొద్దుట్నించీ ఏం తినలేదు తెల్సా...వేడివేడిగా అన్నం వొండుతా ఉండూ' అని హడావుడి పడుతుంటే 'నీకంత సరదా ఉంటే అలాగే తీసుకెళ్ళు... నాచేతికి మాత్రం ఇవ్వబాక..తీసుకువెళ్తావా' అనడిగాడు ఫెంగ్. అప్పటికిగానీ వంట మాస్టారుకు అందులో ఉన్న ఇబ్బంది అర్థం కాలేదు. దాంతో గమ్మున ఉండిపోయాడు అతను.

ఫెంగ్ ఆరు చిలకడదుంప ముక్కలు ఒక ప్లేటులో సర్ది మావో గదిలోకి తీసుకువెళ్ళే సరికి మావో మంచం తలకట్టుకి తల ఆనించి, సన్నగా గురక తీస్తూ నిద్రపోతూ కనిపించాడు. మావోను నిద్ర మంచి లేపడం ఇష్టంలేక ఫెంగ్ ఆ ప్లేటుని రేడియటర్ మీద ఉంచి బయటకు వచ్చేసాడు. నిద్రమత్తు పోవడానికి కాసేపు ఆరు బయట చల్లగాలిలో పచార్లు చేసాడు.

మావోలో ఏదో మానవాతీత శక్తి ఉందనిపిస్తుంది. రాత్రీపగలూ తేడా లేకుండా పనిచేస్తాడు. అది రాయడమైనా, చదవడమైనా సరే. మేం ఒకసారి లెక్కలు తీసాం మావో వారానికి ఎన్ని గంటలు పడుకుంటాడా అని. ముప్పై గంటలు లెక్కతేలింది. ముప్పై ఐదు గంటలు పడుకున్నాడంటే పండగ చేసుకోవచ్చు. సెంట్రల్ కమిటీ సభ్యులు ఎవరూ మావోతో పోటీపడలేకపోయేవారు. అందర్లో లుయోరుయికింగ్ కాస్త ఉద్దండుడు. అతనే చేతులు ఎత్తేసాడు ఒకసారి. 'ఎట్టా ఉంటున్నారురా బాబులూ మీరు మావోకు కాపలాగా? ఒక రోజు మావోతో గడిపేసరికే నా ప్రాణాలు దస్సిపోయాయి. నా వల్ల అయ్యే పనికాదు,

మావోతో పోటీపడి పనిచెయ్యడం తనలో ఏదో మానవాతీత శక్తి ఉంది. మావోకు ఎవరూ సరితూగలేరు' అన్నాడు లుయో.

ఓ పావు గంట అలా పచార్లు చేసి ఫెంగ్ లోపలికి అడుగుపెట్టాడు. మావో పొడిగా దగ్గడం విని గభాల్ని గదిలో దూరి' తినడానికి రెడీ చేసా ఛైర్మన్ అన్నాడు.

'పట్రా పట్రా, ఓ పట్టు పడదాం' అన్నాడు మావో.

చిలకడదుంపల ప్లేటును సదిరి పెట్టాడు ఫెంగ్. మావో ఒకదాన్ని చేతిలోకి తీసుకుని తొక్కవొలుస్తూ 'ఇంకా తెలవారలేదూ' అని పాడుతూ దుంపను చిన్న చిన్న ముక్కలుగా కొరిగి తినసాగాడు.

ఫెంగ్ కిటికీలోంచి బయటకు చూసాడు. దూరంగా చుక్క పొడుపు కనిపించింది. సూర్యోదయం కావస్తా ఉంది. ఫెంగ్‌కు నిద్రతూలుకు వస్తా ఉంది. చలిగాలికని బయటకు వచ్చాడు.

ఇంకో పావుగంట గడిచాక మళ్ళీ లోపలికి అడుగుపెట్టాడు. మావో సన్నగా గుర్రు కొడుతున్నాడు. తింటూనే నిద్రకు పడినట్లున్నాడు అనుకుని ఫెంగ్ ప్లేటు తీసి బయటకు వచ్చేద్దాం అనుకుంటూ ఉండగా మావో నోటి నుంచి వచ్చే గురకలో ఏదో తేడా అనిపించి పరీక్షగా మావోకేసి చూసాడు. మావో పళ్ళ మధ్యన చిన్న చిలకడ దుంపముక్క ఇరుక్కుపోయి ఉంది దాంతో ఫెంగ్ కంగారు పడిపోయాడు. గెంతుకు అడ్డంపడితే ఇంకేవన్నా ఉందా అని దడదడలాడుతున్న గుండెలతో మావో నోట్లోంచి ఆ ముక్క బయటకు లాగాడు.

దాంతో మావో ఉలికిపాటుతో లేస్తూ 'ఎవరిదీ' అని అరిచాడు. నిద్ర నుండి హఠాత్తుగా లేవడంతో మొహం, కళ్ళూ ఎర్రబడిపోయాయి. 'ఏం చేస్తున్నావ్' అని కసిరాడు దాంతో ఫెంగ్ బిక్క చచ్చిపోయాడు. కళ్ళనిండా నీరు పెట్టుకుని 'క్షమించండి' అన్నాడు ఫెంగ్ చేతిలో ఉన్న చిలకడ దుంప ముక్క చూసి ఏం జరిగి ఉంటుందో మావో అర్థం చేసుకున్నాడు.

'క్షమించండి ఛైర్మన్, అనవసరంగా మీ నిద్దర చెడగొట్టా. ఈ దుంప ముక్క మీ నోట్లో ఇరుక్కుపోయింది. గొంతుకు అడ్డం పడుతుందని భయపడి తీసా. మిమ్మల్ని నిద్రలేపడం నా ఉద్దేశం కాదు అని ఫెంగ్ ఏడుస్తూ చెప్పాడు.

ఆ ఏడుపు చూసి మావో 'సరి సరి ఏడవబాకు. నే పడుకుంటాకానీ నువ్వు ఏడవబాకు" అంటూ దుప్పటి ముసుగు తన్ని పడుకున్నాడట. నిజంగా విచిత్రమే నిద్రాభంగం అయినా మావో కోప్పడకపోగా, వెంటనే ముసుగు తన్ని పడుకోవడం మేం ఎరగని విచిత్రమే.

# 10. ఇష్టమైన వంటకం

ఘాటైన మిరియాల పొడిని ఇష్టపడేవాళ్ళు తిరుగుబాటు స్వభావం కలిగి ఉంటారని మావో అంటుండేవాడు. మిరియాలంటే మావో చాలా ఇష్టపడేవాడు. వేయిస్తే రచిపోతుందని మిరియాల రోస్టును వాడేవాడు. పోర్క్ (సీంపంది మాంసం) అన్నా, పీతలన్నా మహా ప్రీతి. మావోకు 'టానిక్కు' పుచ్చుకునే అలవాటు లేదు. పోర్కు తిన్న రోజున మాత్రం ముందస్తుగా కాస్త 'టానిక్కు' పుచ్చుకునేవాడు. అదీ 'టానిక్కు'గానే – రెండు మూడు ఔన్సులు.

షాజియాదిన్ ముద్ధం నిర్ణయాత్మక దశకు వచ్చిన సందర్భం అది. వరసగా మూడు రోజులపాటు నిద్దరలేకుండా గడిపాడు మావో. శతృ సైన్యానికి చెందిన 36వ డివిజన్‌ను రెడార్మీ తుక్కు తుక్కుగా కొట్టేసిందని, ఆరువేల మందిని బందీలుగా పట్టుకుందన్న విజయవార్త మావోకు చేరింది. ఆ వెంటనే మావో నన్ను పిలాచాడు. 'పోర్కు తినాలని వుంది. కొవ్వుతో సహా..తెప్పించి పెడతావూ' అనడిగాడు నన్ను.

'అంతోటి యుద్ధం గెలిచారు కదా..ఓ గిన్నెడు పోర్కుతో సరిపెట్టుకుంటారా, అనడిగా నేను..' అదేం కాదూ మూడు నాలుగు రోజులు నాన్‌స్టాప్‌గా పనిచెయ్యడం కదా బాగా అలసటగా ఉంది. బుర్ర వేడెక్కిపోయింది. పోర్కు కొవ్వుతో సహా తింటే కాస్త చల్లబడుద్ది' అన్నాడు తను.

నేను పోర్కు శుబ్బరంగా వండించి తెచ్చా. గిన్నె తన ముందు పెట్టా. ముక్కలు ఎగపీల్చి గట్టిగా వాసన చూసాడు. కళ్ళు మూసుకుని మరీ వాసనను ఆస్వాదించాడు. 'గొప్ప రుచిగా వండించినట్టున్నావ్' అన్నాడు. చాప్‌స్టిక్స్ అందుకున్నాడు. రెండు నిమిషాల్లో గిన్నె ఖాళీ చేసాడు. నేను కళ్ళప్పగించి అలా చూస్తుండిపోయాను. అది గమనించి మావో చిన్న పిల్లాడిలా సిగ్గుపడిపోయాడు. 'ఆత్రమనిపించింది, తినేసా' అన్నాడు సంజాయిషీగా. 'నేనేం గొంతెమ్మ కోరిక కోరలేదు కదా? చాలా గొప్ప విజయం సాధించాం కదా, అందుకే తినాలనిపించింది అన్నాడు మావో. అద్భుత ప్రజా యుద్ధ వ్యూహకర్త అలా చిన్న పిల్లాడి మాదిరిగా అడిగేసరికి నా మనస్సు ఆర్ద్రమైపోయింది. 'అదేం లేదు చైర్మన్..మీరు సాధించిన విజయం ముందు మీరు అడిగింది ఏపాటిది' అన్నా నేను.

'ఏమో మరి నాకయితే ఇబ్బంది అనిపించింది. యుద్ధ భూమిలో ఉన్న మన వాళ్ళు మాంసం తినాలిపిస్తే గుర్రాలను చంపుకు తినాల్సి వస్తుంటే నేనిలా పోర్కు తెప్పించుకు

తినడం భావ్యం కాదనిపించింది' అన్నాడు మావో.

మావోకు పోర్కు అంటే ఎంత ఇష్టమో ఆ రోజే నే స్వయంగా తెలుసుకున్నా. ఆ తరువాత నుండి పండగ చేసుకోదగిన ఏ అవకాశం వచ్చినా నేను మావోకు పోర్కు వండించి పెట్టేవాణ్ణి. రాత పనిలో ఉండి నాలుగైదు రోజులు తీరిక లేకుండా గడిపిన సందర్భాల్లోనూ మావోకు ఇష్టమైన ఆ వంటకం రుచిగా వండించి పెట్టేవాణ్ణి.

ఆ తరువాత ఏడాది అంతా ఆహార కొరతతో ఇబ్బందులు పడ్డాం. రెండు నెలలపాటు సోయాబీన్స్ ఉడికించుకు తినాల్సి వచ్చింది. కడుపులు కళ్ళేపల్లి చెరువులు అయిపోయాయి. ఆ మూడు నెలలూ మావో తీరిక లేకుండా గడిపాడు. రాత్రీ-పగలూ తేడా లేకుండా పనిచేస్తున్నాడు. ఏకబిగిన మూడు రోజులపాటు నిద్దరలేకుండా పనిచేసిన సందర్భాలూ ఎక్కువే. అది ఒక రోజు కింద లెక్క తనకు. దేశంలో వివిధ ప్రాంతాల్లో జరుగుతున్న విముక్తి పోరాటాలకు ఆయన నిత్యం దిశా నిర్దేశం చేస్తూనే సమాంతరంగా రచనా వ్యాసంగం కొనసాగించాడు మావో. 'విముక్తి యుద్ధం-రెండవ ఏడాది వ్యూహం' 'ప్రజా విముక్తి సైన్యం మ్యానిఫెస్టో' వంటి పుస్తకాలు ఆ కాలంలోనే రాసాడు. మావో నుదురు రుద్దుకుంటూ కనబడినప్పుడల్లా నా మనసు బాధతో మూలిగేది. తల భారంగా ఉన్నప్పుడో, బుర్ర వేడెక్కిపోయినప్పుడో తనకు అలా నుదరు రుద్దుకోవడం అలవాటు. ఎక్కడన్నా పోర్క్ దొరికితే బావుండు, మావోకు వండి వడ్డించడానికి అనిపించేది. ఆహారకొరత మూలంగా నా చేతులు కట్టేసినట్లయింది. ఛాంగ్-కై-షేక్ సైన్యం మాదిరిగా నేను రైతుల ఇళ్ళ మీద పడి వాళ్ళ పెంపుడు పంది పిల్లల్ని కొట్టుకొచ్చి పెట్టలేనుగా? ఏం చెయ్యాలో పాలుపోక రోజులు భారంగా గడుపుతున్నాం.

ఇంతలో మా మొర ఆలకించినట్లు జనరల్ హేలాంగ్ ఐసు పెట్టెలో నిలవ పోర్కు పంపించాడు. నిలవ పోర్కు రోస్టు చెయ్యడానికి పనికిరాదు. వేపుడు చెయ్యాల్సిందే. మాంచి రుచిగా కూడా ఉంటుంది. ఆ రోజు భోజనంలో పోర్కు ఫ్రై మావోకు వడ్డించాను. 'తీసెయ్ నా కొద్దు' అన్నాడు మావో. 'అది కాదు చైర్మన్ మీ బుర్ర అసలే హీటెక్కి పోయింది. చలవ చేస్తుంది తినండి' అన్నా నేను. 'నా బుర్ర వేడెక్కిన మాట నిజం. ఇది తింటే చలవ చేసే మాటా నిజమే ఇంకియావో. కానీ అసలే ఆహార కొరత ఎదుర్కొంటున్నాం. మీరంతా ఆకలికి డొక్కలు మాడ్చుకుంటూ ఉంటే నేను కడుపుకు నిండుగా పోర్కు తినగలనా చెప్పు.. వొద్దు...తీసే.. మీ అందరితోపాటే నేనూనూ..' అన్నాడు మావో. నేను ఇంకేదో సర్దిచెబుదామని చూసా కానీ మావో నా మాట సాగనియ్యలేదు. 'భోజనం అయ్యాక..నువ్వో మాటు తలదువ్వి, మసాజ్ చెయ్యి. నీ చెయ్యి పడితే వేడి గీడీ చేత్తో తీసేసినట్లు అవుతుంది'

అన్నాడు మావో. ఇంకేం మాట్లాడతానూ. ఆయన అడిగినట్లే చేసి సరిపెట్టా.

మళ్ళీ పోర్కు వండే సాహసం చెయ్యలా. కొత్త సంవత్సరం రోజున ఏదో మీటింగ్ ఉండి జనరల్ చెన్‌యి వచ్చాడు. ఆ రోజు ఆయనకు పోర్కు వండి వడ్డించాం.

ఉత్తర షాంగ్సీ నుండి జిబైపో వచ్చాక మేం తిండికి అంతగా ఇబ్బంది పడలేదు. అయితే మావో కొన్ని రోజుల తరబడి పగలూ రాత్రీ ఏకబిగిన పనిచేసేవాడు. దేశంలో మూడు ప్రాంతాల్లో జరుగుతున్న మిలటరీ క్యాంపెయిన్లను తనే సంభాళించేవాడు. మావో ఆరోగ్యాన్ని దృష్టిలో ఉంచుకుని నేను పై వాళ్ళతో మాట్లాడాను. మావోకు పౌష్టికాహారం అందేలా చూడమని వాళ్ళు నాకు పురమాయించారు. ఇది ఎట్లాగో మావోకు తెలిసింది. నన్ను పిలిచి "చూడబ్బాయ్ నువ్వు చేసింది మంచిపనికాదు. మీరు అనుకునే తిండి తినే తీరికా నాకు లేదు, తిన్నా అరాయించుకునే ఓపికా లేదు. మూణ్రోజులకు ఒక మాటు అంత పోర్కు వండించి పెడితే – అదే నాకు వెయ్యి ఏనుగల బలం. చాంగ్‌కై షేక్‌ను ఎడం చేత్తో ఓడించెయ్యనూ" అన్నాడు. దాంతో నేను మావో చెప్పినట్టే చెయ్యాల్సి వచ్చింది. బీజింగ్‌కు తరలివచ్చాక కూడా మావో పోర్కునే ఇష్టపడేవాడు. ఆర్భాటమైన తిండన్నా, షడ్రసోపేతమైన భోజనం అన్నా మావో మొహం గంటు పెట్టుకునేవాడు. విదేశాల నుండి ముఖ్యమైన అతిథులు వచ్చినపుడు కూడా 'ఎందుకింత ఆర్భాటపు తిండీ, ఎవరు తినొచ్చారూ ఇన్ని రుచులూ, అంతా దండగ మారి వ్యవహారం కదా' అనేవారు. షడ్రసోపేతమైన వంటకాలు చూసి ఒకసారి మావో అన్న మాటలు నాకు ఇప్పటికీ బాగా గుర్తు. ' ఈ ప్రపంచంలో బతుకుతుంది దొరికినదల్లా మేసెయ్యడానికి కాదు. మనం ఈ ప్రపంచం బతుకుకోరాలి. దీన్ని అహ్లాదరకమైన ప్రపంచంగా మనగలగనివ్వాలి. ప్రతి మానవుడి కనీస ధర్మం ఇది. జంతువులకు మనిషికీ ఉండాల్సిన తేడా ఇదే" అని చెప్పాడు మావో.

మావో వ్యక్తిగత వైద్యుడు డాక్టర్ సూటదవో అనేకసార్లు మావోకు పోషకాహారం తీసుకోవాలని ఒత్తిడి చేసాడు. కానీ ప్రతిసారీ మావో తల అడ్డంగా ఊపేవాడు. ఎవరు ఎన్ని రకాలుగా చెప్పినా మావో తన నిర్ణయాన్ని మార్చుకోలేదు. దానికి తగిన కారణాలూ చెప్పేవాడు. ఒకసారి ముతక బియ్యంతో వండిన అన్నం తింటూ – 'ఇదిగో ఈ మాత్రం తిండి మన రైతులందరికీ దక్కుతుందని నికార్సుగా చెప్పండి. అప్పుడు మీరు చెప్పే పోషకాహారం గురించి ఆలోచిస్తా' అని డాక్టర్ సూటావోతో అన్నాడు.

ఇంకో సందర్భంలో 'చూడండి డాక్టర్ – నేను రైతు బిడ్డని, పుట్టి పెరిగిన దగ్గర నుండి రైతు కుటుంబాల ఆహారపు అలవాట్లే నాకూ అబ్బాయి. పుట్టుకతో వచ్చిన అలవాట్లను

మార్చుకోమని మీరు నన్ను బలవంత పెట్టీ ఉపయోగం లేదు' అని కరాఖండీగా చెప్పాడు.

మరో సందర్భంలో అయితే 'సరే డాక్టర్ గారూ.. అన్నీ మీ ఒక్కరికే తెలుసు అనుకుంటే ఎట్లా? మీరు నా వయసుకు వచ్చేటప్పటికి ఇపుడు మీకు ఉన్న శరీర ధారుడ్యాన్ని (ఫిజిక్) కలిగి ఉంటారా చెప్పండి. నాకు తెలిసీ బడా పెట్టుబడిదారులకన్నా రైతులు ఎక్కువ కాలం బతుకుతారు" అంటూ నాకేసి తిరగి 'చూసావా ఇంకియావో తమాషా- ఈ డాక్టర్లతో పెద్ద చిక్కు అనుకో. వాళ్ళు చెప్పింది చెవికి ఎక్కించుకోలేదనుకో దానిక భారీ మూల్యమే చెల్లించుకోవాల్సి వస్తుంది. అట్లా అని అస్సలు లెక్క చెయ్యలేదనుకో అప్పుడూ పుట్టి మునిగిపోతుంది. ఏంటి చెయ్యడం చెప్మా" అన్నాడు ఛలోక్తిగా.

ఒకసారి మావో ఏకబిగిన ఇరవై గంటలపాటు పనిచేసాడు. ఆ తరువాత కాసేపు నిద్రపోయి లేచాడు. ఆ అదను చూసుకుని 'ఛైర్మన్ చాలా రోజులుగా మీరు సరయిన తిండీ తిప్పలు లేకుండా పనిచేస్తున్నారు' అన్నా.

'అలాగా' అంటూ అప్పటికే నాతో తెప్పించుకున్న టీ చప్పరిస్తూ నిజమే నాకు ఆకలేస్తుంది. తినడానికి పట్రా అన్నాడు.

'డాక్టర్ సూ మీ కోసం స్పెషల్ మెనూ తయారుచేసి ఇచ్చి వెళ్ళాడు. కానీ ఆ మెనూలోని అన్నీ సమకూర్చులేక..' అంటుండగానే మావో కల్పించుకుని ఆ మెనూ సంగతి మర్చిపో రోస్టు చేసిన పోర్కు ఉంటే తెప్పించు చాలు. అన్నాడు.

'కానీ..' అంటూనేను నసగబోతుంటే మావో పెన్నూ, కాయితాలు అందుకుంటూ 'ఇక నువ్వు వెళ్ళొచ్చు' అన్నాడు. నేను ఇంకా అక్కడే నిలబడడంతో 'ఎంతసేపట్లో నాకు తిండి అందుతుందో చెప్పగలవా' అనడిగాడు. దాంతో నేను అక్కణ్ణించి కదిలాను.

వంట మనిషి దగ్గరండి పోర్కు వండిస్తున్నా. ఈలోగా జియాంగ్‌కింగ్ ఏదో పుస్తకం చదువుతూ నడవాలో పచార్లు చేస్తున్నదల్లా తిరిగి తన గదికేసి వెళుతూ కనిపించింది. నేను గబగబా ఆవిడ దగ్గరికి వెళ్ళాను.

'ఛైర్మన్ భోజనానికి ఏర్పాట్లు చెయ్యమన్నారు' అని చెప్పా.

'మంచిదేగా' అందావిడ.

'పోర్కు రోస్టు చాలట' అని చెప్పా.

'ఏంటీ, పోర్కా వొద్దు. ఎప్పుడు చూసిన ఆ పోర్కేనా..వినీ వినీ నాకే మొహం

మొత్తుతుంది. సుబ్బరంగా ఏ చేపలో, కోడి మాంసమో వండించి పెట్టు. చాలా రోజులుగా సరయిన తిండే తినడం లేదాయన. ఇంతకీ నిన్న ఏం వండించి పెట్టావ్' అనడిగింది ఆవిడ.

'నిన్ననా, రెండు మగ్గుల బార్లీ జావ' అని చెప్పా.

'మొన్నా' అనగడిగిందావిడ.

'మొన్న ఝూంగ్‌ది డ్యూటీ. నూడిల్స్ చాలన్నారని చెప్పాడు తను' అన్నా.

ఏం ఉద్యోగాలు చేస్తున్నారర్రా..ఇలాగేనా ఆయనకు తిండిపెట్టేది. ఆ కరెంటు కుక్కరూ, సత్తు మగ్గు తగలెయ్యా...చంపుకు తింటున్నారే... వాటిని తీసుకెళ్ళి ఏ చెత్త కుప్పలోనో పారేసిరండి. అప్పుడు గానీ మీ అయ్యగారు సరయిన తిండి తినరు' అని క్షణం ఆగి కోపం దిగమింగుకుంటూ..

'సర్లే... వంటవాళ్ళకి చెప్పండి, డాక్టరు చెప్పిన మెనూ ప్రకారం వంట చేసి పెట్టమని వారంలో మూడు పూట్లయినా మెనూ ప్రకారం తిండి పెట్టకపోతే ఎట్లా' అన్నారావిడ.

'ఛైర్మన్ ఏమో ఆ మెనూ గినూ పట్టించుకోమాకండి. పోర్కు పట్రాండి అంటున్నారు'అని చెప్పా నేను.

'ఇంకో మాటు ఆ ముక్క నీ నోటి నుండి వినదల్చుకోలానేను. చెవుల తుప్పు ఒదిలింది చాలు. ఏవుందనీ ఆయన పోర్కో పోర్కో అని పడి చచ్చిపోతాడు.. ఈ డొల్లు పుచ్చుకాయ మనిషి మారడా' అని విసుక్కుంది ఆవిడ.

నాకు మాత్రం రోజు పోర్కు వండించి పెట్టడం సరదానా? నాకు మాత్రం మావోకు రుచికరమైన వంటలు వండించి వడ్డించాలని లేకనా? కానీ ఏం చెయ్యను. ఆయన ఆర్డరు వేస్తే ఆర్డరే. కానీ ఇటు చూస్తే ఈవిడ పట్టు పట్టుకు కూచుంది. మొత్తానికి ఆవిడ మాట ప్రకారం చేప వండించా. తీసుకెళ్ళి మావో గదిలో ఉన్న భోజనాల బల్ల మీద పెట్టి పక్కన నిలబడ్డా. పేపరు చదువుతున్న మావోతో 'భోజనం రెడీ' అని చెప్పా.

పేపరులోంచి తల తిప్పకుండా మావో అలానే వొచ్చి భోజనాల బల్ల ముందున్న కుర్చీలో కూచున్నారు. తినేటపుడు పేపరు చదవడం మావోకు అలవాటు. అలా పేపరు చూస్తూనే 'చాప్‌స్టిక్స్' అందుకున్నాడు. ఈలోగా జియాంగ్ కింగ్ వచ్చి ఆయన ప్లేట్లో చేప ముక్కలు వడ్డించింది. ఇహ భారం అంతా ఆవిడే చూసుకుంటుందని నే ధీమాగా ఉన్నా. మావో 'చాప్‌స్టిక్స్'తో ప్లేట్లో పోర్కు ఉందనుకుని దాన్ని ఎలా తీసుకోవాలో అలవాటయిన

రీతిలో చెయ్యి కదిపాడు. తేడా పట్టేసాడు. పేపర్లోంచి తల తిప్పి 'ఏంటీదీ? నే అడిగిన పోర్కు ఎక్కడా' అనడిగాడు పళ్ళెంలోకి చూస్తూ. అడిగింది నన్ను కాదన్నట్లు మౌనంగా ఉండిపోయాను.

'నిన్నే అడుగుతా' అంటూ మావో నాకేసి చూసాడు. నేనేం చెబుతాను? నీళ్ళు నవుల్తూ ఉండిపోయా. జియాంగ్ మాట సాయానికి వస్తుందిలే అన్న ధీమాతో ఉన్నా. పోనీ ఆవిడ కేసి చూద్దామా అంటే ఇదంతా ఆవిడ చలవే అని నే చెప్పకనే చెప్పినట్లు అవుతుందని నేల చూపులు చూస్తుండిపోయా. జియాంగ్ కింగ్ కూడా చడీ చప్పుడు లేకుండా నిలబడి ఉంది. అప్పుడు కానీ నాకు అర్థం కాలా ఆవిడ నాకు దెబ్బవేసిందని. తప్పనిసరయి నోరు విప్పా...'అదీ..అదీ..దొరకలా' అనేసా గభాల్న.

'ఏంటీ దొరకలేదా? నేను అడిగింది పోర్కు. మణులూ మాణ్యాలు కాదు. పోర్కు దొరకలా' అనడిగాడు మావో. అప్పుడయినా జియాంగ్ మాట సాయానికి వస్తుందేమో అని చూసా. ఇందాక నా దగ్గర దబాయించినట్లు మావో తోనూ దబాయింపుగా మాట్లాడుతుందేమో, నన్నీ గండం నుండి గట్టెక్కిస్తుందేమో అని ఎదురుచూస్తా ఉన్నా కానీ నా ఆశ నిరాశ అయింది. జియాంగ్ ఏం ఎరగని దానికి మల్లే చోద్యం చూస్తూ నిలబడి ఉంది.

'మాట్లాడవేం? నేనేం చెప్పాను, నువ్వేం చేసి తీసుకొచ్చావ్' అని గదమాయింపుగా అడిగాడు మావో.

అప్పుడు కూడా జియాంగ్ పెదవి విప్పలేదు. దాంతో అసహాయుడిని అయిపోయా. ఉక్రోషంతో నా కళ్ళెంబడి నీళ్ళు జలజలా రాలాయి.

మగాడు కంట తడిపెడితే మావో సహించలేడు. 'సర్లే..సర్లే కుళాయి తిప్పమాకు నేను నిన్నింకా ఏం అడుగనులే. చెప్పొచ్చుననుకుంటే తర్వాత చెబుదూ. ముందు ఆ ఏడుపాపు. నువ్వలా ఏడుపు మొహం పెడితే నాకు ఇది కూడా తినబుద్ధి కాదు' అన్నాడు. పళ్ళెంలో వడ్డించిన చేప ముక్కల్ని గబగబా నోట్లో కుక్కుకుని, తినడం అయిందనిపించాడు.

బల్ల దగ్గర నుంచి లేచి 'నాతో రా' అంటూ నన్ను వెంటపెట్టుకు వెళ్ళాడు. పక్క మీద వాలిపోతూ 'సరే ఇంతకీ ఏం జరిగిందో చెప్పు' అనడిగాడు. 'ఏం జరిగిందో మీకు తెలియదా' అనడిగా నేను. 'ఊహించాన్లే. అవునో కాదో నీ నోటితో నువ్వు చెప్తే కదా తెలిసేదీ' అన్నాడు మావో. నేను జరిగిందంతో పూసగుచ్చినట్లు వివరంగా చెప్పా.

అప్పుడు మావో 'అద్గదీ సంగతి. నీ ఏడుపు ఆగింది చూసావా. మనసులో బాధ

ఉంటే ఎవరికన్నా చెప్పుకుంటే భారం తీరుద్ది ఇంకియ్యావో. అందుకే చెప్పమని అడిగా. లేదనుకో ఆ దిగులుతో నువ్విలా ఎంతసేపు ఏడుపు మొహం వేసుకు ఉండేవాడివో కదా' అన్నాడు.

ఆ మాటలకు నిజంగానే నా మనసు తేలికపడింది. నేనేదో అందామని నోరు తెరిచేగా మావో స్థిరంగా, కాస్తంత కోపంగా – 'ఆవిడ అన్నాదానికి నే తప్పు పట్టడంలేదు. నిజంగా నేను దేశవాళీ డొల్లపుచ్చకాయనే. నేనో రైతు బిడ్డను. నా తిండీ తిప్పలు అలవాట్లు అన్నాపల్లెటూరి రైతు కుటుంబం నుండి వచ్చినవి. పట్నం వచ్చాం కాబట్టి మార్చుకోమంటే నే మార్చుకోలేను. ఆవిడ పట్నం పుచ్చకాయ కామోసు. రేపట్నించి ఆవిడ తిండి ఆవిడిది. నా తిండి నాది. ఇందులో ఆవిడ జోక్యం ఉండకూడదు. ఇదే నా ఆఖరి మాట' అన్నాడు. మావో గభాల్న మాట తూలాడు. ఏదన్నా ఒక మాట చెప్పాడంటే తు.చ. తప్పక దానికి కట్టుబడి ఉంటాడు. తను ఏం చెబితే అది పొల్లు పోకుండా అలాగే జరగాలని కోరుకుంటాడు. లేదంటే పొరబాటు చేసిన వాళ్ళకి శిక్ష పడాల్సిందే.

అంతే ఆ రోజు నుండి మావో, జియాంగ్ కింగ్‌లు వేర్వేరుగా భోం చేసేవారు. ఎప్పుడన్నా ఇద్దరూ కలిసి భోం చేయాల్సి వచ్చినా మావో ఆవిడ కంచంలోంచి ఏమి ముట్టేవాడు కాదు. కానీ జియాంగ్ మాత్రం స్వతంత్రంగా తనకి ఏమి కవావాలన్నా మావో కంచంలోంచి తీసుకునేది. మసాలా దట్టించిన ఘాటు ఘాటు కూరలుంటే మావోకు తగని ఇష్టం. అప్పుడప్పుడూ జియాంగ్ కూడా నేను మాత్రం తక్కువ తిన్నానా అన్నట్లు ఆ కూరలు రుచి చూసేది.

కాలవల్లో పట్టే చేపలన్నా మావో ఇష్టంగా తినేవాడు.

ఒకసారి ఉత్తర షాంగ్సీలోని యాంగ్జియాగువోలో ఉండగా జనరల్ హేలాంగ్ మాంఛి చేపలు రెండు పంపించాడు. బొచ్చె చేపలేమో ఒక్కోటి ఇంతింత ఉన్నాయి. అందులో ఒకటయితే మరీనూ. ఝూవో ఆ రెండు చెపల్ని గొప్ప రుచిగా వండాడు. జియాంగ్ కింగ్ రెంటిలో పెద్ద చేపని మావోకు వడ్డించింది. తనకీ, వాళ్ళమ్మాయి లీనెకు చిన్న చేప అట్టేపెట్టుకుంది. చానా రోజులుగా నల్ల సోయాబీన్స్ పులుసు తినీ తినీ అక్కడ అందరి నోళ్ళూ చవి చచ్చిపోయాయి.

నేను మావోకు ఏం కావాలో చూస్తున్నా. లీనె ఆలనాపాలనా చేసే నర్సు హాన్ లీనె పక్క నుండి మరీ తనకు ఏం కావాలో చూసుకుంటుంది. (ఆ తర్వాతి కాలంలో హాన్‌తోనే నా పెళ్లి జరిగింది) లీనెకు వడ్డిస్తూనే ఆ చేపలోంచే చిన్న ముక్కలు రెండు హాన్‌కు వడ్డించింది

జియాంగ్. హాన్ మొహమాటంతో వొద్దనేసింది. కాని జియాంగ్ పట్టుపట్టేసరికి సోయాబిన్ పులుసు తినీ తినీ మొహం వాచి ఉన్న హాన్ కూడా ఇష్టంగా రుచిగా తింది ఆ చుప ముక్కల్ని జియాంగ్ కింగ్ తినాల్సిందే, తినాల్సిందే ఎంతా రెండు ముక్కలేగా, అని పట్టుపట్టిపుడు హాన్ కళ్ళలో సన్నటి కన్నీటి పొర నే గమనించా. అంతటి ఆత్మీయ బంధం వాళ్ళది.

మావో ఏవో డాక్యుమెంట్లు చదువుతూ, దీర్ఘంగా ఆలోచిస్తూ తనకు వడ్డించిన చేప తినేస్తూ ఉన్నాడు. సగం చేప తిని మిగతా సగం ఫళ్ళెంలో వొదిలేసి పైకి లేస్తూ 'ఇంకియావో ఇది నీ కోసం తినేయ్' అన్నాడు.

ఆ ఊహించని పరిణామానికి నేను 'అహాహా, నా కొద్దు' అన్నా కంగారుగా

'నేనేం ఎంగిలి మనిషిని కాదులేవోయ్ నాకూ శుచీ శుభ్రం తెలుసు చేప ఆ వైపు నే ఎంగిలి చెయ్యలేదు' అన్నాడు మావో.

'నా ఉద్దేశం అది కాదు సామీ. అది అట్లా రాత్రి భోజనంలో వడ్డిద్దామనీ' అన్నా నేను.

'నాకంత భాగ్యం వొద్దుగానీ, నువ్వు తినే. నిలవపెడితే చేప పుల్సు మూడ్రోజులుదాకా సుబ్బరంగా తినొచ్చు అంటారు కానీ - నాకు తాజాగా పండింది తినడమే నచ్చుద్ది. దా తిను' అని మావో లేచి వెళ్ళిపోయాడు.

జియాంగ్ కూడా తన కంచంలో ఉన్న నాలుగు ముద్దలూ గబగబా కతికేసి అక్కణ్ణించి లేచి వెళ్ళిపోయింది. ఎదురుగా ఆవిడ ఉంటే నే తినడానికి మొహమాటపడతానేమో అనే ఉద్దేశంతో.

ఆ రోజు నే తిన్న చేప రుచి జన్మంతా గుర్తుంది నాకు. నిజానికి ఆ చేప ముక్క నాకు వొదిలిపెట్టి, నిలవ పులుసు కూర నే తినను అని మావో చెప్పాడు కానీ - అది కారణం కాదనీ నాకూ చేప తినిపించాలనే ఉద్దేశంతోనే అలా అన్నాడని నాకు తెల్సు. గతంలో చాలా సార్లు ఆయన నిలవ పులుసుకూర తిన్నాడు. ఈ సంఘటన తర్వాత కూడా తిన్న సందర్భాలూ చాలానే ఉన్నాయి. కానీ ఆ రోజుల్లో తిండి కోసం కటకటలాడిన రోజులు కాబట్టి మావో ఆ సాకు చెప్పి నాతో చేప తినిపించాడు.

మావో తిండి సంగతి చెప్పుకోవాల్సిందే, కంచంలోంచి తినే బల్ల మీదకు ఒక్క మెతుకు ఎంగిలి రాలనిచ్చేవాడు కాదు, కంచంలోనూ ఒక్క మెతుకు కూడా మిగలకుండా

సుబ్బరంగా తినేసేవాడు. వయసులో ఉండగా వేడన్నం ఎంత ఇష్టంగా తినేవాడో చద్దన్నమూ అంత ఇష్టంగా తినేవాడు. ఒక్కోమాటు నీరుగారిపోయిన అన్నాన్నీ తినడం నే ఎరుగుదును. ఎటువంటి ప్రతికూల పరిస్థితుల నయినా తట్టుకోవడానికి ఈ అలవాట్లు చేసుకున్నాడు. 1948 చివర్లో అనుకుంటా సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ప్రతినిధిగా ఒక రహస్య సమాలోచన కోసం తన స్టాఫ్ ఆఫీసర్ ఇవానోవిచ్ మికోయాన్‌ను స్టాలిన్ తమ ప్రతినిధిగా జిబైపోకు పంపాడు. ఇవానోవిచ్ మావోతో పలుమార్లు సమావేశం అయ్యాడు. మావోతోపాటు ఛూటే, లీషావ్‌చి, చౌఎన్‌లై, రెన్ బిషిలు ఆ మీటింగుల్లో పాల్గొనేవారు. "ప్రజా విముక్తి సైన్యాన్ని యాంగ్జీనది దాటించి నడిపించాలనే నిర్ణయాన్ని మార్చుకొమ్మనీ, అలా చెయ్యడం మూలంగా అమెరికా నేరుగా జోక్యం చేసుకునేందుకు అవకాశం ఇచ్చినట్లు అవుతుందేమో" అనేది స్టాలిన్ పంపిన వర్తమానం. మావోను ఒప్పించడానికి ఇవాన్‌విచ్ చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు. మావో స్వతంత్రంగా నిర్ణయాలు తీసుకునే మనిషి. తనను ఎవరో వేలు పట్టుకుని నడిపిస్తే నడవాలనుకునే తత్వం కాదు అతనిది. చైనా విముక్తి కోసం ప్రజా విముక్తి సైన్యాన్ని ఎటువైపు ఎలా నడిపించాలో అప్పటికే నిర్ణయం జరిగి పోయినందున ఈ విషయమై మరో ఆలోచన లేదని మావో స్పష్టం చేసాడు. ఆ విషయాలు నేనింత లోతుగా పట్టించుకోలేదు కానీ ఇవానోవిచ్ పర్యటన సైడ్-లైట్స్ గురించి మీకు చెప్పాల్సిందే.

ఇవానోవిచ్ ఊలు పంట్లాం, కోటు-నెత్తిన 'ఫర్ టోపీతో డాబుగా దర్జారాయుడిలా ఉన్నాడు. కానీ చైనా కమ్యూనిస్టు అగ్రనేతలుగా ఉన్న ఛూటే, లీషావ్‌చి, చౌ-ఎన్‌లై, రెన్‌బిషి ఆఖరుకు మావోతో సహా ఐదుగురూ సాదాసీదా కాటన్ సైనిక యూనిఫారాల్లో ఉన్నారు. మావో యూనిఫారం కయితే అతుకులు కూడా ఉన్నాయి. ఇవానోవిచ్ వస్తూ వస్తూ వాళ్ళ దేశం నుండి డబ్బా తిండి (టిన్ట్ ఫుడ్), రకరకాల మద్యం సీసాలు తెచ్చాడు. విందుకు కూర్చున్నప్పుడు అవన్నీ బల్లమీద పరిపించేవాడు. మేం ఇచ్చిన ఆతిధ్యం మహా సాదాసీదాగా ఉండింది. పెరట్లో పెంచిన నాటు కోళ్ళను కోసి, దగ్గర్లోని హుటువో నదిలో దొరికే చేపలు తెప్పించి వండించి వడ్డించేవాళ్ళం. ఇవానోవిచ్ గ్లాసులు గ్లాసులు మందు పుచ్చుకునేవాడు భోంచేసేటప్పుడు, అదేదో మంచి నీళ్లు అయినట్లు గ్లాసుడు మందూ ఎత్తిన గ్లాసు దించకుండా తాగేవాడు. మావో మందు తీసుకునేవాడు కాదు. తాగితే మొహమదీ ఎర్రగా కందిపోయేది. ఛూటే గొంతు పూసింది. దాంతో తనూ మందు ముట్టలేదు. రెన్‌బిషికి బిపి-ఆయనా మందు ముట్టడు. లీషావ్ చీ మాత్రం రెండు రెండు మూడు పెగ్గులు బిగించేవాడు. మా లెక్క ప్రకారం చౌ-ఎన్-లై తాగుబోతు. అందర్లోకి ఆయనే రెండు పెగ్గులు ఎక్కువ పుచ్చుకునేది. ఇవానోవిచ్ తాగుడు చూసి చౌ-ఎన్-లైను తాగుబోతని అనవసరంగా

అనుకున్నామే అనిపించింది మాకయితే. ఇవానోవిచ్ జిబైపోలో వారం రోజులు గడిపాడు. మూడు నాలుగుసార్లు మావో వాళ్ళతో కలిసి విందుకు కూచున్నాడు. చర్చలన్నీ సామరస్యంగానే జరిగేవి. కానీ ఎందుకో మావో ఒకింత రవరవలాడేవాడు. విందులో 'షో' అంతా సోవియట్లు కొట్టేస్తున్నారని కామోసు. దాంతో హఠాత్తుగా 'ఆఖరి రౌండు పొయ్యండ్రా అబ్బాయ్' అని అక్కడితో పార్టీ ఖతమ్ చేసేసాడు.

'మీ వంటకాలు చాలా రుచిగా ఉంటాయ్. అయితే ఎలా వండాలో మాకు తెలీదు. మీరు విజయం సాధించి ఈ దేశంలో ఎర్రజెండా ఎగురవేసాక మీ వంటలు నేర్చుకోవడానికి మా దేశం వాళ్లని దఫదఫాలుగా పంపిస్తాం' అన్నాడు ఇవానోవిచ్ ఒక మారు.

అప్పుడు మావో ఒకింత గర్వంతో – 'ఈ ప్రపంచానికి చైనా రెండు బహుమతులు అందిస్తుంది. ఒకటి మందూ మాకులకు ఉపయోగించే మొక్కలు, తీగలు రెండు చైనీస్ ఫుడ్' అని చెప్పాడు.

సోవియట్ ప్రతినిధులతో విందుకు కూర్చున్నప్పుడు ఒకతను ఆ రోజు వడ్డించిన చేప రోస్టు కేసి చూస్తూ ఫోర్కుని అందులో గుచ్చానా లేదా అన్నట్లుగా పైపైన పట్టుకుని 'ఇది తాజా చేపేనా బతికున్న చేపే వొండారా' అనడిగి అవునన్నాక గానీ దాన్ని ముట్టలేదు. ఇదంతా మావో ఓ కంట గమనించాడు.

ఒక ఏడాది తర్వాత మావో మాస్కో పర్యటనకు వెళ్ళాడు. తనతోపాటు వచ్చిన వంట అతన్ని పిలిచి 'నువ్వు చేప వొండాల్సి వస్తే బతికిందో, చచ్చిందో అడిగి తెల్సుకో, చచ్చిన చేపయితే అవతలకి గిరాటు వెయ్యమని చెప్పు.... తెల్సిందా' అని నిక్కచ్చిగా చెప్పాడు.

అనుకున్నట్లుగానే సోవియట్లు ఒక రోజు చేప తెచ్చారు. స్పెషల్ గార్డు దళానికి చెందిన కల్నల్ స్థాయి అధికారి మందీ మార్బలంతో స్వయంగా వచ్చాడు. వాళ్ళు తెచ్చింది చచ్చిన చేపలు. మావో మాట ప్రకారం వంటతను 'తీసుకెళ్లి ఏట్లో పారేయ్యండి' అని చెప్పాడు. దాంతో కల్నల్ వాళ్ళు తెల్లబోయారు. ఎందుకలా జరిగిందో మాకు తప్ప వేరే ఎవరికీ తెలిసే అవకాశం లేదు. దుబాసీగా ఉన్న అతను 'మావోకు మట్టగిడసల్లా బతికి ఉన్న చేపలంటే ఇష్టం' అని చెప్పాడు కల్నల్‌కు. 'అట్లా అయితే అవే తెప్పిద్దాం' అని కల్నల్ ఆ పని మీద వెళ్ళాడు.

ఈ వార్త క్రెమ్లిన్ అంతా పాకింది. 'మావో బతికిన చేపలంటేనే ఇష్టపడతాడట' అని తెగ చెప్పుకున్నారు. ఏడాది క్రితం జరిగిన సంఘటన గుర్తొచ్చి మేం నవ్వుకున్నాం.

# 11. నవ చైనా ఆవిర్భావం

**మా**వో జెడాంగ్, తన సహచర కామ్రేడ్స్ నాయకత్వంలో దశాబ్దాల తరబడి సాగిన సాయుధ పోరాటం విజయవంతమై ఎట్టకేలకు 1949 అక్టోబర్ 1న నవ చైనా ఆవిర్భవించింది.

ఆ రోజు ఉదయం ఆరున్నర ఆ ప్రాంతం అప్పుడు మావో నన్ను పిలిచి 'నాకు కాసేపు పడుకోవాలనుంది' అన్నాడు. అంత పొద్దుటపూట పడుకోవాలనుంది' అని అడిగేసరికి నిద్రలేమితనం (ఇన్‌సోమ్నియా)తో బాధపడే మావో సంగతి తెలుసుకాబట్టి నే కాదనలేకపోయాను. మావో స్నానం చేసొచ్చి 'ప్రస్తుతానికి నాకు ఇంకేం అక్కర్లేదు, నువ్వెళ్ళొచ్చు' అని నాతో అనేసి తను పక్కమీద వాలిపోయాడు. నేను గార్డు ఆఫీసుకు వచ్చేసాను.

గార్డు ఆఫీసులో నాలుగు కుర్చీలు రెండు మేజాలతోపాటు ఒక మంచం కూడా ఉంది. 'ఇరవై నాలుగు గంటల డ్యూటీ మీద ఉంటే మరో ముగ్గురు ఎనిమిది గంటల షిఫ్టున పని చేసేవాళ్ళు. వీలు దొరికినప్పుడల్లా నడుం వాల్చడానికి ఆఫీసు రూంలోనే మంచం ఏర్పాటు చేసుకున్నాం. మావో బెడ్‌రూంలో స్విచ్ నొక్కితే మా ఆఫీసులో మోగేట్లు ఒక ఎలక్ట్రిక్ బెల్లు పెట్టుకున్నాం. దాంతో ఆయనకి ఏదన్నా 'అవసరం పడితే' ఆ బెల్లు నొక్కేవాడు. మేం ఠకీమని వెళ్ళేవాళ్ళం. ఆ రోజు నాది 'డే అండ్ నైట్' డ్యూటీ.

కాసేపు పడుకుంటా అన్నాడే గానీ మావో ఇంకా పక్క మీద యథాప్రకారం మెసికింతలాడతానే ఉండి ఉంటాడు అనిపించింది నాకు. ఇలాంటప్పుడు ఆఫీసు గదిలో ఉన్న మంచం మీద నడుం వాల్చడం నాకు అలవాటు కానీ ఆ రోజున నడుం వాల్చదలచలేదు. ఇవాళ నవచైనా ఆవిర్భావ ప్రకటనోత్సవం. అంత గొప్ప చారిత్రక సంఘటన జరగాల్సిన రోజున అదమరుపున కునుకు తీస్తే షెడ్యూలు అంతా ఖరాబు అవుతుందేమో అనే భయం నాది. మావోకు బెల్లు మోగించే అవసరం లేకుండా నేనే వెళ్ళి ఆయన్ని నిద్రలేపాలని నిర్ణయించుకున్నా.

మధ్యాహ్నం ఒంటిగంట అయింది. ఈ పాటికి బెల్లు మోగాలి. అయినా మోగలేదు ఎందుకో. సమయం ముంచుకొచ్చేస్తుంది అవతల. ఆ కంగారుతో నేనే వెళ్ళి 'కామ్రేడ్

ఛైర్మన్' అని ముమ్మారుపిలిచా ఆయన్ని నిద్రలేపటానికి. 'ఏంటిదనీ' అంటూ కళ్ళు విప్పి ఆవులిస్తూ మేల్కొన్నాడు మావో.

'ఒంటి గంట దాటతా ఉంది' అంటూ తల కట్టున దిళ్ళు సదిరా. మావో లేచి మంచం తలకట్టుకి నడుం ఆనించి విశ్రాంతిగా కూచున్నాడు. నేను ఇచ్చిన తడి తువ్వాలుతో మొహం తుడుచుకున్నాడు. బద్దకం వొదిలిపోయిందల్లే ఉంది. గట్టిగా శ్వాస తీసుకున్నాడు. అప్పటికే మంచం పక్కన మేజాబల్ల మీద వేడిగా సెగలు కక్కుతున్న టీ కప్పు అందుకుని ఒక గుక్క తాగాడు. వేడి వేడి టీ కొద్దికొద్దిగా చప్పరిస్తూ అలవాటుగా రెండో చేత్తో పేపరు అందుకుని తిరగెయ్యసాగాడు. నేను మావో వేసుకోవడానికి 'డ్రస్' సిద్ధం చేసే పనిలో పడిపోయా.

యేజిలాంగ్ నుండి ప్రత్యేకంగా తెప్పించిన ఖాకీ రంగు 'ఉలెన్ యూనిఫారం' తీసి పెట్టా. అమెరికా సైనికాధికారులు కూడా అప్పట్లో ఇదే రంగు దుస్తులు వాడేవాళ్ళు. ఫ్రాన్సులో చదువుకుని వచ్చిన స్టూడెంట్ కుర్రాడు వాంగ్ జిక్యుయింగ్ ఆ డ్రెస్సు కుట్టాడు. తరువాతి కాలంలో వాంగ్ ఫుజింగ్ వీధిలో ఉన్న అతని షాపే 'లీమెంగ్ టైలర్ షాపు'గా పేరు పడింది. జియాంగ్ కింగ్‌కు కూడా అతనే దుస్తులు కుట్టేవాడు. మావో పిల్లలు లీమిన్, లీ నెలకు కూడా కొంతకాలం అతని దగ్గరే బట్టలు కుట్టించేవాళ్ళు.

అటు చేసీ ఇటు చేసి అరగంట గడిచింది. 'ఒంటిగంటన్నర దాటతా ఉంది' అన్నా నేను మావోతో. దాంతో ఆయన చదూతున్న పేపరు పక్కన పెట్టాడు. మంచం దిగి నే సిద్ధం చేసి ఉంచిన డ్రస్ తీసుకున్నాడు. నేను పంట్లాం మడతలు, కోటు మడతలూ సరిచేసా. సరిగ్గా కుదిరింది డ్రస్సు అనుకున్నా. వేడివేడిగా భోజనం వడ్డించా, నిమిషాల్లో భోజనం కానిచ్చేసాడు. కాసేపు విశ్రాంతిగా కూర్చుని బయల్దేరాం. సరిగ్గా రెండు గంటలు అయ్యేసరికి ఝూంగ్‌నాన్హైలో ఉన్న క్విన్‌జెంగ్ హాలుకు చేరుకున్నాం. చూటే, లీషావ్‌చి, చౌ-ఎన్-లై, రెన్‌బిషి, ఛాంగ్‌లీన్, లీజిషెన్, సూంగ్‌చింగ్ లింగ్, గావోగాంగ్‌లు కూడా అపాటికే అక్కడ ఉన్నారు. కేంద్ర ప్రజా ప్రభుత్వ మండలి తొలి సమావేశానికి వాళ్ళంతా హాజరయ్యారు. తొలుత వాళ్ళందిరతో ప్రజా ప్రభుత్వ మండలి సభ్యులుగా ఎంపిక చేసినట్లు ప్రకటించారు. ఆ తరువాత ఓ పది నిమిషాల పాటు అందరూ గొప్ప ఉత్తేజంతో మాట్లాడుకున్నారు.

పది నిమిషాల తక్కువ మూడు గంటలకు అందరూ బయటకు వచ్చి హాలు బయటకు వచ్చి హాలు బయట వరసాగ్గా నిలిపి ఉంచిన కార్లు ఎక్కారు. ఝూంగ్‌వాన్హై తూర్పు దిక్కున

ఉన్న గేట్లోంచి కార్లో వారు బయల్దేరారు. ఐదు నిమిషాల్లో తియాన్మెన్‌కు చేరుకుంది. అందరూ కార్లు దిగి వచ్చి వరుసగా నిలబడ్డారు. మావో అగ్రభాగాన, పైన ఏర్పాటుచేసిన వేదిక వైపు సాగారు. అప్పటికి ఇంకా తియాన్మెన్ కూడలిలో 'టన్నెల్' నిర్మించలేదు. వందమెట్లు ఎక్కాల్సి వచ్చేది పైకి చేరుకోవడానికి. నేను మావోకు సాయంగా నిలిచాను. సరిగ్గా మూడు గంటలకు అందరూ వేదిక మీదకు చేరుకున్నారు.

ఇప్పుడు 'తియాన్మెన్ స్క్వేర్'గా పేరొందిన బహిరంగ స్థలి అప్పట్లో పెద్ద 'క్రాస్' ఆకారంలో ఉండేది. దాదాపు మూడు లక్షల మంది జనాభా కూడేందుకు అనువుగా ఉండేది. తూర్పు దిక్కున ఉన్న పురాతన ఇంపీరియల్ దేవాలయానికి, పడమర దిక్కు ఉన్న ఝూంగ్‌షాన్ పార్క్‌కు మధ్యగా ఉండే తియాన్మెన్ మధ్య నుండి ఓ గేటు ఉత్తరానికి, ఝూంగ్ హువా గేటు దక్షిణం కొసకి ఉండేది. జనం తండోపతండాలుగా రావడంతో సభా స్థలి కిక్కిరిసిపోయి ఉంది. ప్రతి వాళ్ళ చేతిలో ఎర్రజెండా రెపరెపలాడుతూ ఉంది. రంగురంగుల దుస్తులు ధరించిన జనాల చేతుల్లోని ఎర్రజెండాలతో ఆ ప్రాంతం అంతా పూల తోటలా విలసిల్లింది. తియాన్మెన్ ఎదురుగా ఏర్పాటుచేసిన మార్బుల్ రాయి ఫ్లాట్‌ఫారమ్‌లలో ఒకదాని మీద సైనిక పెరేడ్ డైరెక్టర్లు. ఇంకో దాని మీద సోవియట్ ప్రతినిధివర్గం కూచుని ఉన్నారు.

మావో ఉచితాసనంలో కూచున్నాడు. సెక్రటరీ– జనరల్ లిన్ బొక్యుయు కార్యక్రమం ప్రారంభం కాబోతుందని ప్రకటించాడు. మావో లేచి వచ్చి మైక్రోఫోన్ ముందు నిలుచున్నాడు. జనాన్ని కలియచూసాడు. ప్రజలంతా ఉత్కంఠంతో ఉన్నారు. మావో అలవోకగా ఒకసారి భుజాలు ఎగురవేసి 'జన చైనా రిపబ్లిక్కు, కేంద్ర ప్రజా ప్రభుత్వాల ఆవిర్భావాన్ని ప్రకటిస్తున్నాను' అన్నాడు. వసంతకాలపు మేఘ గర్జనలా మావో గొంతులోంచి వచ్చిన ఆ మాటలు నలుదిక్కులా ప్రతిధ్వనించాయి. అంతే జనం ఉత్సాహంతో కేరింతలు ఏర్పాటుచేసిన స్విచ్ నొక్కాడు. ఐదు నక్షత్రాలతో ఉన్న భారీ ఎర్ర పతాకం జెండా కొయ్యన ఎగిరింది. ప్రజా వీరుల స్మృత్యర్థం ఏర్పాటుచేసిన రాతి చెక్కుడు కట్టడానికి ఎదురుగా జెండా రెపరెపలాడుతూ ఎగురుతోంది. మావో జెండా ఎగరవెయ్యడం తోటే యభైనాలుగు తుపాకులు ఒక్కసారిగా ఆకాశంలోకి బారుసాచి 'ధన్‌ధన్' మని గర్జించాయి. వరుసగా ఇరవై ఎనిమిదిసార్లు పేలాయి. ఆ యాభై నాలుగు తుపాకులు రాజకీయ చర్చా సదస్సులో ఏర్పాటు చేసిన యాభై నాలుగు అధ్యయన కమిటీలకు గుర్తుగాను, చైనాలోని ఇరవై ఎనిమిది రాష్ట్రాలూ ఉక్కులాంటి ఐక్యతతో ఉన్నాయని చాటడానికి ప్రతీకగా అన్నిసార్లు తుపాకులు పేల్చారు.

దేశంలోని వివిధ ప్రాంతాలను, ప్రపంచంలోని వివిధ దేశాలను ఉద్దేశించి చైనా ప్రజా ప్రభుత్వం చేసిన ప్రకటనను మావో చదివి వినిపించాడు. చైనా ప్రజల సార్వభౌమిక ప్రభుత్వంగా జన చైనా ప్రపంచ దేశాలతో రాయబార సంబంధాలు ఏర్పాటు చేసుకోవడానికి సిద్ధంగా ఉందనీ, సమానత్వం, ఉభయత్రా గౌరవం, పరస్పర సహకారం, ఒండొరుల భౌగోళిక, సార్వభౌమిక హక్కులపట్ల గౌరవం ప్రాతిపదికలుగా జన చైనా విదేశాలతో సంబంధ బాంధవ్యాలు నెరవుతుందని ప్రకటించాడు ఆ సందర్భంగా.

ఆ తరువాత సైనిక కవాతు కన్నుల పండువగా జరిగింది. జనరల్ నీ రోంగ్ జెన్ నాయకత్వాన నాలుగు డివిజన్ల దళాలు పెరేడ్‌లో పాల్గొన్నాయి. ముందుగా కాల్బలం ఆ వెనుక అశ్విక దళం, దాని వెనుకగా యుద్ధ ట్యాంకులు, వాటి వెనుకగా సాయుధ మిలటరీ ట్రక్కులు బారులు తీర్చి కవాతులో పాల్గొన్నాయి. ప్రజా విముక్తి సైన్యం మార్చింగ్ గీతం, జెండాల రెపరెపలు తప్ప కవాతు జరిగినంత సేపూ ఆ ప్రదేశం అంతా నిశ్శబ్దంగా ఉన్నట్లు అయిపోయింది. సైనిక కవాతు పూర్తి కావడంతోటే ఆకాశంలో వైమానిక విన్యాసాలు ప్రారంభం అయ్యాయి. దాంతో జనాలు అందరూ పైకి చూస్తూ హర్షధ్వానాలు చేసారు.

దాదాపు మూడు గంటలపాటు జరిగింది ఆ ఉత్సవం. పొద్దువాలింది. చీకటి అలుముకుంది క్రమంగా. దాంతో సభాస్థలి అంతా రంగురంగుల్లో కాంతులీనుతున్న లాంతర్లు, టార్చిలైట్లు వెలిగించారు. ప్రజల ఆనందోత్సాహాలు, ఆకాంక్షలకు ప్రతీకలుగా ఆ ప్రదేశం అంతా సువర్ణ శోభితమయింది. ప్రజలు 'మావో వర్ధిల్లాలి' అని ఎలుగెత్తి నినదించారు.

మధ్యాహ్నం మూడు గంటల నుండి రాత్రి పది గంటల వరకూ జన చైనా ఆవిర్భావోత్సవం జరుగుతున్నంత సేపూ మావో అలా నిలబడే ఉన్నాడు. మధ్యలో 'యిన్ జిన్ షెంగ్' కుర్చీ ఎదరకు తెచ్చాడు. మావోను కూర్చోమని అడిగాడు. కానీ మావో కుర్చీ వద్దనేసాడు. అన్ని గంటల పాటు అలా నిలబడి సైనిక కవాతు జరిగినంత సేపూ సెల్యూట్ చేస్తూ మిగతా సమయంలో ప్రజలకేసి పలకరింపుగా చేతులు ఊపుతూ గడిపాడు. అంత శక్తి ఎట్లా వచ్చిందో అని నాకు ఆశ్చర్యం వేసింది. జనాలు మావో వర్ధిల్లాలి అని నినదించిన ప్రతిసారీ మావో కూడా మైక్రోఫోన్లోంచి 'ప్రజలు చిరకాలం వర్ధిల్లాలి' ప్రజా వీరులు వర్ధిల్లాలి' అని నినాదాలు ఇచ్చాడు. ప్రజలు ఆనందంతో కేరింతలు కొడుతూ, నృత్యాలు చేసారు.

'జీవితకాలానికి సరిపడా తృప్తినిచ్చే అనుభవం ఎదురవడం అంటే ఇదే' అన్నాడు చెన్‌యి ఉద్వేగంతో.

రాత్రి పదిగంటలకు అంతా తిరుగుముఖం పట్టాం. ఇంటికి రాగానే మావో ఆ పూట వేసుకుని విడిచిన యూనిఫారాన్ని భద్రంగా దాచిపెట్టా, ఇంకెప్పుడైనా ప్రత్యేక సందర్భాలు వస్తే వాడొచ్చని.

అప్పట్లో ఆర్మీకి స్థిరంగా ఒక యూనిఫారం అంటూ లేదు. బీజింగ్‌లో జరిగిన కవాతుకు హాజరయిన సైనికులు వేసుకున్న యూనిఫారం కొమింటాంగ్ మిలిటరీ డిపోల్లోంచి స్వాధీనం చేసుకున్న అమెరికన్ సైనికుల డ్రస్సులే. మా దృష్టిలో ఖాకీ రంగులో ఉండేది ఏదయినా మాకు యూనిఫారమే. ఎందుకయినా మంచిదని యే జిలోంగ్ నుండి అదే రకం బట్ట తెప్పించి వాంగ్ జికింగ్ దగ్గర మూడు జతల యూనిఫారం కుట్టించి ఉంచాను మావో కోసం.

కొరియా యుద్ధానికి ముగింపుగా 'నిర్యుద్ధ సంధి' ఒప్పందం మీద సంతకాలు చేసాక 'ఇక మనం ఆర్మీయూనిఫారాలు వాడడం మానేస్తే మంచిది ఇహ నుంచి నేను ఆ యూనిఫారమ్ తొడగను మీరూ తొడగొద్దు' అన్నాడు మావో మాతో. అప్పట్నించి మేం సైనిక దుస్తులు తొడగడం మానేసాం. నవచైనా ఆవిర్భావ దినోత్సవం రోజున మావో తొడుక్కున యూనిఫారం నేను కుట్టించిన మరో మూడు జతల యూనిఫారం ఆ తరువాత మావో ఎన్నడూ వాడలేదు.

1954లో అనుకుంటా చైనా సైనిక దుస్తులు రంగూ, రూపూ మార్చమని ఆదేశించాడు మావో. జియాంగ్ కింగ్‌తో 'బీరువాలో ఉంచిన నా యూనిఫారాల అవసరం పడదు ఇంకా-ఎవరికన్నా ఇచ్చెయండి' అని చెప్పాడు.

నేను ఓ రోజున ఆఫీసుకు రాగానే అమ్మగారు పిలుస్తున్నారని కబురు వచ్చింది. నేను జియాంగ్ కింగ్ దగ్గరకు వెళ్ళా. ఆవిడ నన్ను చూసి బీరువాలోంచి మావో సైనిక యూనిఫారమ్ జతలు తీసుకొచ్చి 'ఛైర్మన్ ఇహ నుండి ఈ యూనిఫారాలు వాడనన్నారు. ఇహనుండి వీటిని నువ్వే వాడుకో ఇంకియావో' అంటూ నా చేతికి ఇచ్చింది. నేను భావోద్వేగంతో ఆ బట్టలు అందుకుని జియాంగ్‌కు ధన్యవాదాలు చెప్పి వచ్చేస్తుంటే వెనుక నుండి ఆవిడ 'నీకు అభ్యంతరం లేదనుకుంటే సన్‌యాంగ్‌కు ఓ జత ఇయ్యి ఇంకియావో. అవి అచ్చంగా నీవే. నీకు అభ్యంతరం లేదనుకుంటేనే ఇయ్యి' అన్నారు.

మావో అంగరక్షక దళంలో సన్‌యాంగ్ డిప్యూటీ కమాండర్. జియాంగ్ ఆ మాట అనేసరికి నేను మావో జన చైనా ఆవిర్భావ దినోత్సవం రోజున తీసుకున్న యూనిఫారం నా కోసం అట్టే పెట్టుకుని మిగిలిన మూడు జతలూ సన్‌యాంగ్‌కు ఇచ్చాను. అలా ఆ

జతనే నేను అట్టే పెట్టుకోవడంతో ఆ రోజున ఆ డ్రెస్సుకు ఉన్న చారిత్రక ప్రాధాన్యత గురించి ఆలోచించలేదు నేను. అది అమెరికన్‌ల యూనిఫారం కావడం, ఉన్నవాటిలో మన్నికగా ఉండడంతో అది నేను అట్టేపెట్టుకోవాలని ఆ క్షణాన భావించాను.

ఆ జత తొడుక్కుంటే నాకు బాగా వొదులొదులుగా అనిపించింది. అందుకే నా సైజుకు తగినట్లుగా కుట్లు వేయిద్దాం అనుకున్నాం. ఆ మాటే మా ఆవిడతో అంటే 'చాల్చాల్లే అట్టా ఎట్లాకుదురుద్దీ' అంది! అనడిగా నేను. 'ఏందనుకున్నావ్, పట్టాభిషేకం జరిగినపుడు మహారాజును తొడుక్కునే చీనీ చీనాంబరాలతో సమానం ఆ బట్టలు. పదిలంగా, భక్తిగా చూసుకోవాల్సిందిపోయి కత్తిరించి నీ సైజుకి కుట్టించుకుంటానంటావా' అనడిగింది మా ఆవిడ.

'రాజులూ పోయారు, ఆ రాజ్యాలూ పోయాయి ఇప్పుడిది నవ చైనా. నువ్వేం మాట్లాడుతున్నావో అర్థం ఉందా అసలూ? మావోనే చాలామాట్లు చెప్పాడు- ఇది ప్రజా ప్రభుత్వం, ప్రభుత్వాధినేత అంటే మహారాజుగారు అనుకోమాకండి- ప్రభుత్వాధినేత అంటే ప్రజా సేవకుడు అని. తెల్సా' అనడిగా నేను మా ఆవిడని. తను మారు మాట్లాడలేదు మరి.

ఎంతో చారిత్రక ప్రాధాన్యత కల మావో యూనిఫారాన్ని నేను సైజు చేయించి కుట్టించుకుని మరీ తొడిగి వాడుకున్నాను.

1967లో టియాన్జిన్ చారిత్రక పురావస్తుశాల వాళ్ళు ఆ జత యూనిఫారం కోసం నన్ను సంప్రదించారు. ఆ జతకు బదులుగా కొత్త సూటు ఇస్తాం అన్నారు. అప్పటికే ఆ యూనిఫారంకు ఉన్న చారిత్రక ప్రాధాన్యతను నే గుర్తించక 'సరే ఈ బేరం ఏదో బాగుందే' అనుకుని వారికి ఆ 'డ్రస్సు' ఇచ్చేసా.

ఆ తరువాత కొన్నాళ్ళకు కేంద్ర చారిత్రక పురావస్తుశాల వాళ్లు- మావో మరణానంతరం - ఆ 'డ్రస్సు' కోసం నాకు కబురు పంపారు. అప్పుడు తెలిసివచ్చింది. నాకు నేను ఎంత బుద్ధిలేని పని చేసానో. నేను ఆ యూనిఫారాన్ని సైజు చేయించడం, కొత్త సూటు కోసం మారకం వెయ్యడం ఎంత తప్పో తెలిసివచ్చింది. టియాన్జిన్ పురావస్తుశాలవాళ్ళను నేనిచ్చిన డ్రస్సు వాపసు ఇమ్మని అడిగా. దానికి వాళ్ళు నిరాకరించారు. దాంతో కేంద్ర పురావస్తుశాల వాళ్ళు సన్‌యాంగ్ దగ్గర ఉన్న యూనిఫారమ్ తీసుకుని దానినే నవ చైనా ఆవిర్భావ దినోత్సవం నాడు మావో తొడుక్కున్న యూనిఫారమ్‌గా ప్రదర్శనలో ఉంచారు. కాని అది నిజం కాదని నాకు మాత్రమే తెలుసు.

# 12. అర్ధాంగితో జీవితం

పదిహేనేళ్లపాటు - మావో అంగరక్షకుడిగా పనిచేసిన నా అనుభవం దృష్టిలో మావో-జియాంగ్ కింగ్‌ల మధ్య ఎంతటి అపారమైన ప్రేమానుబంధం ఉండేదో అంతటి ఎడమొహం పెడమొహంగానూ ఉండేవారు ఒక్కోసారి. వాళ్ళిద్దరూ వైవాహిక జీవితాన్ని ఆనందంగానే గడిపారు. ఐతే వాళ్ళిద్దరి మధ్యా తలెత్తిన తగాదాలు వారి వైవాహిక జీవితం మీద ప్రభావమూ చూపాయి.

పుట్టుకతోనే ఎవరూ మోసకారి తనంతో పుట్టరు. ఎదిగే క్రమంలో అబ్బే లక్షణం ఇది. ఈ అమానవీయ లక్షణం కొందరిలో అంతర్లీనంగా వయసు పెరిగే కొద్దీ బయట పడుతుంది. మరి కొందరిలో బాహాటంగానే అట్టే వయసురాకముందే బట్టబయలవుతుంది. 'హీరోదాత్త లక్షణాలున్న మనిషే రాత్రికిరాత్రే కరుగుగట్టిన నేరస్తుడిగా మారతాడు' అని మా చైనాలో ఒక సామెత ఉంది. పోలిక తీసుకురావడం కాదుగానీ జియాంగ్ కింగ్ వ్యక్తిత్వం అంచనా వేసేటప్పుడు నాకు ఈ సామెత గుర్తుకు రాకమానదు. అయితే నా అంచనా వేసేటప్పుడు నాకు ఈ సామెత గుర్తుకు రాకమానదు. అయితే నా అంచనా సరైనదో, కాదో కాలమే నిగ్గు తేల్చాలి.

జియాంగ్ కింగ్ జిత్తులమారి మనిషిగా ఎలా మారిందో అని వివరించడం నా ఉద్దేశం కాదు. చెప్పాలంటే ఆ సంగతులు నాకు అంతగా తెలియవు. బహుశా 'సాంస్కృతిక విప్లవం' చోటు చేసుకున్న కాలంలో కామోసు జియాంగ్ తీవ్ర నిరాశతో కూరుకుపోయింది. సరిగ్గా అప్పుడే నన్ను వేరే బాధ్యతలలోకి బదిలీ చేసారు. నేను మావోను విడిచి వెళ్లిపోయాను. ఆ తరువాత జియాంగ్‌ను ఎన్నడూ కలవలేదు. ఐదే ఆవిడ గురించి నాకు తెలిసిన కొన్ని విషయాలు మాత్రం నే ప్రస్తావిస్తాను.

1937 జులై 7న మార్కోపోలో బ్రిడ్జి సంఘటన తరువాత యావత్ దేశం జపాన్ దురాక్రమణ దారుల యుద్ధంలో మునిగిపోయింది. అప్పుడే అనేకమంది దేశభక్తులకు యేనాన్ ప్రత్యేక ఆకర్షణగా నిలిచింది. కాని అక్కడ రోజువారీ జీవితం బహుదుర్లభంగా ఉండేది. పని ఒత్తిడి కూడా విపరీతంగా ఉండేది. అందుకే అక్కడకు ఉత్సాహంగా అడుగు పెట్టినవాళ్లు కూడా ఆ ఒత్తిడికి తట్టుకోలేక తిరుగుముఖం పట్టేవారు. కాని జియాంగ్ కింగ్ మాత్రం మావోను అంటిపెట్టుకుని అక్కడే ఉండి. కష్టకాలంలో నిభాయించుకురావడం ఆవిడకే ఉన్న సానుకూల పార్శ్వం. అయినా ఆవిడ విప్లవం పట్ల పరిపూర్ణమైన నిబద్ధతతో

ఉంధని మాత్రం చెప్పలేం. మావో అనేక తడపలు ఆవిడ మొహం మీదే 'నీలో ఇంకా బూర్జువా దర్పం పోలేదు' 'దోపిడీదార్ల ఆలోచనల నుండి నువ్వింకా బయటపడలేదు' అనేవారు. ఈ విమర్శ నన్ను చాలా ఆకట్టుకుంది. విప్లవం పట్ల ఆపేక్ష లేకపోతే జియాంగ్‌తో మావో ఈ రకమైన వాదులాటకు దిగి ఉపయోగం ఏముందీ? జియాంగ్ జీవిత పర్యంతం విప్లవకారిణిగా ఉంది కాబట్టే మావో అలా విమర్శనా పూర్వకంగా మాట్లాడాడు.

ఆ రోజుల్లో యేనాన్‌లో చాలామంది యుక్త వయస్కురాళ్ళయిన ఆడపిల్లలు ఉన్నారు. అందులో నడత దృష్ట్యాగానీ, అందం, తెలివితేటల దృష్ట్యాగానీ గొప్పగా రాణించేవాళ్ళకూ కొదవలేదు. వాళ్ళలో చాలామంది ఆ తరువాత కాలంలో ప్రజా విప్లవ సైన్యంలో పెద్దపెద్ద ఆఫీసర్లను, ఉన్నతాధికారులను పెళ్ళాడారు. చెప్పాలంటే అటు పార్టీలోనూ, ఇటు సైన్యంలోనూ అగ్రస్థానంలో ఉన్న మావోను ఎవరు కాదనుకుంటారు. మావో అన్నివిధాలా తనకు తగినట్లుగానే జియాంగ్‌కింగ్‌ను వివాహమాడారు. కాని కొన్ని పత్రికలలో ఆయన తనకు తగిన ఆమెను పెళ్లాడలేదు అనే అర్థంలో వార్తలు వ్యాసాలూ వొచ్చాయి, కానీ అది సరికాదు.

జియాంగ్ కింగ్ వయసులో ఉండగా బహు అందంగా ఉండేది. కోటేరేసిన ముక్కు విల్లంబుల మాదిరి వొంపు తిరిగిన కనుబొమ్మల కింద చెంపకు చేరదేసి అంత ఉండే కళ్ళు, కుదురైన జుత్తు, తీరైన నాభితో ఇట్టే ఆకర్షించేది తన రూపం.

అప్పట్లో మాకు ఆవిడ సిన్మాస్టారు లెక్క బీజింగ్ ఒపేరాలలో కూడా అద్భుతంగా ఆడేది. 'బెస్తవాడి ప్రతీకారం' అన్న ఒపేరాలో ఆవిడ నటనకు ముగ్ధులైపోవాల్సిందే ఎవరైనా. పార్టీ సెంట్రల్ కమిటీ నాయకులూ, మావో ఆ ఒపేరా అంటే ఎంతగానో పడి చచ్చిపోయేవాళ్ళు. ప్రజా విముక్తి సైన్యంలో పనిచేసే మాకోసం కూడా ఆమె చాలామార్లు నాట్యం చేసింది. లీనె తన తల్లిగారయిన ఆవిడ దగ్గరే రంగస్థల ఓనమాలు దిద్దుకుని మెళకువలు నేర్చుకుంది. ఉత్తర షాంగ్సీలో ఉధృతమైన ప్రజా యుద్ధ పోరాటం కొనసాగుతున్న కాలంలో మా సైనికులకు ఆటవిడుపుగా ఉండేందుకు లీనె ఒపేరా నాట్యం చేసింది.

జియాంగ్ కింగ్ రాత ఎంత అందంగా ఉండేదో. అందులోనూ పాత సుడికారంలో రాసేదేమో బొమ్మ గీసినట్లుగా ఉండేది ఆవిడ రాస్తే. లీనె 'కాలీగ్రఫీ' నేర్చుకునేటప్పుడు మావో ఒకసారి' ఈ విషయంలో మాకన్నా వాళ్ళ అమ్మే తనకు ఇంకా బాగా నేర్పగలదు. చాలా అందమైన దస్తూరీ తనది. టీచర్లకు ఉండేంత నేర్పు ఓర్పు ఉన్నాయి తనలో' అంటూ జియాంగ్‌ను ఆకాశానికి ఎత్తేస్తూ పొగిడాడు కూడా.

జియాంగ్ గుర్రపు స్వారీలో కూడా మంచి అనుభవజ్ఞురాలు. ఎంతటి పొగరుమోతు

గుర్రాన్నయినా ఇట్టే మచ్చిక చేసుకునేది. ఆవిడ చేతికి లొంగని గుర్రం అంటూ ఉండేది కాదని అందరూ అనుకుంటూ ఉండేవాళ్లు. ఉత్తర షాంగ్సీలో ఉన్నప్పుడు జనరల్ హేలాంగ్ ఆవిడకు ముదురు గోధుమరంగులో ఉండే ఒక గుర్రాన్ని బహుమతిగా అందించాడు. జియాంగ్ ఆ గుర్రం మీదే స్వారీ చేసేది. యేనాన్‌లో ఉండగా తరచూ తనతో పోటీకి రమ్మని మగాళ్ళను కవ్వించేది ఆవిడ. పోటీలో ఎప్పుడూ ఆవిడే నెగ్గేది. ఒకసారి మావో సూచన మేరకు చౌ-ఎన్-లై సెంట్రల్ పార్టీ నిర్వహిస్తున్న క్లాసులో పాఠం చెప్పడానికి వచ్చాడు. యాంగ్ జియాలింగ్ నుండి చౌ-ఎన్-లై, జియాంగ్‌లు ఇద్దరూ చెరో గుర్రం మీదా పోటాపోటీగా వస్తుండగా చౌ-ఎన్-లై పట్టుదప్పి గుర్రం జీను మీద నుండి జారి కిందపడి ఎడం చెయ్యి విరగకొట్టుకున్నాడు. 1939లో జరిగిన విషయం ఇది. చౌ-ఎన్-లైను ఖతం చెయ్యడానికి పన్నిన కుట్ర ఇది అని అప్పట్లో పుకార్లు లేచాయి. కాని అదంతా అబద్ధం. ఇలాంటి తప్పుడు ప్రచారాలకు విలువనివ్వక్కర్లేదు. దురదృష్టం ఏంటంటే ఒకప్పుడు ఇలాంటి అభాండాలకు, పుకార్లకు టార్గెట్‌గా మారిన జియాంగ్ కింగ్ సాంస్కృతిక విప్లవకాలంలో తన అంతే వాసులతో కలిసి రకరకాల పుకార్లు ప్రచారంలోకి రావడానికి కేంద్ర బిందువుగా నిలిచింది.

జియాంగ్ ఎందుకోగానీ తుపాకులను మాత్రం ముట్టేదికాదు. కుట్లు, అల్లికలు-చీట్ల పేక ఆడడం, ఇవీ ఆవిడ కాలక్షేపాలు. ఊలు స్వెట్టర్లు ఎంత అందంగా, గొప్పగా అల్లేదో ఆవిడ. అలాగే కుట్టుపని కూడా అంత అలవోకగా చేసేది. వాళ్ళ చిన్నమ్మాయి లీనె బట్టలన్నీ స్వయంగా ఆవిడే కుట్టేది.

ఉత్తర షాంగ్సీలో జరిగిన పోరాటంలో ఆవిడ ప్రత్యక్షంగా పాలుపంచుకోలేదు. మావోను కనిపెట్టుకుని ఉండడానికే పరిమితం అయిపోయింది ఆవిడ. అంగరక్షక దళంలో పనిచేసే మా అందరి మంచిచెడ్డల గురించి కూడా చాలా పట్టించుకునేది. స్వయానా ఆవిడే మాకు తలమాసినప్పుడల్లా క్షవరం చేసేది. ఖాళీగా ఉన్నప్పుడు సైన్సు పాఠాలు, జనరల్ నాలెడ్జ్ పాఠాలు చెప్పేది. కుట్లు నేర్చుకోండర్రా అని సతాయించి మరీ సూదిపని నేర్పింది. మేం కవాతు చేసేటప్పుడు ఒక్కోసారి తెగ ఉత్సాహపరిచేది. అప్పుడప్పుడూ పొడుపు కథలు విప్పమని అడిగేది మమ్మల్ని. ఉదాహరణకు ఆవిడ అడిగే పొడుపు కథ ఒకటి చెప్తా మీకు.

– ఉన్న గదిలోంచి కదలకుండా వేలమైళ్ల దూరం ఎలా ప్రయాణించగలవు? రాజులు, మంత్రులు, సేనాధిపతులూ, అందరినీ ఒకే చోట ఎక్కడ చూడగలవు? నీకు ఓ కొడుకు ఉంటాడుకానీ వాడి ఇంటి పేరు వేరేగా ఉంటుంది – నీకు ఓ అందమైన భార్య ఉంటుంది. నువ్వామెతో ఎన్నడూ సంసారం చేసి ఉండవు- ఎలానో చెప్పండీ అని అడిగేది.

మేం బిక్కు మొహాలు వేసేవాళ్ళం.

'నాటకం'లో అని సమాధానం చెప్పేది ఆవిడ.

జియాంగ్ ఎప్పుడూ ఒద్దికగా, పద్ధతిగా ఉండేది. తన ఇంటికి ఏది బాగా నప్పుద్దో బాగా తెలుసు ఆవిడకి. మొదట్లో జుత్తు విరబోసినట్లు రిబ్బను కట్టి ఒదిలేసేది. కొంత కాలానికి బన్ను ముడి వేసుకోవడం మొదలుపెట్టింది. ఆడపిల్లలు తలకట్టు విషయంలో ఆవిడ సాయం కోరి వచ్చేవాళ్ళు. ఎవరికి ఎలా నప్పుద్దో ఓపిగ్గా అలా తీర్చిదిదిద& పంపేది ఆవిడ. శీతాకాలం అంతా సైనిక దుస్తులు ధరించేది. వేసవికాలంలో మాత్రం కాటన్ దుస్తులు వాడేది. ఒంటి తీరు కనబడేలా కాస్త బిగుతుగా ఉండేవి ఆవిడ తొడుక్కునే బట్టలు. అందర్లోకి భిన్నంగా కన్పించేది. తనలో ఉన్న బలం, బలహీనతలు ఏమిటో గుర్తెరిగి వ్యవహరించేది. అందుకే మిగతా ఆడవాళ్ళకన్నా భిన్నంగా ఉండేది ఆవిడ.

తనలో ఉన్న 'టాలెంట్'ను ప్రదర్శించుకోవాలనే ఆదుర్దా పెరిగిన కొద్దీ ఆవిడలో ఉన్న బలహీనతలు, లోపాలు ఒక్కొక్కటిగా బయటపడేవి. ఎందుకోగానీ ఆవిడ ఈ ధోరణి నుండి బయటపడలేకపోయింది. రాన్రానూ ఆవిడలో ఉండే బలమైన అంశాలను ఈ బలహీనతలు మింగేసాయి. చివరకు మావోతో ఉన్న సంబంధ బాంధవ్యాల మీద కూడా ప్రభావం చూపాయి.

ఉత్తర షాంగ్సీలో ఉన్నప్పుడు మేం తరచూ మా మకాం మార్చాల్సి వచ్చేది. వేల సంఖ్యలో ఒక్కోమాటు పదివేల మందికిపైగా శతృసైన్యాలు మావో కోసం వేట సాగించాయి. మమ్మల్ని కుదురుగా ఒక చోట విడిది చేసి ఉండనిచ్చేవాళ్ళు కాదు. కొండలూ కోనలూ చెట్లూ, పుట్టలూ పట్టుకు తిరిగేవాళ్ళం. దినదినగండం నూరేళ్ళ ఆయుష్షుగా సాగాయి అప్పట్లో మా రోజులు. అంత దుర్భరమైన పరిస్థితులలో కూడా జియాంగ్ మావోతో మాటామాటా అనుకున్నట్లుగా కూడా నే చూడలేదు. ఇంకా చెప్పాలంటే ఎక్కువ కామ్రేడరీ (స్నేహితం)గా ఉండేవారు. కష్టకాలం మనుషుల్ని ఒక దగ్గరకి చేరుస్తుందేమో కానీ షాజియాదియాన్ యుద్ధంలో గెలిచినాక మా మకాం యాంగ్జియాగువోకు మారాక మావో, జియాంగ్‌ల మధ్య అభిప్రాయ భేదాలు పొడసూపాయి. అప్పటిదాకా మేం శతృ సైనికుల నుండి ఎదుర్కొన్న ఒత్తిడులు తగ్గి కాస్తంత కుదురు కోవడం– జియాంగ్, మావోల మధ్య మాటామాటా అనుకోవడం పెరగడం యాదృచ్ఛికమేనేమో. లీనెను సాకే ఆయా విషయంలో రగడ మొదలయింది తొలిసారి.

ఆయా వచ్చి పనిలో చేరిన మొదటి రోజునే జియాంగ్ ఆమెకు తన ఇష్టంగా వేసుకునే బట్టలు, బూట్లు నజరానాగా ఇచ్చింది. అంత అతి ప్రేమ ఏదో ఒక రోజు అనర్థానికి

దారితీస్తుందనేది నా నమ్మకం. నేను అప్పుడే అనుకున్నా ఏదో జరగరానిది జరుగుతుందని. నేను ఊహించినట్లు కొద్ది రోజులకే జియాంగ్ ఆ ఆయా మీద ఉత్తపుణ్యానికి విరుచుకు పడిపోయింది.

మావో దంపతుల సంతులో ఒకరైన లీనె ఆలనాపాలనా ఆ ఆయానే చూసేది. ఆ పనులతో పాటు అప్పుడప్పుడు మావో బట్టలు ఉతికి ఇస్త్రీ చెయ్యడం వంటి చిన్న చిన్న పనులు కూడా అందుకునేది. ఒకరోజు ఇలాగే ఆ ఆయా మావో కోసం తీసి పెట్టిన బట్టల మడతలు విప్పి చూసిన జియాంగ్ మొహం చిట్లింది 'ఏంటిదీ కుట్టడం, అతుకులు కనిపిస్తా, దారాలు పోగులు పోగులు పడి-ఇట్లేనేనా కుట్టేదీ' అని ఆయా మీద అరిచేది.

ఆ ఆయాకు అప్పటికి పదిహేడేళ్ళు ఉంటాయేమో. అంతకుముందు ఎప్పుడూ సూది పట్టుకుని ఎరగదు. మావో తొడుక్కునే బట్టలు కదా అని వచ్చీరాని కుట్లతో ఏదో తంటాలు పడి అతుకులు సరిచేసింది. ఈ విషయం జియాంగ్‌కూ తెల్సు. అయినా ఆ పిల్లను కేకలేసింది. అక్కడితో విషయం వదిలెయ్యచ్చుకదా. 'ఊహూ... వొదిలిపెట్టలేదు. ఆ పిల్ల రెక్క పుచ్చుకుని మావో దగ్గరకు బరబరా లాక్కెళ్లి 'చూసావా బాస్ ఈ పిల్ల ఎంత పని చేసిందో, చూడు ఈ కుట్టు ఎంత ఏబ్రాసిగా కుట్టిందో' అంది. మావోను జియాంగ్ ఆ రోజుల్లో 'బాస్' అని పిలిచేది.

ఆ సమయానికి మావో ఏదో పనిలో తలమునకలుగా ఉన్నాడు. అయినా తలపైకెత్తి చూసాడు. ఆయా మొహంకేసి చూడగానే ఆ పిల్ల మనసు ఎంత గాయపడిందో ఇట్టే పసిగట్టేశాడు. దాంతో జియాంగ్‌కేసి కోపంగా చూస్తూ 'నువ్వే మాట్లాడుతున్నావో అర్థమవుతుందా... 'ఫూల్' అనేసాడు. ఆయాకేసి చూసి 'థ్యాంక్స్ అమ్మడూ..." బాగానే కుట్టావ్‌లే అని అనునయంగా అన్నాడు. 'నువ్వెళ్లు' అని ఆ పిల్లని పంపించేసాక 'నువ్వింకా ఆ బూర్జువా ఇగోను తగ్గించుకోలా' అని కసిరాడు జియాంగ్‌ను.

ఆ తరువాత జియాంగ్ ఆ పిల్లను దగ్గరకు తీసి 'నువ్వే అనకోబాక ఆయా... నీ మనసు కష్టపెట్టాలనేది నా ఉద్దేశం కాదు. సరేనా... నువ్విదేం మనసులో పెట్టుకోమాకు' అని బుజ్జగించింది.

నిజంగానే ఆ పిల్ల మనసు కష్టపెట్టాలనేది జియాంగ్ ఉద్దేశం కాదు. కానీ ఆవిడ తరహానే అంత, కోపం వస్తే ముందూ వెనకా ఆలోచించకుండా నోటికి ఎంత మాట వస్తే అంతమాట రకీమని అనేస్తుంది.

ఆ తరువాత ఆవిడ స్వయంగా ఆ పిల్లకు దగ్గరుండి మరీ కుట్లూ, అల్లికలూ

నేర్పించింది. అలా నేర్పించిన కొన్ని రోజులకి 'ఫర్ లైనింగ్‌తో కుట్టిన జాకెట్ చూసి జియాంగ్ ఆ పిల్ల మీద మళ్లీ అరిచేసింది. 'దీన్ని అసలు కుట్టు అంటారా? ఎంత దరిద్రంగా ఉందో తెల్సా. కుట్లన్నీ విప్పి మళ్లీ సరిగ్గా కుట్టు' అని కోపగించుకుంది. ఆ మరుసటి రోజే మళ్లీ 'ఏమనుకోబాకు పిల్లా. నిజానికి నేనంత దూకుడు మనిషినికాదు. ఏంటో నిన్న అలా జరిగిపోయింది. నువ్వే మనసులో పెట్టుకోబాకా' అనేసింది ఆయాతో.

ఆ మాటలు ఎందుకో నాకు బోలుగా అనిపించాయి. ఈ కసురుకోవడాలూ, విసురుకోవడాలూ మనసులో పెట్టుకుని ఆ పిల్ల 'లీనె'ను ఏం ఇబ్బంది పెడుతుందో అన్న ఉద్దేశ్యంతో జియాంగ్ ఆయాను అలా అనునయించేదేమో అనిపించింది నాకు.

ఒకసారి ఇలానే నేమ జియాంగ్‌కు దగ్గరుండి భోజనం అదీ వడ్డిస్తున్నా. అవి పార్టీ 'దిద్దుబాటు' కోసం పిలుపు ఇచ్చిన రోజులు. ఆవిడ జనరల్ హేలాంగ్ పంపించిన చేపకూరని నా పళ్ళెంలోకి తోడతూ ఉంది. సోయాబీన్స్ పులుసు తినీ నోరు చవిచచ్చిపోయిన నాకు ఆవిడ అలా మంచి చేప పులుసు నా కోసం ఓ పళ్ళెంలోకి తీసిపెడతూ ఉంటే నా మనసు ఆగింది కాదు. ఆవిడ అన్నం కూర కలుపుకు తింటూ మధ్యలో తలెత్తి నా కేసి చూసి 'దొంగనా బట్టలు. నా గురించి నేను చెప్పిన మాటలు కూడా నమ్మరా. నేను 1932లో విప్లవంలో చేరాను. అని ఒక పక్కన చెబుతూ ఉంటే కాదు 1935లో అని ఒత్తి ఒత్తి చెబుతారేంటీ.... ఎంత దౌర్భాగ్యం' అంది.

నేను ఏం బదులు చెప్పకుండా మౌనంగా అలా ఉండిపోయాను. బాడీ గార్డుగా ఇంత సర్వీసు పెట్టుకున్న నాకు ఒక విషయం బాగా అర్థమైంది. పెద్దపెద్ద నాయకులు కూడా ఒక్కోసారి తమ మనసులో ఆక్రోశాన్ని బాడీ గార్డులతోనే చెప్తుంటారు. ఇంకో నాయకుడితో చెప్పుకోవడం నామర్ధాకావచ్చు. అవతలివాళ్ళు ఏం అనుకుంటారో అన్న జంకూ కావచ్చు. అనుభవ పూర్వకంగా నేనీ విషయం తెలుసుకున్నా. అందుకే ఒళ్ళంతా చెవులు చేసుకుని వింటున్నట్లు, ఆవిడ పట్ల సానుభూతితో ఉన్నట్లు మొహం పెట్టుకుని అలా ఉండిపోయా.

'ఇప్పుడు, నా పాత రికార్డు అంతా తవ్వి తలకెత్తుతున్నారు. ఎంత మోసమో చూసావా' అంటూ ఆవిడ నా కోసం పళ్ళెంలో ఇంకో చేప ముక్క వేసి 'ఆc! ఈ సంగతి చెప్పలేదు కదూ. అందర్లోకీ నువ్వంటే నాకు అభిమానం అట, నీకు బట్టలు కూడా పెట్టానట. నిజంగానే నీకెప్పుడైనా బట్టలు పెట్టనా నేనూ' అనడిగింది.

'ఒక గుడ్డ ముక్క ఎరగను' అని ఉక్రోషంతో రగిలిపోతూ 'ఎవరన్నారామాట' అనడిగా నేను.

'చూసావా ఎంత కట్టుకథో' అందే కానీ ఆవిడ ఆ మాట ఎవరన్నదీ నాకు చెప్పనే లేదు. పై పెచ్చు నేను ఎవరో చెప్పమని పట్టుదలగా నాలుగైదు సార్లు అడిగేసరికి ఆవిడ మాట మార్చేసింది నేర్పుగా. మావో ఆరోగ్యం అదీ ఎలా ఉందో అంటూ ఆరా తీసింది. మావో 'మూడ్' ఎలా ఉందో నా నుండి రాబట్టడానికి అనేక ప్రశ్నలు వేసింది ఆవిడ. ఏదో విషయమై ఆవిడ మావోతో మాట్లాడాలని అనుకుంటుందనీ, దానికి ఎప్పుడు సావకాశంగా ఉంటుందో నా నుంచి తెలుసుకోవాలనుకుంటుందనీ నేను అర్థం చేసుకున్నా.

మరుసటి రోజు ఉదయాన్నే నేను మావో అలా ఆరుబయట నడక సాగిస్తుంటే ఆయన వెన్నంటే నడిచాను. తిరిగి ఆయన్ని తన గది దగ్గర విడిచిపెట్టేటప్పుడు లోపల జియాంగ్ ఇంకా ఆయన పక్కమీద ఉండడం గమనించా. నడి మంచంలో బాసింపట్లు వేసుకు కూచుని ఉంది ఆవిడ. నేనలా గుమ్మం బయటే కాపలాగా నిలబడ్డాను. కాసేపటికి వాళ్ళిద్దరూ లో గొంతుకతో మాట్లాడుకోవడం నా చెవిన బడింది. తన మీద ఎవరోగానీ అనవసరంగా విచారణకు పూనుకున్నారనీ, ఆ విషయమై మావో కలుగచేసుకోమని జియాంగ్ అడిగింది. కానీ మావో దానికి ఒప్పుకోలేదు. 'పాత రికార్డులో ఏమి ఉంటే అదే జరుగుతుంది. దాన్నెలా మార్చగలం. నువ్వు షాంగైలో ఉండగా కూడా విప్లవకారిణిగా ఉన్నానని చెబుతున్నావుగా, నీకెందుకు ఇంకా భయం. నేను నిన్ను వెనకేసుకువచ్చి మాట్లాడాల్సిన అవసరం ఏముందీ?' అనడిగాను మావో.

దాంతో ఇద్దరి మధ్యనా మాటామాటా పెరిగింది. 'నీకు అన్నీ గుర్తు చెయ్యాల్నా. ఆ కొమింటాంగ్ విప్లవ ప్రతీఘాతకులు తెల్లారి లేస్తే ఎన్ని అబద్ధాలు అచ్చొత్తి ప్రచారం చేసేవాళ్లో నువ్వెరగవా? నువ్వూ, ఘూటే– ఇద్దరూ చచ్చిపోయారని రాసారు. ఒకసారి కాదు రెండుసార్లు కాదు అనేకసార్లు మీరు వాళ్ళ దాడిలో చచ్చిపోయినట్లు ఫొటోలు సహా అచ్చొత్తి వదిలారు. అది నిజమా? సర్వాబద్ధం కాదూ. అట్లానే ఇవాళ నా పాత రికార్డు గురించి యాగీ మొదలు పెట్టారు. సరిగ్గా అదే 'తంతు' అంది జియాంగ్.

'బుర్ర లేకుండా మాట్లాడకు' అని కసురుకున్నాడు మావో.

'అంతేలే నీ కట్లానే ఉంటుంది. ఇంత చేసి నేను పార్టీలో జూనియర్ సెక్రటరీని' అని ఏడుపు మొదలు పెట్టింది జియాంగ్. 'వాళ్ళు ఇంత విషయాన్ని అంత రాద్ధాంతం చెయ్యాలని చూస్తున్నారు. నన్ను ఎలాగోలా వదిలించుకోవాలనేదే వాళ్ళ పన్నాగం. ఇదేదో నన్ను సాధించాలని, ఎలాగొలా నిన్ను వదిలించుకోవాలని చూస్తున్నారు. నీకు ఆ గ్రహింపు లేకుండా పోయింది. పైగా నన్ను బుర్రలేనిదాన్నని అంటున్నావు' అంది ఏడుస్తూనే. దీంతో మావో గొప్ప చికాకు పడిపోయాడు. 'చాలించు ఇంకా నస పెట్టమాకు. వెళ్ళిపో ఇక్కణ్ణించి' అని అరిచేసాడు.

దాంతో నేను గుమ్మం దగ్గర నిలబడినవాడల్లా దూరానికి వెళ్ళి నిలబడ్డాను. నేనట్లా దూరాన నిలబడ్డానో లేదో జియాంగ్ ఏడుస్తూ బయటికి వచ్చింది. తిన్నగా చౌఎన్‌లై గదికేసి దూసుకుపోయింది. చౌఎన్‌లై ఇలాంటి విషయాల్లో సర్దుబాటు చెయ్యగల బహునేర్పరి. తనకు కష్టం అనిపించినప్పుడల్లా జియాంగ్ చౌఎన్‌లైతో తన గోడు చెప్పుకోవడం నే చాలాసార్లు గమనించాను. ఆ రోజున అంత ఉదయాన్నే వెళ్ళిన ఆవిడ మిట్ట మధ్యాహ్నం దాకా చౌఎన్‌లైతో తన బాధ చెప్పుకుంటూనే ఉంది.

ఇటు చూస్తే మావో సిగరెట్లు మీద సిగరెట్టు పీల్చేస్తూ గడిపాడు. మధ్యలో టీ ఇవ్వడానికి వెళ్ళినప్పుడు నాతో చాలాసేపు మాట్లాడాడు. మనసులో బాధంతా నా ముందు వెళ్ళగక్కాడు. ఆయన గొంతు ఎన్నడూ లేనంత విచారంగా అనిపించింది నాకారోజున. ఆయన ఆ రోజు నాతో మాట్లాడింది క్లుప్తంగా చెప్పుకోవాలంటే –

"నువ్వు కార్యదర్శిగా ఉన్న శాఖలో నేను సభ్యుడిగా ఉన్నా కాబట్టి నీతోగాక ఇంకెవరితో చెప్తానూ. నన్ను కలచివేస్తున్న విషయం నీతో చెప్తాను ఇంకియావో. జియాంగ్ నా భార్య కాకుంటే తనకి ఇప్పుడో రాంరాం చెప్పి ఉందును. నేను తొందరపాటుతో తనని పెళ్ళి చేసుకున్నానేమో. కానీ ఇప్పుడు ఏం చెయ్యడం? ఇప్పుడు నేను ఉన్న పొజిషన్లో తనకు విడాకులు ఇవ్వలేను కదా. విడాకులు ఇచ్చేంత నేరం కూడా తను చేసిందీ లేదు. నేను ఆ పని చేస్తే మన కామ్రేడ్స్‌లో అది రకరకాల పుకార్లకు దారితీస్తుంది. తను రాజకీయంగా నాకు సగుబాటుగా తయారయింది. ముందు నుయ్యి, వెనక గొయ్యిలా ఉంది నా పరిస్థితి ఏం చేస్తాం? ఇప్పుడు ఏం చెయ్యలేం" – అన్నాడు మావో.

ఈ తగాదా మావోను బాగా కలతపెట్టింది. కానీ ఆ తరువాత వరుస వారీగా లభించిన సైనిక విజయాలు మావో ఆ విషయాన్ని మరిచిపోయేలా చేసాయి. లీనెకు 'కాలీగ్రఫీ' నేర్పించడానికి జియాంగ్ ఒక రోజు ఆయనను మావో దగ్గరకు పంపి ఆయన 'చేతి రాత నమూనాలు ఇచ్చి పంపమని అడిగింది. అయితే మావో 'వాళ్ళమ్మ చేతి రాతేంటీ, బంగారం. నా కన్నా తనే చాలా మెరుగు. ఆ పనేదో తననే చెయ్యమను' అని చెప్పి పంపాడు. దాంతో జియాంగ్ తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది. తుపాను వెలిసినట్లే అని ఆనందపడింది.

ఇంకోసారి ఇలానే జనరల్ హేలాంగ్ పంపించిన ఎండు మాంసాన్ని మొత్తంగా మావో కోసం అని అట్టేపెట్టింది. 'అది మన కోసం దాచొద్దు. యుద్ధరంగంలో ముందు పీఠిన (ఫ్రంట్ లైన్) ఉన్న మన కామ్రేడ్స్‌కు పంపిద్దాం' అన్నాడు మావో.

దానికి జియాంగ్ రుసరుసలాడుతూ 'ఏ దిక్కున ఉన్నవాళ్ళకీ? తూర్పు దిక్కున ఉన్న

వాళ్ళకా, పడమటి దిక్కున ఉన్నవాళ్ళకా? వాళ్ళకేం వాళ్ళకు అంతా బాగానే జరుగుబాటు అవుతాంది, ఎటొచ్చీ మనమే అన్నింటికీ మొహమాసిపోయి ఉన్నాం. శత్రుమూకలు నీడలా మన వెన్నంటి తరుముతున్నారు. ఒక్కచోట కుదురుగా ఉండనిస్తున్నారా మనల్నీ, రుచిగా నోటికి ఇంత తినడానికి లేదు. కంటిమీద కునుకు ఉండడంలేదు. అలాంటిది ఈ తిండి మనకి అవసరమా వాళ్ళకి అవసరమా' అని అడిగింది. దాంతో మావో ఆవిడని 'ఏం మాట్లాడకు' అని కసిరాడు. 'నువ్వు ఆలోచించేదే తప్పు. మనమేదో కష్టాల్లో ఉన్నాం కాబట్టి బీన్సు పులుసు బదులు ఎండు మాంసం తినే హక్కు మన ఒక్కరికే ఉన్నట్లు, మిగతా వాళ్ళకు పనీపాట్లూ లేవు కాబట్టి వాళ్ళకి అనవసరం అన్నట్లూ నువ్వు మాట్లాడుతున్నావే, శుద్ధ తప్పు' అని తెగేసి చెప్పాడు.

జియాంగ్‌తో వచ్చిన తంటాయే ఇది. ఆవిడ అనే కాదు సర్వసాధారణంగా చాలా మంది ఇలానే పొరబాటుగా ఆలోచిస్తూ ఉంటారు. అయితే ఒక స్థాయి కామ్రేడ్స్ ఇలాంటి ధోరణులలో పడి కొట్టుకుపోకుండా నిరంతరం అప్రమత్తంగా ఉండాలి. జియాంగ్ విషయానికి వస్తే ఆవిడలోని అసూయభావం ఇలాంటి పొరపాటు ధోరణులను మరింత పెచ్చరిల్లేందుకు ఉప్పుకు నిప్పులా తోడయింది.

ఏదన్నా విషయం తనకు తెలీదు, రాదు అని చెప్పుకోవడం ఆవిడకి చిన్నతనం, నామోషీ. 1953లో పార్టీ సెంట్రల్ కమిటీ సభ్యులంతా కుటుంబాలతో సహా బేయిడైహీకు వేసవి విడిది కోసం వెళ్ళారు. అంతా సముద్ర స్నానాలకు రడీ అయ్యారు. నిజానికి జియాంగ్‌కు అంత గొప్పగా ఈతరాదు. లీషావ్ చీ భార్య ఈతలో మంచి ప్రావీణ్యురాలు. నిలువీతా, మునుగీతా పక్కీతా –అన్నింట్లోనూ ఆరితేరింది ఆవిడ. వాళ్ళ ముందు ముందు తనకు ఈత అంతగా రాదని చెప్పుకోవడం నామోషీగా భావించింది జియాంగ్.

వరసవారీ విజయాలతో ప్రజా విముక్తి సైన్యం తుది విజయం సాధించే దిశలోకి అడుగుపెట్టింది. విప్లవం సమీప భవిష్యత్తులోనే జయప్రదం అయ్యే సూచనలు స్పష్టంగా కనబడుతున్నాయి. అదిగో అప్పట్నించి జియాంగ్ ప్రవర్తనలో కూడా మార్పులు చోటుచేసుకున్నాయి. అప్పటిదాకా తనే స్వయంగా చేసుకునే చిన్న చిన్న పనులకు కూడా కరెంటు బెల్లు కొట్టి మరీ గార్డులను పిలిచి ఆ పనులు చేయించేది. నిత్యం ఎవరో ఒకళ్ళు చేతులు కట్టుకుని తన వెనకమాల నిలబడాలని కోరుకునేది. దాన్ని ఒక స్టేటస్ సింబల్‌గా, భావి జీవితానికి ముందస్తు రిహార్సల్‌లా భావించేది ఆవిడ.

ఒక మాటు ఇలానే ఆవిడ బెల్లు కొట్టడంతో ఆ రోజు డ్యూటీలో ఉన్న ఝూంగ్ తియన్‌యీూ ఏం పనిబడిందో అని ఉరుకులు పరుగుల మీద ఆవిడ గదికి వెళ్ళాడట.

జియాంగ్ పక్కమీద బాసింపట్లు వేసుకు కూచుని 'ఆ తువ్వాలు ఇటియ్యి చేతులు తడిగా ఉన్నాయి తుడుచుకుకోవాలి' అందట. తువ్వాలు మంచం మీద ఆవిడికాళ్ళకట్టనే వొంగి తీసుకునేంత దగ్గర్లో ఉందట. ఆవిడకి ఆ తువ్వాలు అందించి వచ్చిన తియాన్‌యీ" ఈవిడేనా ఆవిడా, ఒకప్పుడు మనం ఇలా చిన్న చిన్న పనుల్లో సాయానికి రాబోతే 'వొద్దొద్దు నా పని నే చేసుకోగలను' అనేది, ఇవాళా రేపూ ఇలా తయారయిందేమిటీ' అని తెగ సణుక్కున్నాడు.

భోజనం విషయంలో కూడా పంకలు పెట్టడం నేర్పింది ఆవిడ. ఉత్తర షాంగ్సీలో ఉండగా ఆవిడ కేవలం తిండి కాస్త రుచిగా ఉంటే చాలని కోరుకునేది. జిబైపో వచ్చాక అంతకు ముందులా ఆహార సరఫరాల కొరత లేకపోవడం, పోర్కు, చికెనూ కోరినంత దొరుకుతూ ఉండడంతో జియాంగ్ రుచిగల తిండికి బదులు తిండిలో రుచులు కోరుకోసాగింది. ప్రతి దానిలో పోషకాహార విలువల గురించి, కొవ్వు పదార్థాల గురించి ఆరా తియ్యసాగింది. క్యాబేజి పచ్చడి, పోర్కు వేపుళ్ళంటే చాలా ఇష్టపడేది ఆవిడ. సులభ జీర్ణ ప్రక్రియకు అవి రెండూ మంచివట. పౌష్టికాహారం తీసుకోవాలనుకోవడం తప్పుకానేకాదు. అయినా ఎందుకనో, అంతకుముందు జియాంగ్ వ్యవహార శైలికి ఇపుడు ఆవిడ వ్యవహరిస్తున్న తీరుకి మధ్య ఉన్న తేడా మూలానేమో అదీ మాకు తప్పుగా అనిపించింది. మావో ఇలాంటి వ్యవహారాలను పట్టించుకునేవాడు కాదు. జియాంగ్‌తో తిండి విషయంలో సర్దుకుపోయేవాడు. జియాంగ్, పోర్కుతోపాటు తాజా కూరగాయ ముక్కలు కూడా తినడానికి వడ్డించేది మావోకు. అరుగుదలకు కూరగాయ ముక్కలు మంచిది అని చెప్పేది. మావోకు అంతగా ఇష్టం లేకపోయినా ఆమె వడ్డించినవి తినేసేవాడు.

విప్లవం విజయం సాధించాక జియాంగ్‌ను పట్టతరం మా వల్ల కాలేదు. రోజూ పొద్దున్నే 'ఏమ్మా రాత్రి బాగా నిద్రపట్టిందా' అని అడిగి తీరాల్సిందే. ఏమరుపాటున ఎవరన్నా పొద్దు అలా అడగడం మరిచారో ఇహ వాడికి ఆ రోజంతా మూడినట్లే. పొద్దుటి పూట అల్పాహారం, పాశ్చాత్య సినిమాల్లో మాదిరి, మంచం మీద కూచుని తీసుకోవడం అలవాటయింది ఆవిడకి. మావో మాదిరి కాకుండా తిండి మీద శ్రద్ధకల మనిషి ఆవిడ. వేళకు తిండి తినేది, అరాయించుకునేది. పొద్దుటిపూట ఫలారంగా వెన్న రాసిన బ్రెడ్డు ముక్కలో, బన్నో పొద్దు తిరుగుడు పువ్వు నూనెతో పట్టిన నిలవ పచ్చళ్ళతో నంచుకు తినేది. ఒక్కోసారి ఉడకబెట్టి ఉప్పు చల్లిన బీన్స్ గింజలు తీసుకునేది. ఎప్పుడైనా కాసిని పాలు పుచ్చుకునేది. బియ్యం జావ అంటే ఇష్టంగా తాగేది. మధ్యాహ్నం పూట కూరలతో భోంచేసేది. చేపలు, వేట మాంసం, సముద్రపు రొయ్యలంటే ఇష్టం ఆవిడకి. పగటి భోజనంలోకాని, రాత్రి భోజనంలోకానీ చేప కూడ ఖచ్చితంగా ఉండాల్సిందే. కోడి మాంసం అన్నా ఇష్టపడేది ఆవిడ. కోడి జాయింట్లతో సూపు కాయమని అడిగేది. ఇలా జాయింట్లసూపు

గానీ, చేప పులుసుగానీ వండాల్సి వస్తే మట్టిదాకలో వండమని చెప్పేది ఆవిడ. మట్టి దాకలో వండిన పులుసు రుచి ఇస్తుందట. శాకాహారంలో తోటకూర, బచ్చలికూర, గోంగూర వంటి ఆకుకూరలకే తన ఓటు. చక్కగా తరిగించి ఇగురు కూరగానో, కాస్త నూనె తగిలించిన వేపుడు కూరగానో తీసుకునేది. ఎప్పుడన్నా సుస్తీ చేసినపుడు మాత్రం ఆకుకూరలని గుజ్జు మాదిరి వండించుకుని చెంచా వేసుకు తినేది. కూరల్లో నూనె వాడకం తక్కువ. ఒక్కోసారి వేటమాంసం ఆకుకూర లేకపోతే పుట్టగొడుగులు ఆకుకూర వంటకాలు ఇష్టంగా తినేది.

నిజానికి దేశాధ్యక్షుడి భార్య స్థానంలో ఉన్న ఆవిడ స్థాయితో పోలిస్తే ఈ తిండి ఒక తిండికాదు. ఇందులో డాబూ దర్పం ఏమీలేదు. ఒక్కొక్కప్పుడు ఇంతకన్నా సాదాసీదా భోజనం తీసుకునేది. కాకపోతే ఆవిడ రుచులు కనుక్కోవడం మా ప్రాణానికి వచ్చేది. మావో వంట మాస్టర్ సహా వంటగాళ్ళు ఎవరూ ఆవిడ మెప్పును పొందలేకపోయారు, ఒక్క లియావో బింగ్‌ఫూ తప్ప.

బహుశా పోషకాహారానికి సంబంధించిన పుస్తకాలను ఆవిడ బాగా మదింపు చేసి ఉండాలి. అందుకే అంత శ్రద్ధ పెట్టేది. మాకేమో అది అతిశ్రద్ధగా తోచేది. జియాంగ్ తన ఆహారపు అలవాట్లను మార్చుకోవడంతోపాటు మావోకు కూడా అలవాటు చేసేందుకు తెగ ప్రయత్నించింది. కానీ మావో తన తిండి విషయంలో ఎవరి మాటా సాగనిచ్చేవాడు కాదు, అది డాక్టరయినా ఒకటే, తన అర్థాంగి అయినా ఒకటే. జియాంగ్ ఏవి వద్దనుకునేదో మావో అవే ఇష్టంగా తినేవాడు. కూరల్లో ఉప్పు ఉండాలి. కారంగా తగలాలి. మాంసం వండితే నూనె నూనెగా ఉండాలి – ఇవీ మావో ఇష్టాలు. అలా ఉంటే జియాంగ్ ముద్ద ముట్టేది కాదు. మావో ఆరోగ్యం పట్ల శ్రద్ధ తీసుకోవాలనే ఆలోచనతో జియాంగ్ స్వయంగా మావో ఏం తినాలి ఏం తినకూడదు అనేవి దగ్గరుండి చూసుకోవాలని కోరుకుంది. ఇందులో ఆవిడని తప్పు పట్టడానికి కూడా ఏం లేదు. ఆవిడ పట్టుపట్టేసరికి, మావోకు చిర్రెత్తుకురావడం – మాటామాట అనుకోవడం, అప్పట్నించీ ఒక కుండలో వండిన కూడు ఇద్దరూ తినకపోవడం గురించి నేను ఇంతకుముందే ప్రస్తావించాను. భార్యాభర్తలు అన్నాక ఒక కంచంలో తినకపోయినా ఒక దగ్గర కూచుని తినడానికి ఇష్టపడకపోవడం అంటే ఆ సంసారంలో ఏదో తిరకాసు మొదలయినట్లే కదా!

జియాంగ్ చాలా పద్ధతిగల మనిషి. తన అలవాట్లు ఏనాడూ మార్చుకోలేదు. వేళకి తిండి, వేళకు విశ్రాంతి, వేళకు పని, వేళకు నిద్ర – ఈ అలవాట్లు విప్లవోద్యమం ఉధృతంగా ఉన్న రోజుల్లో కూడా మార్చుకోలేదు ఆవిడ. మావో పద్ధతి ఇందుకు పూర్తి విరుద్ధంగా ఉండేది. అవసరం కొద్దీ ఏకబిగిన పనిచేసేవాడు. వరసరాత్రుళ్ళు మెలకువతో గడిపేవాడు. జియాంగ్ మాత్రం తనమానాన తను నిద్రపోయేది. వాళ్ళిద్దరూ కలిసి పడుకోవడం ఓ

వారానికో నెలకో ఒక రోజయితే అదే గొప్ప.

జియాంగ్ చాడీలు చెప్పడంలో దిట్ట. ఏది అవసరం, ఏది అనవసరం దేని గురించి చెప్పొచ్చు, దేని గురించి చెప్పకూడదు వంటి విషయాలేవీ ఆలోచించేది కాదు. ఏదన్నా తగాదా తన దృష్టికి వస్తే మరింత ఎగసనదోసేది. జియాంగ్ పట్ల మావో అయిష్టం పెంచుకోవడానికి ఇది కూడా ఒక కారణం.

మావో ఎదుటి మనిషిని ఇట్టే నమ్మేస్తాడు. తనకు అంతరంగికంగా ఉండేవాళ్ళు నవ్వుతాల కోసం ఏదన్నా విషయాన్ని ఒకటికి రెండుమార్లు చెప్పారంటే అదే నిజమనుకుంటాడు. మాతో బాగా చనువుగా ఉండేవారు. ఇరుగుపొరుగు అంతా అన్యోన్యత ప్రదర్శించేవారు. పని ఒత్తిడి నుండి బయటపడడానికి తరచూ మాతో చతుర్లాడేవాడు. మావోను హుషారెక్కించడానికి అప్పుడప్పుడూ మేం కూడా గప్పాలు కొట్టేవాళ్ళం. ఒకసారి మా సహచరుడు 'ఒకతను రాత్రిళ్ళు సరిగ్గా నిద్రపట్టడం లేదు' అని చెప్పేసరికి 'కొంపదీసి మీ లవరుగానీ జెల్ల కొట్టేసిందా ఏంటీ' అని అతన్ని తెగ ఆటపట్టించాం. మొదటిసారి మావో విన్నప్పుడు మేం ఆకతాయి తనంగా అలా అన్నాం అని భావించి నవ్వుకున్నాడు. రెండోసారి విన్నప్పుడూ సరదాగానే తీసుకున్నాడు. మూడోసారి మా నోటి వెంట అదే మాట వినేసరికి 'ఇదేదో సీరియస్' మ్యాటరుల్లా ఉందే' అనుకున్నట్లు ఉన్నాడు – 'విషయం ఎంటో చెప్పండి, తేడా ఎందుకొచ్చినట్లు అసలూ, ఆ అమ్మాయి ఎవరో పిలిపించండి ఒకమారు. నేమాట్లాడి సర్దుబాటు చేస్తా" అన్నాడు మాతో. 'లేదు మహాప్రభో, ఇదంతా సరదాగా మా వాణ్ణి ఆటపట్టించడానికి అన్నాం' అని చెప్పి ఆయన్ని ఒప్పించడానికి మా తలప్రాణం తోకకొచ్చింది.

మావో దగ్గర షిచె దుబాసీగా పనిచేసేది. గావోగాంగ్ శక్తివంతుడూ, నమ్మకస్థుడూ అని చెప్పింది ఆవిడ. ఆ మాటలను బట్టి 'గావో మంచోడ్రా' అని మావో చాలాసార్లు అనడం నే విన్నా. రెండేళ్ళ తరువాత పార్టీ సెంట్రల్ కమిటీ నాల్గవ ప్లీనరీ సదస్సులో రావ్‌షుషితో పాటు గావోగాంగ్ మీద కూడా పార్టీ బహిష్కరణ వేటు పడింది. పార్టీ విచ్ఛిన్న కార్యకలాపాలకు పూనుకున్నారన్న అభియోగాలు రుజువై వాళ్ళిద్దరినీ పార్టీ నుండి బహిష్కరిస్తూ ఈ సదస్సు నిర్ణయం తీసుకుంది. ఈ సదస్సు అయిపోయాక అదేంటమ్మా నువ్వు గావో గాంగ్ గురించి నాతో అలా చెప్పావు' అని మావో షిచెను అడిగాడు. 'నేను ఎప్పుడు చెప్పానా మాటా? అతను పార్టీ ఉపాధ్యక్షుడిగా ఉన్నప్పుడు కదా' అని ఎదురు అడిగింది ఆవిడ. మావో మౌనంగా ఉండిపోయాడు

మావో ఎవరినన్నా కసుకుంటున్నప్పుడో, ఎవరి మీదన్నా అరుస్తున్నప్పుడో జియాంగ్ కలుగచేసుకుని విషయాన్ని సర్దిపుచ్చగల సత్తా కలదే. కానీ ఆవిడాపని ఎన్నడూ చేసేదికాదు.

పై పెచ్చు తనూ ఒకటి రెండు మాటలు అంటించి విషయాన్ని పెద్దది చేసేది. దాంతో మావో కోపం నషాళానికి అంటేది. కానీ ఆ తర్వాత తీరిగ్గా ఆలోచించి 'ఎందుకిలా చేశానబ్బా' అని ఆలోచించడమే కాకుండా 'జియాంగ్ చేసిందేమిటీ' అని కూడా నెమరు వేసుకునేవాడు. దాంతో ఆవిడ తప్పు ఎంతో తెలిసివచ్చేది. అందుకే ఆ తర్వాత ఎప్పుడన్నా జియాంగ్ మధ్యలో కలుగచేసుకుంటే మావో ఆవిడ మీద కూడా అరిచేసేవాడు. 'నీకు ఎవరితో ఎలా మెలగాలో తెలీదు. నువ్వూరుకో ఇంకా ఎవరితోనూ స్నేహితంగా ఉండలేవా నువ్వు. ఎందుకిలా ప్రతి వాళ్ళతోనూ తంపులు తెచ్చుకుని వాళ్ళని నీ శత్రువులుగా మార్చుకుంటావు' అని అడిగేవాడు. 'నరంలేని నాలుకతో ఆవిడ ఎన్ని తిప్పలు తెస్తుందో చూడు ఇంకియావో. ఇప్పుడు కాదు రేపు నే చచ్చాక తెలుస్తుంది. ఆవిడకి తన బతుకెంత విషాదంగా మారుతుందో' అన్నాడు మావో నాతో ఒకసారి. నిజంగానే మావో భయపడినట్టే జరిగింది.

తన హద్దుల్లో తాను ఉండాలని ఏనాడూ అనుకునేది కాదు ఆవిడ. మావోతో ఏదన్నా చెప్పి తీరాలి, ఆయన తన మాట వినడని అనిపిస్తే ఎవరు చెబితే మావో వింటాడని ఆవిడకి తెలుసో అటు నుంచి విషయాన్ని నరుక్కొచ్చేది. ఈ ధోరణులు మూలంగానే ఆవిడ సాంస్కృతిక విప్లవకాలంలో మావోయువాన్జిన్‌తో కుమ్మక్కయింది.

ఒక్క విషయం మాత్రం చెప్పుకోవాల్సిందే. జియాంగ్ తన నటనా వైదుష్యంతో మావో సహా జనాల్ని ఎంతగానో అలరించేది. ఉత్తర షాంగ్సీలో ఉండగా దుర్భరంగా గడిపిన రోజుల్లో మాకు ఆటవిడుపు ఆవిడ ఆటా-పాటే. పగలంతా పనితోనో, సైనిక డ్రిల్లుతోనో గడిచాక రాత్రిపూట రేషను తిండి తిన్నాక నీరసంగా తలా ఒక మూలన జారగిలపడిపోయే వాళ్ళం. అప్పుడు జియాంగ్ తన శ్రావ్యమైన కంఠంతో బీజింగ్ ఓపేరాలలో పాటలు పాడేది. ఆ పాటలు వింటూ మమ్మల్ని మేం మైమరిచిపోయేవాళ్ళం. ఒక్కోసారి ఆవిడ షాంగై నుండి వస్తూ కొని తెచ్చిన గ్రామఫోన్ రికార్డులు పెట్టి పాటలు వినిపిస్తూ, నాట్యం చేసేది. మావో ఆవిడ పాడేపాటలను, వేసే గ్రామ్‌ఫోన్ రికార్డులను ఎంతో తన్మయత్వంతో విని ఆనందించేవాడు. ఆవిడ తెచ్చిన గ్రామఫోన్ రికార్డులే అతి తక్కువ. అందుకే అవే రికార్డులు ఒకటికి నాలుగుసార్లు వేసి వినిపించేది. పదేపదే విన్న పాటలే అయినా మావోకు ఏనాడూ మొహం మొత్తలేదు. ఆ పాటలు వినడానికి పై పెచ్చు 'వన్స్‌మోర్' అంటూ హుషారుగా మళ్ళీ మళ్ళీ ఆ పాటల రికార్డు వేయించుకుని వినేవాడు.

బీజింగ్‌కు మకాం మరాక మావో వేళకు అంత విశ్రాంతి తీసుకునేలా చూడడానికి జియాంగ్ తెగ ప్రయత్నించింది. మావో ఎంత పని ఒత్తిడిలో ఉన్నా ఆయన్ని షన్లోంచి మళ్ళించడానికి వాళ్ళమ్మాయిని పిలిచి 'నువ్వెళ్ళి నాన్నగారిని కాసేపు అలా బయట షికారుకు తీసుకెళ్ళిరా' అని పంపించేది జియాంగ్. కూతురు వచ్చి అడగడంతో మావో చచ్చినట్టు

లేచి ఆ అమ్మాయితో కాసేపు అట్లా షికారుకి వెళ్ళి వచ్చేవాడు. ఇహ పని వదిలిపెట్టి రాలేని పరిస్థితుల్లో, 'ఇప్పుడు కాదమ్మా' అని అన్నాడనుకోండి వాళ్ళమ్మాయి కూడా తెలివిగా 'అయితే వొద్దులే కాసేపు చైనీస్ చెక్కర్ ఆడదాంరా' అని పన్నోంచి లెగకొట్టేది. అలాగే మావో కోసం అని జియాంగ్ సినిమాలు వేయించేది. ఆయనకు సినిమాల మీద అట్టే ఆసక్తి లేదు. ఆయన రాను అంటే అప్పుడు జియాంగ్ 'అట్లా అంటే ఎట్లా. నీకిష్టం లేదులే కాదన్ను. నువ్వు లేకుండా ఆ కుర్రాళ్ళు సిన్మా చూస్తారా... ఆ కుర్రాళ్ళ కోసమయినా రావొచ్చుగా' అని అడిగేది. మా కోసం అనే సరికి ఆయన తానే లేచివచ్చి మాతో కలసి సిన్మా చూసేవాడు. 'మీ కోసం తప్పితే, నాకు ఎందుకు వచ్చిన సిన్మాలూ' అని మా మొహానే చెప్పేవాడు కూడా.

అయితే సరదాల విషయంలో మావో, జియాంగ్‌ల తీరు వేర్వేరుగా ఉండేది. ఎందుకు అలా అని అడిగితే నా దగ్గర జవాబు లేదు. బహుశా వాళ్ళ వాళ్ళ వ్యక్తిత్వాలు కావచ్చు. వయసు కావచ్చు. ప్రత్యేకించి మారిన జియాంగ్ జీవన విధనమూ కావొచ్చు. ఎవరు చెప్పొచ్చారు?

మావోకు వయసు మీద పడుతున్న కొద్దీ ఆయన ఆరోగ్యం గురించి మావో ఫిజీషియన్ తెగ పట్టించుకునేవాడు. నడక, ఈత కొట్టడంతోపాటు వారానికి ఒకటి రెండుసార్లు డాన్సు కూడా చేస్తుండాలని నియమం పెట్టాడు.

వయసులో ఉన్న కుర్రాళ్ళతో కలిసి, వాళ్ళంతా కాసర బీసరగా గొడవ చేస్తూ ఉండగా ఈత కొట్టడం, డాన్సు చెయ్యడం అంటే మావోకు మంచి హుషారు. ఆ కాసేపు సర్వం మరిచిపోయేవాడు. కుర్రాళ్ళతో పోటీపడి మరీ ఈత కొట్టేవాడు. డాన్సు చేసేవాడు. అలాంటప్పుడు కుర్రాళ్ళు కూడా ఆయన పెద్దరికాన్ని కాసేపు పక్కనపెట్టేసి నవ్వుతూ, తుళ్ళుతూ కేరింతలు కొడుతూ గడిపేవాళ్ళు.

అలాంటప్పుడు జియాంగ్ ఎందుకోగానీ అయిష్టంగా చూసేది మావంక. మావోతో కలిసి మేమంతా అల్లరిచిల్లరగా తుళ్ళుతూ ఉంటే ఆవిడ మాత్రం గంభీరంగా మొహం పెట్టుకుని చూస్తూ ఉండేది. 1957 ప్రాంతం నుండీ ఆవిడలో చిర్రుబుర్రులు ఎక్కువయిపోయాయి. ఏమాత్రం శబ్దమయినా, ఆఖరికి హోరుమని ఈదురుగాలి వీచినా చిరాకు పడిపోయేది. 'జీవిత చక్రంలో మార్పుల మూలంగా అలాగే అనిపిస్తుందులే' అనేవాడు డాక్టరుగారు. అంటే ఏంటో మాకు అప్పుడు అర్థం కాల్లేదు. ఆవిడకు ఆరోగ్యం సరిలేదేమో అనుకునేవాళ్ళం. "ఆవిడ పరిస్థితీ మారిపోలా. ఇపుడు ఆవిడ ఉపమంత్రి హోదాల్లో ఉన్న పార్టీ సెక్రటరీనయ్యే. పైపైకి పోయినకొద్దీ ఇలాంటి చికాకులు తప్పవేమో" అని

చెప్పుకునేవాళ్ళం మాలో మేం.

ఆ ఏడాది శెలవలు హాంగ్‌ఝువ్‌లో గడపడానికి వెళ్ళాం. అక్కడ పార్టీ కమిటీ ఒక హోటల్‌లో డాన్సులకు ఏర్పాటు చేసింది. దానికి జియాంగ్ తోడు లేకుండా మావో ఒక్కడే వచ్చాడు. ఇక ఆ రోజున పట్టపగ్గాలు లేకుండా పోయాయి మాకు. ఒకటే కేరింతలు, తుళ్ళింతలు. ఒళ్ళంతా చెమట ముద్దయ్యే వరకూ డాన్సు చేశాం. తియాన్‌యున్‌యుకు అక్కడే ఒక అమ్మాయితో స్నేహం ఏర్పడింది. పాటకచేరీ బృందంలో పిల్ల ఆ అమ్మాయి. ఆ రోజున మా సంతోషానికి హద్దే లేకుండా పోయింది. మావో కూడా మాతో ఇట్టే కలిసిపోయాడు. అంతే మానసిక, శారీరక ఉల్లాసం కలిగించడానికని పార్టీ కమిటీతో మాట్లాడి డాక్టరుగారు ఇంకో రోజున కూడా అలాంటి పార్టీకి ఏర్పాటు చేశారు.

ఈసారి పార్టీ వేరే హోటల్‌లో జరిగింది. ఆ ఆరోజున ఆటాపాటా కోసం అక్కడ పోగుపడిన వాళ్ళందరివీ అంతకుముందుసారి జరిగిన పార్టీలో కలిసిన వాళ్ళమే కావడంతో హుషారుగా పలకరింపులు, కౌగిలింతలతో అంతకుముందుకన్నా జాలీగా గడపాలి ఆ రోజు అనుకున్నాం. మావో రావడంతోటే మోత ఎక్కించాలి అని హుషారుగా ఎదురుచూస్తున్నాం. వాతావరణం అంతా సందడి సందడిగా ఉంది.

ఇంతలో మావో రానే వచ్చాడు. అప్పటిదాకా సందడిగా ఉన్న వాతావరణం ఆయన రాకతో మరింత అల్లరిగా మారాల్సింది పోయి ఒక్కసారిగా నిశ్శబ్దం అయిపోయింది. మావోను చూడగానే ఆయన్ని చుట్టుముట్టెయ్యాలని హుషారుగా ఎదురుచూస్తున్న కుర్రాళ్ళంతా పిల్లుల్లా అయిపోయారు. అయన వస్తుంటే రెండు బారులుగా తీరి నిలబడి డ్యూటీ చేస్తున్నట్లు చప్పట్లు కొడుతూ ఉండిపోయారు.

వాతావరణం ఒక్కసారిగా అంత గంభీరంగా మారిపోవడానికి కారణం మావోతోపాటు ఆ రోజున జియాంగ్ కూడా తోడు రావడమే. బింకంగా ఉన్న ఆవిడని చూసేసరికి ఎవరికి వాళ్ళు రవ్వంత ఆందోళనగా తయారయ్యారు. కాళ్ళూచేతులూ చల్లబడినట్లు అయిపోయారు. మావో మాత్రం హుషారుగా అందరినీ పలకరిస్తూ, జోకులు వేస్తూ వాతావరణాన్ని తేలికపరచడానికి ప్రయత్నించాడు. కానీ లాభం లేకపోయింది. తేడా ఏమిటో మావో పసిగట్టేసాడు. వెళ్ళి ఓ కుర్చీలో కూలబడుతూ 'ఆవిడని వెంటేసుకువచ్చి మీ పార్టీ చెడగొట్టినట్లు ఉన్నానే' అన్నాడు.

ఆ తరువాత కొద్ది నిమిషాలకే సంగీతం మొదలయింది. అందరూ ఆ సంగీతానికి అనుగుణంగా డాన్సు మొదలుపెట్టారు. 'చాలు ఆపండి, చెత్తగా ఉంది ఆ పాట, వేరేది వాయించండి' అన్న అరుపు వినబడింది.

ఇంకెవరూ? ఆ అరిచింది జియాంగే. అందరి దృష్టి తన మీదపడ్డాక ఆవిడ రాజసంగా బ్యాండ్ వాయించే వాళ్ళ దగ్గరకు నడిచివెళ్ళింది. బ్యాండ్ మాస్టర్ ఏవేం పాటలు వాయించాలి అనుకున్నదీ జియాంగ్‌కు ఒకటొకటిగా వివరిస్తుంటే ఆవిడ 'ఇది వొద్దు, ఇదీ వొద్దు, ఆ... ఇది సరే, ఇది ఒద్దు, ఒద్దు' అంటూ 'మాగ్ర్స్టో'కు మాదిరి ఏ పాటలు వొద్దో, ఏ పాటలు వినిపించాలో ఎంపిక చేసింది. సంగీతంలో ఆవిడకు ఉన్న పట్టు చూసి ఆశ్చర్యపోవడం మా వంతు అయింది. కానీ ఆవిడ అలా 'అథార్టీ' చెలాయించడం చూసి మావో కోపంతో కుతకుత ఉడికిపోయాడు.

చివరికి 'సెలక్షన్స్' పూర్తి అయ్యాయి. పాట మొదలయింది. తొలిగా జియాంగ్ మావోతో కలిసి డాన్సు చేసింది. ఏ మాటకు ఆ మాటే చెప్పుకోవాలి. ఆవిడ గొప్ప నాట్యకత్తె. ఆ రాజసం, ఆ ఠీవీ ఆ దర్పం గొప్పగా నప్పాయి. అయితే ఎందుకోగానీ ఆ డాన్సులో 'జోష్' లేదనిపించింది. సాదాసీదాగా హుందాగా వుంది. ఇంతలో మావో నాకు కనుసైగ చేశాడు. దాంతో నేను నాతోటి బాడీగార్డులు అందరినీ హుషారు చేసి రంగంలోకి దింపాను. ఇంకోపాట మొదలయ్యేసరికి లీలియాన్‌చెంగ్ వెళ్ళి 'మేడమ్ మనం డాన్స్ చేద్దాం రండి' అంటూ జియాంగ్‌ను మావో దగ్గర్నించి తప్పించాడు. మావో అప్పట్నించి రకరకాల వాళ్ళతో హుషారుగా డాన్స్ చేశాడు.

వయసులో ఉన్న కుర్రాళ్ళు ఆ రోజు డాన్సులు అదరగొట్టేస్తున్నారు. డాన్సులు మంచి రసపట్టులో ఉండగా జియాంగ్ మళ్ళీ అంత గొంతు వేసుకుని 'ఏంటి అంతంత శబ్దాలూ.. చెవులు దిబ్బళ్ళు పడిపోతున్నాయి. నెమ్మదిగా వాయించలేరూ.. ఇంకా నెమ్మదిగా ఇంకాస్త' అని అరిచేసింది. అట్లా ఆ రాత్రి ఆవిడ అందరినీ నరాలు ఉగ్గపట్టుకుని ఉండేలా చేసింది.

పార్టీ నుంచి తిరిగి వచ్చాక మావో కోపంతో ఎగ ఊపిరి పీలుస్తూ 'అందరి ఉత్సాహం మీదా నీళ్ళు కుమ్మరింపచేసిందే ఈవిడా. ఏమిటీ ఆవిడకి ఈ సరదా. ఇహ నుండి ఆవిడ ఉంటే నేను డాన్సు పార్టీలకు రాను' అనేసాడు.

అయినా ఆ తరువాత జియాంగ్‌తో కలిసి కొన్ని పార్టీలకు హాజరయ్యాడు. ఆవిడ తన ధోరణి మార్చుకోలా. అక్కడా అదే తంతూ. ఒకసారి కాదు, రెండుమార్లు కాదు వెళ్ళిన ప్రతిసారీ అదే రగడ. దాంతో మావోపార్టీలకు వెళ్ళాల్సి వస్తే ఆవిడను తప్పుకు తిరగసాగాడు. 'ఆవిడవస్తే ప్రతి వాళ్ళూ ఇబ్బంది పడాల్సిందేనా' ఎట్లాంటి హుషారుని ఎట్లా నీరుగార్చేస్తుందో' అని నా దగ్గర, టియాన్‌యుస్‌యు, ఫెంగ్‌యావోసాంగ్‌ల దగ్గర చాలాసార్లు వాపోయాడు.

ఎక్కడికన్న ప్రయాణం అయి మధ్యలో ఎక్కడన్నా ఆగుదాం అనుకున్నాక, ఆ ఆగిన

చోటకు జియాంగ్ వచ్చి మాతో కలుస్తానంది అన్న వార్త వస్తే చాలు మావో అక్కడ ఆగనీకుండా 'పదండి పోదాం' అని బయల్దేరదీసేవాడు. 'అవిడ వచ్చిందంటే మళ్ళీ అంతా చికాకేనర్రా... పదండి అవిడ ఇక్కడికి చేరుకోకముందే బయల్దేరి పోదారీ' అనేవాడు. 1959లో గుహన్‌ఝూవోలో ఉండగా ఇలానే చేసాడు. ఆ తరువాత కూడా చాలాసార్లు ఇలానే అయ్యింది.

మావో అలా చెప్పా పెట్టకుండా, తను వస్తున్నానని తెలిసీ అక్కడ ఆగకుండా బయల్దేరి వెళ్ళిపోయాడని తెలియడంతోనే జియాంగ్ మండిపడిపోయేది. ఆ కోపమంతా నౌకర్లు చాకర్ల మీద చూపించేది. ఒక్కోసారి ఆ సెగ మావో బాడీ గార్డులం అయినందుకు మాకూ తగిలేది. ఒకసారి బీజింగ్‌లో అలానే జరిగింది.

లీ లియాన్‌చెంగ్ ఆ రోజు ఏదో పని మీద జియాంగ్ ఉన్న గదిలోకి అడుగుపెట్టాడు. మర్యాదపూర్వకంగా జియాంగ్‌ను పలకరించాడు. కానీ ఆవిడ ఉరుము ఉరిమినట్లు 'ముందు బయటకు నడూ, కాలి బూట్లు బయట విప్పిరావాలని తెలీదా' అని లీ పై అరిచేసిందట. దాంతో లీ గబగబా బయటికి వచ్చి బూట్లు విప్పి లోనికి అడుగుపెట్టాడు. తలచిక్కుతీసుకుంటూ అద్దం ముందు నిలబడి ఉన్న ఆవిడ 'ఏంటా నడవడం, దబాదబా గున్న ఏనుగులా శబ్దం చేసుకుంటూనీ, నిమ్మళంగా నడవలేవా' అని మళ్ళీ కేకలేసిందట. నిజానికి ఆవిడ ఉన్న గదిలో నేలమీద అంగుళం మందాన కార్పెటు పరిచి ఉందిట. అంత ఎత్తు మీంచి గాజుగ్లాసు పడేసినా పగిలేందుకుగానీ, మోత వచ్చేందుకుకానీ అవకాశం లేనంత మెత్తగా ఉన్న ఆ కార్పెట్ మీద ఒట్టి కాళ్ళతో నడిచి వెళ్ళిన లీ మోత చేసాడని చివాట్లు తిన్నాడు.

ఓ ఏడాది క్రితం జియాంగ్ తన ఆరోగ్యం గురించి ఏమేం జాగ్రత్తలు తీసుకోవాలో అడగడానికి లిన్‌పియావో దగ్గరకు వెళ్ళింది. అపుడు ఆవిడతోపాటు నేనూ, లీలియాన్‌చెంగ్ కూడా ఉన్నాం. లిన్‌పియావో ఆవిడకు మూడు సూత్రాలు చెప్పాడు. ఎండా, శబ్దాలు, చలిగాలులు-వీటికి దూరంగా ఉండమన్నారు. అప్పట్నించీ ఆవిడది. అదే వరుస కిటికీల్లోంచి ఎండపొడ పడకుండా ఉండడానికి నల్లటి తెరలు నిండుగా కప్పాలి. శబ్దాలు రాకుండా ఉండడానికి గదుల్లో గోడ అంచు నుండి గోడ అంచుదాకా మెత్తటి కార్పెట్లు పరిచి ఉండాలి. గది అంత వెచ్చగానూ అంత చల్లగానూ లేకుండా మధ్యస్థంగా ఉండేలా సకల జాగ్రత్తలూ తీసుకునేది ఆవిడ.

అదిగో అలాంటి రోజుల్లో లీ ఆవిడకు ఇలా దొరికిపోయాడు.

'బయట చల్లగా ఉందా' అని అడిగిందట ఆవిడ.

'లేదు కామ్రేడ్- మంచుకురవట్లా, బాగానే ఉంది' అని లీ చెప్పాడట. దాంతో ఆవిడ బయటకు వచ్చి, అలా అడుగుపెట్టీ పెట్టడంతోటే లీ మీద మళ్ళీ అరిచేసిందట. 'ఏంటీ చల్లగా లేదా? ఇది చల్లదనం కాదా? నేనడిగితే చల్లగా లేదని చెప్పావ్ ఏంటి నీ ఉద్దేశం' అని నాలుగు జాడించేసిందట.

దాంతో లీ అగ్గగ్గలాడిపోతూ 'లేదు కామ్రేడ్, ఉండండి ఇంకో ఉన్ని శాలువా తెస్తా మరీ అంత చల్లగా ఉంటే, నిజానికి ఎండ కాస్తానే ఉంది ఇందాకటిదాకా, అలా కాస్త ఎండ పొడన నడుద్దురుగానీ' అన్నాడట.

అయినా ఆవిడ శాంతిస్తేనే, 'లేదులే, నీ ఎత్తు ఏంటో నాకు అర్థమైంది. ఇలా చలిగాల్లో తిరిగి నాకు రొంపట్టాలనేగా' అని రుసరుసలాడుతూ తిరిగి గదిలోకి వెళ్ళిపోతూ గుమ్మం తలుపు ధడాలుమని వేసేదిందట. మొదట లీ తన మీద తనే జాలిపడ్డాడట. ఆ మరునిమిషంలోనే జియాంగ్ మీద జాలివేసిందట.

ఆవిడ నోటికి దడిచి ఎవరికి వాళ్ళే ఆవిడని తప్పుకు తిరిగడాన్ని చూసిన కొద్దీ జియాంగ్ మరింత పేట్రేగిపోయేది.

ఆవిడకు పొద్దు గడవడం భారంగా ఉండేది. ఏవీ తోచుబడి అయ్యేది కాదు. దాంతో 'లీను పేకాడదాం రా అని కబురంపి పిలిపించుకునేది. ప్రతి ఆటా గెలవాలనుకునేది. కానీ ఘోరంగా ఆట తరువాత ఆట ఓడిపోయేది. ఆవిడతో పేక ఆడడానికి మించిన పీడకల ఇంకొకటి ఉండదు.

ఒకరోజు ఇలానే రాత్రిపూట లీను పిలిచి పేకాట మొదలుపెట్టిందట. లీ ఏదో ముక్క పొరబాటున వేసేసరికి జియాంగ్ తన చేతిలో ముక్కలు విసురుగా అవతలపారేసి 'పో నువ్విక్కడ నుంచి చేతావాతాకాని ఆట ఆడతావెందుకు' అని అరిచేసి 'ఉఫ్'మని కొవ్వొత్తి ఆర్పేసిందట. లీ బతుకుజీవుడా అనుకుని అక్కణ్ణించి బయటపడేలోగా 'తప్పుడాట ఆడతావా. నిలబడూ అలాగా, నీ కీ రోజు పనిష్మెంటు ఇదే' అని అరిచిందట జియాంగ్ వెనుకనుండి. గది గుమ్మం దాకా వచ్చిన లీ అలా చీకట్లోనే నిలువు కాళ్ళేసుకుని నిలబడిపోయాడట.

అలా ఒక గంట గడిచినాక జియాంగ్‌ను చూడడానికి వచ్చిన డాక్టరు పరిస్థితిని అర్థం చేసుకుని 'నిలబడింది చాల్లే, ఆవిడ నిద్రకు పడినట్టుంది వెళ్ళు. వెళ్ళి ఆవిడ మేలుకునే టైంకి వచ్చి మళ్ళీ నిలబడు' అని సలహా ఇచ్చాడట. కానీ లీ ససేమిరా అని భీష్మించుకున్నాడట. దాంతో డాక్టరుగారు వెళ్ళి సుహాన్‌హువాకు పరిస్థితి అంతా వివరించి విషయాన్ని ఏదోవిధంగా సర్దుబాటు చేసిరమ్మని పంపాడట. సుహాన్ అప్పట్లో గువాంగ్‌డాంగ్

ప్రావిన్షియల్ పబ్లిక్ సెక్యూరిటీ బ్యూరోకు డైరెక్టరుగా పనిచేసేవాడు. జియాంగ్ అంత కోపంలో ఉండగా జరిగిందాని గురించి వదిలెయ్యమని అడగడానికి సాహసించలేక 'ఏముంది ఇందులో క్షమించమని ఆవిడని ఒక ముక్క అడిగితే అంతా సర్దుకుంటుంది గదా' అని అన్నాడట లీతో. దానికి లీ ఒప్పుకోలేదు. 'క్షమార్పణ కోరేంత తప్పు నేనేం చెయ్యలేదు. పేక ముక్క తప్పుగా కొట్టినందుకు క్షమార్పణ అడగాల్సిన అవసరం లేదు' అని చెప్పి ఆ రాత్రి తెల్లవార్లూ నిలుపు కాళ్ళ మీద గడిపాడట లీ.

జరిగిన సంఘటనకు లీ చాలా బాధపడినట్టున్నాడు. ఏడ్చేసాడట కూడా. ఎక్కడో దూరాన్న ఉన్న నాకు ఫోన్ చేసి మరీ ఈ సంగతుల్నీ చెప్పి హృదయ భారం తీర్చుకున్నాడు. నేను ఊరు నుండి తిరిగి రాగానే మావో ఏం జరిగిందో నా దగ్గర ఆరా తీసాడు. నేను జరిగింది జరిగినట్లు చెప్పా. 'అత్త మీద కోపం దుత్త మీద చూపినట్లు నా మీద కోపాన్ని అర్భకుడు లీ మీద చూపించింది ఆవిడ. నాకు చాలా బాధగా ఉంది లీ ను తలుచుకుంటే. అంతకాడికి తమ ఆవిడ దగ్గర ఎందుకు పని చెయ్యాలి. సుబ్బరంగా తప్పుకోకా. నువ్విప్పుడే మాట్లాడి లీను అక్కణ్ణించి తప్పించు. వేరే చోటకు డ్యూటీ వేయించు. వీలయితే ఆవిడ దగ్గర ఎవరికీ డ్యూటీ వెయ్యమాకండి అప్పుడు ఎవరి మీద చిర్రుబుర్రులాడుతుంధో చూద్దాం' అన్నాడు మావో.

ఆయన మాట ప్రకారం ఆ రోజు లీను అక్కడ నుండి తప్పించాను. గువాంగ్‌ఝూవో నుండి ఆ రోజే బీజింగ్‌కు ప్రయాణం కట్టాడు లీ. వెళ్ళేముందు మావోను కలిసాడు. 'ఏవనుకోబాకు లీ. ఆవిడ ప్రాణం బాగుండటంలేదు ఈ మధ్యన. జరిగిందేదీ నీ మనసులో పెట్టుకోకు. ఆవిడ తరఫున నేను క్షమాపణలు చెబుతున్నా' అన్నాడు మావో.

జియాంగ్‌కు కోపం చవిచూడని వాడు ఎవరూ లేరు మాలో. అందుకే మావో మా అందరికీ 'ఆవిడ ఏమన్నా గానీ మనసులో ఏం పెట్టుకోమాకండి' అని బుజ్జగించి చెప్పేవాడు.

మనసులో మమ్మల్ని ఏవీ పెట్టుకోవద్దని చెప్పిన మావో మాత్రం ఆ పని చెయ్యలేకపోయాడు. జియాంగ్ మూలంగా తలెత్తిన గిల్లికజ్జాలన్నీ ఆయన బుర్రకి ఎక్కేసాయి. దాంతో కనీసం ఆవిడని చూడడానికి కూడా ఇష్టపడేవాడు కాదు. తిండి, నిద్రా, పనీ... అన్నీ వేరువేరుగానే గడిపారు ఆ ఇద్దరూ. వారి వైవాహిక జీవితం అలా ఎడమొహం పెడమొహంగా గడిచింది చివర్లో. నేను మావో దగ్గర మానేసి కొత్త బాధ్యతలు స్వీకరించడానికి తియాన్‌జిన్‌కు బయలుదేరేనాటికి, ఆ దంపతుల ఇద్దరి మధ్యనా ఉండాల్సిన ప్రేమైక భావన అణగారిపోయిందని మాత్రం అనిపించింధి నాకు.

# 13. మధ్యవర్తిత్వం

'పట్టలేని కోపంతో జియాంగ్ మీ మీద ఓ బూతుమాట విసిరిందే అనుకోండి, అయినా మీరా మాటల్ని అస్సలు పట్టించుకోమాకండి. నా కోసం సరేనా' అన్న మాటలు మావో నోటివెంట మేం ఎన్నిసార్లు విన్నామో. జియాంగ్‌తో మాలో ఎవరికయినా లడాయి పడినప్పుడల్లా ఒక కుటుంబ పెద్దలా వాటిని సముదాయించుకు రావడం మావోకు తలకు మించిన పనయ్యేది.

జియాంగ్‌కు, నాకూ మధ్యన తగాదాలు నడవడం కొత్తకాదు. అయితే ఒకటి రెండు సందర్భాల్లో తప్ప ఆ గిల్లి కజ్జాలు ఇట్టే సద్దు మణిగిపోయేవి. బాగా రగడ అయిన రెండు సందర్భాల్లోనూ, సమస్య కూడా పెద్దదీ కాదు, తీవ్రమైనదీ కాదు, పేకాట ఆడేటప్పుడు వచ్చిన తగాదాలే.

1950ల నుండి 60ల కొత్తలో వరకూ జియాంగ్‌ను మావో రాజకీయ వ్యవహారాలకు దూరంగా ఉంచాడు కాబట్టి ఆవిడకు బోలెడంత తీరిక ఉండేది. దాంతో కాలక్షేపానికి పేకాట ఆడేది. మావో కూడా పేక ఆడేవారు. చాలాసార్లు ఓడిపోయేవాడు. అయినా దాన్ని ఆటగానే తీసుకునేవారు. కాని జియాంగ్ మాత్రం అలాకాదు. ఓటమిని అస్సలు జీర్ణించుకోలేకపోయేది ఆవిడ.

ఆటలో ఓటమిని మావో సరదాగా తీసుకునేవాడు. మావోను గెలిపించే ఉద్దేశంతో ఎవరన్నా తొండి ఆట ఆడుతున్నట్లు గ్రహిస్తే ఆయన మొహం గంటు పెట్టుకునేవాడు. ఎదుటివాళ్ళు పట్టు బిగించి ఆట తిప్పితే మావో దీర్ఘంగా ఒక నిట్టూర్పు విడిచి ఓటమిని అంగీకరించేవాడు. 'మొత్తానికి మావో అజేయుడు కాదని తేలిపోయింది. మావో కూడా అప్పుడప్పుడూ ఓడిపోతాడన్నమాట' అనేవాడు.

జియాంగ్ మాత్రం ఇలా ఆలోచించేదికాదు. ఎదుటివాళ్ళు గెలవకూడదని ఎప్పుడూ తనదే పై చెయ్యిగా ఉండాలని కోరుకునేది. అందుకు భిన్నంగా జరిగిందా ఇహ నరకమే.

పేకాటలో నేను ఆవిడ జట్టుగా ఉండేవాణ్ణి. ఆవిడ జతగా ఆడాలంటే నాకు ఎలా ఉండేదంటే, సూడాంగ్‌పో అని రాజుల కాలం నాటి కవి అన్నట్లు 'మృత్యుశీలత స్పర్శ'ని సజీవంగా పక్కన పెట్టుకున్నట్లు ఉండేది. ఒళ్ళు దగ్గర పెట్టుకుని ఆడేవాణ్ణి. కాలింగ్ కార్డ్ కొట్టాడా ఏంటీ అని రకరకాలుగా ఆలోచించే ముక్క వేసేవాణ్ణి ఏ ముక్కా ఎందుకు పట్టకుండా ఉంటుంది. ఒకటి కాకపోతే ఇంకోటయినా ఏ ముక్క ఎక్కకుండా ఎందుకు

ఉంటుందీ. అలా నే వేసిన ముక్క పక్క వాళ్ళు ఎత్తినపుడు జియాంగ్ నన్ను కాల్చి భస్మం చేసేలా చూసేది. మా బ్యాచ్‌లో వాళ్ళతో ఆట అంటే నాకు భే ఫర్వాగా ఉండేది. ఎట్టాగూ ఓడితీరతారు వాళ్ళు. కాబట్టి భయంలేదు. అదే ఆయాలతో కూచుని ఆడాల్సి వచ్చినపుడు మాత్రం నాకు చుక్కలు కనిపించేవి. ఎందుకంటే వాళ్ళు స్వతహాగా తెలివిగా ఆడేవాళ్ళు. పై పెచ్చు షూ బ్యాచ్‌లో వాళ్ళను 'మేనేజ్' చేసినట్లు వాళ్ళని ఓడిపోయేలా చెయ్యడం నావల్ల అయ్యేపని కాదు. అయినా క్రమక్రమంగా ఓడిపోతే మాకు ఎదురయ్యే కష్టాలేంటో అర్థమయినాక వాళ్ళు కూడా అప్పుడప్పుడు మా కోసం ఓడిపోవడం అలవాటు చేసుకున్నారు. ఏదేమన్నాగానీ నేను వేసిన ముక్కతో పక్కవాళ్ళు ఆట తిప్పకుండా ఉంటే అదే పదివేలు అని ప్రతిసారీ ప్రార్థించుకునేవాణ్ణి. ముళ్ళ మీద కూచున్నట్లు ఆడేవాణ్ణి. అయ్యా! అదీ ఆవిడతో పేకాట ఆడే కథ.

1952 వసంతకాలంలో ఇలానే ఒక రోజున నాకు మూడింది. ఆ రోజున చీట్ల పేకకు కూచోడమే జియాంగ్ రుసరుసలాడుతూ కూచుంది. దాంతో నాకు టెన్షన్ పెరిగిపోయి సరిగ్గా ఆడలేకపోయా. కంగార్లో ఒక ముక్క బదులు ఇంకో ముక్క పారేసానేమో కూడా. నేవేసిన ముక్కలు వరుసగా పక్కవాళ్ళు ఎత్తడం, వాళ్ళు అలా ముక్క ఎత్తినప్పుడల్లా జియాంగ్ నాకేసి చూసిన తీరుకు నేను మరింత గాబరాపడి తప్పు మీద తప్పు ఆడుతూ పోయా. ఆవిడ కూడా నన్ను మార్చిమార్చి చూడడం ఎక్కువయింది. నా పరిస్థితి గమనించి పక్క వాళ్ళు ఏదోరకంగా ఆ ఆట నన్ను గెలిపించాలని చూశారు. కానీ వాళ్ళ వల్ల కాని పరిస్థితి వచ్చేసింది.

చూసీ చూసీ ఆవిడ తన చేతిలో పేక ముక్కలు విసిరేస్తూ 'నేనాడను ఇంకా, ఏంటిదదీ మన క్యాంపెయిన్‌కి మల్లే నేను ముక్కలు నాన బెడుతున్నాననుకున్నావా?' అంది విసురుగా ఒక్కసారిగా నా గుండె గతుక్కుమంది. నా మొహం జీవం లేక పాలిపోయింది. ఒణుకు పుట్టేసింది హఠాత్తుగా. నాకు తెలీకుండానే ఠకీమని లేచి నిలబడి ఆవిడకి సెల్యూట్ కొట్టి అలా నిలబడిపోయా. పేకాటకీ ఆవిడ అన్న ముక్కలకీ ఉన్న సంబంధం ఏంటో నాకు అర్థం కానే కాలేదు.

ఒక ఏడాది క్రితం దేశంలో అవినీతి, దుబారా, బ్యూరోక్రసీలకు వ్యతిరేకంగా 'నేషనల్ క్యాంపెయిన్' మొదలయింది. అప్పట్లో జియాంగ్ యేనాన్‌లో ఉంది. పార్టీ ఇచ్చిన 'దిద్దుబాటు కార్యక్రమం' పిలుపులను ఎందుకోగానీ ఇచ్చగించేది కాదు ఆవిడ. దేనికో భయపడుతున్నట్లుగా కనిపించేది. వీలయితే అలాంటి కార్యక్రమాలను తిట్టిపోసేది. బహుశా ఇదంతా ఆవిడ పాత రికార్డులను కూడా తవ్వి తీసి పార్టీ పరిశీలించాలి అనుకోవడం, దాని గురించి మావోను ఒక మాట అడ్డేయమని ఆవిడ అడగడం, అందుకు మావో

నిరాకరించడం ఈ విషయమై ఇద్దరూ మాటామాటా అనుకోవడం జరిగిన దగ్గర నుండీ ఆవిడలో ఇలాంటి వ్యతిరేక భావనలు పెరిగాయి. దిద్దుబాటు కార్యక్రమాల గురించి ఆవిడ కాస్త పెడసరంగానే వ్యాఖ్యానించేది. 'వేరే పనేంటి వీళ్ళకి ఎప్పుడూ ఎవరో ఒకర్ని ఉచ్చులో బిగించాలని పొద్దు గడిపేస్తుంటారు', 'ఇల్లు అలకగానే పండగ కాదులే. ఇవాళ వాళ్ళను విచారిస్తున్నారు రేపు నీ వంతు రాకుండా ఉండదా ఏం'- ఇలా మాట్లాడేది ఆవిడ.

'మూడు అవలక్షణాలకు వ్యతిరేకంగా దిద్దుబాటు ఉద్యమం సాగించాలని పార్టీ నిర్ణయించిన దరిమిలా ఆవిడ శాఖా సమావేశాలకు, పార్టీ మీటింగులకు దూరంగా ఉండిపోయింది కొంతకాలం. సుయెపు అనే అంతరంగిక కార్యదర్శి ఒక రోజు నన్నోమాట అడిగాడు. 'ఎందుకలా పార్టీ ఏ రాజకీయ పిలుపులు ఇచ్చినా ఆవిడ దూరందూరంగా ఉంటుందీ' అని అతను అడిగిన దానికి 'ఏముందీ నాగ్రోజులు నానబెడితే పుణ్యకాలం గడిచిపోతుందిగా' అన్నా నేను. నేను అన్న మాటను ఎవరో ఆవిడకు ఊదేశారు. ఇపుడు ఆవిడ నా మాటలను నాకే అప్పగించింది. అందుకే నా ఒళ్ళు చల్లబడిపోయింది.

ఆవిడ కోపంతో ఎగ ఊపిరి దిగ ఊపిరిగా శ్వాస పీలుస్తూ గదిలో పచార్లు చేస్తూ 'కుక్కల కొడకా' అని తిట్టింది నన్ను. నేను కిమ్మన కుండా ఉండిపోయా. నాకు నరాల ఒణుకు మొదలయింది. ఆవిడ అంతే కోపంతో గదిలోంచి విసవిసా బయటకు వచ్చేసి పెరట్లో అటూ ఇటూ నడుస్తూ ఉంటే నేను కూడా మౌనంగా ఆవిడ వెనక వెనకే తిరుగుతూ ఉండిపోయా.

'నేను నాన్చుడు రకం దాన్నా' అని కటువుగా అడిగింది ఆవిడ ఉన్నట్లుండి. నాకు కళ్ళంట నీళ్ళు వచ్చేస్తాయి.

'మూగిలా అలా నిలబడ్డం కాదు. నువ్వామాట అన్నావా లేదా చెప్పు' అని గదమాయించింది ఆవిడ.

'నన్ను క్షమించు కామ్రేడ్' అన్నా నే కూడా బలుక్కుని. 'మిమ్మల్ని బాధపెడదామనో, తప్పు పడదామనో అన్న మాటలు కావు అవి, సుయెపు అడిగినదానికి....' నేను విచారణ 'ఎంత విశ్వాస ఘాతకుడివి నువ్వు' అంటూ గుడ్ల నీరు కక్కుకుంటూ.

'ఇన్నాళ్లూ రాజకీయంగా నీకు ఎంత అండ కల్పించానూ, అందుకు బదులుగా నన్నిలా అభాసుపాలు చెయ్యాలని చూస్తావా! అనడిగింది ఆవిడ.

'నన్ను నమ్మండి కామ్రేడ్, అసలు మిమ్మల్ని బాధ పెట్టాలనే ఉద్దేశమే నాలో ఏ కోశానా లేదని చెబుతున్నాగా అట్లాంటిది మిమ్మల్ని అభాసుపాలు చెయ్యాలని ఎందుకు ఆలోచిస్తానూ' అన్న నేను సంజాయిషీగా.

'ఇంకా బుకాయించాలని చూడకు. ఎదురుగా వినయాలు నటిస్తూ వెనకమాల గోతులు తవ్వుతావా. ఇంకా నా గురించి ఏవేం పుకార్లు లేపావో చెప్పు' అంది ఆవిడ. 'లేదు కామ్రేడ్.... నే నట్లాంటి పని ఎప్పుడూ చెయ్యలా' అని బదులిచ్చానేను.

'చెయ్యలానా? మరయితే లిన్‌మిన్‌ను నాకు కాకుండా దూరం చేస్తుంది ఎవరూ?' అనడిగింది. 'ప్రమాణపూర్తిగా చెబుతున్నా.. నేనట్లాంటి పనేమీ చెయ్యలా' అన్నా నేను.

'ఏదీ మళ్ళీ ఆ ముక్క అను. దమ్ముంటే కాదని మళ్ళీ చెప్పు. నే ఎరగనా నీ వేషాలు. ఆ రోజున కారు పంపించి లిన్‌మిన్‌ను తీసుకురమ్మని నీకు పురమాయించలేదూ. నువ్వేం చేసావ్' అని పాత సంగతులు తడిమింది ఆవిడ.

'నేను కారు పంపా. పంపడం కాదు, నేనే స్వయంగా వెళ్ళా కూడా. కానీ తను రానంది' అని ఆ రోజు ఏం జరిగిందో చెప్పా.

'ఎందుకొస్తుందీ. నీ మాయలో పడి ఉంటుంది. నువ్వా పిల్ల మనసు విరిచేసి ఉంటావు. ఏంతయినా నే సవతి తల్లిని కదా! ఎక్కడ పోటు పొడవాలో బాగా ఎరిగిన వాడివి కదా, నా మీద లేనిపోని చాడీలన్నీ చెప్పి ఆ పిల్లను నాకు కాకుండా చేసుంటావ్. చేసావా, లేదా' అని గద్దించింది ఆవిడ.

'ముమ్మాటికీ నేనట్లాంటి పని చెయ్యలేదు. చెయ్యను కూడా' అని చెప్పా నేను స్థిరంగా.

'నాకు తెలీదనుకోమాకా. ఆఖరికి ఛైర్మన్‌కు నాకూ మధ్యన కూడా తంపులు పెట్టడానికి తయారయ్యావ్' అంది ఆవిడ వలవల ఏడుస్తూ, హిస్టీరియా వచ్చినట్లు ప్రవర్తించింది ఆ కాసేపూ.

ఆవిడ నా మీద అంత అభాండం వేసాక నేనింకేం మాట్లాడనూ? తలవేలాడేసుకుని అలా నిలబడిపోయా. నిజానికి ఆ రోజున మావో పోర్కు అడిగితే వద్దని చేప వడ్డించింది ఆవిడ. మావో నా మీద గయ్యిన లేచినపుడు అది నేను కాదు ఆవిడ అని జియాంగ్ హీందే తోసేసి ఉందును. వాళ్ళ మధ్య తంపులు పెట్టాలని చూసేవాణ్ణయితే. కానీ నేనలా చెయ్యలేదు ఆ రోజున. ఇలాంటివి ఎన్నో విషయాలు నా మదిలో మెదిలాయి.

నేను వాచీ కేసి చూసుకున్నా. సాయంకాలం నాలుగయింది. మావో నిద్రలేచే టైం అది. దాంతో నేను సాధ్యమయినంత సావధానంగా 'ఛైర్మన్ నిద్రలేచే టైం అయింది. నేను వెళ్ళాలి. కావాల్సివస్తే నేను రాతపూర్వకంగా ఆత్మవిమర్శ చేసుకుని మరీ మీకు ఆ కాయితాలు అందజేస్తా, వెళ్తా' అని చెప్పి అక్కణ్ణించి బయల్దేరా.

సరిగ్గా మావో బెల్లు మోగించే సమయానికి నేను ఆఫీసులో అడుగుపెట్టాను. భారమైన

గుండెతో ఆయన పనులు చూడ్డానికి వెళ్ళాను.

నేను అందించిన తడి తువ్వాలుతో మొహం తుడుచుకుని మంచానికి తలకట్టున నడుం ఆనించి కాళ్ళు బార్లా జాపుకు కూచుని న్యూస్ పేపర్ అందుకుని చదువుకోసాగాడు మావో. చెబుదామా వొద్దా అని కాసేపు శషభిషలు పడి చివరికి 'కామ్రేడ్ ఛైర్మన్ ఇప్పుడే నాకూ కామ్రేడ్ జియాంగ్‌కు మధ్యన తగాదా అయింది' అని చెప్పా. మావో చదువుతున్న పేపర్లోంచి తలతిప్పకుండానే 'నువ్వు ఆవిడతో ఎందుకు తగాదా పెట్టుకున్నట్లో' అనడిగాడు. 'నేను పెట్టుకోలా, ఆవిడే మొదలు పెట్టింది' అన్నా నేను.

మాటలు జాగ్రత్తగా కూడదీసుకుని 'పార్టీ క్యాంపెయిన్‌లంటే ఆవిడ కాళ్ళు తొక్కుకుంటుందని నేనూ, రాజకీయంగా నేను తనని భ్రష్టు పట్టిస్తున్నానని ఆవిడా మాటామాటా అనుకున్నాం' అని చెప్పా.

'కాళ్ళు తొక్కుకోవడమా' అన్నాడు ఆసక్తిగా కనుబొలెగరేసి నాకేసి చూస్తూ 'నువ్వా మాట అన్నావా' అనడిగాడు మావో.

'అన్నమాట వాస్తవమే' అంటూ సు అలా అడిగేసరికి యథాలాపంగా నేనా మాట అన్నమాట నిజమే అని చెప్పా నేను. అక్కణ్ణించి జరిగింది అంతా పూసగుచ్చినట్లు వివరంగా చెప్పా. 'అంతేకానీ ఆవిడ మీద లేనిపోని అభాండాలు వెయ్యడమా, అభాసుపాలు చెయ్యడమో నా ఉద్దేశ్యం కాదు' అని ఆఖరి ముక్కగా చెప్పా.

'అదా సంగతీ' అన్నాడు మావో తల పంకిస్తూ.

'నేను అమ్మాయిగారికీ ఆవిడకీ మధ్యన ఆఖరికి మీకూ ఆవిడకీ మధ్యన కూడా తంపులు పెడుతున్నానట. ఆవిడే అంది. నేనట్లా ఎప్పుడన్నా చేసానా చెప్పండీ' అనడిగా.

'సరే, సరే' అని క్షణం పాటు ఆలోచించి 'నువ్వెళ్ళు. ఆవిడతో మాట్లాడాలి రమ్మనమని చెప్పు' అన్నాడు మావో.

నేను బయటికివచ్చా. జియాంగ్ ఇంకా పెరట్లో అలా పచార్లు చేస్తూనే ఉంది. నేను భారంగా ఆవిడ దగ్గరకు వెళ్ళా. 'కామ్రేడ్... ఛైర్మన్‌గారు మిమ్మల్ని రమ్మంటున్నారు మీతో మాట్లాడాలట' అని చెప్పా.

'ఏం తెలివో నీదీ' అందావిడ కనుకొలకుల్లోంచి నాకేసి చూస్తూ. ఏం మాట్లాడితే ఏం తంటా వస్తుందో అని భయమేసి నేను నేల చూపులు చూస్తూ ఉండిపోయా.

మరి కాసేపటికి బెల్లుమోగింది. నన్ను రమ్మని కబురు అది. నేను వెళ్ళేసరికి కామ్రేడ్ జియాంగ్ అక్కడి నుండి వెళ్ళిపోయింది.

'మొత్తానికి గొప్ప చిక్కే తెచ్చిపెట్టావ్' అన్నాడు మావో సాలోచనగా నాకేసి చూస్తూ. సిగరెట్ దమ్ము అదే పనిగా పీకుతూ. ఇందులో నా సాయం ఒక్కటే చాలేలా లేదు. నువ్వో పన్జేయ్. కాయితం మీద ఆత్మవిమర్శ రాసుకుని తీసుకురా. అదయినా ఈ గండం నుండి నిన్ను గట్టెక్కిస్తుందో లేదో అని భయంగా ఉంది. అయినా చూద్దాం' అన్నాడు.

'అంటే, ఏం రాయమని మీ ఉద్దేశం' అనడిగానునేను.

'నువ్వు ఇందాక నాతో ఏం చెప్పావో అదే' అన్నాడాయన.

'కానీ ఆవిడ నేను తనని రాజకీయంగా భ్రష్టుపట్టించాలని చూసాను అంది. కానీ నా ఉద్దేశం అది కాదే' అన్నా.

'ఆ ముక్కే రాయి.... నా ఉద్దేశం అది కాదూ అని'

'నేను లిన్‌మిన్‌ను ఆవిడకు వ్యతిరేకంగా తిప్పుతున్నాడట. కానీ నేను అలాంటి పనేమీ చెయ్యలేదు' అన్నా మళ్లీ.

'ఆ ముక్కే రాయి – నేనలాంటి పనేం చెయ్యలేదూ అని'.

'ఇదంతా ఆవిడతో ఇందాక వివరంగానే చెప్పా. ఆత్మవిమర్శ పేరిట మళ్ళీ అవే మాటలు కాయితం మీద రాసిచ్చినంత మాత్రాన పని జరుగుద్దా ఛైర్మన్ నాకు అనుమానమే' అన్నా నేను.

'నువ్వు నా మాట వినవా' అని మావో నవ్వుతూ' నువ్వు అధ్యయనం పెంచుకో అని మునుపు నీకోసారి సలహా ఇచ్చా అది ఎంత దాకా వచ్చిందో ఏంటో, నా మాట నువ్వేమన్నా పట్టించుకున్నావో లేదో నాకయితే అర్థం కావట్లేదు. అధ్యయనం చేసేవాడికి ఆత్మవిమర్శ రాయడం ఎలానో తెలీదా... అఁ మనకి ఎందుకు వచ్చిన అధ్యయనం లెద్దూ అంటావా' అనడిగాడు మావో నేనా మాటలకు ఇబ్బందిగా నవ్వా.

'సరే ఆత్మవిమర్శ ఎట్లా రాయాలో చెప్తా చూడూ' అంటూ మావో ఎడం అరచేతి మీద కుడిచేతి చూపుడు వేలితో పేపరు మీద పెన్ను పెట్టి రాసినట్టు కదిలిస్తూ –

'ముందు ఎవర్ని ఉద్దేశించి రాస్తున్నావో వాళ్ళ పేరు వ్రాయి. అంటే ముందు ఆవిడ పేరు రాయాలన్నమాట. ఇందుకు నకలు అని నా పేరు కిందరాయి. రెండు చుక్కలు పెట్టి దాన్నే వంటారూ – 'అర్ధానుస్వారం' అనుకుంటా కదా... ఆ గుర్తుపెట్టు. ఆ తరువాత పేరా మొదలుపెట్టు 'పార్టీ క్యాంపెయిన్ అంటే ఆవిడ కాళ్ళు తొక్కుకుంటుంది అని నేను అనడం తప్పే. మొదటి తప్పుగా ఇది కాయండి' అన్న వాక్యంతో అంతా సరిపెట్టు. ఆ వాక్యం కిందనే 'కానీ' అని మొదలుపెట్టి నీ వాదన రాయి. ఇందాక నాతో చెప్పావ్ కదా

నువ్వు ఆవిడని అభాసుపాలు చెయ్యడానికో, లిన్‌మెన్‌ను ఆవిడనూ దూరం చెయ్యడానికో ఏం చెయ్యలేదనీ' - ఆ విషయమే వ్రాయి. 'లిన్‌మన్‌ను తీసుకురమ్మనమని చెప్పిన మీదట నేనాపని మీద ఉన్నా కానీ లిన్‌మెన్ రాలేదు. ఇది నా ప్రయత్న లోపమే. ఇహ ముందు ఇలాంటివి జరగకుండా చూసుకుంటా'. అని రాసేసావనుకో' బస్, ఖతం. అయిపోయినట్లే కదా' అన్నాడు.

'అరటిపండు ఒలిచినట్లు ఎంచక్కా చెప్పారో కామ్రేడ్ ఛైర్మన్ చాలా థ్యాంక్స్. ఇప్పుడే రాసి తీసుకొస్తా' అంటూ హుషారుగా నా గదికి వచ్చేసా. మావో చెప్పింది మళ్ళీ మర్చిపోతానేమో అన్న భయంతో ఏకబిగిన అంతా రాసేసా. దాన్ని పట్టుకెళ్ళి మావోకు చూపించా.

'అద్దదీ' అన్నాడు మావో మెచ్చుకోలుగా నేనిచ్చిన కాగితాలు మంచం పక్కనే ఉన్న మేజా బల్లమీద పెడుతూ' అంతా బాగానే ఉంది కానీ సమస్య అలానే ఉండిపోయినట్టుందే- పార్టీ క్యాంపెయిన్ అంటే ఆవిడ కాళ్ళు తొక్కుకుంటుంది అనేది చిన్నా చితకా మాటకాదే?! ఏం చెయ్యాలి ఇపుడూ' అన్నాడు దీర్ఘంగా ఆలోచిస్తూ. ఆ మాటలకి తెల్లబోవడం నా వంతు అయింది.

'ఓ పని చేస్తేపోలా' అనడిగాడు మావో. నా మొహంలో ఆశ చిగురించింది మళ్ళీ. 'చెప్పండి అనడిగా ఆత్రంగా. 'నువ్వు కూడా కాళ్ళు తొక్కుకుంటా ఉంటే సరిపోలా. సరికి సరయిపోద్ది కదా' అన్నాడు మావో కళ్ళు చికిలిస్తూ తమాషాగా నవ్వుతూ.

ఆపుకుందామనుకున్నా నాకు నవ్వాగలేదు. నవ్వుకుంటూ ఆయన గదిలోంచి బయటకు వచ్చా.

కొన్ని రోజుల తర్వాత మావో నా కోసం కబురు చేసాడు. నేను కనబడడంతోటే పలకరింపుగా నవ్వుతూ 'అబ్బాయ్ విషయం తేలిపోయింది సరేనా! ఆవిడ ఆసుపత్రిలో ఉంది ప్రాణం బాగోక. నువ్వీపూట ఆవిడని పలకరించడానికి వెళ్తున్నావ్. అవిగో అక్కడ ఉన్నాయి చూడూ - అవి ఆవిడ కోసమే తీసి అట్టేపెట్టా. నువ్వు వెళ్తూ వెళ్తూ నీకూడా వాటిని తీసుకెళ్ళి ఆవిడకి ఇయ్యి. అర్థమైంది కదూ నే చెప్పిందీ' అన్నాడు మావో.

'అలాగే వెళ్ళి చూసొస్తా' అన్నానే హుషారుగా - గొడవ సద్దుమణిగిపోయిందన్న ఆనందంతో.

'వెళ్దూగానిలే.. ఇపుడూ కాదు. నువ్వు రూంలో వెయిట్ చేస్తూ ఉండు మళ్ళీ నే కబురంపుతా' అన్నాడు మావో.

హాస్పిటల్‌కు వెళ్ళమన్న వరకూ బాగానే ఉంది. కానీ కాసేపు ఆగి వెళ్దానే అని ఎందుకు అన్నదీ అర్థం కాలా నాకు. వచ్చి నా రూంలో కూచుని ఎదురుచూస్తూ ఉన్నా. ఓ పావుగంట తర్వాత నా గదిలో ఫోన్ మోగింది. ఎత్తి మాట్లాడా. హాస్పిటల్ నుంచి నర్సు ఫోన్ చేసింది. వొచ్చేటప్పుడు పళ్ళు, సిగరెట్లు తెమ్మనమని జియాంగ్ చెప్పినట్లు చెప్పింది ఆ నర్సు. జియాంగ్ ఏవేం తెమ్మనమని చెప్పిందో సరిగ్గా అవన్నీ రడీ చేసి ఉంచాడు మావోనే పట్టుకు వెళ్ళడానికి. ఫోన్ రావడంతోటే నేను అవన్నీ తీసుకుని బయల్దేరా ఆసుపత్రికి.

నేను వెళ్ళే సరికి వార్డులో ఎవరూ కనబడలేదు. గదిలో ఒక పక్కన ఉన్న తెర వెనక నుంచి నీళ్ళ శబ్దం వినబడతా ఉంది. నేనలా నిలబడి ఉన్నా. ఇంకాసేపటికి జియాంగ్ తడిచేతుల్తో తెరవెనక నుండి వచ్చింది. నన్ను చూసి తువ్వాలుతో తడిచేతులు అద్దుకుంటూ 'ఎట్లా ఉన్నావ్. అని నిలబడిపోయావే కూర్చో' అంది ఆవిడ.

'ఇందా మీ కోసం' అంటూ చేతితో ఉన్న బుట్ట పక్కనపెట్టి నేనూ ఒద్దిగగా ఒక స్టూల్ మీద కూర్చున్నా.

'నువ్వు నా గురించి ఏమన్నా అనాలనుకుంటే నా మొహం మీదే అనెయ్, అంతేగానీ నా వెనక మాట్లాడితే మాత్రం నాకు నచ్చదు' అందావిడ సీదాగా విషయానికి వచ్చేస్తూ.

'అబ్బే నా మనసులో ఎలాంటి దురుద్దేశాలూ లేవు. అయినా ఇహ ముందు అలా ఎప్పుడూ మాట్లాడను' అన్నానేను.

'మరేం లేదు ఇంకియావో. నువ్వు అనాలకున్నది ఏదన్నా ఉంటే నా మొహానే అన్నావనుకో, అదే మూడో మనిషి నోటివెంట వినరావాల్సి వస్తే నాకు కష్టంగా ఉండదూ. నీ మీద కోపం రాదూ అందుకని చెప్తా' అంది ఆవిడ మళ్ళీ.

నేను మారుమాటాడే అవకాశం ఇవ్వకుండా ఆవిడే మాటమార్చేసింది. మావో మంచీ చెడ్డా చూసుకోవడానికి నేను ఏవేం చేస్తే బాగుంటుందో చెప్పింది.

'నా ఆరోగ్యమూ అంతంత మాత్రంగా ఉంది. ఇహ మీదట ఛైర్మన్ ఆరోగ్యం గురించి నువ్వే పట్టించుకోవాలి సుమా. నువ్వు ఆయన్ని ఎంత బాగా చూసుకుంటే నాకు అంత సంతోషం' అని చెప్పింది. అట్లా ఆ రోజున మా తగాదా కథ సుఖాంతం అయింది.

ఆ తరువాత తెలిసింది నాకు నా కథ సుఖాంతం అవడానికి ముందు ఏం జరిగిందో. నన్ను వెళ్ళి నా గదిలో 'వెయిట్' చేస్తూ ఉండమని చెప్పాక మావో జియాంగ్‌కు ఫోన్ చేసాడట. 'చూడూ, నీకు ప్రాణం బాగోలేదని తెలిసి ఇక్కడ ఇంకియావో ఎంత ఇదయిపోతున్నాడో తెల్సా. నీకోసం' అని పళ్ళు, సిగరెట్లు ఏంటేంటో తీసుకుని నిన్ను

కలవాలని, నిన్ను చూడాలని కాళ్ళు తొక్కుకుంటున్నాడు. పాత సంగతులేవీ మనసులో పెట్టుకోకుండా అతగాడికి ఫోన్ చేసి రమ్మనమని పిలవచ్చుగా. కాస్త పెద్దమనసు చేసుకుని ఆలోచించు' అని నచ్చచెప్పాడట. మావో అన్న మాటలు జియాంగ్ మీద పనిచేసాయి. అలా మా మధ్య ఏర్పడిన పొరపొచ్చాలు చిటికెలో ఆవిరయ్యేలా చేసాడు మావో. ఆ తరువాత కొద్ది రోజులకే నన్ను అంగరక్షక దళానికి డిప్యూటీ కమాండర్‌గా నియమించారు. నేను ఆసుపత్రి నుండి తిరిగి వచ్చాక మావో నేను రాసిన 'ఆత్మ విమర్శ' కాయితాన్ని నాకే ఇచ్చేస్తూ 'ఇహ వీటితో పనిలేదు. నీ దగ్గరే అట్టేపెట్టుకో' అన్నాడు. ఆ కాయితాలతో అవసరం తీరిపోయినా ఎందుకనో వాటిని భద్రంగా దాచిపెట్టుకున్నా నేను. అదే ఆ తరువాత నా కొంప ముంచింది.

1967లో, సాంస్కృతిక విప్లవ రోజుల్లో ఒక మాటు 'రెడ్‌గార్డు'లు మా ఇంటిని సోదా చేసారు. అప్పుడు మా కాయితాలు వాళ్ళ చేతుల్లో పడ్డాయి. మావో అంటే నాకు గిద్దటనే దానికి ఆ కాయితాలే సాక్ష్యాలని 'రెడ్ గార్డు'లు నిర్ణయించేసారు. అనడానికి జియాంగ్‌ను ఉద్దేశించి అన్నా... నేను లక్ష్యంగా చేసుకున్నది మావోనే అని తీర్మానించి నన్ను జైల్లో పారేసారు. నానారకాల ప్రశ్నలతో నన్ను గుచ్చి గుచ్చి చంపారు. 'సెర్చింగ్' పేరిట నా ఇంటి మీదికి పదేపదే దండెత్తి నా ఇల్లు పీకి పందిరేసారు. దక్షిణాది ప్రావిన్షియల్ పట్టణాల తనిఖీకి బయల్దేరిన మావో టియాన్‌జిన్‌లో ఆగినప్పుడు నా విషయం ఆయన చెవిన పడిందట. దాంతో స్వయంగా ఆయన కలుగజేసుకున్నాక నాకు ఖైదు నుండి విముక్తి లభించింది.

అప్పట్లో మా ఇంట్లో నుండి స్వాధీనం చేసుకున్న ఆ కాయితాలు ఇప్పుడు తియనాజిన్ పురావస్తుశాలలో ప్రదర్శనకు ఉంచారు. ఆ రకంగా అవి చారిత్రకతను సంతరించుకున్నాయి.

జియాంగ్ చీటికీ మాటికీ మాతో గిల్లికజ్జాలు పెట్టుకోవడంతో రానురానూ మేమూ వాటిని గురించి పట్టించుకోవడం మానేసాం. ఒకరకంగా చెప్పాలంటే అలవాటు పడిపోయాం అని చెప్పాలి. ఒక్కోసారి ఆవిడ అరిచినా లెక్కచెయ్యడం మానేసాం. సుదీర్ఘకాలంపాటు మావో దగ్గర పనిచేసిన మూలాన మేమంతా ఆయన కుటుంబంలో సభ్యులుగా 'ఫీల్' అయ్యేవాళ్ళం. బహుశా ఆ ధైర్యంతోనే ఆవిడ ఎన్నిసార్లు మా మీద తగాదాలకు వచ్చినా పట్టించుకోవడం మానేసాం అనుకుంటా. ఆ తగాదాల ముచ్చట్లన్నీ ఇక్కడ ఏకరువు పెట్టలేనుగానీ, మా మధ్యన ఇంకోమారు జరిగిన తగాదా, ముచ్చట ఒకటి చెబుతా.

1960, వేసవి కాలంలో మేం బేయిడైహీకు వెళ్ళాం. తోటలో ఉన్న డాబా ఇంట్లో మకాం చేసాం.

ఆ రోజున నేను డ్యూటీలో ఉన్నా. పదింటికి మావో నన్ను పిలిచి 'ఇంకియావోనే కాసేపు నిద్రపోతా.. నాలుగింటికి ఓ మీటింగ్ ఉంది. మూడు గంటలకల్లా నన్ను లేపు' అని చెప్పాడు. ఆయన పడుకోవడంతో నాకు వేరే పనేం లేకపోయింది ఆరాంగా నా గదిలో కూచుని ఉన్నా. కామ్రేడ్ జియాంగ్ నన్ను రమ్మనమని కబురు పంపింది. అపుడు సుమారు రెండు గంటలు కావస్తుంది.

నేను వెళ్ళడమే ఆవిడ హుషారుగా 'రా ఇంకియావో, పేకాటాడుదాం ఎప్పట్లానే నువ్వూ నేనూ ఓ జట్టు' అంది. నాకు నీరసం ముంచుకు వచ్చేసింది. దీర్ఘంగా నిట్టూరుస్తూ అయిష్టంగానే చతుర్ముఖ పారాయణానికి కూచున్నా.

నేను అన్యమనస్కంగా ఆటకు కూచున్నానని ఆవిడ ఇట్టే గమనించేసినట్టుంది. మొహం గంభీరంగా పెట్టుకుంది. కాసేపాగి 'ఏంటి ఇంకియావో నీ మనసు ఇక్కడ ఉన్నట్టు లేదే. మీ యావిడగానీ గుర్తు వచ్చిందా ఏంటీ? కాస్త మనసు పెట్టి ఆడు' అంది వేళాకోళంగా.

'అబ్బే అలాంటిదేం లేదు' అన్నా పొడిపొడిగా, వాచీ కేసి చూసుకున్నా. రెండున్నర అయింది. 'ఇదేం తలనొప్పిరా బాబూ' అనుకున్నా మనసులో.

ఇంతలో జియాంగ్ కాస్త కోపంగా 'నువ్వే ముక్కవేసేదీ' అంది.

నేను వెంటనే స్పందించలేదు. చేతిలో ఉన్న ముక్కలకేసి చూస్తూ ఉండిపోయాగానీ ఏది సీక్వెన్సో, ఏది పెయిరో కూడా పట్టించుకోలా. చేతికి దొరికిన ముక్కని కొట్టా. అది 'డెడ్ డిస్‌కార్డ్' అవుతుందని నాకు తెల్సు.

తన్నుకొస్తున్న కోపాన్ని అణుచుకుంటూ ఆవిడ 'ఏమయింది నీకూ' అని రెట్టించింది.

'అబ్బే ఏం లేదు' అన్నా నా అయిష్టాన్ని అంతా ఆ మూడు మాటల్లో ధ్వనిస్తూ. మళ్ళీ వాచీ చూసుకున్నా. 'ఛైర్మన్ ఇంకాసేపట్లో మీటింగ్‌కు వెళ్ళాల్సి ఉందే' అని చెప్పా అక్కడ నుండి తప్పించుకోవడానికి సాకుగా.

'ఇవాళ టియాన్‌యున్‌యుది కదా డ్యూటీ. తను చూసుకుంటాడ్లే అవన్నీ' అందావిడ.

నేను బద్ధకంగా నోరావలించాను. అయితే ఆ రోజు మీటింగ్‌కు తనతోపాటు మావో నన్నూ రమ్మనమన్నాడన్న సంగతి నేనావిడతో చెప్పలేదు. పదేపదే నిట్టూరుస్తూ ఉండిపోయా.

అప్పటికి రెండు ఆటలు ఓడిపోయాం. మూడో ఆట మొదలయింది. నేను ఆపకుండా నిట్టూర్పులు విడుస్తూనే ఉన్నాను. మూడో ఆటకూడా చేజారిపోయే పరిస్థితి వచ్చింది.

'చెత్త ఆట. నేను క్విట్' అంటూ జియాంగ్ చేతిలో పేకను విసురుగా టేబుల్ మీద పారేసింది. నాకేసి కొరకొరా చూస్తూ 'ఏమైంది నీకివాళా ఎక్కడికయినా పోవాల్నా ఏంటీ' అనడిగింది.

'అవును. నేను ఛైర్మన్‌తో కలిసి మీటింగ్‌కు వెళ్ళాల్సి ఉండే. కానీ మీరేమో పిలిచి మరీ ఈ రొంపిలో కూచోబెట్టారు. ఇపుడు అడుగుతున్నారా నువ్వు ఎక్కడికన్నా వెళ్ళాల్నా అనీ' అన్నానే నిష్ఠూరంగా.

'ఎంత పొగరూ' 'ఎవరితో మాట్లాడుతున్నావో తెలిసే మాట్లాడుతున్నావా' అని హూంకరించింది ఆవిడ చూపుడు వేలిని నాకేసి బెదిరింపుగా ఆడిస్తూ.

'ఎవరితో మాట్లాడతానూ, మీతోనే మాట్లాడుతున్నా. ఇదంతా మీ మూలాని కాదూ' అన్నా నేను తగ్గకుండా.

'ఏం తలబిరుసుతనం' ఏం చూసుకుని ఆ మిడిసిపాటు? నువ్వు నాకు నౌకరువా, నేన్నీకు నౌకరుననుకున్నావా?' అని అడిగింది ఆవిడ కోపంతో నిలువెల్లా వొణికిపోతూ.

'నేను ఛైర్మన్‌కు సేవ చెయ్యడం ద్వారా ప్రజలకు సేవ చేసుకుంటున్నా. రాజకీయంగా చూస్తే మీరు నేనూ ఒకటే ఇపుడు. అయినా పేకాట ఆడడం నా డ్యూటీ కాదు' అన్నా నేను. 'నిన్నూ... నిన్నూ.... ఎంత పొగరు నీకూ... ఆఫ్ట్రాల్ నువ్వొక బాడీగార్డువి అయినా ఇంత కావరంగా మాట్లాడతావా? నీ మొహం చూపించకు నాకు, పో ముందిక్కడి నుంచి' అని అరిచేసింది ఆవిడ.

తోటి బాడీగార్డులు, నర్సుల ముందే పట్టుకుని నన్ను ఆవిడ అంత మాట అనేసరికి నా అహం దెబ్బతిన్నది. నేనిప్పుడు సాదాసీదా గార్డుని కాదయ్యే. గార్డు దళానికే డిప్యూటీ కమాండర్‌ను. 1938లో పార్టీలో చేరినవాణ్ణి. పన్నెండేళ్ళుగా మావో దగ్గర పనిచేస్తున్నవాణ్ణి. నన్ను ఇంతేసి మాటలంటుందా అని రోషం పొడుచుకువచ్చింది నాకు. 'చాల్చాలేవమ్మా పెద్ద చెప్పొచ్చావ్. ఎందుకొచ్చిన అహంకారం. ఇంతా చేస్తే మీరు పార్టీ కమిటీలో ఒక సెక్రటరీయే. జనాలు మిమ్మల్ని చూసి వర్ధిల్లాలి, వర్ధిల్లాలి అని గొంతు చించుకు అరిచే పొజిషన్లో లేరు' అన్నా కచ్చగా.

'ఏం వాగుతున్నావ్ నువ్వు... ఏదీ మళ్ళీ వాగూ... నోటికొచ్చినట్లు పేల్తావా' అంటూ ఆవిడ నా మీదకి దూసుకు రాబోయింది. నేనూ ఏం అయితే అదే అవుతుందని ఆవిడకి ఎదురెళ్ళడానికి కదిలా అయితే నర్సులు ఆవిడని, నాతోటి బాడీగార్డులు నన్ను రెక్కలు

పట్టుకుని నిలేసి వెనక్కి లాగారు. 'అంటూ నే అన్నదాన్లో తప్పేముంది. నేను ఛైర్మన్ అంగరక్షక దళానికి డిప్యూటీ కమాండర్‌ని. మీ పేకాట సరదాకు జతగాడ్ని కాదు' అన్నా నేను.

అలా మా ఇద్దరి మధ్యన చెలరేగిన రగడ ముదిరి పాకాన పడింది. ఇంతకుముందు ఓసారి (1952లో) మా మధ్య జరిగిన గొడవ తాలూకు విషయాలు మతికొచ్చి మాటామాటా అనుకోవడంతో మరింత పేట్రేగిపోయాం. అలా తిట్టుకుంటూనే చిన్న పిల్లల్లా ఏడ్చుకోసాగాం ఇద్దరం. మా ఇద్దర్నీ ఆపడానికి అటు నర్సులు, ఇటు బాడీ గార్డులు, నానా తంటాలు పడుతున్నారు. మధ్యలో ఎందుకో నాకు ఒంటిమీద స్పృహ వచ్చినట్లయింది. కథ ఇంత దూరం వచ్చినందుకు నా వెన్నులో ఒణుకు పుట్టింది. అదీగాక మావోతో కలిసి మీటింగ్‌కు వెళ్ళాల్సి ఉందనే విషయం గుర్తుకొచ్చి అలా ఏడుస్తూనే మావో గదివైపు ఉరికాను.

నేను అయన గదిలోకి విసురుగా చొరబడ్డాను. అపాటికే మావో నిద్రలేచి ఏవో డాక్యుమెంట్‌లు చదువుకుంటూ ఉన్నాడు. నేను ఏడుపుతో బెక్కుతూ చేత్తో బయటికి చూయిస్తూ 'ఆవిడ నన్ను నానా మాటలంది. నా పరువు తీసేసింది పదిమందిలో. నేనావిడ నౌఖరునట. ఆవిడ ఏం చెబితే నేనాపని చెయ్యాలట' అన్నాడు మావోతో.

'ముందు ఆ ఏడుపాపు' అని మావో నన్ను కసిరాడు. 'ఏం జరిగిందో సరిగ్గా చెప్పరాదూ' అనడిగాడు మళ్ళీ తనే.

'పేకాడదాం అందావిడ. ఇటేపు చూస్తే మీతో మీటింగుకు రావాల్సి ఉందయ్యే... అయిష్టంగానే ఆవిడ మాట తీసెయ్యలేక ఆటకు కూర్చున్నా. నా మనసు మీటింగ్ మీద ఉంటే ఇంకా ఆ ఆట ఏం ఆడతానూ. వరుసగా పోయినయ్. దాంతో ఆవిడ పేక ముక్కలు ఇలా విసిరేసి నా మీద విరుచుకుపడిపోయింది' అంటూ అభినయిస్తూ చెప్పా.

ఆ చివరి ముక్క నా నోట్లోది నోట్లోనే ఉంది. ఇంతలోనే జియాంగ్ పెద్దగా ఏడుస్తూ రయ్యిన మేం ఉన్న గదిలోకి దూసుకు వచ్చింది. మళ్ళీ మా మధ్య కీచులాట మొదలయింది. 'తప్పు నీదే అంటే నీదే' అని అరుచుకున్నాం. మావో మా ఇద్దరి మధ్యకు వచ్చి నిలబడి 'ఆపండింక' అని కసిరాడు. మా నోళ్ళు మూతపడితేగా. దాంతో మావో ఓ చేత్తో నా రెక్క పుచ్చుకుని ఇవతలకి, ఇంకో చేత్తో జియాంగ్ రెక్క పుచ్చుకుని ఆవిడ తలుపు వైపుకు నెట్టేస్తూ 'బుద్ధుందా మీకూ, ఎంత అసహ్యంగా ఉందో తెల్సా. అరవకండీ. నోర్మూసుకోండీ – ముందు నోర్మూస్కోండీ ఇద్దరూ' అని గదమాయించాడు.

దాంతో ఒక్కసారిగా మేం ఇద్దరం గమ్మునుండి పోయాం. మావో ఆవిడని బయటకు వెళ్ళిపొమ్మనట్లు నెట్టేస్తూ 'నువ్వు సీనియర్‌వి కదా. ఆ మాత్రం నోరు సంభాళించుకోలేవా' అనడిగాడు. అదే అదనుగా నేను రెండు మాటలు విసిరా. దాంతో మౌనంగా గుమ్మందాకా వెళ్ళిపోయిన ఆవిడ ఏడుస్తూ నన్ను శాసనార్థాలు పెడుతూ రేచులా నా మీదకు దూసుకువచ్చింది. మావో ఆవిడకి అడ్డంగా నిలబడిపోయి నాకేసి తిరిగి చూస్తూ 'ఏవొచ్చింది నీకివాళా! ఆవిడ నోరు మూసుకుందిగా నువ్వు మూసుకోలేవా ఆం!' అని హుంకరించాడు నా మీద.

దాంతో నేను వెనక్కి తగ్గా. కానీ ఆవిడ మాత్రం తిట్ల దండకం ఆపలేదు. కాసేపు ఓర్చుకుని మళ్ళీ నేనూ నోరువిప్పా. అక్కడితో మావో సహనం కోల్పోయాడు. 'నోర్మూస్కోమన్నానా ఇద్దర్నీ' అని మరోసారి కసిరాడు. దాంతో మేం గమ్మునుండి పోయాం. 'మళ్లీ మీలో ముందు ఎవరు నోరెత్తారంటే ఈ గొడవకు అసలు కారణం వాళ్ళే అని తేల్చేస్తా- ఏంటీ' అనడిగాడు. ఇహ మేం నోరిప్పితే ఒట్టు.

'నాకింకా వేరే పనేం లేదనుకున్నారా. గాడిదలు కాస్తున్నామనుకున్నారా. ఉన్న పనులతో నేను సతమతం అయిపోతా ఉంటే తగుదునమ్మా అంటూ ఈ తలనొప్పులు తెచ్చిపెడతారా నాకూ, ఇట్లా చీటికీ మాటికీ లడాయి పడేంత తీరిక ఉందా మీకూ. ఉన్న టైమ్‌ని సద్వినియోగం చేసుకోవడం తెలీదా మీకూ. ఎవరన్నా వింటే నవ్విపోతారని కూడా ఆలోచించరా. మావో సెక్రటరీ, బాడీగార్డులు చీట్ల పేకాట దగ్గర తగాదాలు పడి ఒకళ్ళ జుత్తు ఒకళ్లు పటుకున్నారని నలుగురికీ తెలిస్తే ఎంత నామర్థాలనో కూడా ఆలోచించారా? సిగ్గనిపించడం లేదా మీకూ' అని ముక్క చీవాట్లు పెట్టాడు మా ఇద్దరినీ. 'ఇహ మీదట ఆ చీట్ల పేక ఆడడం కట్టిపెట్టి బుద్ధిగా ఏవన్నా పుస్తకాలు చదువుకోండి. అది వల్ల కాదా- మీ ఇద్దరూ కలిసి ఒకే బల్లమీద పేకాట ఆడకండి. అలా ఎన్నడన్నా ఒక దగ్గర కనిపించారో అప్పుడు చెప్తా మీ సంగతి' అన్నాడు బెదిరింపుగా.

ఆ రోజుతో జియాంగ్‌తో కలిసి పేకాట ఆడే అవసరం లేకుండాపోయింది.

చెప్పాలంటే చాలా రోషంగా పోట్లాడుకున్నాం ఆ రోజున మేం ఇద్దరం. అయినా ఎందుకో నే పెద్దగా 'వర్రీ' కాలా. కుటుంబంలో వచ్చే కలతల మాదిరి ఈ గొడవా సద్దుమణిగిపోయింది. నేననే కాదు, మావో దగ్గర పనిచేసిన వాళ్ళంతా ఆయన కుటుంబంలో ఒకళ్ళుగా 'ఫీల్' అయ్యేవాళ్ళు. అంత అభిమానంగా చూసుకునునేవాళ్లు మావో మమ్మల్ని విడదీయలేని ఆత్మీయ బంధం అది.

# 14. ములాకత్

ఎరిగి ఉన్న వాళ్ళతో మావో వ్యవహరించే తీరు అయా మనుషుల వ్యక్తిత్వాలను బట్టి రకరకాలుగా ఉండేది.

పార్టీ సభ్యులతో హుందాగా, కాస్తంత 'రిజర్వ్‌డ్'గా వ్యవహరించేవాడు. ఏనాడూ మొక్కుబడిగా ఉండేవాడుకాదు. ఏదన్నా విషయం మాట్లాడాలనుకుంటే సూటిగా, నిస్సంకోచంగా, నిర్భయంగా మాట్లాడేవాడు. సాధారణ సిపాయి క్రిందిస్థాయి కార్యకర్తల నుంచి సైనిక జనరల్స్, ప్రభుత్వ ఉన్నతాధికారుల వరకూ అందరినీ సమానంగా చూసేవాడు. పలకరింపుల్లో ఎక్కువ తక్కువలు చూపించేవాడు కాదు. ఎవరన్నాతనని కలవడానికి వచ్చేటప్పటికి తను ఏదన్నా పనిలో ఉంటే ఒక్కమాటు కుశల ప్రశ్నలు, పలకరింపులు కూడా ఉండేవికావు. మావోకు మంచం తలకట్టున వీపు ఆనించి కాళ్ళు బార్లా జాపుకు కూర్చుని చదవడం రాయడం అలవాటు. ఆ పొజిషన్లోంచి కదిలేవాడు కూడా కాదు. వచ్చిన వాళ్ళు నేరుగా విషయం ఏంటో చెప్పడం మొదలు పెట్టాక వచ్చిన వాళ్ళు కూచుని ఉంటే సరే లేకపోతే చూసి 'కూచోమని' సైగ చేసేవాడు.

పార్టీ సభ్యులు ఎవరన్నా చాలా కాలం తరువాత తనను కలవడానికి వచ్చినప్పుడు మాత్రం మావో ఎదురేగి స్వాగతం చెప్పేవాడు, వెళ్ళేటప్పుడు గుమ్మం దాకా వెళ్ళి సాగనంపేవాడు. కరచాలనంచేసేవాడు. వచ్చినవాళ్ళు గుమ్మం దాటి తన గదిలోకి అడుగుపెట్టాకే మావో మర్యాదగాలేచి నిలబడేవాడు. సోదర పార్టీల నుండి ప్రతినిధులు వచ్చినా ఇదే తీరు.

1950లో అనుకుంటా ఒక రోజున మా ఆఫీసు ఫోను మోగింది. ఆ ఫోన్ నేనే ఎత్తా. అవతల నుంచి చౌ-ఎన్-లై మాట్లాడాడు.

'ఛైర్మన్ లేచారా' అనడిగాడు ఆయన.

'లేదింకా' అని చెప్పా నేను.

రెండు క్షణాల తర్వాత 'ఎన్నింటికి లేస్తారూ' అనడిగాడు చౌ.

'మామూలుగా అయితే, ఎనిమిది దాటాల్సిందే' అన్నా నేను.

'ఫర్లేదు. నిద్రలేపు ఇంకియావో ఇవతల హోచిమిన్ వచ్చి ఉన్నాడు. అర్జెంటుగా మావోతో మాట్లాడాల్సిన అవసరం ఉందే' అన్నాదాయన.

వియత్నాం వర్కర్స్ పార్టీ అధ్యక్షుడు హోచిమిన్ రహస్య సమాలోచన కోసం బీజింగ్ వచ్చినట్లు నాకు అప్పుడే తెలిసింది.

'సరే' అని చెప్పి ఫోన్ పెట్టేసి నే వెళ్ళి మావోను నిద్రలేపాను. విషయం చెప్పాను. తడి తువ్వాలుతో మొహం తుడుచుకుని గబగబా రడీ అయ్యాడు. ఇద్దరం కలిసే రిసెప్షన్ హాల్లోకి వచ్చాం. మేం అలా వచ్చిన రెండు నిమిషాలలోపే నడవాలోంచి చౌ-ఎన్-లై, హోచిమిన్ ఇద్దరూ మాట్లాడుకుంటూ రావడం కనబడింది.

నేను ఆ పాటికే గుమ్మం దగ్గరకు వెళ్ళి నిలబడ్డాను. మావో లోపల కుర్చీలో కూచుని ఉన్నారు. 'వాళ్ళు వచ్చేసారు ఛైర్మన్' అని నే లోగొంతుకతో చెప్పా మావోకు. ఆయన లేచి గుమ్మం దాకా వచ్చారు. 'ఎలా ఉన్నారు?' అని చైనా భాషలో అడుగుతూ హోచిమన్ లోపలకు అడుగుపెట్టారు. 'నే బాగానే ఉన్నా. మీకు ఇక్కడ సౌకర్యంగానే ఉందా అంతా' అని అడుగుతూ మావో ఆయన్తో కరచాలనం చేసి సాదరంగా తీసుకెళ్ళి కూచోబెట్టాడు. నే వెళ్ళి టీ తెచ్చి ఇచ్చా. వాళ్ళు చాలాసేపు ఏవో విషయాలు మాట్లాడుకున్నారు. తిరిగి మావో హోచిమిన్ను సాదరంగా గుమ్మందాకా తీసుకువచ్చి వదిలారు. గుమ్మం అవతల నుంచి చౌ-ఎన్-లై తోడుగా ఉండి హోచిమిన్ను తీసుకెళ్ళాడు.

అలాగే అంతకుముందు 1948 ప్రాంతంలో అనుకుంటా, జనరల్ సుయు చెంగ్ నాన్ ఝూంగ్లో జరిగిన మిలిటరీ సమావేశంలో పాల్గొని అటునుంచి అటు మావోను కలవడానికి వచ్చాడు. మావో ఎదురేగిమరీ సుయుకు సాదరంగా ఆహ్వానం పలికేడు. ఇద్దరూ షేక్హ్యాండ్ ఇచ్చుకున్నారు. మావో చాలాసేపు ఆ చేతిని వదల్లేదు 'పదిహేడేళ్ళయింది' అని మావో అనడం నా చెవిన పడింది. అంతకాలం వాళ్ళు ఒకళ్ళనొకరు చూసుకోలేదా- అయినా మావో సుయును ఎంత ఆత్మీయంగా పలకరించాడో కదా అనుకున్నా నేను. ఆ దృశ్యం నా మనసు మీద గాఢమైన ముద్రవేసింది.

ఎందుకనో మావో అటు పార్టీలో, ఇటు ప్రభుత్వంలో, అటు సైన్యంలో ఉన్న ఉన్నతాధికారులతో జిగిరీ దోస్తీ చేసేందుకు ప్రయత్నించలేదు. పనికొద్దీ వాళ్ళతో మాట్లాడడమే తప్ప ప్రత్యేక ఆసక్తి ఏమీ చూపించేవాడు కాదు. చౌ-ఎన్-లై కొన్ని దశాబ్దాల పాటు మావోకు కుడి భుజంగా మెలిగాడు. మావో రోజువారీ జీవితం అంతా చౌఎన్లైకు కరతలామలకమే. అంత సామీప్యత ఉంది వారిద్దరి మధ్యన. ప్రజా విముక్తి యుద్ధ కాలంలోగానీ ఈ తరువాతగానీ మావో ఉండడానికి తగిన ఇల్లు వెతకడం దగ్గర నుండి అవసరం అయినవన్నీ సమకూర్చడం ద్వారా స్వయానా చౌ-ఎన్-లైయే దగ్గరుండి చూసుకునేవాడు. చౌ-ఎన్-లై అంటే మావోకు విపరీతమైన గురి, అపారమైన నమ్మకం. ఒక్కోసారి కీలకమైన నిర్ణయాలు తీసుకునే బాధ్యత కూడా చౌ-ఎన్-లైకు వదిలేసేవాడు

మావో. ఇవన్నీ గమనిస్తే మావోకు చౌ-ఎన్-లైకు మధ్యన గొప్ప దోస్తీ ఉండి ఉంటుందని ఎవరైనా భావిస్తారు. కానీ నేను మావో దగ్గర పని చేసిన పదిహేనేళ్ళలో మావో ఏ రోజునా చౌ-ఎన్-లై గురించిగానీ, ఆయన వ్యక్తిత్వం గురించిగానీ ఒక్కమాట, ఒక్కమాట అంటే ఒక్క మాట అనగా నే విన్లేదు.

పార్టీ, చరిత్ర, పార్టీలో పనిచేసిన తీరుతెన్నుల మూలంగానే బహుశా ఇలాంటి ధోరణులు అలవాటు అయ్యాయేమో అనిపించేది నాకు. ప్రజావిముక్తి యుద్ధకాలంలో శత్రువు ఎక్కడికక్కడ లిబరేషన్ ఆర్మీని విడగొట్టి ఒకదానికొకటి సహకరించుకోలేని పరిస్థితులు సృష్టించి పై చెయ్యి సాధించాలని ప్రయత్నించేవాడు ఎప్పుడూ. దాంతో దళాలు వేటి చావు అవి చచ్చేవి. ప్రతిఘటించడం, నెగ్గుకురావడం, శత్రువును లొంగతీసుకోవడం- ఇవన్నీ ఏ ప్రాంతానికి ఆ ప్రాంతంలో ఉన్న దళాలే పూర్తి బాధ్యతగా తీసుకుని పని చేసేవి. ఫలితంగా ఎక్కడిక్కడ ముక్కలు ముక్కలుగా గ్రూపులు గ్రూపులుగా విడిపోయి ఉండేది ప్రజా విముక్తి సైన్యం. 'పోన్లే పార్టీలో గ్రూపులు కట్టకుండా ఉంటే చాలు' అనేవాడు మావో. పార్టీ ఛైర్మన్‌గా అన్ని దళాలనూ ఏకరీతిగా చూసుకోవాల్సిన బాధ్యత మావో మీద ఉంది. ఒకళ్ళను తక్కువగా చూసి ఒకళ్ళను ఎక్కువగా చూసాడనే మాట రాకుండా ఉండడానికే కామోసు ఆయన ఎవ్వరితోనూ దగ్గరగా మెలిగేవాడు కాదు. 'మావోకు నేను బాగా క్లోజు' అని ఎవరూ చెప్పుకునే పరిస్థితి లేదు.

పార్టీలో అందరితో సమానదూరం పాటించాలని మావో చేసిన ఈ ప్రయత్నం మరో రకంగా పరిణమించింది. పార్టీ, ప్రభుత్వాలలో అత్యున్నత స్థాయిలో ఉన్న వారితో సహా ఎక్కువమంది మావో మీద ఉన్న గౌరవంతో ఆయన ఎదుట పడి నిక్కచ్చిగా మాట్లాడడానికి ఎందుకనో సంకోచించేవారు. మావో ప్రతిష్ట పెరిగిన కొద్దీ ఈ మొహమాట ధోరణులు వదిలించుకోలేనంతగా బలపడిపోయాయి. 1960వ దశకు చివరిపాదం నుండి 1970వ దశకం వరకూ అధికారం అంతా 'ఒక్క మనిషి' చేతిలో కేంద్రీకృతం కావడానికి కారణం పార్టీలో నెలకొన్న ఈ ధోరణి బాగా ఊతం ఇచ్చిందనేది నా అభిప్రాయం.

అయితే ఇందుకు మినహాయింపులు ఉన్నాయి. పెంగ్ దెహుయి, చెన్‌యిలను ఇందుకు ఒక ఉదాహరణగా చెప్పుకోవచ్చు.

మావో, పెంగ్ దెహయిల మధ్య స్నేహితం బాగానే ఉండేదని చెప్పుకోవాలి. అరమరికలు లేకుండా ఒకే కుటుంబంలోని వ్యక్తుల లాగా దగ్గరగా మెసులుకునేవారు. పెంగ్ గొంతు ఖంగు ఖంగున మోగేది. మిషన్‌గన్‌లోంచి తూటాలు వచ్చినంత వేగంగా మాట్లాడేవాడు. అతను మాట్లాడుతూ నవ్వుతూ విరగబడుతుంటే 'ఇంటి పైకప్పు ఎక్కడ కూలి పోద్దో ఈయన గారి ఫోర్సుకీ' అనుకునేవాళ్ళం మేం. మావో కూడా అంతే హుషారుగా

పెంగ్‌తో శృతి కలిపేవాడు. వాళ్ళిద్దరూ కలిస్తే ఇక మాటలకు అంతూ పొంతూ ఉండేదికాదు. అనేక విషయాల మీద మాట్లాడుకునేవాళ్ళు వారిద్దరూ.

ఉత్తర షాంగ్సీలో యుద్ధం మొదలవడానికి ముందు నుంచే పార్టీలో అందరూ మావోను ఛైర్మన్ అనే విశేషణంతో సంబోధించడం మొదలయింది. కానీ పెంగ్ మాత్రం 'లావ్ మావో' (వయసులో హోదాలో పెద్దవాళ్ళయినా ఎదుటి మనిషితో బాగా చనువు ఉంటే చైనాలో 'లావో' అని పిలుస్తారు. ఆత్మీయతకు పర్యాయపదం 'లావో') అని పిలిచేవాడు. పార్టీలో కడమాగా ఆ పిలుపును వొదిలిపెట్టిన ఏకైక వ్యక్తి పెంగ్.

లూషన్ పర్వత సానువుల్లో జరిగిన పార్టీ సెంట్రల్ కమిటీ సమావేశాల్లో పెంగ్ మావోను నిశితంగా విమర్శించాక వాళ్ళిద్దరి మధ్యన ఉన్న సాన్నిహిత్యం ఆవిరయిపోయింది. అప్పట్నించీ పెంగ్ మావోతో ముభావంగా మెలిగేవాడు. మావో పొడ అంటే గిట్టని విధంగా తయారయ్యాడు.

ఇక చెన్‌యి విషయం వేరుగా ఉండేది. రావడమే మడాలు రెండూ తకామనిపిస్తూ శెల్యూట్ చేసి 'వొచ్చింది చెన్‌యి కామ్రేడ్ ఛైర్మన్' అనేవాడు. 'చాల్చాల్లే దా కూచో, కూర్చుని మాట్లాడు ఏంటీ కబుర్లూ' అని ఆసక్తిగా అనేవాడు మావో. దాంతో ముందు చెన్‌యి మొహాన నవ్వు పూసేది. ఆ తరువాత ఇల్లంతా నవ్వులు పువ్వులై విరిసేది.

పార్టీలో ఉన్న మావోకు ఉన్న ఏకైక కవిమిత్రుడు చెన్‌యి. ఎటువంటి సహజాతాలు లేకుండా నిర్మలంగా, నిష్కల్మషంగా గొప్ప కవిత్వాభినివేశంతో మాట్లాడేవాడు చెన్‌యి. చలాగ్గా ఉండి కబుర్లతో ఇట్టే ఆకట్టుకునేవాడు. చెన్‌యితో కాలక్షేపం చెయ్యడం అంటే మావో పడి చచ్చిపోయేవాడు. 1970 దశకం అంతా మావో క్రమం తప్పకుండా విధిగా హాజరయిన ఏకైక సంస్మరణ సభ చెన్‌యిది. అతనంటే మావోకు అంత ఇష్టం.

పబ్లిక్ ఫంక్షన్లకీ, ఈతకి, డాన్సు పార్టీలకు వెళ్ళినప్పుడు మావో సాధ్యమైనంత వరకూ కుర్రకారుతో కలిసిమెలిసి మెలిగేవాడు. తన వ్యక్తిగత జీవితంలో ఆనందంగా గడిపిన ఘడియలు ఏమన్నా ఉంటే అవి కుర్రకారుతో గడిపిన క్షణాలే అని చెప్పొచ్చు. మావో స్నేహితులంతా వయసు మళ్ళిన వాళ్ళు. అందరూ అనుభవజ్ఞులు, చైనా పాత సంప్రదాయక, ప్రాపంచిక దృక్పథం అనేవాళ్ళే. మేవంతా ఆకతాయితనంగా 'వీళ్లని మ్యూజియమ్‌లో పెట్టొచ్చు' అనుకునేవాళ్ళం. కాని మావో వాళ్ళకు గొప్ప గౌరవం ఇచ్చేవాడు. ప్రజాస్వామ్యంలో వాళ్ళకు ఉన్న విశ్వాసం మూలంగా వాళ్ళకు ఆ గౌరవం దక్కాల్సిందే అనేవాడు మావో.

మావో తన వ్యక్తిగత స్నేహితులతో విధేయంగా, ఒబ్బిడిగా మెలిగేవారు. జనతా ప్రజాతంత్ర విప్లవం అంతిమ విజయం సాధించాక మావో తన పాత స్నేహితులను పిలిచి

విందు ఇచ్చాడు. చౌఎన్‌లై కూడా మావోకు తోడుగా ఉన్న ఆ పార్టీకి ఝూంగ్‌లాన్, లీజిషిన్, షెన్‌జునీరు, గువో మొరువో, చెన్ షుటాంగ్ వంటి పెద్దలంతా వచ్చారు. పార్టీ కామ్రేడ్‌లతో వ్యవహరించే తీరుకు భిన్నంగా వాళ్ళు వచ్చినప్పుడు తన గదిలోంచి బయటకి వచ్చి ఎదురేగి మరీ సాదరంగా స్వాగతించాడు. వాళ్ళలో ప్రతి ఒక్కరినీ, సాగనంపాల్సి వచ్చినప్పుడు మెట్టదాకానో, కారువరకో వెళ్ళి మరీ దిగబెట్టి వచ్చాడు. విందులో వాళ్ళకు అత్యంత సన్నిహితంగా మెలిగాడు.

'ఎల్లకాలం నన్ను ఓ తిరుగులేని జాతీయ నాయకుడిగా చెయ్యాలని చూడమాకండీ' అనేవాడు మావో అప్పుడప్పుడూ, 'హునాన్ ప్రావిన్సు'కు చెందిన ఒక పెద్ద మనిషి మావో గురించి పేపర్లో రాస్తూ 'అంతర్జాతీయంగా గణతికెక్కిన మేధావి' 'జీవితంలో ఎన్నో ఎగుడుదిగుడులు చవిచూసాడు' వగైరా వగైరా అంటూ రాసాడు.

నవచైనా ఆవిర్భావం తరువాత తరచూ మావోను కలిసే ప్రజాస్వామిక వాదులలో ఈయన ఒకరు. ఝూంగ్ వాన్హైలో ఉండగా ఒకరోజు ఇద్దరూ కలిసి అలా చెరువు గట్టున షికారుకు వెళ్ళారు మాట్లాడుకుంటూ. ఆ పెద్ద మనిషి మావోకు ఒక అడుగు వెనగ్గా నడుస్తా ఉన్నాడు. అలా మాట్లాడుకుంటూనే మధ్యలో ఉన్నట్టుండి ఆ పెద్ద మనిషి మెడ కొంగ మెడలా ముందుకు సాచి మావోకేసి చూస్తూ 'అనకూడదుగానీ ఛైర్మన్ మావో మీరెంత గొప్ప మనిషో తెల్సా, అబ్బో ఏం గొప్పదనం ఏం గొప్పదనం'...' అన్నాడు.

ఆ దరువుకి మావో ఉబ్బిపోతాడని ఊహించినట్లున్నాడు ఆ పెద్ద మనిషి. కానీ మావో మొహం చికాగ్గా పెట్టి 'అట్లా ఊదరగొట్టకండి. మనలాంటి స్నేహితుల మధ్య ఇట్లాంటివి రావొచ్చా' అనడిగాడు. అప్పుడు చూడాలి ఆ పెద్ద మనిషి మొహం సిగ్గుతో కందగడ్డ మాదిరి అయిపోయింది.

కాని ఇదే పెద్ద మనిషి ప్రభుత్వ వ్యవహారాల విషయం వచ్చేసరికి తను చెప్పిందే వేదం అన్నట్లుగా ఉండేవాడు. తన అభిప్రాయాలూ, అవగాహనా తప్పుడువి అయినా వాటినే పట్టుకు వేలాడేవాడు. మావోకు అది ఇష్టం ఉండేదికాదు. మామూలుగా ఆయన పెద్దరికానికి గౌరవం ఇచ్చేవాడే కానీ మావో మాత్రం ఇలాంటి విషయాల్లో నిష్కర్షగా, సూటిగా, ముక్కుమీద గుద్దినట్లు విమర్శించేవాడు. ఆ పెద్దమనిషీ తగ్గేరకం కాదు. వాళ్ళ మధ్యన ఏదన్నా చర్చ మొదలయిందంటే అది ఒక పట్టాన తేలేది కాదు. గంటల తరబడి సాగేది, చివరకు మావో చెప్పిందే పై చెయ్యి సాధించేది. అందులోనూ గొంతు పెంచి మరీ వాదులాడుకునే వాళ్ళేమో ఎం తగాదా వస్తుందో ఏం పాడో అని మేం భయపడి చచ్చేవాళ్ళం. ఆ మాటే ఎప్పుడన్నా మావో కులాసాగా ఉన్నప్పుడు అంటే 'ఇందులో గొడవ ఏముందీ... మా అభిప్రాయ భేదమల్లా సైద్ధాంతిక అంశాలపైనే కదా. సైద్ధాంతిక అభిప్రాయ భేదాలు

రావడం ఎక్కడయినా సహజమే. రగడ అవుతుందేమో అని వాటిని వాయిదా వెయ్యలేం కదా. అలా చేస్తే నష్టం కూడా' అని సుతిమెత్తగా చెప్పేవాడు.

ఒకసారి వీళ్ళిద్దరి మధ్యన తలెత్తిన అభిప్రాయ భేదాలను సర్దుబాటు చెయ్యడానికి ఝూంగ్‌లాన్ ప్రయత్నించాడు. 'మీరెందుకు అంత పట్టుదలకు పోతారూ' అని అడిగి ఇట్లాంటి విషయాల వినీవిననట్లు వదిలెయ్యాలని సూచించాడు. అలాగే చౌ-ఎన్-లై కూడా ఇలాంటి ప్రయత్నమే చేసాడని పేపర్లో చదివాను. కానీ వాళ్ళిద్దరి మధ్యవర్తిత్వం పనిచెయ్యలా. వాళ్ళిద్దరికీ మావో ఒక మాట చెప్పాడు. – 'నాతో వాదులాటకు దిగినందుకు నేనా పెద్ద మనిషి మీద గుర్రుగా ఉన్నాననుకుంటున్నారేమో, అలాంటిదేం లేదు. ఇప్పటికీ ఆయన పెద్దరికాన్ని గౌరవిస్తా, కానీ ఆయన రాజకీయ విశ్వాసాలకు మాత్రం కాదు. సైద్ధాంతిక పరమైన విబేదాల మూలంగా నేనాయనతో తగాదా పడాల్సి వస్తుంది కానీ ఆయన మీద వ్యక్తిగతంగా నాకు ఎలాంటి దురభిప్రాయంలేదు. ఇలాంటివి ఎక్కడయినా సర్వసహజం. సైద్ధాంతిక విబేదాలు 'రాజీ' పద్ధతుల ద్వారా పరిష్కారమవుతాయా. మీరు ఇట్లా రాజీ, రాజీ అని ఎందుకు పాకులాడుతున్నారో నాకు అర్థం కావడంలేదు' అని మావో చెప్పాడు.

పార్టీలో ఉన్న వాళ్ళందరితోనూ మావో సంబంధ బాంధవ్యాలు పార్టీ విషయాల వరకే పరిమితం అయి ఉండేవి. ఒక్క చెన్‌యి మాత్రమే ఇందుకు మినహాయింపు. అతనితో కలిసి కవిత్వం, సాహిత్యం గురించి చర్చించేవాడు. ఒకరి కవితలు ఒకరు ఇచ్చి పుచ్చుకునేవారు. అలాగే పార్టీ సభ్యులుకానీ ప్రజాస్వామిక వాదులతో కూడా మావో స్నేహం చేసేవాడు. వాళ్ళతో పార్టీ వ్యవహారాలు చర్చించేవాడు కాదు.

ఝూంగ్ షిఝూవ్‌తో నిరంతరం ఉత్తర ప్రత్యుత్తరాలు నడిపేవాడు. 1949లో కొమింటాంగ్ ప్రభుత్వంతో శాంతి చర్చల కోసం వెళ్ళిన ప్రతినిధి వర్గంలో ఈయన సభ్యుడిగా ఉన్నాడు, అనక నేషనల్ పీపుల్స్ కాంగ్రెస్ స్టాండింగ్ కమిటీలో సభ్యుడిగా నియమించబడ్డాడు.

ఒక రోజు ఝూంగ్ దగ్గర నుండి వచ్చిన ఉత్తరం చదివాక మావో ఎదురుగా ఉన్న బల్లమీద వేళ్ళతో దరువేస్తూ నాకేసి చూసి 'ఇంకియావో, పో, పోయి అర్జెంటుగా రెండు కోళ్ళు తీసుకొని ఝూంగ్‌కి ఇచ్చిరా. ఉన్న పళాన వెళ్ళిరా' అన్నాడు. 'తినే కోళ్ళుకాదు, బొమ్మ కోళ్ళు' అని చివర్లో ఓ ఝలక్ ఇచ్చాడు.

అప్పుడు రాత్రి ఏడెనిమిది అవుతా ఉన్నట్లుంది. ఆ పళాన నేను బజారు మీద పడ్డా. పింగాణీ బొమ్మలు దొరికే దుకాణాలు తిరిగి, తిరిగి వెతికి, వెతికి జత కోళ్ళ బొమ్మలు కొన్నాను.

ఝూంగ్ ఊరు శివార్లలో కాపురం ఉంటున్నాడు. ఆయన ఉండే ఇల్లు చూసి

దడుచుకున్నా. అంత దయనీయంగా ఉంది ఆ ఇల్లు. లోపలికి వెళ్ళి 'ఛైర్మన్ ఇవి మీకు ఇచ్చిరమ్మన్నారు' అని జత కోళ్ళ బొమ్మని ఆయన చేతుల్లో పెట్టా.

'చాలా ధన్యవాదాలు మిత్రమా, చీకట్లో పడి తెచ్చి ఇచ్చినందుకు' అన్నాడాయన అవి అందుకుంటూ.

'మీరు రాసిన ఉత్తరం అందింది ఆయనకి' అన్నా నేను విషయం ఏమిటో ఈయన అన్నా చెబుతాడనే ఆశతో.

'తెలుసు. ఇదిగో జాబు కూడా పంపించాడుగా' అంటూ కోళ్ళ బొమ్మ చూపించి 'బేషుగ్గా ఉంది' అని బదులిచ్చా.

అక్కడితో సరి. నే వెనక్కి వచ్చేసా. ఉత్తరం చదవగానే మావో ఈ కోళ్ళ బొమ్మ ఇచ్చిరమ్మనడం ఏమిటో, అవి చూసి ఆయన 'జాబు రాసాడుగా' అనడం ఏమిటో ఇంతకీ ఆ ఉత్తరంలో ఏముందో అని నే చాలాసేపు బుర్ర బద్దలు కొట్టుకున్నా అర్థం కాలేదు. నేను తిరిగి వచ్చి ఝూంగ్ ఏమన్నదీ మావోకు చెబితే ఆయనో మాయదారి నవ్వు నవ్వాడు. అంతే తప్ప విషయం ఏంటో చెప్పలా. జవాబులేని ఆ ప్రశ్న నా బుర్రలో అలానే ఉండిపోయింది. ఇదంతా 1955లో జరిగింది.

ఆ ఏడాదే జియాంగ్ నింగ్ మావోకు ఒక బహుమానం పంపింది. అది ఆవిడ స్వయంగా గీసిన ఒక బెబ్బులి చిత్రపటం. చుట్టూ అందంగా ఫ్రేమ్ కట్టించి మరీ పంపింది. ఆవిడ కొమింటాంగ్ వామపక్ష విభాగంలో సభ్యురాలు. అద్భుతమైన ప్రతిభాశాలి. కళాకారిణి. పీపుల్స్ గవర్నమెంటులో నాయకురాలుగా పనిచేసింది. గోడకు నిలేసి పట్టుకున్న ఆ బొమ్మకేసి మావో చాలాసేపు చూస్తుండిపోయాడు. ఆ తరువాత 'అద్దీ సంగతి, ఈ బొమ్మ ఎక్కడ ఉండాలో ఇప్పుడు తట్టింది నాకు. దాన్ని తీసుకెళ్ళి ఆ తూర్పువైపు గదిలో వేలాడదీయండి' అన్నాడు.

ఆయన చెప్పినట్లే దాన్ని తీసుకెళ్ళి ఆ గదిలో తగిలించాం. కానీ దాని వెనుక లాజిక్కు ఏమిటో మావో అంతలా ఎందుకు ఆలోచించాడో నాకు అంతుబట్టలా.

1959లో మావో జన చైనా అధ్యక్షుడిగా తన బాధ్యతలకు రాజీనామా పెట్టాడు. ఆ రకంగా రోజువారీ పని ఒత్తిడులు తగ్గాయి. ఖాళీగా ఉన్న సమయంలో 'కాలిగ్రఫీ' మీద్ద మరింత అభ్యాసం పెంచుకున్నాడు. అలానే ప్రజాస్వామిక వాదులను కలుసుకోవడమూ పెరిగింది.

హుయాంగ్ యాన్ పీ అలాంటి ప్రజాస్వామికవాదులలో ఒకరు. ఆయన దగ్గర వాంగ్ జిజ్ హి 'కాలిగ్రఫీ' నమూనాలు కూడా ఉన్నాయి. వాంగ్ జిజ్‌హి క్రీస్తుశకం 321–

379 సంవత్సరాల్లో - తూర్పు జిన్ రాజ వంశీయులు పరిపాలన చేస్తున్న కాలంలో- పేరొందిన 'కాలిగ్రాఫర్'. హుయాంగ్ సేకరించిన 'కాలిగ్రఫీ'ల్లోకెల్లా వాంగ్ జిజీహీ కాలిగ్రఫీ మావోకు బాగా నచ్చింది. చూసి నెల రోజుల్లో తిరిగి ఇచ్చేస్తాననే మాట మీద మావో వాటిని హుయాంగ్ నుండి అరువు తెచ్చుకున్నాడు. ఆ నెల రోజుల్లో మావో ఎప్పుడు చూసినా వాటిని ముందేసుకు కూర్చుని నకళ్ళు గీస్తూ కనిపించేవాడు. నకళ్ళంటే యథాతథంగా, యాంత్రికంగా మక్కికి మక్కిగా దించడం కాకుండా వాంగ్ చేతిరాత సొబగుల ఆత్మను అట్లా తన అక్షరాల్లో ఒలికించడానికి మావో కఠోర శ్రమ చేసాడు. ఆ పనిలో ఉండగా ఒక్కోసారి తిండీ తిప్పలు గురించి కూడా పట్టించుకునేవాడు కాదు మావో. అంతగా మమేకం అయిపోయాడు ఆ పనిలో.

అయితే హుయాంగ్‌కు ఒకటే ఆరాటంగా ఉంది. అది అసలే అరుదైన కళాఖండం అయ్యే. అందులోనూ అసలు సిసలయింది. పట్టుమని నాల్రోజులన్నా గడవకముందే అతను మావో అంగరక్షక దళ కార్యాలయంలో కనిపించినవాడినల్లా 'ఇంతకీ మావో ఆ కాలిగ్రఫీ చూడ్డం అయిందా' అంటూ 'ఎంక్వయిరీ' చేస్తా ఉన్నాడు. 'పోనీ సుమారు ఎప్పుడు పూర్తవుతుందో చెప్తారా' అని అడిగేవాడు.

ఈ నస భరించలేక యిన్ జింగ్ షాన్ అనే బాడీగార్డు ఒక రోజున మావోకు టీ అందిస్తూ 'ఆ హుయాంగ్ గారి నస భరించలేకపోతున్నాం. మాటికి పదిమాట్లు ఆ కళాఖండం మీరు చూడ్డం అయిందా అని ఆరా తీస్తున్నారు' అని చెప్పాడు.

'ఏంటీ' అని నొసలు చిట్లిస్తూ అడిగాడు మావో.

'అదే, ఆయన అస్సలు ఆగలేకపోతున్నాడల్లే ఉంది' అన్నాడు జింగ్‌షాన్.

'ఇదిక్కెడి లంపటం. నాకు మరో నక్షత్రకుడు తగులుకున్నాడట మాట. నెల రోజుల్లో పంపిస్తా అన్నాకదా. ఇప్పుడు ఎన్ని రోజులయినట్లూ, అప్పుడే అనుకున్న గడువు అయిపోయిందా' అంటూ చేతిలో ఉన్న సిగరెట్టు డబ్బీని మావో చికాగ్గా నేలకేసి విసిరికొట్టాడు. దీంతో జింగ్‌షాన్ కంగారుపడి 'అబ్బే ఆయన అడిగి తెచ్చినపెట్టమనే ధోరణి'లో మాట్లాడలేదు ఛైర్మన్. కాకపోతే మనిషికి కాస్త కంగారనుకుంటా! ఇంకా అవసరం ఉందా అని అడుగుతున్నాడు అంతే' అన్నాడు.

'అవసరమే' అన్నాడు మావో.

మధ్యలో ఇంకో నక్షత్రకుడు అనే ప్రస్తావన ఎందుకు వచ్చిందంటే అప్పటికే రష్యా అధినేత కృశ్చేవ్ 'మేము ఇచ్చిన అప్పు తిరిగి కట్టేయమని' తెగ ఒత్తిడి పెడుతున్నాడు. మావో తాపీగా టీ తాగి, కిందకి విసిరేసిన సిగరెట్ డబ్బీ అందుకుని ప్రశాంతంగా ఒక

సిగరెట్ వెలిగించుకుని దమ్ము పీకుతూ 'నెల రోజుల్లో ఇస్తానని నే ముందుగానే చెప్పాను. అన్న మాట నిలబెట్టుకోకపోతే అప్పుడు నన్ను తప్పు పట్టాలి అంతేకానీ ముందు నెల రోజుల కోసం అడిగినప్పుడు సరే అని తీరా గడువుకు ముందే ఇచ్చెయమని అడగడం అంటే అది అతని తప్పే కదా' అన్నాడు మావో. 'అంతే అంతే' అన్నాడు జింగ్‌షాన్.

ఆ తరువాత కొద్ది రోజులకే హుయాంగ్ మావోతో భేటీ అయ్యాడు. మాటామంతీ అయ్యాక హుయాంగ్ ఆ కళాఖండం గురించి అడిగాడు. 'నెలరోజుల్లో ఆగలేకపోతున్నావా మిత్రమా' అనడిగాడు మావో. దానికి ఆయన ఏం సమాధానం చెప్పాడో మాకు వినబడలా. నోరు తెరిచి ఆయన ఏదో చెప్పబోయేలోగా జింగ్‌షాన్ అందుకుని 'నల్ల తుమ్మబంకల్లే ఆ మాట మాత్రం వదలట్లా మీరు' అన్నాడు.

'మరీ కాబూలీవాలా లా ఆ సతాయింపు దేనికండీ... ఛైర్మన్ ఆ మాత్రం గౌరవం ఇస్తే మీ సొమ్మేంపోతుందీ' అని అందుకున్నా నేను.

దాంతో హుయాంగ్ ఏం మాట్లాడలేకపోయాడు. మావో మొహం మాత్రం మా మాటలకు వికసించింది. 'హుయాంగ్ మహా నిర్మొహమాటస్థుడు, అంతే కానీ మాంచి స్నేహితుడు అనిపించుకోవాలనుకోవడం లేదల్లే ఉంది' అన్నాడు. ఇహ చేసేదేం లేక హుయాంగ్ అక్కడితో ఆ ప్రస్తావన ఆపేశాడు.

సరిగ్గా నెలరోజులు కాగానే మావో ఆ ఆల్బమ్‌ను జాగ్రత్తగా రెండు కార్డు బోర్డుల మధ్య 'ప్యాక్' చేయించి 'దీన్ని ఇట్లానే భద్రంగా పట్టుకెళ్ళి హుయాంగ్‌కు అప్పచెప్పిరండి. పొద్దువాలక ముందే ఇచ్చిరావాలి సుమా. లేకపోతే అన్న గడువు మీరినట్లువుతుంది' అన్నాడు.

'కావాలంటే ఇంకొన్ని రోజులు అట్టే పెట్టుకోమని శెలవిచ్చాడు ఆయన' అన్నాడు జింగ్‌షాన్.

'ఏం వొద్దు. పట్టుకెళ్ళి ఇచ్చేసిరండి. స్నేహితులు అన్నాక అన్న మాటకు కట్టుబడి ఉండాలి. పోయి ఇచ్చిరండి' అంటూ మమ్మల్ని తరిమాడు.

'పార్టీ వ్యవహారాలకు, వ్యక్తిగత వ్యవహారాలకు మధ్యన లక్ష్మణ రేఖను పాటించాలి' అంటుండేవాడు మావో.

అది 1950వ సంవత్సరం వసంతకాలం. ఒకరోజు మావో తన మొదటి భార్య (మావో మొదటి భార్యపేరు యాంగ్ కై హుయి. ప్రొఫెసర్ యాన్ కుమార్తె. కొమింటాంగ్ ముష్కరుల చేతుల్లో మరణించింది. అంతర్యుద్ధ కాలంలో మావో జాడ చెప్పమని చిత్రహింసలు పెట్టి చంపేసారు) సంతు అయిన అనీయింగ్‌ను పిలిపించి 'రేపు మనం మీ అమ్మ సమాధి చూసిరావడానికి బయల్దేరాలి. మీ అమ్మమ్మ కోసం ఏమన్నా కొని తీసుకువెళ్ళాలి. ఆవిడకి

ఏం కావాలో నువ్వు చూడు. నిజంగా మీ అమ్మమ్మది మా దొడ్డ మనసు. భలే తెలివిగలది. నేనంటే మా చెడ్డ అభిమానం. మీ తాతగారు అభ్యుదయ భావాలకు పెట్టింది పేరు. నాకు డబ్బు అవసరం పడినప్పుడల్లా ఆయనే సర్దేవాడు' అంటూ వాళ్ళ గురించి చెమ్మగిల్లిన కళ్ళతో తలుచుకున్నాడు. 'వాళ్ళకు దూరంగా ఉండిపోయాం అన్న దిగులు' అన్నాడు.

మావో చాలా కాలం పాటు అత్తమామల కుటుంబానికి ఆర్థికంగా తోడ్పాటు అందించాడు. అలాగే తన చుట్టాలు, స్నేహితులు ఎవరు డబ్బులకు ఇబ్బంది పడుతున్నారని తెలిసినా ఉన్నంతలో వాళ్ళకు సర్దుబాటు చేసేవాడు. అదీ తన జీతం సొమ్మునుంచో, రాయల్టీగా వచ్చే డబ్బులోంచో ఖర్చు చేసేవాడు. అయితే బంధుత్వాన్ని అడ్డం పెట్టుకుని చెప్పేసేవాడు. నవ చైనా ఆవిర్భావం తరువాత ఆయన బంధువుల నుండి వ్యాపారానికి సాయం కోరుతూ డజన్ల కొద్దీ ఉత్తరాలు రాసారు. వాళ్ళకు మావో ఎంత నికరంగా సమాధానం ఇచ్చేవాడో చూడండి -

యాంగ్‌చైజీ స్వయానా మావోకు బావ వరస అవుతాడు. ఆయనకు రాసిన ఉత్తరంలో 'నా నుండి ఇలాంటి సాయాలు ఆశించవద్దు. ఆ పని మీదే అయితే బీజింగ్ వరకూ మీరు రాబడాల్సిన పనిలా. నిజంగా నీకు అవసరం ఉంది అనుకుంటే గవర్నమెంటుకు అర్జీ పెట్టుకో. అవకాశం ఉంటే సదరు డిపార్టుమెంటు వాళ్ళు సాయం చేస్తారు' అని కుండ బద్దలు కొట్టినట్లు తన వైఖరి తెలియజేశాడు.

అలాగే మావో చిన్ననాటి స్నేహితుడు సెన్‌పిన్ సర్కారులో ఏదన్నా పదవి ఇప్పించమని, తగిన సిఫార్సు చెయ్యమని మావోకు ఉత్తరం రాసాడు. దానికి బదులుగా మావో లేఖ రాస్తూ 'సర్కారు వారికి నువ్వు సేవ అందించడానికి ముందుకు రావడం ఎంతైనా ముదావహం. ప్రజలపట్ల నీకు ఉన్న అంకిత భావాన్ని గుర్తించి సర్కారు వారే నీకు సముచిత పదవి కట్టబెడితే అది నీకు వన్నె తెచ్చి పెడుతుంది గానీ, నా సిఫార్సుతో పని జరిపించుకోవడం నీకు నామర్దా కాదూ? నా మనసులో ఉన్న మాటతో నీకు విభేదం లేదనుకుంటా' అంటూ విషయాన్ని అక్కడితే తెంపేసాడు.

అనీయింగ్ తల్లి, మావోకు మొదటి భార్య అయిన యాంగ్ కై హుయా మీద మావో ఒక పద్యం రాసాడు. ఆమె మీద ఉన్న అపారమైన ప్రేమను తొలి వాక్యాల్లోనే అత్యంత ప్రతిభావంతంగా వ్యక్తం చేసాడు. ఈ పద్యం చదివి జియాంగ్ కింగ్ నొచ్చుకుంది. నా మీద కన్నా ఆవిడ మీదే నీకు ప్రేమ ఎక్కువల్లే ఉండే అన్న ధోరణితో వ్యవహరించింది మావోతో. అప్పుడు ఆయన 'నీ బుద్ధి పోనిచ్చుకున్నావ్ కాదు. నరంలేని నాలుక ఎన్ని తిప్పలు తెస్తుందో కదా' అన్నాడు ఆవిడతో. ఆ మీదట జియాంగ్ కింగ్ కొన్ని రోజులు మావోతో మాటలు బంద్ చేసింది.

పది హేనేళ్ళు నేను మావో పంచన పనిచేసా. మావోకు చుట్టాలం అనో, పక్కాలం అనో, చిన్ననాటి స్నేహితులం అనో ఎవరన్నా చెప్పుకుని వ్యక్తిగత లాభం పొందిన దాఖలానే లేదని నే ఖచ్చితంగా చెప్పగలను. అయితే వాళ్ళెవరన్నా తనను కలవడానికి వచ్చినప్పుడు మాత్రం ఎంతటి ఆదరాభిమానాలు చూపించేవాడో గుర్తు పెట్టుకు తీరాల్సిందే.

ఒకసారి ఒక పెద్దావిడ మావోను చూడడానికి వచ్చింది. చిన్నప్పుడు ఎప్పుడో మావో ఇంటి పక్కనే కాపురం ఉండేదట. పుట్టి పెరిగిన ఊరి ముచ్చట్లు చెప్పడానికి వచ్చిన ఆవిడని మావో సాదరంగా ఆహ్వానించాడు. వయసు బాగా మీదపడిన ఆవిడ కూర్చోబోతున్నా, లేవబోతున్నా 'భద్రం భద్రం' అంటూ మావో లేచి ఆవిడకు సాయంగా చేయి అందించేవాడు. ఆవిడ కూడా మావోను అనుకరిస్తూ 'ఆ భద్రం, భద్రమేలేయ్యా' అంటూనే మావో చెయ్యి అందుకుంది. ఏవి ఘటికురాలురా ఈవిడ అనుకోకుండా ఉండలేకపోయా నేను అది చూసి. మావో చెయ్యాలి, తను చేయించుకోవాలి అన్నంత దర్జా ఒలకబోసింది ఆవిడ. మావో దగ్గర తనకు ఆ మాత్రం చనువు ఉందని మా నలుగురికీ తెలియచెప్పడం ఆవిడ ఉద్దేశం. మావో ఆవిడ ముచ్చట తీర్చాడు ఆ రోజున.

అప్తులుగా భావించిన వాళ్ళతో మావో ఒక దేశాధ్యక్షుడిగానో ప్రపంచంలోకల్లా అతి పెద్దదయిన కమ్యూనిస్టు పార్టీ అధినాయకుడిగానో ఏనాడూ వ్యవహరించలేదు. సాదాసీదాగా గడిపేవాడు.

1950లో జరిగిందే ఇంకో ముచ్చట గురించి మీరు ఇప్పుడు చెప్పాలి. చైనాకు మిత్రదేశంగా ఉన్న ఒక దేశం నుండి రాయబారి బాధ్యతలు తీసుకోవడానికి ఆ రోజున ఒక పెద్ద మనిషి రానున్నాడు. వచ్చే అతను అధికారిక నియామక పత్రాలు తెచ్చి దేశాధ్యక్షుడైన మావోకు చదివి వినిపించి, ఆనక ఆ పత్రాలు ఆయన చేతుల్లో పెడతాడు. ఇదీ రివాజు. ఒక మోస్తరు ఫంక్షను కదా కాస్త క్షవరం, గడ్డం చేయించుకుందా అనుకున్నాడు మావో.

వాంగ్‌హుయి అనే అతను మావోకు క్షౌరం చేసేవాడు. బాగా ముసలతను. బట్టతల, నెరిసిన గడ్డం. దళసరి కళ్ళద్దాలు, కోల మొహం, ముక్కు మీదకి జారి ఉండే సోడా బుడ్డి కళ్ళద్దాలు- ఇదీ అతని వాలకం. అతనికి తెలిసిందల్లా క్షౌరం ఒక్కటే. అందుకే వయసు మళ్ళినా, చూపు ఆనుతున్నా, ఆనకపోయినా అదే వృత్తిలో కొనసాగుతున్నాడు. ఇహ అతను క్షౌరం, గడ్డం చేసే తీరు గురించి చెప్పుకోవాల్సిందే. ఆ రోజునయితే మరీనూ ఒక పక్కన రాయబార పదవీ స్వీకారోత్సవం, రెండో పక్కన ఈ ముసలాయన క్షౌర కార్యక్రమం. చూపు సరిగ్గా ఆనని మూలాన చీటికీ మాటికీ కళ్ళజోడు పైకి ఎగదోసుకోవడం, కిందకి జార్చడం, తలపక్కకి తిప్పి వొంకరగా చూడడం, మావో చుట్టూ ప్రదక్షిణలు చెయ్యడం- అదీగాక ఓ చేత్తో మావో తల పట్టుకుని ఆ మూల నుండి ఈ మూల నుండి తీక్షణంగా

చూడడం, ఎక్కడ నుండి మొదలు పెట్టాలి, కత్తెరకు ఎటునుండి పని పెట్టాలి అని ఆలోచించడం, అలా ఆలోచించుకున్నాక తీరుబాటుగా ఏదో ఒక కొస నుండి కాస్త జుత్తు కత్తిరించడం, ఒక మాటు కత్తెర వేసాక కాస్త వెనక్కి అడుగువేసి స్టెప్పు సరిగ్గా వేసానా లేదా అని చూసుకోవడం, అలా చూసుకుని బాగా కుదిరింది అని తన పనిని తనే మెచ్చుకోవడం – ఇలా తీరుబడిగా చేస్తున్నాడు వాంగ్‌హుయి. చూస్తున్న మాకే విసుగువచ్చేస్తా ఉంది. ఇక మావో ఎలా భరాయిస్తున్నాడో కదా అనుకున్నాం. మావో నేమో 'తొందరగా కానియ్‌రా బాబూ... తొందరగా' అని తొందరపెడతా ఉన్నాడు.

'ఊర్కోండి దొరగారూ అట్టా హడావుడి పెట్టమాకండి నన్నూ' అని అభ్యంతరం పెడుతూ వాంగ్ తన పని తీరిగ్గా కానిస్తున్నాడు.

'పెద్దాయనా కాస్త తొందరగా కానీ' అంటూ విసుగుదల ప్రదర్శిస్తూ మావో కుర్చీలో అసహనంగా కదిలాడు. కాని వాంగ్ వొదిలిపెడితేగా 'కదలకుండా కూర్చోండి' అంటూ మావోను ఎటూ కదలనీకుండా రెండూ చేతుల్తో అదివిపట్టి 'మీకు ఆలస్యం కానీను, సరేనా, నా మాటివండి' అన్నాడు వాంగ్.

ఎట్లాగయితేనేం మొత్తానికి గడ్డం గియ్యడం అయిందనిపించాడు వాంగ్. మావో నుదుటపట్టిన చెమల తుడుచుకున్నాడు. కుర్చీలోంచి లేవబోతుంటే వాంగ్ కల్పించుకుని 'లెగొద్దని చెప్తున్న మీరు నా మాట వినిపించుకోకపోతే ఎట్లా? కుదురుగా కూర్చోండీ' అన్నాడు.

'అవతల పన్లున్నాయి' అని గొణిగాడు మావో అభ్యంతరంగా. 'తొందరగా కానీ' అన్నాడు.

'అలాగే... తొందరగానే అవజేస్తాగా' అంటూ మావో వెనక్కుజేరి నడినెత్తిన జుట్టులేకుండా నున్నగా ఉన్న బుర్ర మీద పసిపిల్లాడిలా చేతివేళ్ళతో దరువేసాడు. అది చూసి మా గుండెలు గతుక్కుమన్నాయి. కానీ మావో దాన్ని గురించి పెద్దగా పట్టించుకున్నట్లు లేదు. భారంగా నిట్టూర్చి ఊరుకున్నాడు. వాంగ్ కత్తితో మావో మెడ చుట్టూ నున్నగా గీకుతూ 'మీరా ఈ దేశానికి ఛైర్మన్ లాంటోరు. అట్టాంటి మీకు క్షౌరం సరిగ్గా చెయ్యకపోయినా, గడ్డం సరిగ్గా గియ్యకపోయినా నాకు ఎంత నామర్దా. ఇంత సర్వీసు పెట్టుకుని నేను మాట పడగలనా' అంటూ తమ అంతశ్రద్ధ ఎందుకు పెడుతున్నాడో మావోకు వివరించి చెప్పాడు.

నాకు తెలిసీ, నేను చూసినంతలో వాంగ్ అంత ఆత్మాభిమానంతో మావో ఎదుట మెలిగిన వాళ్ళు కద్దు. చేసేది క్షౌరం పనే అయినా, అవడానికి మావో దేశాధ్యక్షుడయినా రాజకీయంగా ఇద్దరూ సమానమే అనే తీరుతో ఉండేవాడు వాంగ్.

ఇరుగు పొరుగుకు సాయం చేసి సంబరపడిపోయే వాళ్ళకు ఈ ప్రపంచంలో కొదవలేదు. మావో కూడా అలాంటి కోవకు చెందుతాడు.

హాన్ గ్రుయిక్సిన్ మావో సిబ్బందిలో చేరేనాటికి పద్దెనిమిదేళ్ళ పిల్ల. పనిలో భాగంగా తరచూ మేం ఇద్దరం మాట్లాడుకుంటూ ఉండేవాళ్ళం. తొందరలోనే ఇద్దరం మంచి స్నేహితులం అయిపోయాం. ఆ స్నేహం ఇష్టంగా మారింది. అయితే అక్కణ్ణించి అడుగు ముందుకు కదల్లేదు. ఉత్తర షాంగ్సీలో యుద్ధం జరుగుతున్న కాల అది. ఒక రోజు మావో నన్ను పిలిచి 'హాన్ గురించి నీ అభిప్రాయం ఏంటీ?' అనడిగాడు.

'మంచి పిల్ల' అన్నా నేను చాలా యథాలాపంగా.

మావో నాకేసి చూసి మార్మికంగా నవ్వుతూ– 'మీరు ఒకళ్ళ నొకళ్ళు ఇంకా బాగా అర్థం చేసుకోవాలి. అట్లా అర్థం చేసుకోవాలంటే తరచూ మీ ఇద్దరూ కలుసుకుంటూ ఉండాలి' అన్నాడు.

ఒక్కసారిగా నా గుండె వేగం పెరిగింది. సిగ్గరితనం అనిపించింది. మౌనంగా నేల చూపులు చూస్తూ ఉండిపోయా. మావోలో నాకు ఆ క్షణాన నా మనసు ఎరిగిన ఆప్తమిత్రుడు కనిపించాడు.

'విన్నావా' అని మావో రెట్టించాడు' తరచూ ఆమెను కలుసుకుంటూ ఉండు. కాస్త ఆపేక్షగా మసలుకో. ఆడపిల్ల తను ఆ చొరవ చెయ్యలేదు. అందుకే నీకు చెప్తా' అన్నాడు. బదులుగా నేను తల ఊపా.

ఉత్తర షాంగ్సీ నుండి మా పటాలం అంతా జిబైపో చేరుకున్నాక మాకు అంతకు ముందులా తిప్పట లేకుండాపోయింది. దాంతో నాకు హాన్‌ను తరచూ కలుసుకునే వెసులుబాటు చిక్కింది.

ఆ తరువాత ఒక రోజున నేను మావోతో కలసి అలా పంట చేల వెంబడి నడుస్తూ వెళుతుండగా మీ బంధం బలపడినట్టేనా అని ఎంతో ఆత్మీకంగా అడిగాడు. నేను నవ్వాను.

మావో నా నవ్వుకు అర్థం ఏమిటో గ్రహించాడు. 'ఇందులో సిగ్గుపడాల్సింది ఏం లేదు. సరేనా' అంటూ భరోసాగా నా భుజం తడుతూ 'మీకు నా ఆశీస్సులు ఎప్పుడూ ఉంటాయి' అన్నాడు.

నిజానికి నాకు లోపల్లోపల ఒకింత ఆందోళనగా ఉంది. జిబైపోలో పెళ్ళికాని ఆడపిల్లల కంటే పెళ్ళికాని మగపిల్లలు ఎక్కువగా ఉన్నారు. దాంతో ఆడపిల్లల దృష్టిలో పడడానికి ప్రతి మగాడూ ఏదో రకంగా పాట్లు పడుతుంటాడు. హాన్ మీద కూడా ఎక్కువ మంది

మగాళ్ళే కన్నేసారన్న విషయం నాకు తెల్సు. కానీ నా విషయం తన దగ్గర ఎలా ప్రస్థావించాలో పాలుపోకుండా ఉంది నాకు. పోనీ ఎవరన్నా పెళ్ళిళ్ళ పేరయ్య ద్వారా విషయం కదిపి చూద్దామా అని ఆలోచించా ఒక దశలో అయితే. ఆ అవసరం లేకుండానే లడ్డూ లాంటి అవకాశం వచ్చి పడింది.

'నీకు పిల్లను చూసాంరా అబ్బాయి నువ్వొచ్చి ఓ మారు చూసుకుంటే లగ్నాలు పెట్టించేస్తామ్' అంటూ మా ఇంట దగ్గర నుండి నాకు ఓ ఉత్తరం వచ్చింది. నేనా ఉత్తరం మావోకు చూపించాను.

'ఇప్పుడు నన్నేం చెయ్యమంటారో చెప్పండి ఛైర్మన్' అని అడిగాను.

మావో ఆ ఉత్తరం చదివి 'ఇంతకీ నువ్వే చేద్దాం అనుకుంటున్నావ్' అని ఎదురు అడిగాడు.

నేను బేలగా తల వాల్చేసా.

మావో నవ్వాడు. 'ఆడపిల్లలా అలా సిగ్గుపడతావే' అని అడిగి 'ఓ పన్జేయ్. ఈ ఉత్తరం తీసుకెళ్ళి ఆ అమ్మాయి చేతిలో పెట్టు. జవాబు రాసి పెట్టమని అడుగు. ఆ పని నీకన్నా తనయితేనే సరిగ్గా చేస్తుంది' అని ఉపాయం చెప్పాడు.

దాంతో నే ఎగిరి గంతేసా. నా మొహం వెలిగిపోయింది. మావో చెప్పిన ఉపాయానికి.

అక్కణ్ణించి తిన్నగా హాన్ దగ్గరకు వెళ్ళా. 'మా ఇంటి నుంచి వచ్చిన ఉత్తరం చదువు' అన్నా. ఆమె ఉత్తరం చదివాక 'ఏవని జవాబు రాయమంటావ్? వొద్దని రాసేదా' అనడిగా నేను.

హాన్ ఊపిరి వేగం హెచ్చింది. మొహం సిగ్గుతో ఎర్రబారింది. తడబడుతూ 'అలాగే, అలాగే రాయి' అంది.

'ఆ పనేదో నీ చేత్తో చేసి పెట్టరాదూ. నేను ఆ సంబంధం ఎందుకు వొద్దంటున్నానో కూడా వాళ్ళకు తెలుసుద్ది' అన్నా నేను. 'మంచి ఆలోచనే' అని మురిపెంగా నవ్వుతూ 'ఇన్నాళ్ళకి బయటపడ్డాడండీ, పెద్ద మగాడూ, నా కోసం జనాలు తెగవెంటబడతా ఉంటే వాళ్ళందరినీ తప్పించుకు తిరగడానికి నే ఎన్ని తంటాలు పడ్డానో తెలుసా. పోనీ నీ మనసులో ఏముందో తెల్సుకుందాం. నీ నోటితో నువ్వు చెబితే విందాం అని ఎదురుచూస్తా ఉంటే నువ్వేమో మూగ నోము పట్టావయితివయ్యే. ఈ మాట కోసమే, నీ మాట కోసమే నేనిన్నాళ్ళూ ఎదురుచూసింది' అంది తను.

"ఇంకా నయం. ఈ ఉత్తరం చూశాక మావో నీకు చూపించమని ఉపాయం చెప్పాడు

కాబట్టి సరిపోయింది. లేకుంటే ఈ విషయం నీతో ప్రస్తావించలేక ఇంకా మూగగానే ఉండిపోయేవాణ్ణేమో" అని చెప్పా తనకి.

ఆ ఆనందంతో అప్పటికప్పుడు మావో దగ్గరకు పరుగులు తీసానేను. మా ఇద్దరి మధ్యన జరిగిన సంభాషణ పూసగుచ్చినట్లు వివరించి చెప్పా. దాంతో ఆయన మొహం కూడా విప్పారింది. 'మంచిది' అంటూ అభినందన పూర్వకంగా నా చెయ్యి వొత్తి విడిచి 'పదా, అలా నడుస్తూ మాట్లాడుకుందాం' అన్నాడు.

'వొదిలి పెట్టకు ఇంకియావో. ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకునే అవకాశం వొదలుకోమాకు. ఏదో అదృశ్యహస్తం మిమ్మల్ని నడిపించిందనుకుంటాను. అందుకే మీ ఇద్దరూ నా కొలువులో కుదురుకున్నారు' అంటూ మావో నా కర్తవ్యాన్ని బోధపరిచాడు.

1948 డిసెంబర్‌లో నేనూ, హాన్ పెళ్ళి చేసుకోవడానికి పార్టీకి లెటరు పెట్టాం. రెండు రోజుల్లోనే మా అర్జీని అనుమతిస్తూ ఆ లేఖను తిరిగి మాకు పంపించారు. సంబంధిత కమిటీ నాయకులు అందరూ వాళ్ళ వాళ్ళ అంగీకారంతో పాటు రకరకాల శుభాకాంక్షలు తెలియచేస్తూ రాసారు మా అర్జీ మీద. పార్టీ శాఖ కూడా మా పెళ్ళికి అంగీకారం తెలిపింది. బంగారు ఖజానా దొరికినంత సంబరంగా ఆ లేఖ అందుకున్నాం మేం.

అలా మా పెళ్ళి విషయంలో మావో చొరవ చూపించాడు. ఇదేదో నా ఒక్కడికే దక్కిన అదృష్టం అనుకునేరు. మా పటాలంలో మావో నుంచి అటువంటి అదృష్టం దక్కించుకున్నవాళ్ళు చాలా మందే ఉన్నారు. వాస్తవాలను గమనంలో ఉంచుకుని ఎలాంటి తొందరపాటూ లేకుండా నిబ్బరంగా ఆలోచించి నిర్ణయం తీసుకునేవాడు మావో.

ఒకసారి ఫెంగ్ యాపేసాంగ్ ఒక డాన్సు పార్టీలో ఒక అమ్మాయిని కలిసాడు. తొలి పరిచయంలోనే ఆమె మీద మనసు పారేసుకున్నాడు. ఆ అమ్మాయి మ్యూజికల్ పార్టీలో సభ్యురాలు. ఈ విషయం తెలిసి మావో ఫెంగ్‌ను పిలిపించి మాట్లాడాడు.

'అరే అబ్బాయ్ నువ్వసలు అలా మ్యూజికల్ పార్టీలో పనిచేసే అమ్మాయిని ఎంచుకోవడమే తప్పు. ఇవాళా రేపూ మ్యూజికల్ ట్రూపులో ఉండే అమ్మాయిలు ఎంతో ఫ్యాన్సీగా ఉండడానికి చూస్తారూ. నీదా గొర్రె తోక బెత్తెడు జీతం. నీ అత్తెసరు జీతంతో ఆ అమ్మాయినెలా సుఖపెడదాం అనుకున్నావ్. నువ్వు కమ్యూనిస్టువే కావొచ్చు కానీ మన సమాజంలో అందరూ కమ్యూనిస్టు భావజాలంతో జీవిస్తున్న వాళ్ళు కాదు. నువ్వు ఈ విషయాన్ని మర్చిపోతే గాల్లో నిచ్చెన మెట్లు కట్టుకున్నవాడివి అవుతావ్. బాగా ఆలోచించి నిర్ణయం తీసుకో' అని మావో మా వాడికి క్లాసు పీకాడు.

మావో ఎక్కువమందికి ఒక్క విషయం గట్టిగా చెప్పేవాడు. 'ఇది సలహాయే అనుకోండీ,

ఇంకోటి అనుకోండి కాని జీవిత భాగస్వామిని ఎన్నుకునేటప్పుడు కలల్లో విహరించకండి. నేల మీద ఉండి ఆలోచించండి. మావో దగ్గర పని చేస్తున్నాల్లే, నాకేంఫర్లా అన్న భరోసాతో ఎలాంటి నిర్ణయాలూ తీసుకోకండి. రేపు అసలుకే మోసం వస్తుంది. మన చుట్టూ ఉన్న సామాజిక వాతావరణాన్ని గుర్తెరిగి మరీ నిర్ణయాలు తీసుకోండి. భౌతిక వాస్తవాలను విస్మరించకండి. పెళ్లంటే జీవిత కాలపు బంధం, జాగ్రత్తగా ఆలోచించి నిర్ణయం తీసుకోండి" అని తరచూ మాకు సలహా ఇచ్చేవాడు.

తొలి చూపు ప్రేమ అలా మురిసి ముక్కలయినాక ఫెంగ్ ఇంకో అమ్మాయి వెంటపడ్డాడు. అన్హుయి ప్రావిన్సులోని హెఫెయి అనే ఊళ్ళో ఆ అమ్మాయి తారసపడింది. చిత్రం ఏంటంటే ఈ పిల్లా మ్యూజికల్ పార్టీలో పనిచేసే ఆమే. విషయం తెలిసిన మావో ఒక రోజు ఫెంగ్‌ని 'ఏంట్రా అబ్బీ పోయిన చోటే వెతుక్కోవాలనే సూత్రం బాగా ఒంటబట్టినట్టుంది నీకూ, మళ్ళీ ఇంకో మ్యూజికల్ ట్రూప్‌లోని పిల్ల వెంట పడుతున్నావట' అనడిగాడు. ఫెంగ్ ఓ వెర్రి నవ్వు నవ్వేసి ఊరుకున్నాడు.

ఈలోగా ఒకసారి అన్హుయి ప్రావిన్సు పార్టీ కార్యదర్శి జెంగ్, ఆయన సతీమణి మావోను చూడవచ్చారు. వచ్చేటప్పుడు ఆ అమ్మాయి గురించి భోగట్టా సేకరించుకురమ్మని మావో వాళ్ళకు కబురు పంపాడు. వాళ్ళు రావడమే' అబ్బే ఆ అమ్మాయి మన వాడికి తగిన పిల్లకాదండీ, వయసులో మూడేళ్ళు పెద్దది మనవాడికి అయుక్షీణం కదూ' అన్నారు. అప్పుడు మావో అన్నాడు – 'అబ్బే... వయసులో ఒకటి రెండేళ్ళు పెద్దదయినంత మాత్రాన సమస్య కాదనుకోండీ.... చెప్పాలంటే ఆ పిల్ల అంత వయసున్న దానిలా కనిపించదు కదూ. ఇంకా ఏవన్నా విశేషాలుంటే చెప్పండి' అనడిగాడు.

'విశేషమే. ఆ అమ్మాయి విధవరాలు; ఒక బిడ్డకు తల్లి కూడా' అని చెప్పాడు జెంగ్.

అప్పుడు మావో ఫెంగ్‌కేసి 'ఏంటీ సంగతి? విన్నావుగా! ఆ అమ్మాయి ఒక బిడ్డకు తల్లి అట. ఆ బిడ్డని నీ కూతురుగా సాకడానికి సిద్ధమేనా మరీ' అనడిగాడు. ఫెంగ్ అడ్డంగా తలూపాడు.

అప్పుడు మావో జెంగ్‌కేసి తిరిగి 'అదండీ సంగతి. నా దగ్గర పనిచేసే కుర్రాళ్ళకు ఎంత హుషారో చూసారా. అవ్వా కావాలి బువ్వా కావాలట. పిల్ల కళ్ళకు అందంగా ఉండాలీ, ఎట్లాంటి బంధాలూ ఉండకూడదు. ఏం చేస్తాం. మీ ప్రావిన్సులోని మ్యూజికల్ ట్రూపు పిల్లకు మా వాణ్ణి చేసుకునే అదృష్టం లేదు' అన్నాడు.

జెంగ్ వాళ్ళు వచ్చిన పని చూసుకు వెళ్ళిపోయాక మావో ఫెంగ్‌ను పిలిచాడు. 'చూసావా, కంటికి నచ్చిన వాళ్ళ దగ్గరల్లా మనసు పారేసుకుంటే ఇలానే ఉంటుంది. నేను

నిన్నే తప్పుపట్టట్లా. నీ ప్రయత్నం నువ్వు చెయ్యి. కాని తొందర పడమాకు' అని సుతిమెత్తగా హెచ్చరించాడు.

ఆ తరువాత మా మకాం లూషన్ పర్వత ప్రాంతాలకు మారింది. జియాంగ్జీ ప్రావిన్షియల్ పార్టీ కార్యదర్శిగా యాంగ్‌పాంగ్‌కుయి పనిచేస్తున్నాడు. ఫయిజింగ్ అతని భార్య. మావో ఆవిడని పిలిచి ఫెంగ్‌కు మంచి సంబంధం చూడమని చెప్పాడు. ఆవిడ ఒక నర్సు సంబంధం తెచ్చింది. ఒక మాట అనుకునే లోగా మావోతో సహా మకాం ఎత్తేసి మేం బీజింగ్‌కు వచ్చేసాం. మావో ప్రోద్బలంతో ఫెంగ్ ఆ అమ్మాయికి ప్రేమలేఖలు రాసేవాడు. చివరకు ఎట్లా అయితేనేం వాళ్ళిద్దరికీ పెళ్ళి కుదిరింది. పెళ్ళి అవగానే వచ్చి మావో ఆశీర్వాదం తీసుకున్నారు వాళ్ళిద్దరూ.

ఇట్లాంటిదే ఇంకో సంఘటన గురించి కూడా మీకు చెప్పాలి. టియాన్‌యున్‌యు మొదటిసారి ఒక పిల్లతో బాగా స్నేహితంగా ఉండేవాడు. ఆ అమ్మాయి నాటకాలు, ఓపేరాల్లో నటించేది. రెండేళ్ళపాటు వాళ్ళ స్నేహబంధం సజావుగానే సాగింది. ఆ తరువాత ఏ కారణానో ఆ ఇద్దరికీ బెడిసికొట్టింది. దాంతో టియాన్ ఆ అమ్మాయికి అంతకుముందు తాను బహుమతులుగా ఇచ్చిన చేతిగడియారం, ఉలెన్ బట్టలు తిరిగి ఇచ్చెయ్యమని అడిగాడట. ఆ విషయం తెలిసిన మావో టియాన్‌ను పిలిచి ముక్క చివాట్లు వేసాడు. "బుద్ధుందా నీకూ? మగాళ్ళు చేసే పనేనా అదీ– ఇచ్చిన బహుమతులు తిరిగి తీసుకుంటారా ఎక్కడైనా, మీ ఇద్దరూ ఆనందంగా గడిపిన క్షణాలకు అవే కదా తీపి గురుతులూ. ఇహ వీటి సంగతి మర్చిపో. ఆ అమ్మాయి నీ మాజీ స్నేహితురాలే కానీ శత్రువు కాదు. ఆ విషయం గుర్తించుకో" అని హెచ్చరించాడు.

ఆ తరువాత టియాన్ యున్‌యుకు పెళ్ళి సంబంధం కుదిర్చేపనిలో మావో తన వంతు సాయం చేసాడు.

మావో కోసం ఏర్పాటుచేసిన స్పెషల్ రైలులో మావోషు బియాన్ అనే ఆడ కూతురు పనిచేస్తుండేది. ఆ అమ్మాయికి ఒక బాయ్ ఫ్రెండ్ ఉండేవాడు. ఒక రోజు పని ఒత్తిడిలో ఉండి అనుకున్న సమయానికి అతన్ని కలవడానికి వెళ్ళలేకపోయింది. అతగాడు ఏమనుకుంటాడో అని ఈ పిల్ల ఓ మథనపడిపోతూ ఉంది. ఇటుపని వొదిలి వెళ్ళలేక, అవతల అతగాణ్ణి కలుస్తానో లేదో అన్న ఆదుర్దాతో సతమతమయిపోతా ఉంటే చూసి మావో విషయం ఎంటో అడిగి తెలుసుకున్నాడు. ఆ అమ్మాయి విషయం చెప్పగానే 'అర్రరే, ఎంత పనయిందీ, నాతో ఒక ముక్క చెప్పే పనిగా, అతగాడు నీ కోసం అక్కడ ఎంతసేపట్నించి పడిగాపులు పడుతున్నాడో. అర్జంటుగా నువ్వు బయల్దేరు' అన్నాడు. ఆ అమ్మాయి హుషారుగా బయల్దేరింది. 'ఒక్క నిమిషం ఉండు తల్లీ. ఎందుకింత ఆలస్యం అయిందో నా మాటగా

చెబుతాను' అంటూ అప్పటి కప్పుడు నాలుగు ముక్కల కవిత్వం రాసి ఆ కాయితాన్ని ఆ అమ్మాయి చేతికిచ్చి 'నీ జతగాడికి ఇయ్యి. అర్థం చేసుకుంటాడు' అని పంపించాడు. మావో ఆ కాయితంలో రాసిన కవిత ఇదీ -

అందాల రాశి ఆమె

పట్నం మొగదల నా కోసం వేచి ఉంది

అడుగుకదపదు, నాదరి చేరదు

రోజంతా నన్ను సంభ్రమాశ్చర్యంలో ముంచెత్తింది.

మావో దగ్గర పనిచేసే వాళ్ళందరి వివరాలతో మా ఆఫీసులో 'ఒక పుస్తకం రెడీగా ఉండేది. తన దగ్గర పనిచేసినవాళ్ళు ఎవరాన్న తనని చూడవస్తే, తను తీరిగ్గా ఉంటే తన దగ్గరకే నేరుగా తీసుకురమ్మని, వేరే వ్యాపకంలో ఉంటే మాలో ఎవరన్నా ఒకళ్ళు ఆ వచ్చిన వాళ్ళను సాదరంగా ఆహ్వానించి వాళ్ళ మంచీ చెడ్డలు చూస్తుండమని మావో తరచూ మాకు చెబుతుండేవాడు.

1954 శీతాకాలంలో ఒక రోజున పడమర దిక్కున ఉండే గేటు దగ్గర కాపలాగా ఉన్న ఝూంగ్ నాన్హీ నా దగ్గరకు వచ్చి 'ఝూ యీ ఝువోన్ అనే అతను ఛైర్మన్‌ను కలవాలి అంటున్నాడు. ఏం చెయ్యను' అనడిగాడు. వెంటనే నేను ఆఫీసులో ఉన్న పుస్తకం తిరగేసి ఆ పేరుగల ఆసామి గతంలో మావో దగ్గర పని చేసినట్లు గుర్తించా. వెంటనే మావో దగ్గరకు వెళ్ళా. ఆయన అప్పుడు ఏదో పనిలో ఉన్నాడు. విషయం చెప్పా అయనకి. అతను ఎవరో నీకు తెలిసి ఉండదు కదూ. హేనాన్ ప్రావిన్సు నుండి వచ్చాడు. సన్నగా, పొడుగ్గా ఉంటాడు. ఎర్ర సైన్యంలో ఆఫీసరుగా పన్జేసాడు. పంపించు లోపలికి' అన్నాడు ఆయన.

నేను పడమర దిక్కుకు వెళ్ళా. అక్కడ మావోను చూడవచ్చి రెస్ట్ రూంలో వేచి ఉన్న అతను అచ్చం మావో చెప్పిన పోలికలతోనే ఉన్నాడు. నేనతన్ని వెంటపెట్టుకుని మావో దగ్గరకు తీసుకువెళ్ళా. ఝూయి నాతోపాటు గదిలోకి అడుగు పెడుతుండడం చూసి మావో రాత బల్ల దగ్గర నుండి లేచి అతనికి ఎదురొచ్చి 'రా... రా... ఎంత కాలానికి' అంటూ షేక్ హ్యాండ్ ఇవ్వడానికి చెయ్యి సాచాడు. ఝూయీ ముందుగా మిలిటరీ సెల్యూట్‌కొట్టి ఆ తరువాత షేక్ హ్యాండ్ ఇచ్చాడు. 'కూర్చో' అని మావో అతనికి కుర్చీ చూపించి 'ఏం చేస్తున్నావ్ ఇప్పుడూ 'అనడిగాడు'. ఎయిర్ ఫోర్స్‌లో పని చేస్తున్నా ఛైర్మన్' అని చెప్పాడతను. 'కూర్చో ముందు. కూర్చొని మాట్లాడు' అంటూ అతను కుర్చీలో కూర్చునే దాకా మావో ఊరుకోలేదు. నేను టీ తీసుకురావడానికి వెళ్ళాను. మావోను చూడడానికి ఎవరు వచ్చినా

సరే ముందు టీ ఏర్పాటు చెయ్యడం నా పని.

ఓ అరగంట తరువాత మా ఆఫీసులో ఫోన్ మోగింది. ఫోన్ మాట్లాడి ఆ విషయం మావోకు చెప్పడానికి ఆయన గదిలోకి వెళ్ళా. అప్పటికి ఇంకా మావో అతనితో బాతాఖానీ కొడుతూనే ఉన్నాడు. మావో దగ్గర పనిచేసిన అనుభవంతో నేను పని మీద లోపలికి వచ్చానని ఝూయి గ్రహించినట్లు ఉన్నాడు. తన కుర్చీలోంచి లేచి నిలబడి 'మిమ్మల్ని కలిసి, మాట్లాడి మీదో ఇంతసేపు గడిపినందుకు నాకు చాలా ఆనందంగా ఉంది. ఛైర్మన్ ఇంక నాకు సెలవు ఇప్పిస్తారా' అనడిగాడు. మావో లేచి తనతోపాటు గది గుమ్మం దాకా వచ్చాడు. అక్కడి నుండి నేను తోడ్కొని వెళ్ళాను అతన్ని.

ఆ తరువాత 'వుహాన్'లో ఉండగా మరోసారి వచ్చి కలిసాడు ఆయన. ఇప్పుడు కూడా మావో అతనితో అరగంట సేపు కాలక్షేపం చేసాడు. తరచూ అతనికి ఉత్తర్వాలు కూడా రాస్తుండేవాడు మావో.

సంవత్సరం పొడుగూతా మావోను చూడడానికి ఝూయి లాంటి వాళ్ళు ఎంతోమంది వస్తుండేవారు. ఒక్కోసారి వాళ్ళు వెళ్ళేవరకూ మావో భోజనానికి లేచేవాడు కాదు. లీలియాన్ చెంగ్, టియన్ యున్‌యులను మావో భద్రతా దళం నుండి వేరే బాధ్యతలోకి బదలాయించారు. వాళ్ళు వెళ్ళిపోయే ముందు మావోను వచ్చి కలిసారు. రాత్రి భోజనం చేసాకగానీ వెళ్ళడానికి వీల్లేదని మావో పట్టుబట్టాడు. దాంతో వాళ్ళిద్దరూ భోజనానికి ఉండిపోయారు. ఆ రోజు మావో స్వయంగా వాళ్ళ కోసం 'టోస్ట్' తయారు చేసాడు. అసాధారణంగా వాళ్ళతో కలిసి ఓ పెగ్గు మందు పుచ్చుకున్నాడు. మందు పుచ్చుకోవడం ఆలస్యం మావో మొహం ఎర్రబడిపోయింది. భోజనం చేస్తూ మావో వాళ్ళిద్దరితో ఎంతో ప్రేమగా 'తరచూ మీరు వచ్చి కలుస్తూ ఉండండి. లేకపోతే నాకు ఏదో కోల్పోయినట్లు ఉంటుంది' అన్నాడు.

తన దగ్గర పనిచేసిన వాళ్లకు డబ్బు అవసరం పడితే మావో తన జేబులోంచే ఆ డబ్బు సర్దేవాడు. 'అవసరానికి నేను కాకపోతే ఎవరు ఆదుకుంటారు వీళ్ళనీ, వీళ్ళంతా నేను నా బాధ్యతలు సక్రమంగా నెరవేర్చడానికి ఎంతగా తోడ్పడ్డారనీ' అంటుండేవాడు.

అలా అని మావో ఎన్నడూ అపాత్రదానం చేసి ఎరగడు. తన దగ్గర పనిచేసి వెళ్ళిన వాళ్ళందరితోనూ మావో ఒక మాట చెబుతుండేవాడు –, "పని మీద శ్రద్ధ పెట్టండి" 'నిజాయితీగా నికరంగా ఉండండి' 'ఏదన్నా కష్టం వస్తే మటుకు నేను ఒకణ్ణి ఉన్నానని మాత్రం మర్చిపోకండి. మీ కష్టం ఏమిటో నాకు రాయండి నాకు చేతనయినంతలో సాయం చేస్తా' అనేవాడు. అన్నమాట ప్రకారం ఎవరికి ఏ కష్టం వచ్చినా అండగా నిలబడేవాడు.

# 15. బిడ్డల శిక్షణ

చైనా విముక్తి పోరాటంలో ఆరుగురు బిడ్డలను కోల్పోయిన మావో పిల్లలతో చాలా ప్రేమగా మెలిగేవారు. అలాగే కఠినంగానూ వ్యవహరించేవారు.

మొదట భార్య సంతు అయిన మావో అనీయంగ్ సోవియట్‌లో చదువు పూర్తి చేసుకుని వచ్చాక అతనికి అతుకుల బట్టలు ఇచ్చి షాంగ్జిగన్సు- నింగ్జియా సరిహద్దు ప్రాంతానికి పంపించి వ్యవసాయం నేర్చుకోమన్నాడు. అక్కడ ఉన్న ఒక ఆదర్శ రైతు దగ్గరకు పంపిచాడు. మావో తన పిల్లలను సాకే సందర్భంలోని ఇలాంటి అనేక అంశాలలో నాకు గుర్తున్న విషయాలను ఇప్పుడు మీ దృష్టికి తీసుకొస్తాను.

అప్పట్లో యేనాన్‌లో జపాన్ సామ్రాజ్యవాద వ్యతిరేక సైనిక రాజకీయ శిక్షణ జరిపేందుకు కాంగ్డా అనే కాలేజీ నడుస్తుండేది. ఆ కాలేజీలో చదువుకునేందుకు బీపింగ్ నుండి ఫు అనే అమ్మాయి వచ్చి చేరింది. కంటికి నదురుగా కుదురుగా ఉండేది. ఆ పిల్ల. దేశంలోని వెనుకబడిన ప్రాంతంలో ఉన్న పట్నం అని చెప్పుకోదగ్గ ఒక పెద్ద పల్లెటూరు యేనాన్. అక్కడ ఆడ పిల్లల జనాభా తక్కువ. అందులోనూ 'ఫు' లాంటి అందగత్తె ఆ ప్రాంతానికి మకుటం లేని రాజకుమార్తి కింద లెక్క. ఆ పిల్ల జియాంగ్ కింగ్ కళ్లబడింది. ఆ పిల్లను చూడ్డంతోనే ఆవిడ మదిలో ఏదో ఆలోచన మెదిలింది. భోజనానికి ఇంటికి రమ్మని ఆ పిల్లకు కబురు పంపింది. ఆ రోజు రాత్రి భోజనాల దగ్గర ఆ పిల్లను అనీయంగ్‌ను ఎదురెదురు కూర్చోబెట్టింది ఆవిడ. వాళ్లిద్దరికీ మాటా మాటా కలిపింది. ఇద్దరూ ఒకరినొకరు ఇష్టపడ్డారేమో కూడా ఆ అమ్మాయికి వెళ్లిపోయాక ఎలా ఉంది ఆ పిల్ల నీ మనసుకు నచ్చిందా? అని అనీయంగ్‌ను అడిగింది మావో భార్య. 'పెళ్లీడుకి వచ్చావే. అమ్మాయి నచ్చితే చెప్పు' అంది.

ఆ కుర్రాడు కాసేపు మౌనంగా వున్నాడు. ఆ తరువాత కాస్త సిగ్గుపడుతూ "నాన్నగారు ఏమంటారో కదా' అన్నారు.

'ఆ విషయం నాకు ఒదిలేయ్. ఆయన్తోనే మాట్లాడతాగా' అని భరోసాగా అంది జియాంగ్ కింగ్.

అయితే జియాంగ్ ఆశల మీద మావో నీళ్లు చల్లేశాడు. జియాంగ్ తన మనసులోని మాట చెప్పడంతోటే మావో తల అడ్డంగా ఊపుతూ 'అప్పుడే పెళ్ళి ప్రస్తావనా;? ఒకసారి

కలిశారో లేదో పెళ్లి అంటే ఎలా. కుర్రాడికి తొందరపాటు ఉందంటే అర్థం చేసుకోవచ్చు. నువ్వయినా ఆలోచించాలి కదా. అనీయంగ్‌ను ఒకసారి వచ్చి నన్ను కలవమను' అన్నాడు.

దాంతో ఆవిడ అనీయంగ్ దగ్గరకు వెళ్ళి 'మీ నాన్న రమ్మనమంటున్నారు. విషయం నీతో మాట్లాడతారనుకుంటా. జాగ్రత్త! ఇప్పుడంతా నీ చేతుల్లోనే ఉంది' అని చెప్పి మరీ పంపించింది.

అనీయంగ్ వచ్చి మావో దగ్గర నిలుచున్నాడు. 'అమ్మాయి అందంగా ఉంటుంది' అని సిగ్గుపడుతూ అనీయంగ్ తన ఇష్టాన్ని తండ్రికి చెప్పాడు.

'కాబట్టే కదా నువ్వు ఇంతదాకా వచ్చింది' అని మావో చిలిపిగా నవ్వుతూ "నాకు అర్థమైంది. కాకపోతే పైపై అందాలు చూసి మనసు పారేసుకుంటే ఎలా అనేదే నాకు అర్థం కాలా" అన్నాడు వెంటనే.

దాంతో అనీయంగ్ మౌనంగా ఉండిపోయాడు.

'ఆమె గురించి ఏం తెలుసుకున్నావ్ నువ్వు. చూడ్డానికి కళ్ళకు అందంగా ఉండిపోతుంది.. అంతేకదూ. మరి విప్లవం పట్ల ఆమెకు విశ్వాసం ఉందా? ఆమె వ్యక్తిత్వం ఎటువంటిది? ఎటువంటి నడత కలిగినది? బీపింగ్ నుంచి ఇక్కడ చదువుకోవడానికి వచ్చి అట్టే కాలం కాలేదు. ఆమె గురించి ఇటువంటి వివరాలేం తెలీవు. ఆమెతో నేరుగా పెళ్లి అనేస్తే ఎలా? పెళ్లి అంటే నీ మటుకు నీకు వ్యక్తిగత అంశం అని చూడమాకు. విప్లవ క్రమంతో అనుబంధం గల బంధం పెళ్లి అంటే. నువ్వు మావో కొడుకువి. అది నీ అదృష్టమో దురదృష్టమో నే చెప్పలేను. అంతా నీ విచక్షణకే వదిలేస్తున్నా. నీ ఇష్టం ఇక' అన్నాడు మావో. మావో ఆలోచనా రీతి సరైనదే అని తొందరలోనే రూఢి అయింది. యేనాన్‌లో కఠోరమైన జీవితంతో పొసగక ఆ అమ్మాయి బీపింగ్‌కు బిచాణా ఎత్తేసింది. అది చాలదన్నట్లు స్థానిక దినపత్రికలలో విప్లవం మీద అవాకులు చెవాకులు పేలుతూ వ్యాసాలు రాసింది. ఇదంతా మావో దృష్టికి వచ్చింది. అప్పుడు బలమైన హునాన్ యాసలో 'అందమైన భాహ్యరూపం ఎన్నడన్నా మోసం చెయ్యవచ్చు. కానీ విప్లవం పట్ల నిబద్ధతగల ఆత్మ సౌందర్యం ఏనాటికీ మోసం చెయ్యదు' అన్నాడు.

మావో మకాం జిబైపోకు మారిన తరువాత అనీయంగ్‌ను దగ్గరలోని ఒక పల్లెటూరుకు భూసంస్కరణల అధ్యయన కమిటీలో సభ్యుడిగా పంపించాడు. ఆ కమిటీలో లియుసికి అనే అమ్మాయి కూడా ఉంది. అనీయంగ్ ఆమెతో ప్రేమలో పడ్డాడు. ఈసారి అనీయంగ్ చౌఎన్‌లై భార్య డెంగ్ ఇంగ్ చావో, ఛూటే భార్య కాంగ్‌కెక్వింగ్‌ల సాయంతో ఆ అమ్మాయితో

పెళ్లికి మావోను ఒప్పించారు. అదెలా జరిగిందో చెప్తా వినండి.

ఒకరోజు నేను హాన్‌గుయిక్సిన్ చేతిపట్టు పందెం వేసుకున్నాం. మావో నన్ను గెలిపించేందుకు సాయం చేస్తాడన్నాడు. సరిగ్గా ఆ టైంలో అనీయంగ్ వచ్చాడు. కుశల ప్రశ్నలు అయ్యాక 'కాంగ్ ఆంటీ మిమ్మల్ని కలిసిందటగా... సికి గురించి మీరు చెప్పే ఉంటుందనుకుంటా' అన్నాడు నసుగుతూ, 'చెప్పింది' అన్నాడు మావో.

'అయితే పెళ్లి రిజిస్ట్రేషన్‌కు ఏర్పాటు చేయించమంటారా' అనడిగాడు అనీయంగ్.

'సికి వయసు ఎంత ఉంటుంది' అనడిగాడు మావో యథాలాపంగా.

'పద్దెనిమిది' అని అనీయంగ్ బదులిచ్చాడు.

'అసలు వయసేనా నువ్వు చెబుతుంది లేక కొసరు వయసా' అనడిగాడు మావో. 'నిజంగా చెప్పు' అని అన్నాడు (అప్పట్లో అసలు వయస్సుకన్నా ఒకటి రెండేళ్లు తక్కువ చెప్పుకోవడం సర్వసాధారణంగా ఉన్న అలవాటు)

'అంటే' అని నసుగుతూ 'కొసరు వయసే అనుకుంటా. కాకపోతే అట్టే తేడా ఉండి ఉండదు. అటూ ఇటుగా కొన్ని నెలలే' అన్నాడు అనీయంగ్.

'ఒక్క రోజు తేడా ఉన్నా నాతో ఈ విషయం మాట్లాడబాక ఇంకా. వొదిలే. నేను చాలా బిజీగా ఉన్నాను' అన్నాడు మావో.

చాలా ఆశలు పెట్టుకు వచ్చిన అనీయంగ్ ముఖం వేలాడేసుకుని వెళ్ళిపోయాడు. అయితే ఇదే మావో నా పెళ్లి విషయంలో చాలా చొరవ చూపించాడు. ఇప్పటికీ ఆ విషయం తలుచుకుంటే నా గుండె పొంగిపోతూ ఉంటుంది.

అనీయంగ్ మాతో పాటు 'సిక్లాసు' మెస్‌కి వచ్చి భోంచేసేవాడు. అధికారులు అది గమనించి అనీయంగ్‌ను 'బి' క్లాసుమెస్‌కు మార్చాలని చూశారు. మావో వద్దనేశాడు. అది ఎంత ఉగ్రంగా అనుకున్నారూ. ఆ రోజు మావో బల్లముందు కూర్చుని రాసుకుంటూ ఉన్నాడు. ఒక బాడీగార్డు వచ్చి అనీయంగ్‌ను ఇలా సిక్లాసు నుండి బి క్లాసుకు మార్చబోతున్న విషయం మావోతో అన్నాడు. దాంతో మావో చేతిలో ఘంటాన్ని విసురుగా నేలమీదకి విసిరేసి చిటపటలాడుతూ తన గదిలోంచి బయటకు వచ్చాడు. నేను మావో వెనకాలే పరుగుతీశా. మావో ఆవేశం చూస్తే ఎక్కడ కొడుకు మీద కోపం చేసుకుంటాడో అన్నంత భయం వేసింది నాకు. మావో అనీయంగ్ గది ముందు ఆగారు. 'అనీయంగ్ నీకు నువ్వేమనుకుంటున్నావ్" అని గర్జించాడు.

అంతే. అనీయంగ్ నోటమాటరానట్లు బొమ్మలా నిలబడిపోయాడు. కాసేపు అక్కడ నిశ్శబ్దం తాండవించింది. మావో అనీయంగ్‌కేసి చూసి విసురుగా అక్కడ నుండి వెళ్లిపోయాడు.

ఇది జరిగిన కొన్ని వారాలకు మావో పల్లెబాట కార్యక్రమంలో భాగంగా ఒక పల్లెటూరుకు బయల్దేరాడు. దార్లో వేరే పనిమీద అటుగా వస్తున్న అనీయంగ్ మావోకు ఎదురు పడ్డాడు. ఏదో సాకు చెప్పి అనీయంగ్ అక్కడ నుండి తప్పించుకోవడానికి ప్రయత్నించాడు. కానీ మావో అది గమనించి 'ఏంటీ నన్ను తప్పుకు తిరగాలని చూస్తున్నావా? అప్పుడే పెళ్లి వద్దన్నానని అలిగేవా? పెళ్లికి ఇంకా తొందరపడుతున్నావా? అని అడిగారు అతన్ని.

'అదేం లేదు' అని అనీయంగ్ తడబడుతూ నేల చూపులు చూస్తూ 'నాది పొరబాటే' అన్నాడు.

'అమ్మాయి సికి ఏమంటుంది' అనడిగాడు మావో.

'తనకీ అభ్యంతరం లేదు ఇంకా ఏడాది ఆగుదాంలే అంది' అని బదులిచ్చాడు అనీయంగ్.

'ఇప్పుడు నా బిడ్డవనిపించావ్' అన్నాడు మావో సంతోషంగా.

'సర్లే ఇంక ఇంటికెళ్లు' అని ఆప్యాయంగా భుజం తట్టి చెప్పాడు.

అక్కడ నుంచి మేము కదిలాం. దారి మధ్యలో మావో ఒక చోట ఆగిపోయి నాకేసి చూస్తూ 'నేను మీతో సన్నిహితంగా ఉంటాను. నా కొడుకుతో సన్నిహితంగా ఉంటానా చెప్పు' అన్నాడు.

నేనొక క్షణంపాటు ఆలోచించి 'మాతోనే' అని బదులు చెప్పా. మావో కాసేపు మౌనంగా ఉండిపోయాడు. ఆ తరువాత ఆలోచనగా 'వాడూ నేనూ కలిసేది ఏ అమావాస్యకో, పున్నమికో. కలిసినప్పుడైనా ఎదురు బదురు కూర్చుని మనసు విప్పి మాట్లాడుకునేదీ అరుదే. కానీ మీ విషయం అలా కాదే. ప్రతి రోజూ, ప్రతి గంటా ప్రతి నిమిషం నా నీడలా నన్ను వెన్నంటి వుంటారు మీరు. నా కుటుంబ విషయాలు బయటి ప్రపంచానికి రహస్యాలేవో కానీ నీకు మాత్రం కాదు కదా' అన్నాడు. "ఇంకియావో నా గురించి ఏదన్నా రాయాలనుకుంటే నే బ్రతికి ఉన్నన్నాళ్లూ ఆ పని చెయ్యమాక. నేను చచ్చేవరకూ వాయిదా వేసుకో. ఆ తరువాత నువ్వు ఏమి రాయదలచుకున్నా సత్యం మాత్రమే రాయి' అన్నాడు.

ఇదే మాట ఆ తరువాత కూడా ఇంకో మాట అన్నాడు మావో. అదీ 1958 ప్రాంతంలో 'కార్మిక-కర్షక-సైనిక' అనే పత్రిక కోసం నన్ను ఏదన్నా రాయమని సంపాదకవర్గం అడిగింది. నేనూ వారి కోరిక మన్నించి ఏదన్నా రాయాలనే ప్రయత్నంలో పడ్డా. అది తెలిసి మావో మరోసారి నాతో 'నా గురించి రాయదల్చుకుంటే మాత్రం నేను చనిపోయేదాకా వేచి ఉండాల్సిందే సుమా' అన్నాడు.

అనీయంగ్‌ను కొరియా యుద్ధానికి పంపించాలని మావో అనుకుంటున్నట్లు తెలిసి జియాంగ్ కింగ్ తదితరులు ఆయన దగ్గరకు వచ్చారు. అనీయంగ్‌ను పంపడం మానుకోమని చెప్పాలనే వాళ్ల ఉద్దేశం. 'ఇక్కడ అంతకన్నా ముఖ్యమైన బాధ్యతలే చూస్తున్నాడుగా' అని అడిగారు మావోను. మావో తాను అటువంటి నిర్ణయం ఎందుకు తీసుకోవలసి వచ్చిందో వాళ్లకి క్షుణ్ణంగా వివరించారు. ఆ వివరాలు అన్నింట్లోకి నేను మర్చిపోలేనిది "తను నా కొడుకు కదా. నేను నా కొడుకుని యుద్ధానికి పంప కుండా మిగిలిన వాళ్లను పంపడం ఏం సబబుగా ఉంటుంది" అని మావో అడగటం.

కొరియా యుద్ధంలో అనీయంగ్ చనిపోయాడు. పెంగ్‌వెహుయి ఈ విషయమై టెలిగ్రామ్ ఇచ్చాడు. జియాంగ్ కింగ్, చౌఎన్‌లై, యేజిలాంగ్‌లు ముగ్గురూ సంప్రదించుకుని ఈ దుర్వార్తని వెంటనే మావోకు తెలియకుండా ఉంచాలని నిర్ణయించారు. ఆ తరువాత కొన్నాళ్లకు జియాంగ్, యేజిలాంగ్‌లు మావోకు విషయం చెప్పి భోరున విలపించారు.

ఆ మాట విని మావో మాన్పడిపోయారు. నోట మాట పెగల్లేదు. అలా రెప్పవెయ్యకుండా జియాంగ్, జిలాంగ్‌లు ఇద్దరికేసీ చూస్తుండిపోయాడు. వాళ్లిద్దరూ తల వేలాడేసుకు నిలబడిపోయారు.

మావో దీర్ఘంగా నిట్టూర్చి తల తిప్పి పక్కనే టేబుల్ మీద ఉన్న సిగరెట్ పెట్టెను అందుకున్నాడు. ఒక సిగరెట్ తీసి పెదాల మధ్య పెట్టుకుని అగ్గిపుల్ల వెలిగించి ముట్టించే ప్రయత్నం చేశాడు. కానీ అదాయన వల్ల కాలా, ఒకటి, రెండు, మూడు సార్లు ప్రయత్నించాడు. ఊహూ, లాభం లేక పోయింది. వేళ్ళు పెదాలు వణుకుతున్నాయి. దుఃఖభారంతో. అది గమనించి వెళ్లి సిగరెట్ ముట్టించా. గదంతా శ్మశాన నిశ్శబ్దం తాండవిస్తుంది. మావో సిగరెట్టు దుమ్ము పీల్చి 'వొదుల్తున్న శబ్దం ఘోషలా వినబడుతుంది. మావో కళ్ళు ఎర్రబడిపోయి కనుకొలకుల్లోనీరు చెమరించింది. సిగరెట్ పొగతగిలి అలా అయ్యిందా లేక తన మదిలో పాత జ్ఞాపకాలు కదిలి అలా అయ్యిందా? యేజిలాంగ్ ఆ గదిలోంచి మౌనంగా నిష్క్రమించారు. మావో సిగరెట్ తాగడం పూర్తి చేసి పీకను యాష్‌ట్రేలో మలిపేశాడు. భారంగా నిట్టూర్చి 'మావోకు కొడుకుగా పుట్టడమే వాడి అర్ధాయుష్షుకు

కారణం అనుకుంటూ' అన్నాడు జీరబోయిన గొంతుకతో.

నేను మొఖం పక్కకు తిప్పుకుని ఏడ్చేశా.

కానీ మావో మాత్రం కన్నీరు కార్చలేదు. దుఃఖభారం నుండి ఉపశమనానికా అన్నట్లు మరో సిగరెట్ వెలిగించాడు. జరిగిన విషాదం గురించి కింగ్ మావోకు వివరించింది. శత్రువిమానాలు బాంబులు కురిపిస్తూ, వైమానిక దాడులకు తెగబడిన సందర్భంలో మావో అనీయంగ్ షెల్టర్ నుండి బయటకు వచ్చి నిలువెల్లా దహించుకుపోయి దుర్మరణం పాలైన వైనాన్ని కింగ్ మావోకు వివరిస్తుంది. కాని ఆ వివరాలు లీలా మాత్రంగానే నా చెవికి తాకాయి. 'మావోకు కొడుకుగా పుట్టడమే వాడి అర్ధాయుష్షుకు కారణం అనుకుంటూ' అన్న మావో మాటలే నా చెవుల్లో గింగుర్లెత్తుతున్నాయి.

అనీయంగ్ మావోకు తొలి భార్య ద్వారా కలిగిన సంతాన పోలికలు అచ్చం తండ్రివే పుణికి పుచ్చుకున్నాడు. అనీయంగ్ పసిప్రాయంలోనే మావో చైనా సాయుధ విప్లవ సాధన కోసం దేశం పట్టి తిరుగుతూ ఉన్నాడు. తల్లి విప్లవ ప్రతీఘాతశక్తుల చేతుల్లో హత్యకు గురైంది. వారితో అనీయంగ్ అనాథ పిల్లాడిలా గాలికి తిరుగుతూ, బిచ్చమెత్తుకు తింటూ బతికాడు. అనీయంగ్ పసిప్రాయం అంతా దుర్భరంగా గడిచింది. అందు మూలానే అతని ఆరోగ్యం అంతంత మాత్రంగా ఉండేది. ఇవన్నీ దృష్టిలో ఉంచుకునే మావో ఆ పిల్లాడిని దయగా, ప్రేమగా సాకాడు. ఉక్కు క్రమశిక్షణ చూపేవాడు కాదు.

1957 ఆగస్టు తొలి నాళ్లలో అనుకుంటా మావో క్వింగ్‌డావ్‌లో ఉండగా అనీయంగ్‌ను తీసుకు రమ్మని నాకు పురమాయించాడు. అప్పటికే అనారోగ్యంతో ఉన్న అనీయంగ్ శానిటోరియంలో చికిత్స పొందుతున్నాడు. నేను వెళ్లి అనీయంగ్‌ను తీసుకొచ్చా. మావో బస సర్కారు వారి రాదారి బంగాళాలో. అక్కడే అనీయంగ్‌కు ప్రత్యేకంగా ఒక గది కేటాయించి మావో రోజూ అతనితో చదువు రాజకీయాలు, పని తదితర అంశాల మీద మాట్లాడుతూ ఉండేవాడు. అతని ఆరోగ్యం గురించి శ్రద్ధ పెట్టేవాడు. అన్‌కింగ్ కూడా అప్పట్లో అక్కడే ఉండేవాడు. అన్‌కింగ్‌కు సేవలు అందించే నర్సు అతనితో చాలా కుశాలగా వ్యవహరించేది. స్నేహానికి మించిన బంధమేదో వారిద్దరిలో చిగురించింది. ఆ నోటా ఈ నోటా విషయం మావో చెవికి చేరింది. శానిటోరియంకు ఎవరినన్నా పంపి అన్‌కింగ్‌కు అందుతున్న చికిత్స ఏమిటి. ఆ పిల్ల వివరాలు, వ్యవహారం ఏమిటో ఆరా తీసుకు రమ్మని మావో గార్డు ఆఫీసులకు ఆదేశం పంపాడు. సుయాంగ్ ఫు అనే గార్డుకు ఆ పని బత్తాయించారు. సుయాంగ్ ఫు ఈ విషయమై క్షుణ్ణంగా ఆరా తీసి మావోకు ఒక 'నోట్' పంపాడు. అది చదివిన మావో ఆ 'నోట్' తీసుకు వచ్చిన తియాన్ యూస్‌యూ తో 'సు'కు నా ప్రత్యేక

అభినందనలు తెలియచెయ్యి అన్నాడు. ఇచ్చిన పని క్షుణ్ణంగా చేసుకురావడం అంటే అదీ అని మెచ్చుకున్నారు.

ఇక కూతుళ్లు లీమిన్, లీన్ విషయానికి వస్తే చాలా ప్రేమగా మెలిగేవారు. కొడుకుల క్రమశిక్షణ విషయంలో ఉన్నంత పట్టింపు ఆడ కూతుళ్ల విషయంలో చూపించేవారు కాదు.

లీమిన్ ముద్దు పేరు జియావో, జియావో 'లవ్లీ లవ్లీ'. డెంగ్ యాంగ్చావో ఈ బిడ్డ పుట్టగానే ఎత్తుకుని 'ఎంత ముద్దు ముద్దుగా (లవ్లీ, లవ్లీ) ఉందో ఫిల్ల' అంది. అప్పట్నించి ఆ పాపకు లవ్లీ, లవ్లీ అనే ముద్దు పేరు స్థిరపడిపోయింది. చైనాలో స్కూలు చదువుతున్నప్పుడు తన పేరు అదే. సోవియట్ రష్యాలో విద్యాభ్యాసం ముగించుకు వచ్చాక మావో లీమిన్ అని పేరు పెట్టాడు.

మావోను 'లీ' దేషింగ్ అనే పేరుతో పిలిచేవాళ్లు 'నె' ?మిన్' అనే పదాలు కన్ఫ్యూషియన్ ప్రవచనాల్లోవి. మాటలు తక్కువ (నె) పని ఎక్కువ (మిన్) అని ఆ పదాలకు అర్థం. తన పిల్లలు కూడా అలా ఉండాలని మావో కోరిక. అందుకే ఒక కూతురికి లీ'మిన్' అని మరో కూతురికి లీ'నె' అని పేరు పెట్టాడు.

అయితే ఆడపిల్లలు ఏనాడూ మావోతో కలిసి భోం చేసిందిలేదు. వాళ్లకు కూడా మాతోపాటే 'సి' క్లాసు మెస్‌లో భోజనాలు. కాలేజీ చదువులప్పుడు కూడా మావో కూతుళ్లు కదాని ప్రత్యేక వసతులు ఏవీ ఏర్పరచలే వాళ్లకి. డార్మెటరీ వంటి గదిలో గదికి అరుగురు, ఎనిమిది మంది చొప్పున కలిసి వుండేవాళ్లు. దాన్లో ఉన్న సిమెంట్ చప్టాలపైనే వాళ్లు పడక కూడా. భోజనాలు కూడా సహ విద్యార్థులతో కలిసి మెస్‌లో తీసుకోవడమే. అందరితోపాటే యూనిఫారమ్ వేసుకునేవాళ్లు. బట్టలు ఉతుక్కోవడం వంటి వాళ్ల పనులు వాళ్లే చేసుకునేవాళ్లు మావో కూతుళ్లంటే నమ్మలేనంత సాదాసీదాగా కాలేజి జీవితం గడిపారు వాళ్లిద్దరూ.

1956 ప్రాంతంలో అనుకుంటూ. ఒక రోజు మావోతో కలిసి కాలినడకన నేనూ వ్యాయామానికి బయలు దేరాను. ఉన్నట్టుండి మావో 'అవునూ నీకు నా ఇద్దరు బిడ్డల్లో ఎవరంటే ఇష్టం లీ'మీన్నా' 'లీనేనా' అనడిగారు.

"ఇద్దరికిద్దరూ రత్నాలు కాద్గా కామ్రేడ్. ఆ వినయం విధేయతా సంస్కారం ఎందర్లో ఉంటాయి చెప్పండీ. ఇక్కడకు కొంతమంది నా పై ఆఫీసర్ల పిల్లలే ఉన్నారు. ఏం తలబిరుసు తనమనీ వాళ్లకీ, మాబోంట్ల వాళ్ల కళ్లకు ఆను తున్నామా... మహా ముట్టిపొగరు చూయిస్తారు. అదే మీ బిడ్డలయితేనా. రత్నాలు కదూ. ఆ క్రమ శిక్షణ, మర్యాదా, మన్ననా, నాకు బాగా నచ్చాయి. ఏం కష్టపడతారండీ పిల్లలూ" అని బదులిచ్చా నేను. నా మాటల్లో ఏ మాత్రం

అతిశయోక్తి లేదు. కానీ మావో ఏమన్నాడో తెల్సా? "ఏమో... నేను మాత్రం జంకుతూనే ఉన్నా. ఆ పిల్లలకి కష్టాలంటే ఏం తెలుసనీ... జీవితంలో నువ్వు పడ్డ కష్టాలతో పోలిస్తే వాళ్లవీ ఓ కష్టాలా. కష్టాలకు ఓర్చడం అలపడితేనే కదా బతుకులో మాధుర్యం తెలిసేదీ. ఈ ప్రపంచంలో నెగ్గుకు రావాలంటే ఎలాంటి కష్టాలయినా తట్టుకోగల చేవ ఉండాలి. వాళ్లకు ఆ ధైర్యం ఉందా అనే అప్పుడప్పుడూ నా మనసు పీకుతుంటుంది" అన్నాడు. ఎందుకో మావోతో నే ఏకీభవించలేకపోయాను. 'అంటే ఏంటి మీ ఉద్దేశం. ఆ పిల్లలు ఇంతకాలం సుఖమరిగి పోయారనుకుంటున్నారా? తప్పు కామ్రేడ్. నాకు తెలిసి ఒక సాధారణ కుటుంబంలో పిల్లలు పడే కష్టాలన్నీ వాళ్లూ పడ్డారు' అన్నా.

దానికి మావో 'ఆ మాటకొస్తే నేనూ నీతో ఏకీభవించలేకపోతున్నా' అన్నాడు. 'నువ్వు ఎత్తుకొచ్చినపోలికే తప్పు అంటే మావో పిల్లలు అయినంత మాత్రమాన వాళ్లు ఒక సాధారణ కుటుంబంలో పిల్లల మాదిరి బతకకూడదా. నిజమే మీతో పాటు 'సి' క్లాసు మెస్‌లోనే వాళ్లూ తిండి తింటున్నారు. కాదన్నూ. కానీ ఆ మాత్రం తిండికీ నోచుకోని రైతు కుటుంబాలు లేవా మన దేశంలో అనడిగారు.

'ఇది మరీ అన్యాయం' అన్నా నే ఉక్రోషంగా 'మీరు మరీ ఇంత దారుణమైన పోలిక తెస్తారనుకోలేదు. అయినా నాకు తెలిసీ స్కూలు క్యాంటీన్లలో పిల్లలకు దొరికే భోజనం అంతా అధ్వానం ఇంకోటి ఉండదు. అంతెందుకు మీరు 'సి' క్లాసు మెస్‌లో భోజనం గురించి చెబుతున్నారే, ఒక్కోసారి ఇంతకుమించిన మంచి భోజనం నాకు ఇంటికాడ దొరుకుద్ది తెల్సా' అన్నా.

'అయినా జనాలు తప్పుగా అనుకోరు మీ గురించి ఉన్నంతలో మీకు మంచి భోజనం దొరుకుతుందంటే మీరు విప్లవానికి మీ వంతుగా ఇచ్చిన తోడ్పాటు కారణం అని సరిపెట్టుకుంటాను. కానీ నా బిడ్డలు ఇంకా విప్లవానికి ఏమి తోడ్పాటు ఇవ్వలేదే. నా దృష్టిలో భౌతిక సుఖాలు కొలమానంగా పోలిక పెట్టడమే శుద్ధ తప్పు. విప్లవానికి ఎవరు ఎంత సేవ చేశారు, అందరు వాళ్లకు తగిన గుర్తింపు లభిస్తుందా లేదా అనేదే నా దృష్టిలో సరైన కొలబదద్ధ' అని విస్పష్టంగా అన్నాడు మావో. ఇక నేను మారు మాట్లడలేకపోయాను.

అయినా మావో పిల్లలు అంత కఠోరమైన జీవితం గడపడం ఎందుకో నా మనసు అంగీకరించలేకపోయింది. అసలు మావో పిల్లలుగా పుట్టడమే వాళ్ల కష్టాలకు కారణం అనిపించేది నాకు ఒక్కోసారి. నేను 1947లో మావో దగ్గర 'బాడీగార్డు' పనిలో కుదురుకున్నా. అప్పటికి లీనె వయసు ఏడేళ్లు ఉంటాయేమో. ఆ వయసులోనే మాతోపాటు చెట్లమ్మట, పుట్లమ్మట, కొండకోనల్లో పడి ప్రయాణం చేసేది. శత్రుసైనికుల దాడులు, పొగబాంబులు,

తుపాకి బుల్లెట్లు, విమానాల నుండి కురిసే బాంబులు-వీటి మధ్యనే మాతోపాటు పెరిగి పెద్దది అయింది.

లీనె మాతోపాటు సత్తుగిన్నె ఒకటి తీసుకుని వరుసలో నిలబడేది. తన వంతు వచ్చినప్పుడు ఆ సత్తుగిన్నెలో సోయాబీన్స్ పులుసు పోయించుకుని గోడవారగా చతికిలబడి కూచుని చిట్టిపొట్టి వేళ్లతో ఆ పులుసు తిని ఆకలి తీర్చుకున్న దృశ్యాలు ఇప్పటికీ అప్పుడప్పుడూ నా కళ్ల ముందు సజీవంగా మెసులుతూ ఉంటాయి. సోయాబీన్స్ పులుసు తినీ తినీ మా మాదిరిగానే తను కడుపు ఉబ్బరంతో సతమతం అయ్యేది. ఈడేరిన వయసుకు వచ్చాక బీజింగ్ ఒపేరాలో నాట్యంచేసే అవకాశం దక్కించుకుంది. ప్రజావిముక్తి యుద్ధంలో తలమునకలుగా ఉన్న రెడార్మీ సైనికులను తన నాట్యంతో, పసితనంతో నిండిన గాత్రంతో అలరింపచేసేది.

నలుగురు పిల్లల్లోకి లీనె అంటే మావోకు మహా ఇష్టం. ఎంత పని ఒత్తిడిలో ఉన్నా రోజుకో మాటయినా ఆ పాపను ఎత్తుకుని 'అమ్మడూ అమ్మడూ నా చిట్టి అమ్మడూ' అంటూ అటూ ఇటూ తిప్పేవాడు. లీనె కూడా మావో మెడకరిచేసుకుని 'నాన్నా నాన్నా' అంటూ రాగాలు పోతుండేది.

మావోకు ఆ పిల్ల మీద అంత అపేక్ష ఉన్నా భోజనం మాత్రం మాతోపాటే 'సీ' క్లాసుమెస్‌లో చెయ్యాల్సి వచ్చేది తను. పొరపాటున కూడా మావో తన మెస్‌కు తీసుకొచ్చేవాడు కాదు. నవచైనా ఆవిర్భావం తరువాత 'లీనె'ను సాకే ఆయా ఒకరోజు మావోతో 'అయ్యగారూ మీరు ఈ దేశానికి రాజు మాదిరయ్యె అయినా బిడ్డకు ఎందుకు అంత కష్టం. మీతోబాటే నాలుగు మెతుకులు కతుకుద్దిగా అంది. అప్పుడుకూడా మావో ఖరాఖండీగా వద్దనేశాడు. 'ఏం అక్కార్లా, మీతోపాటే మెస్‌లో తింటుంది' అని ఆమె ముఖాన చెప్పేశాడు.

కాలేజి చదువులకని యూనివర్సిటీలో చేరాక 'లీనె' శనివారాలు ఇంటికి వచ్చేది. యూనివర్సిటీ ఎక్కడో ఊరి శివారల్లో ఉండేది. ఒక్కోసారి పనుల మూలంగా చీకటి పడ్డాక బయల్దేరి రావాల్సి వచ్చేది. అంత చీకట్లో ఆడపిల్ల ఒంటరిగా రావాల్సి రావడం మీద నా భయాలు నాకున్నాయి. అందుకే మావోకు తెలీకుండా నేను యూనివర్సిటీకి కారు తీసుకుని పోయేవాడ్ని. కాస్త దూరానే కారు ఆపేసి యూనివర్సిటీలోకి వెళ్లి అమ్మాయిని వెంట పెట్టుకుని ఎవరి దృష్టి పడకుండా కార్లో ఇంటికి తీసుకొచ్చేవాడిని. కొన్నాళ్లు అలా సాగింది.

కానీ ఈ విషయం మావోకు తెలిసిపోయింది. ఆ రోజున నన్ను పై నుండి కిందదాకా కడిగి పారేశాడు. 'ఇందులో తప్పేముంది. అంత చీకట్లో పడి అమ్మాయిగారు ఊరి చివర

నుండి ఇంత దూరం ఒక్కతే ఎలా వస్తారనుకున్నారు. అంత క్షేమం కాదు కదా అని అలా చేశా' అంటూనే నసిగాను.

'మరైతే మిగతా ఆడ పిల్లల సంగతేమిటి? వాళ్లూ నా కూతురు వంటి వాళ్లే కదా. వాళ్లకు లేని ప్రమాదం ఈ పిల్ల ఒక్కదానికే వచ్చింది' అనడిగారు మావో గదమాయింపుగా.

'వాళ్ల సంగతి నాకు తెలీదు. తను మావో కూతురు' అన్నానే గొంతుపెంచి.

నేనలా గొంతుపెంచి సమాధానం చెబుతానని ఊహించని మావో ఒక్కక్షణం తేరుకోలేకపోయాడు. ఆ ఒక్కక్షణాన్ని నే.అవకాశంగా మలుచుకున్నా. లేకుంటే నా మీద శివాలెత్తిపోయేవాడే. 'శత్రువులకు మిగతా ఆడపిల్లల జోలి అక్కర్లేదు. వాళ్ల దృష్టి గ్యారంటీగా మావో పిల్లల మీద ఉంటుంది. అందుకే నా జాగ్రత్తనే తీసుకున్నా' అని టక్కున అన్నాను.

ఆ మాటలతో మావో కాస్త చల్లబడ్డాడు. కొమింటంగ్ విప్లవ ప్రతీఘాత శక్తులు అదను చూసి దెబ్బతియ్యడానికి పొంచి ఉన్నాయన్న సంగతి మావోకూ తెలుసు. అందుకే నన్ను మరిక ఏం అనలేక పోయాడు. అయినా మొండి మనిషి కాదా. 'కావచ్చునుకో, అయినా కారు మాత్రం తీసుకువెళ్లడానికి లేదు. ఓ సైకిల్ ఏర్పాటు చెయ్యి కావాలంటే' అన్నాడు. నేను మావోకు ఎలాగొలా నచ్చచెబుదాం అనుకున్నాగానీ మధ్యలో జియాంగ్ కింగ్ కల్పించుకుంది.

'నేను పదేళ్ల వయసప్పటి నుండి కటిక చీకట్లో తిరుగుళ్లాడేదాన్ని. ఇప్పుడు తనేం చిన్నపిల్ల కాదు కదా. కాలేజికి పోతుందాయే. తనను తాను సంభాళించుకోగలదు కానీ.... ముందు ఛైర్మన్ చెప్పినట్లు చెయ్యి' అందావిడ.

ఆ ఏడాది (1960) మంచు కాలం మరీ తీవ్రంగా ఉంది. దేశ ఆర్థిక పరిస్థితీ చిక్కుల్లో పడింది. శీతాకాలం మూలాన పగటి కాలం ఎక్కువగా ఉన్నది. కారు సౌకర్యం లేకపోవడంతో ఇంటికి 'లీనె' రాకపోకలు కూడా తగ్గాయి. రెండు మూడు వారాలకు ఒకసారి వచ్చేది. 'లీమెన్' ఆరోగ్యం సరిగ్గా లేకపోవడంతో తను ఇంటిపట్టునే ఉంటుంది. 'లీనె' మాత్రం యూనివర్సిటీ క్యాంపస్‌లోనే ఉండిపోయింది. ఒక రోజు నేను ఇన్‌జింగ్‌పావ్ అనే నా తోటి సహచరుణ్ని అమ్మాయిగారు ఎట్లా ఉన్నారో చూసి రమ్మని పంపాను. పిల్ల తెల్లగా పాలిపోయి ఉందట. 'ఏమన్నా అనారోగ్యమా' అని ఇన్ ఆరా తీస్తే.... సందేహిస్తూ, సంశయిస్తూనే ఆ పిల్ల 'అంకుల్ అక్కడ తిండికి మాడిపోతున్నా' అందట.

ఇన్ ఈ విషయం నాకు చెప్పేసరికి నా గుండె నీరయిపోయింది. ఉత్తర పాంగ్సీలో

ఒక దగ్గర గడిపినప్పటి కాలం నుండి ఆ పిల్ల అంటే నా మనసులో అభిమానం గూడుకట్టుకుపోయింది. అందుకే తన కోసం కాసిన్ని రస్కులు పొట్లం కట్టించుకుని తీసుకువెళ్లా. నా చేతిలో పొట్లం అందుకుని విప్పి చూసి కంగారుపడి ఎవరన్నా గమనిస్తున్నారేమో అని అటూ ఇటూ చూసి తనని ఎవరూ గమనించడం లేదని నిర్ధారించుకున్నాక ఒకే మాటు ఆబగా రెండు రస్కులు నోట్లో పెట్టుకుని గుటుక్కున మింగినంత పని చేసింది. అది చూసి నా గుండె బరువెక్కి పోయింది. దిగులు మేఘం ఏదో నన్ను కమ్మేసింది. అంతా చేసి నేను తీసుకెళ్లింది చారెడు... వాటినే దొంగతనంగా తినాల్సిన పరిస్థితి. ఆ రెంటితో సరిపెట్టుకుని మిగతావి ఎక్కడన్నా దాటిపెట్టుకుని ఆరారగా తిందామనకున్నట్లు ఉంది ఆ బంగారు తల్లి. నేనది గమనించి వొద్దమ్మదూ, దాచుకోనక్కర్లా, ఇవి తినేసేయ్. కావాల్నంటే మళ్లీ తెస్తా' అని సర్ది చెప్పి తనతో తినిపించి వచ్చా.

ఇది తెలిసి జియాంగ్ కింగ్ నన్ను 'రఫ్' ఆడించేసింది. అయినా నేను నోరు మెదపలా, నేనోరు తెలిస్తే అది ఎక్కడ గొడవ కిందకు దారి తీస్తుందో అని భయమేసి కిమ్మనకుండా ఉండిపోయా. ఎందుకో తెలీదు కానీ జియాంగ్ నా పట్ల ఆక్షేపణగా వ్యవహరించేది. మిగతా బాడీగార్డులతో ఆవిడ అలా వ్యవహరించినట్లు నే ఎప్పుడూ చూడలేదు. ఆ మహాతల్లి ఈ చిన్న విషయాల్ని కూడా మావో చెవిన వేసింది. రమ్మనమని కూడా కబురంపారు మావో. నే వెళ్లా. 'నీకెన్ని మాట్లు చెప్పాలి. ఇలాంటి పన్లు చెయ్యొద్దనీ, తల తిరుగుతుందా. నా మాట లెక్కలేడా' అని అరిచేశారు మావో నా మీద.

'నేనేం తప్పు చెయ్యలా..అక్కడున్న మిగతా పిల్లలకి వారి వాళ్ళ ఇళ్ల నుండి ఎవరో ఒకరు తినడానికి ఏవో ఒకటి ఇచ్చిపోతుంటారు. అమ్మాయిగారికి ఆ పని నేను చేశా' అని చెప్పాను నసుకుతూ.

జియాంగ్ అయితే నోరేసుకు పడుకునేమో కానీ అది మావో అయ్యేసరికి నాకు నోరు పెగల్లేదు. 'తప్పు... నువ్వు చేసింది తప్పు.... మావో కూతురు కాబట్టి తనకు అన్నీ స్పెషల్‌గా అమరుతున్నాయ్ అని ఎవరూ వేలెత్తి చూపకూడదు. అలాంటి ఆరోపణలకు గురిచేసే పనులు చెయ్యడం నువ్వు ఇక నుండైనా మానుకో' అని స్వరం పెంచి హెచ్చరించాడు నన్ను. నేను మావోకు ఎదురు చెప్పలేకపోయాను. 'లీనె'కు నేను తిను బండారాలు అందించడం అదే మొదటిసారి అది చివరి సారి అయిపోయింది.

ఆ రోజు నేను కొంపకు చేరుకోగానే జరిగినదాంట్లో నా తప్పేం ఉంది అంటూ అంతా వివరంగా మా ఆవిడకు చెప్పా. అసలు ఇంత చిన్న విషయం అంత రాద్ధాంతం కావడానికి ఆ మహాతల్లే కారణం అని జియాంగ్‌ను ఆడి పోసుకున్నా. కానీ నిజానికి

ఆవిడ 'లీనె' కన్నతల్లి కదా. నా కన్నా 'లీనె' మీద ఆవిడకే ఎక్కువ ఆపేక్ష ఉంటుంది కదా! ఎందుకన్నా ఇందులో ఆవిడ తప్పు ఉండదు. ఏ కన్నతల్లీ బిడ్డల కడుపు మాడ్చాలనుకోదు. అవసరమైతే తన కడుపు కట్టుకుని అయినా పిల్లల ఆకలి తీరుస్తుంది. అన్నవాస్తవం నా మనసుకీ తెలుసు. అయినా జియాంగ్ మీద మా ఆవిడ దగ్గర చాడీ చెబితే గాని జరిగినదానికి నాకు మనసు స్వాంతన పడలా.

తరువాత ఒక శనివారం నాడు 'లీనె' ఇంటికి వచ్చింది. ఇన్‌జింగ్‌పాస్ అపాటికి మావోకు టీ కాచి ఇస్తున్నాడు. అమ్మాయిగారిని చూడగానే అతను 'కామ్రేడ్ ఛైర్మన్ పాపమ్మ గారు వస్తున్నారు. ఎన్నాళ్లయిందో పాపమ్మగోరు ఇంటికొచ్చి. రాత్రికి భోజనం పాపమ్మగోరితో కలిసి చేస్తారేంటి' అనడిగాడు.

మావో 'ఇన్'కేసి అభినందన పూర్వకంగా చూసి అలాగే కానీ అన్నాడు.

ఇన్ ఈ విషయం జియాంగ్ చెవిన వేశారు.. 'ఛైర్మన్‌తో కలిసి పాపమ్మగోరు భోం చేస్తారు కాస్త ఎసరు ఎక్కువ పెట్టండి. కమ్మటి నూనెతో కూరలు చేయించండి' అని సలహా కూడా ఇచ్చివచ్చాం.

మావో ఇంట్లో ప్రత్యేకంగా భోజనాల గది అంటూ ఉండేది కాదు. మావో ఆఫీసులో ఉంటే ఆఫీసుకు, పడకగదిలో ఉంటే అక్కడికే తెచ్చి భోజనం ఏర్పాటు చెయ్యడం మా అలవాడు. ఆ రోజు రాత్రి భోజనాలకి నాలుగు వంటకాలు సిద్ధం అయ్యాయి. వేడి వేడి సూపు, మిరియాల పొడి, సోప్‌తో చేసిన కూరలు గుమగుమాయిస్తున్నాయి. 'రోజూ కన్నా ఇవాళ రెండింతలు అన్నం కూరలు వండా' అని వంట మాస్టరు గర్వంగా చెప్పాడు.

లీనె మావో ఎదురుగా కూచుని కాలేజి చదువుల గురించి కబుర్లు చెబుతా వుంది. మెల్లిగా విషయం యూనివర్సిటీలో తిండి మీదకి మళ్లింది. ఏ రోజూ తిండికి మొహం వాచి పోవాల్సిందే అక్కడ నంజుకోసం అని వడ్డించేవి ఒక పంటికిందకి రావట్లా. నీళ్ళు ఉప్పులో ఉడికించిన కూర ముక్కలు నాలుగు పెడుతున్నారు. నూనె చుక్క వాడితే ఒట్టనుకోండి. రోజూ అర్ధాకలితో క్లాసులకు పోవాల్సిందే' అని అక్కడి పరిస్థితి వివరించింది.

'ఈ కష్టాలు అట్టే కాలం ఉండవు తల్లీ, దేశంలో మిగతా ప్రజానీకం మాదిరిగానే నువ్వూ పోతివి లెక్క చెయ్యమాకు. పదిమందికీ వువ్వే ఆదర్శంగా నిలబడు. పరిస్థితిని వివరించు. కమ్యూనిస్టు పార్టీ మీద విశ్వాసం సడలనీయకుండా చూడు' అని కర్తవ్యబోధచేశాడు మావో. విషయాన్ని సూటిగా, స్పష్టంగా, దయగా చెప్పిన మావో చివరగా నవ్వుతాలకి 'ఛైర్మన్‌గానే చెప్పగలిగేది ఇదే అంతేకానీ వంట వాళ్లకు ఏం వండాలి. ఎలా

వండాలో అని ఆదేశాలు ఇవ్వలేనుగా' అన్నాడు.

ఇంతలో ఇన్‌జింగ్‌షాన్ వచ్చి 'భోజనాలు సిద్ధం' అన్నాడు. 'దా తల్లీ భోం చేద్దాం' అంటూ మావో లీనెను బల్ల దగ్గరకు తీసుకొచ్చి కూచోపెట్టాడు.

'లీనె' ఛాప్‌స్టిక్స్ తీసుకుని యారారూట్ దుంపలేసి ఉడికించిన వేడివేడి గోధుమ బియ్యం అన్నం నుండి వెలువడుతున్న పొగలు ముక్కుతో పీలుస్తూ 'ఎంత కమ్మగా అనిపిస్తుందో' అంది ఆనందపారవశ్యంతో.

జియాంగ్ ఆ పిల్లకేసి, మావోకేసి చూసింది. ఏదో అందామని నోరు తరచి ఎందుకోగానీ తమాయించుకుని ఉండిపోయింది. బహుశా అక్కడ బాడీగార్డులు కూడా ఉన్నారని సంశయించిందేమో. లీనెకు ఆవిడే స్వయంగా వడ్డించింది. 'కానీ, తినరా తల్లీ' అంటూ మావో ఛాప్‌స్టిక్స్‌కు పనిపెట్టాడు. లీనె ఆత్రంగా ఇంత ముద్ద నోట్లో వేసుకుంది. ఆ వేడికి ముద్ద గొంతుక దిగలేతేమో, నోరు తెరచి 'ఉఫ్ ఉఫ్' అంటూ అన్నం పొగలు బయటకు ఊదుతుంది. ఆ పిల్ల రెండు కళ్లలో నీళ్లు ఊరాయి. 'నిమ్మళం తల్లీ. తొందరేంలేదు' అని మావో నవ్వుతూ అన్నాడేగానీ ఆ నవ్వులో జీవంలేదు.

లీనె తలతిప్పి పక్కనే వడ్డిస్తూ నిలబడిన బాడీగార్డుకేసి చూసి 'కాలేజీలో గబగబా తినడం అలవాటు కదా. అందుకనీ అని నసిగింది. అతని ముందు చిన్నతనం అయిపోతుందేమో అనే భావంతో లీనె ఆ వివరణ ఇచ్చిందని నాకు అర్థమైంది.

'నువ్విప్పుడు కాలేజీలో లేవుగా తల్లీ.... ఇంట్లోనేగా అన్నం ఆరాంగా తిను, అన్నాడు మావో. ఆ గొంతులో దిగులు నే స్పష్టంగా గ్రహించగలిగాను. 'తిన్నంత సుబ్బరంగా తినమ్మా' అంటూ జియాంగ్ లీనె కంచంలో వడ్డిస్తుంది. ఎందుకోగాని జియాంగ్ మొహంలో కళ తప్పింది. పెదవుల మీద నవ్వు అతికించినట్లుగా ఉంది. అంతలోనే ఆ చిరునవ్వు కూడా మాయమైంది.

లీనె ఇవేం పట్టించుకునే స్థితిలో లేదు. ఆకలిగొన్న తోడేలు మాదిరి అన్నం అవురావురుమని తినేస్తోంది. ముద్ద నవలను కూడా నవలట్లా. అప్పుడప్పుడూ ఇంకా ఏ గిన్నెలో ఏవేవి, ఎంతెంత మిగిలి ఉన్నాయో ఓరకంట గమనిస్తోంది. మొదట్లో మావో లీనెతో ఆ కబురూ ఈ కబురూ చెబుతూ తాపీగా భోం చెయ్యసాగారు. 'లీనె'ను గమనించాక కాసేపటికి మాటలు ఆపేసి ఆరారగా అప్పుడో ముద్దా ఇప్పుడో ముద్దా కతకసాగాడు. మావో అంత తాపీగా భోం చేయడం జీవితంలో అదే మొదటిసారి. చివరికి తను తినడం ఆపేసి ఆరాంగా కూచున్నాడు.

జియాంగ్ అంతకన్నా ముందే తినడం ఆపేసింది. లీనేకేసీ మావోకేసి మార్చి మార్చి చూస్తూ భారంగా నిట్టూర్పులు పోతోంది. తన మనసులో ఏముందో గమనించమన్నట్లు మావోకేసి రెండు మూడు సార్లు మార్చి మార్చి చూసింది. లీనే మాత్రం ఇవేం గమనించకుండా తన మానాన తను తింటూ వుంది. 'అవునూ మీరు తినడం ఆపేశారే' అని అడిగింది మావోను. 'అదా! అదీ నే ముసలివాణ్ని అయిపోతున్నాగా 'తల్లీ నేనూ నీ ఈడులో ఉండి ఉంటే నీతో పోటీ పడి ఉండును' అంటూ కూర్చీలో పక్కకి తిరిగి పేపరు అందుకుని చదువుకోసాగాడు. రెణ్నిమిషాల్లోనే అందులో పూర్తిగా మునిగిపోయాడు. జియాంగ్ ఉన్నట్టుండి ఎదురుగా ఉన్న పాత్రలోని అన్నమంతా లీనె కంచంలో బోర్లించేసి గుడ్ల నీళ్లు కుక్కుకుని ఎగిసిపడే హృదయంతో అక్కడ నుంచి వెళ్లిపోయింది.

అయితే మావో ఇదేం గమనించనట్లు లేదు. జియాంగ్ వెళ్లిపోయిన కాసేపటికి పేపర్లోంచి తన పక్కకి తిప్పి 'నీకో సంగతి తెల్సా తల్లీ! చాలా ఏళ్ల క్రితం నేను హునాన్‌లో ఏదో పనిమీద వెళ్లా. రోజంతా ఆకలికి నకనకలాడిపోయి ఉన్నానేమో ఆకలి తీర్చుకోవడానికి ఒ గిన్నె తీసుకుని ఎవరింట్లోనన్నా అన్నం మిగిలి ఉంటే పెట్టమని అడుక్కుతిన్నా' అని చెప్పాడు. మావో మాట పూర్తికాకముందే లీనె 'మీరు వొదిలేసిన అన్నం నే తినేసేదా' అనడిగింది.

లిప్తపోటు మావో చలించిపోయాడు... అలాగే కానీ తల్లి దానికి నన్ను అడగాలా! అంటూ చూపు తిప్పేసుకున్నాడు. ఏదో చూడకూడదని సంఘటన చూస్తున్న భావన ఆ కళ్లలో కదలాడింది. గబాల్న మొహానికి పేపరు అడ్డం పెట్టుకుని సుబ్బరంగా ఒక్క మెతుకు కూడా కింద పోనీయకుండా తిను తల్లీ' అన్నాడు వొణికే కంఠంతో.

లీనే భోజనం బల్లమీద ఉన్న గిన్నెలన్నీ ఖాళీ చేసేసింది. సన్నగా తరిగి అన్నం మీద జల్లిన చిన్న చిన్న ఉల్లిపాయ ముక్కలతో సహా ఏమీ మిగల్చలేదు. అయినా ఇంకా తన ఆకలి తీరలేదేమో, భోజనాల బల్ల ముందు నుంచి లేవకుండా ఖాళీ పాత్రల వంక చూస్తూ కూచుండిపోయింది. 'పెరిగే వయసు కదా డాడీ. నీ పొట్టకు ఆకలే పెరుగుతుంది. ఇదిగో' అంటూ భోజనాల బల్ల మీద ఉన్న గిన్నెను చూపిస్తూ 'ఈ సైజు మొక్కజొన్న రొట్టెలు ఒకే విడత మూడేసి లాగించేయగలను' అంది.

మావో దుఃఖంతో పళ్ళతో కింద పెదవిని అదివి పెట్టుకుని పేపర్లోంచి తలతిప్పకునిడా అలానే ఉండిపోయాడు. 'భోజనం మాత్రం మహారుచిగా ఉంది' అంటూ లీనే మావోకేసి ఓరగా చూసి తర్వాత ఇన్‌జింగ్‌పాప్ కేసి తిరిగి 'అంకుల్ ఏదన్నా సూపు ఉందా? ఈ పాత్రల్లో పోసి తాగేస్తే పాత్రలూ శుభ్రం అయిపోతాయి కదా' అంది.

ఇన్ కళ్ళు నీళ్లపర్యంతం అయిపోతూ వంటగదిగేసి నడిచాడు. ఇదంతా గమనిస్తున్న వంటతను గబగబా రెండు బన్ను రొట్టెలు చేసి నిప్పుల మీద కాలుస్తూ ఉన్నాడు. అవి కాలీ కాలకముందే ఇన్ వాటిని తీసుకొచ్చి 'లీనె' ముందు పెట్టాడు. లీనె ఒక ముక్క తుంపి కూరగిన్నెలో అదుక్కి తుడిచి నట్లో పెట్టుకుంది. ఈలోగా ఇన్ ఉప్పు, వేణ్ణీళ్లు మిగతా గిన్నెలలో పోసి అన్నింటినీ తొలిపి ఓ పెద్దగిన్నెలో పోశాడు. అదే 'సూపు'. లీనె బన్నురొట్టె ముక్కలు ఆ సుపులో ముంచుకు నమిలి తినసాగింది. మావో అక్కణ్నించి లేచి నిశ్శబ్దంగా బయటకు వచ్చేశాడు. కాసేపు అటూ ఇటూ తిరిగి తన గదికేసి నడిచాడు. అంతలోనే మళ్లీ వెనక్కి వచ్చి బయట చాలాసేపు పచార్లు చేసి ఎప్పటికోగాని తన గదికి చేరుకోలేదు.

ఆరోజు రాత్రి జియాంగ్ మావో గదికి వచ్చింది. బాడీగార్డులను కాసేపు బయటకు వెళ్లమంది. ఓ అరగంట తరువాత ఆవిడ ఎర్రబడిన కళ్లతో బయటకు వచ్చింది. ఆవిడ ఏడుస్తోందని మాకు అర్థమైంది. ఆవిడ అటువెళ్లగానే మేం మావో గదిలోకి వెళ్లాం. 'ఇదేం న్యాయం కామ్రేడ్ ఛైర్మన్, లీనె పరిస్థితి చూస్తే మాకే కడుపు తరుక్కుపోతుంది. మనమేం చెయ్యలేమా' అని అడిగా నేను. 'చెయ్యలేంత. దేశంలో చాలా మంది ప్రజానీకం ఇంకా ఆకలితో అలమటిస్తూనే ఉన్నారు' అన్నాడు మావో. 'అది కాదు కామ్రేడ్ ఛైర్మన్..' అంటూ ఏదో చెప్పాలని ప్రయత్నించే లోగా ఆయన మధ్యలో కల్పించుకుని ఈ విషయమై ఇంకేం మాట్లాడొద్దు. ఒక తండ్రిగా నేనుగానీ, తల్లిగా నా భార్యగానీ లీనె గురించి తలుచుకుని దుఃఖపడుతున్నాం. కానీ నేను జనచైనా ప్రభుత్వంలో సభ్యుణ్ని. నాకు రావాల్సిన రేషను నాకు వస్తుంది. లీనెకు రావాల్సిన రేషను తనకు ముడుతుంది. విద్యార్థిగా వున్న తనకు కేటాయించిన రేషను కన్నా ఎక్కువ ఇప్పించేందుకు సర్కారు రూల్సు ఒప్పుకోవు' అన్నాడు. ఒకసారి దీర్ఘంగా నిట్టూర్చి ఒకింత విషాదం నిండిన కంఠంతో 'నేను ఇంతకు ముందొకసారి చెప్పా. మళ్లీ ఇప్పుడు చెబుతున్నా. తను నా బిడ్డల్లో ఒకతి. మావో బిడ్డలు కావడమే వాళ్లకు పట్టిన అదృష్టమో, దురదృష్టమో నే చెప్పలేను. ఇప్పుడు దేశం ఎదుర్కొంటున్న క్లిష్ట పరిస్థితుల్లో దేశాధ్యక్షుడిగా ఉన్న నేనే 'రూల్సు' అతిక్రమిస్తే మిగతావాళ్లకు అది ఎలాంటి సంకేతాలు ఇస్తుంది?. నా బిడ్డలు కాబట్టి మీకు వాళ్లకు ఇంకేమన్నా చేస్తే బాగుండు అనిపించవచ్చు. కాని మిగతా బిడ్డల (జన చైనా ప్రజలు) సంగతో?. అందుకే మీరు ఈ విషయాన్ని ఎప్పుడూ గుర్తు పెట్టుకోండి' అని ముగించారు.

బిడ్డల విషయంలో మావో ఎంత ప్రేమాస్పదంగా ఉన్నా ఏనాడూ ఆ ప్రేమతో అధికార దుర్వినియోగానికి పాల్పడలేదు. అనీయంగ్ కొరియా యుద్ధంలో మరణించినప్పుడుగాని, లీనె విషయంలోగాని అది వరమైనా, శాపమైనా వాళ్లు నాకు

బిడ్డలుగా పుట్టడమే' అన్న మావో మాటలు నేను ఏనాడు మర్చిపోలేదు.

1980ల తరువాత నాకూ, నా భార్యకూ లీనెను కలుసుకోవడానికి వెసులుబాటు దొరికింది. ఆ పాటికే జియాంగ్ కింగ్ మీద నేరనిర్ధారణ (గ్యాంగ్ ఆఫ్ ఫోర్ విచారణలో) జరిగింది. లీనె తన బిడ్డతో ఒంటరిగా, విడిగా బతుకుతోంది. ఆమె జీవితం ఏమంత సజావుగా లేదు. లీనెను కలిసినప్పుడు 'అమ్మా నువ్వు మళ్లీ పెళ్ళి ఎందుకు చేసుకోకూడదూ' అని పెద్దరికంతో సలహా ఇచ్చా. 'గ్యాంగ్ ఆఫ్ ఫోర్ విచారణలో దోషిగా తేలిన నా తల్లికి పుట్టిన బిడ్డగా నన్ను మళ్లీ పెళ్లి చేసుకునేందుకు ఎవరు ముందుకొస్తారు' అంది లీనె నిస్పృహతో. అప్పుడు నాకు మావో అన్నమాటలు గుర్తుకొచ్చాయి. 'నువ్వు కేవలం మీ అమ్మకే కూతురివి కాదుగా తల్లీ మావో లాంటి గొప్ప నాయకుడి బిడ్డవి అది గుర్తించుకో' అని ధైర్యం చెప్పా ఆమెకు.

ఆ తరువాత నేనూ నా భార్య కలిసి లీనెకు మారుపెళ్లి సంబంధాల కోసం చాలా ప్రయత్నాలు చేశాం. వాంగ్‌జింగ్ కింగ్ అని గతంలో మావో దగ్గర గార్డుగా చేసిన అతనితో పెళ్లి నిశ్చయం చేశాం. దగ్గరుండి వాళ్ల పెళ్లి చేశాం. కామ్రేడ్ యాంగ్‌షాంగ్‌కున్ లీనెకు భారీగా బహుమతులు పంపించారు. చిన్నప్పటి నుంచీ లీనెకు చాక్లెట్లు ఇష్టం అన్న సంగతి గుర్తుంచుకుని మరీ ఓ పెట్టెడు చాక్లెట్లు కూడా పంపారు. యాంగ్ తన కుటుంబ సభ్యులందరితో కలిసి అభినందన లేఖ మీద సంతకాలు చేసి పంపించారు. లీనె విషయంలో నేనూ, నా భార్య తీసుకున్న చొరవను కామ్రేడ్ వాంగ్‌గుయాంగ్‌మీ చాలా అభినందించారు. 'చాలా మంచి పని చేశావ్, మావో కూతురిగా తనకు దక్కాల్సిన సాయాన్ని నువ్వు తలకెత్తుకున్నందుకు నాకెంతో ఆనందంగా ఉంది' అన్నాడు.

ఆ తరువాత కొద్దిరోజులకే నన్ను మా ఆవిడిని భోజనాలకి రమ్మని లీనె కబురుపంపింది. ఆరోజు విందులో 'ఇప్పుడు మీకో స్పెషల్ ఐటం వడ్డించబోతున్నా' అంది లీనె. బీన్స్‌తో చేసిన జెల్లీ కేకులు వడ్డించింది. మేం ఉబ్బి తబ్బిబ్బైపోయాం. అవి చూసి 'ఇవి వాంగ్ స్వయంగా మీ కోసం చేసినవి' అని చెప్పింది లీనె. మేం ఆశ్చర్యపోయాం. 'ఏంటీ మీ ఆయన వొండాడా. తను వంట కూడా చేస్తాడా' అని అడిగాం మేం నోరు తెరిచేసి. 'నా కన్నా ఫస్టుగా, బెస్టుగా వంట చేస్తాడాయన' అని చెప్పింది లీనె మెరిసే కళ్లతో. 'మీకెలా కృతజ్ఞతలు చెప్పాలో తెలీడం లేదు అంకుల్. నా జీవితాన్ని సరైన గాడిలో పెట్టారు. వాంగ్ వంటి భర్త దొరకడం నా అదృష్టం. నన్ను ఎంతో ప్రేమగా చూసుకుంటున్నారు' అని చెప్పింది లీనె.

మాకు అంతకన్నా కావాల్సింది ఏముంది? 'లీనె, వాంగ్'లు చిలకాగోరింకల్లా కాపురం చేస్తున్నారు.

# 16. మావో హాస్య చతురత

చైనా ప్రజా విముక్తి పోరాటంలో పాల్గొన్న అనేక మంది అగ్రనేతలతో నాకు అంతో ఇంతో పరిచయం ఉంది. అందర్లోకెల్లా మావో మహాచతురు మనిషి. ఆయన హాస్య చతురత గురించి తెలిపిన వాళ్లు ఎవరైనా సరే ప్రస్తుతం చలామణిలో ఉన్న గంభీరంగా ఉండే మావో చిత్రపటాలు ఆయన వ్యక్తిత్వానికి అద్దం పట్టవు అనేస్తారు. జోకులు పేల్చడమే కాదు ఆయన 'మేనరిజమ్' కూడా నవ్వు తెప్పిస్తుంటుంది. ఉదాహరణకు ఆయన నడక గురించే చూస్తే ముసలివాళ్లు, పార్కుల్లో ఎక్సైర్ సైజులు చేస్తున్నట్లు నడుంకిందభాగం అంతా వొదువొదులుగా తిప్పుకుంటూ నడుస్తాడు. రోజులో ఎక్కువ భాగం రాతపనిలోనో చదివేపనిలోనో గడపడం మూలాన కీళ్లు పట్టెయ్యకుండా ఉండడానికి అలా చేస్తాడు. పది అడుగుల దూరమైనా సరే అలానే నడుస్తాడు. చూడ్డానికి తమాషాగా, నవ్వొస్తా ఉంటుంది. మావో అలా నడుస్తుంటే ఝూంగ్‌నాన్హైలో మీటింగ్ హాల్ మావో ఇంటికి కూతవేటు దూరంలో ఉంటుంది. అయినా ఆ కొద్ది దూరం కూడా మావో అలానే తిప్పుకుంటూ నడుస్తా వుంటే పక్కన నడుస్తుండే మేము ఓరకంట చూస్తూ నవ్వు ఆపుకోవడానికి నానా తంటాలు పడేవాళ్లం. అది గమనించి మావో 'ఏంట్రా అబ్బాయిలూ నా మొహంలో కోతులాడుతున్నాయా ఏంటీ? నేనూ మీ లాంటి మనిషినేగా' అనేవారు. అయితే కెమెరా ముందు మాత్రం మావో చాలా గంభీరంగా రాజసం ఉట్టిపడేలా నడిచేవాడు. ఒంటరిగా నడిచేటప్పుడు ఈ మనిషేనా ఆ మనిషీ అనిపించేది మాకు.

నిలువెత్తు ప్రమాదం కళ్లెదుట నిలిచి వున్నా దాన్ని నవ్వులాటగా మావో ఎదుర్కొనే తీరు తన చుట్టూ ఉన్న మనుషులకు గొప్ప విశ్వాసాన్ని ఇచ్చేది. నాయకుడిగా మావోలో ఉన్న విలక్షణమైన అంశాల్లో ఇదే క్యాడర్‌కు గొప్ప ఉత్తేజాన్ని ఇచ్చేది. ఒకసారి హుజ్వాంగ్‌నాన్ బలగాలు యేనాన్ మీద దాడికి తెగబడ్డాయి. వైమానిక దాడుల ద్వారా తెరలు తెరలుగా బాంబుల వర్షం కురిపించాయి. వాంగ్ జియాపింగ్ ప్రాంతం మొత్తం బాంబుల పేలుళ్లతో దద్దరిల్లిపోయింది. గుట్టి పైన పొగ లేదెత్తున కమ్మేస్తాయి. ఆ ప్రాంతాన్ని కొన్ని బాంబులు సరాసరి మావో దాగి ఉన్న కొండగుహ ముందు పేలాయి. ఆ ధాటికి రాళ్లు పెచ్చులు పెచ్చులుగా పేలిపోయాయి. దాంతో కొంతమంది సైదార్మీ జవాన్లు మావో ఉన్న కొండగుహలోకి హడావుడిగా దూరారు, ఆయనకు ఏమన్నా అయిందేమో అన్న ఆదుర్దాతో. మావో వాళ్లకేసి చూస్తూ తాపీగా 'చుట్టాలు వెళ్లిపోయారా?' అనడిగాడు. 'చుట్టాలా? ఇప్పుడా

ఈ పరిస్థితుల్లోనా? చుట్టాలెవరు' అని జవాన్లు తలా ఒక ప్రశ్న వేశారు.

అప్పుడు మావో చేతిలో వున్న పెన్సిల్‌తో ఆకాశంలోకి చూపిస్తూ 'అదేనోయ్, ఆకాశంలో చెక్కర్లు కొట్టిన చుట్టాలు... చెవులు దిబ్బళ్లు పడేలా అల్లరి చేసిన చుట్టాలు. వెధవ చుట్టాలు' అన్నాడు. దాంతో జవాన్లు అందరూ ఫక్కున నవ్వుకున్నారు. చతురులాడేటప్పుడు మావో ఎలా మాట్లాడతాడో విని తీరాల్సిందే. వేరే వాళ్లు చెప్పడం కన్నా హునాన్ యాసలో జీవం ఉట్టిపడేలా మావో మాట్లాడుతుంటే విని తరించాల్సిందే. అంత గొప్ప మజాగా ఉంటుంది. మావో మాట్లాడేతీరు.

ఉత్తరషాంగ్సీలో యుద్ధం జరుగుతున్న రోజుల్లో ఒకసారి మాకు తోప చూపించి 'గైడ్' దారి తప్పాడు. అప్పుడే మేం ఒక లోతట్టు గ్రామం విడిచి కొండవాలు చేరుకున్నాం. ఆ పాటికే శత్రుసైన్యాలు ఆ ఊళ్లోకి అడుగుపెట్టాయి. యాభై, అరవై వేల మంది దండు అది. అడపాదడపా కింద నుండి తుపాకీ మోతలు వినిపిస్తున్నాయి. భోరున వర్షం కురుస్తావుంది. ఏం జరుగుతుందో అక్కడ నుండి ఎలా బయటపడడమా అన్న సంకటంతో టెన్షన్‌లోపడిపోయారు. మావో చుట్టూ దడికట్టేశారు అందరూ. అప్పుడు మావో 'ఓరి నాయనో కోట గోడ కట్టేసారే. వాన దూరకంత లేదు గాలి దూరసందుగూడా లేదే అన్నాడు నవ్వుతూ మావో. దాంతో రెడార్మీ జవాన్లు నవ్వేశారు. అప్పటిదాగా పడిన టెన్షను మరిచిపోయారు. మావో ఒక్కోసారి లేని మనిషిని ఉన్నట్లుగా ఊహించుకుని మాట్లాడుతూ ఉండేవాడు. ఆ రోజు వాన తెరపి ఇచ్చేలోగా మా గైడు దారి పట్టుకున్నాడు. మా ప్రయాణం అటుకేసి నది ఉధృతంగా ప్రవహిస్తా వుంది. దానికి తోడు మళ్లీ వాన మొదలైంది. కొంత మంది విడిగా ఉన్న ఆ నదిలో ఈదులాడుకుంటూ ఆవలి ఒడ్డుకు చేరుతున్నారు. వాళ్ళతో వంతెన ఏర్పాటు చేయడానికి సరుకూ సరంజామా కూడా తీసుకువెళ్లారు. ఇంతలో కొండమీద దేవాలయం దగ్గర నుండి తుపాకీ మోతలు మొదలయ్యాయి. మోర్టార్ల నుండి బాంబులు కురిపిస్తున్నారు. అవి మాకు అల్లంత దూరంలో పేలుతున్నాయి. శత్రుసైన్యం ఏ క్షణాన్నయినా మీదికి నిమ్మకు నీరెత్తినట్లు కూచుని ఉన్నాడు. మిలటరీ మ్యాప్ మీద పెన్సిల్‌తో గీతలు గుర్తులు పెట్టుకుంటూ ఉన్నాడు సీరియస్‌గా. అయన వానకు తడవకుండా ఉండడానికి మేముఓ నలుగురం మావో నెత్తిన పట్టాపట్టుకుని నిలబడ్డాం. చాంగ్‌కైషేక్‌తో చెస్ ఆడుతున్నట్లు కనిపించాడు మావో. శత్రుసైన్యం కదలికలను మ్యాప్‌లో గుర్తులు పెడుతూ రెడార్మీ వ్యూహాన్ని కూడా ఆ మ్యాప్ మీద గీస్తూ మావో నోటితో 'చ్చా చ్చా చ్చా' అని చిత్రంగా శబ్దం చేశాడు. 'ఎంతపనైపోయింది మిత్రమా కలుగులో ఎలకలా దొరికిపోయావ్ కదా' అన్నాడు. చాంగ్‌కైషేక్‌ను ఉద్దేశించి మావో ఆ మాటలు అన్నాడని మాకు అర్థమైంది. చదరంగంలో ఆటలో శత్రువుని ఓడించేటప్పుడు మాట్లాడినట్లు మావో అలా ఊహాజనితంగా

మాట్లాడుతుంటే మాలో. మేం తెగనవ్వుకునేవాళ్లం.

భవిష్యత్తు మీద మావోకు ఉన్న తిరుగులేని విశ్వాసమే అత్యంత క్లిష్ట సమయాల్లో కూడా ఆసికాలాడేంత ధైర్యం ఇచ్చిందనిపిస్తుంది. ఉత్తర షాంగ్సీ యుద్ధకాలంలో ఒక మాటు మావో తియాన్‌సివాన్ అనే గ్రామంలో బస చేయాల్సి వస్తుంది. కొట్టంలాంటి ఒక ఇంట్లో మరో డజనుమందితో కలిసి ఉండాల్సి వచ్చింది. ఆ ఇంటి యజమాని మావోతో 'అయ్యా క్షమించాలి. ఈ కొట్టం ఇంకాస్త పెద్దదయినా కాకుండా పోయింది. మిమ్మల్ని ఇందులో ఇరుక్కోపెట్టాల్సి వచ్చింది' అన్నాడు క్షమాపణాపూర్వకంగా. అప్పుడు మావో ఆయనతో 'అయ్యో మీరే మమ్మల్ని క్షమించాలి. మీ ఇంట్లో ఇంత మందిమి దూరి మిమ్మల్ని ఇరకాటంలో పడేశాం' అన్నాడు. దాంతో ఇంటి యజమాని సహా అందరూ హాయిగా నవ్వేసుకున్నారు.

హుజాంగ్‌నాన్ మాపటాలం మీద దాడికి దిగడంతో మాకు ఆహారకొరత ఏర్పడింది. లియాంగ్‌జియాఛాలో బస చేసిన తొలి రోజు నుండే మేం సోయాబీన్స్ పులుసు తాగి సరిపెట్టుకోవాల్సి వచ్చింది. సరిగ్గా అలాంటి రోజుల్లోనే మావో 'చైనా ప్రజా విముక్తి సైన్యం మ్యానిఫెస్టో' రచిస్తా ఉన్నాడు. సోయాబీన్స్ పులుసు తినీ తినీ కడుపు ఉబ్బరించిందేమో మావో రాత పని కట్టిపెట్టి ఆరుబయట పచార్లు చెయ్యడానికి వచ్చాడు.

ఆ రోజు ఛూలావోసి గార్డు డ్యూటీ మీద ఉన్నాడు. అతనికి విపరీతంగా పొగ తాగే అలవాటుంది. దాని మూలంగా అతని పళ్లన్నీ గారపట్టేశాయి. మావోను చూడగానే నిటారుగా నిలబడి శెల్యూట్ చేసి పళ్లికలిస్తూ నిలబడ్డాడు. మావో అతని దగ్గర ఆగి 'ఏంట్రా అబ్బాయ్ నీ పళ్ళు అంత నల్లగా అయిపోయాయ్. రోజూ నల్ల బీన్స్ పులుసు తాగీ తాగీ అలా అయిపోయాయా? చచ్చాం నాకింకా విముక్తి లేదు. ఆ పళ్లు ఇంకా నల్లపడాల్సిందే. ఇప్పట్లో నీకు ఆ పులుసు తప్ప వేరే తిండి దొరికే అవకాశం లేదు' అన్నాడు. దాంతో ఛూ పడీపడీ నవ్వాడు. 'నవ్వుకో, నవ్వుకో. నవ్విన నాప చేనే పండుద్ది అన్నారు కానీ నీ పళ్ల రంగు పండదురా అబ్బీ' అన్నాడు మావో. ఇహ మేం కూడా నవ్వు ఆపుకోలేక పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వుకున్నాం.

కాసేపటికి నవ్వులు సద్దుమణిగాయి. అప్పుడు మావో మాట్లాడాడు. "ఇప్పుడు మనం సోయాబీన్స్ పులుసుతో అన్నా కడుపు నింపుకుంటున్నాం. ఇక ముందు అది కూడా కరువయ్యే పరిస్థితి రానుంది. ఉత్తర షాంగ్సీ ప్రాంతం అన్నపూర్ణేమీ కాదు. ఇక్కడా రైతులు పండించే సోయాపంట ఈ ప్రాంత జనాభా అవసరాలకు తీర్చేటంత మాత్రంగానే ఉంటుంది. ఇప్పుడు కొన్ని వందల వేల మంది శత్రువుసైనికులు ఇక్కడి ఊళ్ల మీద పడి దొరికినకాడికి

దోచుకుంటున్నారు. మన ప్రజా విముక్తి సైన్యానికి ఆహారం దొరకనివ్వ కూడదనే మిషమీద పచ్చటి పంట పొలాన్ని నరికి, కాల్చి వాశనం చేసేస్తున్నారు. కాబట్టి మన ముందు ఉంది గడ్డుకాలమే. ఈ పరిస్థితిని మనం మార్చడానికి పూనుకోవాలి. కొన్ని నెలల పాటు మనం తిండి కోసం ఇక్కడ ఆధారపడకూడదు. కానీ శత్రుమూకలు మాత్రం ఇక్కడి తిండి మీదే ఆధారపడేలా చెయ్యాలి. అప్పుడే వాళ్ళు మనకు నష్టం చేయాలనుకున్న ఆహారకొరత పాలబడతారు. వాళ్లు తీసుకున్న గోతిలో వాళ్లే పడతారు" అంటూ మావో ఛూలావోసి కేసి చూస్తూ 'నువ్వేమంటావ్ బ్రదర్, శత్రుమూకలు మన నోటికాడ కూడు లాగేయ్యాలని చూస్తుంటే మనం ఊరుకోవాలా? వాళ్ల పాఠం వాళ్లకే అప్పచెప్పొద్దూ. వాళ్ల నోటికాడ కూడు మనం లాగేసుకోవద్దు' అనడిగాడు.

ఛూ తలూపుతూ 'అంతే... అంతే... కుక్కల కొడుకులకి అలానే చెయ్యాలి. వాళ్ల తిక్క తిన్నగా కుదుర్చాలి' అన్నాడు యాసగా, దాంతో మేమంతా పడీపడీ నవ్వుకున్నాం. 1960వ దశకంలో మూడేళ్ళపాటు దేశ ఆర్థిక వ్యవస్థ అనామత్తుగా తయారైంది. అలాంటి రోజుల్లో మావో ఏడు నెలలపాటు స్వచ్ఛందంగా నీసు ముట్టకుండా గడిపాడు. ఇంకా కోతల కాలానికి గడుపుతున్న రోజుల్లో అయితే ఆహార కొరత మరీ తీవ్రంగా ఉండింది. మావో కాస్తంత తోటకూర పులుసు, సగ్గుబియ్యం జావతో సరిపెట్టుకునేవారు. ఇంకాస్త శుభ్రమైన తిండి తినుమహాప్రభో అని ఎవరెంత మంది చెప్పినా మావో లక్ష్యపెట్టలేదు.

ఒకరోజు నేను మావో ఒళ్లు మర్దనా చేస్తున్నా. మోకాళ్ల చుట్టూనే చేతి వేళ్లతో ఒత్తుతుంటే నా వేళ్లుపడినంత మేరా లొట్టపోయింది. మావో 'ఎడిమా'తో బాధపడుతున్నాడని గ్రహించాను. పోషకాహార లోపంతో వచ్చే జబ్బు అది. అదే మాట నేను మావోతో అన్నాను. 'చాల్లెద్దు... నేను రోజు రోజుకీ బరువు పెరుగుతున్నా ఎలా తగ్గించుకోవాల్రా అని ఆలోచిస్తుంటే నేను ఇంకా తిని బలవాలని భలే చెబుతున్నావే' అంటూ నా మాట నవ్వుతూ తీసేశాడు. షాజియాడియాస్ యుద్ధంలో శత్రువు మీద మేం గొప్ప విజయం సాధించాం. అయినా మావో ఆనందంతో ఎగిరిగంతెయ్యలేదు. హుజాంగ్‌నాన్‌ను తలుస్తూ సానుభూతిగా నిట్టూర్పులు విడుస్తూ 'ఏం చేస్తాం. తానొకటి తలిస్తే, మనం ఒకటి తలిచాం. చివరికి అతగాడి బతుకు ఇలా తెల్లారిపోయింది' అంటూ నోటితో చిత్రంగా 'ప్చ్, ప్చ్' అంటూ శబ్దం చేశాడు. దాంతో మేం పగలబడి నవ్వాం. మావో మాట తీరు ముఖకవళికలు మాకు అంతనవ్వు తెప్పించాయి.

ఆ తరువాత మేం తుదముట్టించిన శత్రుసైనిక బలగాలని తన వేళ్లమీద లెక్కిస్తూ 'క్యుయింగ్ హువాబియాస్ దగ్గర ఒకటి, యాంగ్ మాహె దగ్గర రెండు, పాస్‌లాంగ్ దగ్గర

పెందున్నొక్కటి షాజియాడియాస్ దగ్గర నాలుగు... మొత్తానికి ఆరేడు బ్రిగేడ్ల శత్రుసైన్యాన్ని నామరూపాలు లేకుండా చేశారు' అన్నాడు. 'అందుకు మన నలుగురు జనరల్స్‌కు అభినందనలు. జగజ్జేతలు వాళ్లు' అని కానీ... అంటూ ఆగిపోయాడు. మేమంతా చెవులు రిక్కించాం మావో ఏవే చెబుతాడా అని. 'మావోళ్లు చూడ్డానికి ఎంత మట్టి సుద్దల్లా ఉండారు. రైతులు పెరట్లో పారబోసే పేడకుప్పల మాదిరి ఉందరూ' అన్నాడు. దాంతో మేమంతా గొల్లున నవ్వాం. 'చూశారా రూపం చూసి శత్రుమూకలు ఎలా దెబ్బతినేశారో... జమాజెట్టీలు కాదు మనవాళ్లు. మొనగాళ్లురా అబ్బాయిలూ మీరు మొనగాళ్లు' అన్నాడో మావో. దాంతో మేం అందరం సదురుకున్నాం. మావో మాటల్లో అంతస్సారం అర్థం చేసుకున్నాం. 'ఏరిమన నలుగురు జమాజెట్టీలూ, ఇక్కడ హెక్సుయి, లియుజిక్యి, లీకువాన్‌గాంగ్... ముగ్గురే కనబడుతున్నారు. వీళ్ల ముగ్గురూ మన చరిత్రలో నిలిచిపోతారు. ఏడీ ఆ నాలుగో జెమాజెట్టీ' అని మావో అంటూ ఉండగా గుంపులోంచి ఎవరో 'లీరిజీ' అని అరిచాడు. 'ఆ..అద్గదీ లీరిజీ' అని క్షణం ఆగి 'లీరిజీనా' లేక లీ'ఎర్జీ'నా (ఎర్జీ అంటే రెండిందాలా అదృష్టవంతుడని అర్థం) అనడిగాడు మావో. ఈ సారికి అదృష్టవంతుడే ఇప్పుడు మనకు దొరకలేదు. రెండోసారీ అదృష్టవంతుడే కాబట్టి ఇంకోమాటూ మనకు దొరకకపోవచ్చు. కాని ముచ్చటగా మూడోసారికి మాత్రం మనకు చిక్కాల్సిందే' అన్నాడు. మళ్లీ చుట్టూ నవ్వులు వెల్లివిరిశాయి.

మేం అందరం అంతగా పడీపడీ నవ్వుకుంటున్నా మావో మాత్రం మేం ఎందుకు నవ్వుతున్నామో అర్థం కానట్లు నడ్డిమీద రెండు చేతులూ ఆన్చుకుని మొహం అమాయకంగా పెట్టి చుట్టూ పరకాయిస్తుంటే మేం ఇంకా ఇంకా నవ్వుకున్నాం, నాన్జింగ్ ప్రాంతాన్ని విముక్తం చేసిన వార్త అచ్చు అయిన దినపత్రిక చదువుతూ కూర్చున్న మావో ఫోటో చైనాలో ఎక్కడ చూసినా కనపడుతూ ఉంటుంది. మావోను అలా ఫోటో తీసిన రోజున మేమంతా అక్కడే ఉన్నాం. నిజానికి ఆ మధురక్షణాలను మావోతో కలిసి పంచుకోవాలని, ఆయనతో పాటు ఫోటో దిగాలని మా అందరికి మనస్సుల్లో ఉంది. కాని ఎవరం పైకి తేలలా. మావో మా మనసుల్ని చదివేసినట్టున్నాడు. ఫోటోగ్రాఫర్‌ని అబ్బీ ఇప్పుడు ప్రత్యేకంగా ఇలా ఎందుకు ఫోటో తీస్తున్నట్లూ' అనడిగాడు. 'ఇది ఎలాంటి రోజూ, చరిత్రలో నిచిపోయే రోజు కదా కామ్రేడ్ ఛైర్మన్. నాన్జింగ్ విముక్తి సాధించిన రోజు' అన్నాడు అతను. 'అంత గొప్ప రోజు కాబట్టి ఈ ఫోటో కదా' అని ఫోటోగ్రాఫర్‌తో అనేసి మాకేసి తిరిగాడు మావో. 'ఏ మీరు ఇది గొప్ప రోజు అనుకోవట్లేదా'. అనడిగాడు. ఎందుకు కాదు ఛైర్మన్ మాకు మీతో ఫోటో దిగాలనుంది అని కోరస్‌గా అరిచేశాం అందరం. మావో నవ్వుతూ లేచి మా వేపుకు నడిచి వస్తుంటే మేము ఆనందంతో, ఉద్వేగంతో చప్పట్లు చరుస్తూ, అరుస్తూ ఈలవేస్తూ ఆయనకు స్వాగతం పలికాం. మా అందరితో కలిసి ఫోటో దిగాడు మావో.

చెప్పుకుంటూ పోతే ఇట్లాంటివి ఎన్నో అదో గ్రంథం అవుతుంది. 1950 లో అనుకుంటా మావో నావికాదళం ఇన్‌స్పెక్షన్‌కు వెళ్లాడు. ఆఫీసర్ల నుండి నావికుల వరకూ హోదాల వారీగా ఓడ 'సెక్' మీద నిలబడి ఉన్నారు. వచ్చింది మావో కాబట్టి అందరిలో ఒకింత ఆదుర్దా కనిపిస్తుంది. చైనా కమ్యూనిస్టు పార్టీకి, జన చైనాకు, మిలిటరీ కమిషన్‌కు, పార్టీ కేంద్ర కమిటీకి ఛైర్మన్‌గా ఉన్నాడు మావో. అదీ అక్కడ ఉన్న జనం 'టెన్షన్'కు కారణం. పటాలం అంతా సైనిక వందనం చేసి 'అలర్ట్'గా నిలబడి ఉంది. మావో ఒక్కొక్కరినీ దాటుకుంటూ నడుస్తున్నాడు. ఉన్నట్టుండి మధ్యలో ఆగిపోయాడు. చిన్న వయసులో ఉన్న ఒక నావికుడు ఎదురుగా నిలబడి అభిమానంగా చూశాడు. వెంటనే ఉన్నతాధికారులు, రిపోర్టర్లూ హడావుడిపడ్డారు. మావో ఏదో ఉపన్యాసం ఇవ్వబోతున్నాడు అనుకున్నారు. మావో లాంటి సర్వశక్తివంతుడు తనతోనే కదా మాట్లాడబోతున్నాడు అన్న గర్వంతో రొమ్ము మరింత విరిచి నిలబడ్డాడు ఆ కుర్ర నావికుడు. మావో ఏం అడిగినా ఠకీమని పెద్ద గొంతుకతో సమాధానం చెప్పడానికా అన్నట్లు శబ్దం కాకుండా గొంతు సవరించుకున్నాడు.

మావో అతి ప్రశాంతంగా 'కడుపు నిండా భోజనం దొరుకుతుందా' అనడిగాడు చిరునవ్వుతో. దాంతో ఆ కుర్రాడి సహా అందరూ అప్రతిభులయిపోయారు. మావో నవ్వడంతో ధైర్యం వచ్చిన ఆ కుర్రాడు కూడా బదులుగా నవ్వాడు. మావో ప్రశ్న వినబడినంతమేర ఉన్న వాళ్లు కూడా ముసిముసిగా నవ్వుకున్నారు. ఉత్కంఠతో ఉన్న వాతావరణం ఒక్కసారిగా తేలికపడింది. అక్కడ, బాడీగార్డులు, గార్డులతో అయితే మావో మరింతగా పరాచికాలు ఆడేవారు. ఒకసారి మేం యాంగ్సీనదిలో ఈతకు వెళ్లాం. మావో స్విమ్మింగ్ డ్రెస్ వేసుకున్నాక నేనూ డ్రెస్ తొడుక్కోసాగాను. మావో నాకేసి చూస్తూ 'ఇంకియావో నాతో పోటీకి వచ్చేస్తున్నావు. ఏదో ఒక రోజు నన్ను మించిపోతావ్' అనేసరికి ఏమనాలో నాకు పాలుపోలా. అప్పుడు మావో నా పొట్టమీద తడుతూ 'చూడు ఈ బొజ్జ ఎంత పెంచేశాడో. కొన్నాళ్లుపోతే నన్ను మించిపోయేలా ఉంది అన్నాడు. దాంతో నాకు నవ్వాగింది కాదు. 'అదేం లేదు ఛైర్మన్' అంటూ నేను ఊపిరి లోపలికి పీల్చి నా పొట్ట కాస్త లోపలికి లాక్కున్నా. మావో నా భుజం మీద తడుతూ 'ఛాతీ విరగదీసుకుని నడు. అచ్చం నా మాదిరి ఆనతావ్ జనానికి' అన్నాడు. ఆ మాటలకు బదులుగా నేను 'చాల్లెద్దురూ వయసు మీదపడి పోతుంటేనూ, ఏదేమైనా మీతో సరితూగడం అయ్యేపనేనా' అన్నా. 'చచ్చు మాటలు మాట్లాడబాక. అంతా చేసి ముప్పై ఏళ్లు నిండలేదు నీకు. అప్పుడే ముసలివాడివి అయిపోయావా? ఎట్టెట్టా! మరయితే నే కుర్రాడినా? రేపటి రోజు నీదేనోయ్. మీలాంటి యువకులదే భవిష్యత్తు' అన్నాడు మావో. 'నిజమే కదా' అనుకుంటూ నేనూ మావో వెంటపడి నదిలో ఈతకు పోయా.

రాతిబల్ల ముందు కూర్చుంటే మావో ఒక పట్టాన లేచే మనిషి కాదు. 'కాస్త లేచి అటూ ఇటూ నాలుగు అడుగులు వెయ్యండి లేకపోతే కీళ్లు పట్టేస్తాయి' అని నే పోరగా పోరగా ఎప్పటికో లేచేవాడు. పదే, పది నిమిషాలు. టైం పెట్టుకో, అవగానే చెప్పు' అంటూ మావో లేచి పచార్లు చేసేవాడు ఆరుబయట. నేను ఏనాడూ పది నిమిషాలు అవగానే అయిందని చెప్పిన పాపానపోలేదు. పది నిమిషాలు అయిందా అని తన ఒంట్లో ఏదో గడియారం ఉన్నట్లు అడిగేవాడు. సరిగ్గా పది నిమిషాలయ్యేసరికి లేదు ఇంకా రెండు నిమిషాలుంది అనేవాణ్ని నేను. 'నీ చేతి గడియారం ఏ రోజు సరిగ్గా ఆడిచావదల్లే ఉందే. దాన్ని నమ్ముకుంటే అసలుకే మోసం వచ్చేలా ఉంది' అంటూ మావో ఆఫీసుకేసి తిరుగుముఖం పట్టేవాడు. 'లేదు.. లేదు ఇంకా రెణ్ణిమిషాలుంది నిజంగానే' అంటూ వెంటపడినా పట్టించుకునేవాడు కాదు. మావో పచార్ల కోసం బయటకురాగానే నేను ఇంకొంత మంది గార్డులను తోడు తీసుకుని ఆఫీసులోకీ దూరేవాళ్లం. అక్కడ ఉన్న పెద్ద వాలు కుర్చీని వేరే గదిలోకి మార్చాలని విశ్వప్రయత్నం చేసేవాళ్లం. ఎన్నిసార్లు ప్రయత్నించినా లాభం లేకపోయింది. మావల్ల కాలేదు. ఒక రోజు ఇలానే పచార్లకు వెళ్లి వచ్చిన మావో 'ఏంటీ దీన్ని పక్కగదిలో పెట్టలేదా ఇంకా' అనడిగాడు. 'తలుపులు పట్టడం లేదు. అందుకే ఇక్కడే వొదిలేశాం' అని బదులిచ్చాడు. ఫెంగ్‌యావోసాంగ్. అలాగా అంటూ మావో మాకేసి, కుర్చీకేసి తలుపులకేసి మార్చి మార్చి చూసి బుర్రగోక్కుంటూ 'నాకీ విషయం అర్థంకాలా' అంటూ ఆర్థోక్తిలో ఆగిపయాడు. మవోకు ఓ అలవాటుండేది. ఏదన్నా అంశం మీద పార్టీ సభ్యులతోనో, ఎవరన్నా నిష్ణాతులతోనో మాట్లాడేటప్పుడు హఠాత్తుగా మధ్యలో ఎదుటివాళ్ల మాటలకు అడ్డువచ్చి మాకేసి చూస్తూ 'ఎవరితో చర్చిస్తున్నావో గుర్తుపట్టారా. మేం మాట్లాడుతుంది అర్థం అవుతుందా' అని అడిగేవారు. అంత గొప్ప విషయాల్లో మా అభిప్రాయం అడిగినంత గొప్పగా భావించేవాళ్లం ఆ మాటలకి, అవాళ కూడా సరిగ్గా అలానే మధ్యలో అపేశాడు మావో. దాంతో మేం 'చెప్పండి'అనడిగాం ఏకకంఠంతో. 'అదే... కుర్చీ ఉంచి ఇల్లుకట్టారా, ఇల్లు కట్టాక కుర్చీ ఉంచారానీ' అన్నాడు మావో. ఒక్కసారిగా మా మొహాలు సిగ్గుతో ఎర్రబారాయి. విషయం మాకు అర్థమైంది. ఏదోలా తంటాలు పడి మొత్తానికి ఆ కుర్చీని పక్కగదిలోకి మార్చాం. మావో హాస్యచతురతకు ఇవి కొన్ని ఉదాహరణలు మాత్రమే. మావో పరాచికంగా ఏదన్నా అన్నాడంటే దాని ఉద్దేశం చుట్టూ ఉన్న జనాల్ని నవ్వించడానికో, వాతావరణాన్ని తేలికపరచడానికో మాత్రమే కాదు. మావో చతురులాడిన ప్రతి సందర్భంలోనూ ఏదో ఒక సందేశం, ఒక విశ్వాసం, ఒకింత సంతోషం, కాసింత విజ్ఞానం, ఒకింత విషయ పరిజ్ఞానం, ఒకరకమైన గుండె ధైర్యం ఇచ్చేవి.

# 17. అధ్యయనశీలి మావో

నేను మావో దగ్గర బాడీగార్డుగా చేరిన కొన్నాళ్లకే ప్రాథమిక విద్య నేర్పడానికి క్లాసులకు పంపించేవాడు. పుస్తకాలు ఇచ్చి చదవమనేవాడు. తన దగ్గర పనిచేసేవాళ్లందరికీ అక్షరజ్ఞానం కలిగించడానికి మావో చూపించిన ప్రత్యే శ్రద్ధ మీద అనేక పత్రికల్లో, మ్యాగ్జైన్లలో వచ్చిన కథనాలు అక్షరసత్యాలు. పుస్తకాలు, చదువు... ఈ రెండు విషయాల మీద మావో ఆలోచనలు ఎలా ఉండేవో నాకు జ్ఞాపకం ఉన్నంతలో మీకు వివరిస్తాను.

మావో నాకు తెల్సినంతలో ఎవరినీ నాకు ఈ సాయం చేసిపెట్టు అని అడిగింది లేదు. కానీ ఉత్తర షాంగ్జీలో యుద్ధం జరుగుతున్న రోజుల్లో మాత్రం సాయం కోరాడు. అదీ పుస్తకాలు తెచ్చి పెట్టమని. శత్రుసైన్యం తుపాకీ వేటు దూరంలోకి వచ్చేదాగా జావోలినేగావ్‌లో ఉన్న సెంట్రల్ కమిటీ ఆఫీసును ఖాళీ చెయ్యలేదు. ఇక ఖాళీ చెయ్యక తప్పని పరిస్థితుల్లో మావోను ఒక గుర్రం మీదకి ఎక్కించి ఎక్కిన మనిషి క్షణంలో దిగిపోయాడు. మా హాన్‌రాంగ్ అనే గార్డు దగ్గరకు వెళ్లి 'మీది దగ్గరలోని సుయేడే ఊరే కదూ' అనడిగాడు. అతను గార్డుగా ఈ మధ్యనే కొలువులో చేరాడు. అటెన్షన్‌లో నిలబడి 'అవును ఛైర్మన్' అన్నాడు. మీ ఊరు ఇక్కడికి ఎన్ని మైళ్ల దూరం. అనడిగాడు మావో. సరిగ్గా లెక్క తెలీదుగానీ, నడిస్తే అరపూటలో మా ఊరు చేరవచ్చు. అన్నాడతను. మావో ఒక్క నిమిషం మౌనంగా ఉండిపోయాడు. పెట్టెల్లో సర్దిన పుస్తకాలకేసి చూసి నాకీ చిన్న సాయం చేసి పెట్టాలి కామ్రేడ్, చేస్తావా అనడిగాడు 'మా'ను. ఏం చేయ్యాలో చెప్పండి చాలు అన్నాడతను. చూశావుగా నా పుస్తకాలు ఉన్న పెట్టెలు. వాటిని మీ ఇంట్లో పెట్టించగలవా అనడిగాడు మావో. అదెంత పని ఛైర్మన్ అన్నాడతను. అలాకాదు.. మీ ఇంట్లో వాళ్లకి ఇబ్బందేం కాదుగా. అంటే అనవసరంగా లేనిపోని చిక్కుల్లో పడరు కదా. అనడిగాడు మావో. అట్లాంటి భయమేంలేదు. సూయేడే తూరుపు దిక్కున బాగా దిగుపన ఉండే వీధిలో ఉండారు మా వాళ్లు. హైవేకు చాలా దూరం అది. శత్రుసైన్యాలు అక్కడికి అడుగు పెడతాయని అనుకోను. ఒకవేళ అడుగుపెట్టినా ఎలా సంభాళించుకోవాలో మా వాళ్లకి తెలుసు. ఇక మీరా సంగతి నాకు వదిలెయ్యండి అన్నాడు మా. దాంతో మావో ఆ కుర్రగార్డుకి షేక్‌హ్యాండిచ్చి 'థ్యాంక్యూ కామ్రేడ్ అయితే ముందు నువ్వా పని మీద ఉండు' అన్నాడు. అప్పటి దాగా ఆ పుస్తకాల గతేం కానూ అన్నట్లు నొసళ్లు ముడివేసుకుని ఉన్నాడు

మావో. 'మా' ఆ పుస్తకాల పెట్టెలన్నీ తీసుకుని అక్కడి నుండి బయల్దేరాక గానీ ముడిపడిన ఆ నొసళ్లు విడివడలేదు. రెండు రోజుల తరువాత 'మా' మా ప్రయాణంలో వచ్చి కలిశాడు. 'మీ పుస్తకాలు భద్రంగా ఓ నేలమాలిగలో ఉంచాం. కొమింటాంగ్ సైన్యాన్ని తలదన్నే బందిపోట్లు వచ్చి పడినా వాటి జాడ కనుక్కోలేరు' అని చెప్పాడు మావోతో. దాంతో మావో ముఖం వికసించింది! చాలా, చాలా, చాలా సాయం చేసి పెట్టావ్ కామ్రేడ్ అంటూ అతన్ని అభినందించాడు.

అసలే తీవ్రంగా యుద్ధం సాగుతున్న రోజులు. సాధ్యమైనంత తక్కువ లగేజి వెంట తీసుకువెళ్లాలనేది రూలు. అయినా మావో పుస్తకాలు మాత్రం వదిలేవాడు కాదు. మిగతావి ఏవన్నా సరే వదిలిపెట్టేసేవాడు, ఆఖరికి రాత్రింబవళ్లు కష్టపడి రాసిన కాయితాల కట్టలు కూడా, అందుకే డాంగ్‌బివు మావోను 'పుస్తకాల పురుగు' అనేవాడు. మావో అధ్యయనం పార్టీకి ఎంతో అక్కరకు వచ్చింది. చారిత్రకంగా ఎంతో విలువైన పత్రాలు, డాక్యుమెంట్లు అన్నింటినీ ఎంతో భద్రంగా సంపుటాలుగా అట్టేపెట్టాడు. పార్టీ సెంట్రల్ కమిటీ ఆ పని చెయ్యలేకపోయింది. ఇవాళ అవే పార్టీకి కీలకమైన విలువైన ఆస్థులు" అని ప్రశంసించాడు. మామూలుగా అయితే సైన్యం బయల్దేరడానికన్నా ముందు లెక్క ప్రకారం ఆహారం, పశుగ్రాసం వంటి వాటిని తరలించేవారు. కానీ మా ప్రయాణంలో మాకన్నా ముందు పుస్తకాలు పోయేవి. ప్రయాణంలో మావో వెంట ఎప్పుడూ చదరపు మీటరు వైశాల్యంగల రెండు చెక్కపెట్టెలు ఉండేవి. ఆ రెంటిలోనూ 'రిఫరెన్స్ పుస్తకాలు, సాహిత్యం, రాజకీయశాస్త్రం తదితర పుస్తకాలు, డాక్యుమెంట్లు. రాతప్రతులూ ఉండేవి. నాలుగు రోజుల్లో వెనక్కి తిరిగి వచ్చే పనిమీద బయల్దేరినా ఆ రెండు పెట్టెలూ ఆయనతో పాటు సవారీలో ఉండాల్సిందే. ఎప్పుడన్నా రైల్లో ప్రయాణం అయితే రేలు బయల్దేరడానికి గంట ముందుగానే మేం పుస్తకాల కట్టలు తెచ్చి ఆఫీసులో అవి ఏ క్రమంలో ఉండేవో ఆ క్రమంలోనే మావో బెడ్డు పక్కన డెస్కు పక్కన వరుసగా పేర్చేవాళ్ళం. మావో రైలు ఎక్కగానే ముందు కాసిన్ని చల్లటి నీళ్ళతో మొహం కడుక్కునేవాడు. వచ్చి కూర్చుని పుస్తకం తీసి చదవడం మొదలు పెట్టేవాడు. మావో గొప్ప చదువరి. 1947 అక్టోబర్ ప్రాంతంలో అనుకుంటా జియాంగ్‌కింగ్ లీనెను తీసుకుని పచ్చనది తూర్పు ప్రాంతం నుంచి వచ్చి మాతో చేరింది. అప్పట్లో లీనె అలనాపాలనా హాన్‌గుయిక్సిన్ అనే అయా చూసేది. లీనెకు ఇప్పుడు ఏడేళ్లు. అప్పుడున్న పరిస్థితుల్లో స్కూలుకు పంపించి చదివించడం కుదిరే పనికాదు. ఏం చెయ్యాలి ఇప్పుడు అన్నాడు మావో. హాన్ ఎలిమెంటరీ స్కూలు చదువు పూర్తి చేసింది కాబట్టి లీనెకు రాయడం, చదవడం ఆవిడే నేర్పించాలని తీర్మానించారు ఆఖరుకి. లీనెను హాన్‌కు పరిచయం చేసిన

రోజున నీనె మావోకేసి తిరిగి నేను కష్టపడి చదువుకుండా. అల్లరి చేయ్యను సరేనా అంది. అప్పుడు మావో నా బంగారు తల్లివిదా. కష్టపడి చదువుకో. ఇక అల్లరి మాట అంటావా. వొద్దని ఇననుగానీ ఏదన్నా మితంలో ఉండాలి. పిల్లలు కాకపోతే అల్లరి ఎవరు చేస్తారా. ఆరోగ్యానికి, చురుకుదనానికి పిల్లలు చేసే అల్లరే కొండగుర్తులురా తల్లీ' అన్నాడు. ఆ మాటలు ఆ పిల్ల మీద ఎంత ప్రభావం చూపి ఉండాయో మీరే ఊహించుకోండి. పిల్లలకు విద్యాబుద్ధులు, క్రమశిక్షణ నేర్పాల్సిన తీరు అది. ఒకసారి మావో నన్ను 'నే చెప్పినట్లు చదువుకోకుండా మతిమాలిన పని చేశావ్' అని చివాట్లు పెట్టాడు. మావో దగ్గర పని చేసిన సిబ్బందిలో జాంగ్‌బావోజిన్ అనే పెద్దమనిషి ఒక్కడే తడవుగా మావోను కలిసే అవకాశం దక్కించుకున్నాడు. ఎంత పని ఒత్తిడిలో ఉన్నా బావోజిన్ కబురు పంపితే పనులన్నీ పక్కన పడేసి అతన్ని పిలిపించుకుని కబుర్లాడేవాడు. పాత కాలం నాటి కాలేజీ చదువు పూర్తి చేసిన మేధావిగా మావో ఆయన్ని అభివర్ణించేవాడు.

జాంగ్ కాలేజి చదువులకు వెళ్లడానికి ముందు మావో దగ్గర బాడీగార్డుగా పనిచేశాడు. మావో పడుకున్నప్పుడు వంట చెరకు గొడ్డలితో పగలకొడుతూ ఆ శబ్దాలతో నిద్రాభంగం కలిగించినందుకు గాను మావో జాంగ్‌ను నాలుగు గంటల పాటు ఎండలో నిలేసాడు. మొదట్లో ఎందుకోగానీ జాంగ్ అంటే మావోకు అంతగా సరిపడేదికాదు. కానీ కాలేజీ ప్రవేశ పరీక్ష రాసి అందర్లోకి ప్రథముడిగా నిలబడడంతో జాంగ్ అంటే వల్లమాలిన అభిమానం ఏర్పరుచుకున్నాడు మావో. మాతో ఎప్పుడైనా జాంగ్ గురించి ప్రస్తావించవలసి వస్తే అతన్ని గురించి తెలపొగిడేవాడు. "నా దగ్గర బాడీగార్డుగా పనిచేసేవాడు. కాని చదువుకోవాలనే సంకల్పంతో ఎంత గట్టిగా కృషి చేశాడో చూశారా. ప్రవేశ పరీక్షలో ఫస్టొచ్చాడు. ఆ తరువాత చదువులోనూ ఆ స్థాయి నిలబెట్టుకున ల్నిడు. నా దృష్టిలో ఇప్పుడతను చాలా పెద్దవాడయిపోయాడు. అంత గొప్ప చదువులు చదివిన మూలాన ఇప్పుడతను ఏ విషయాన్నయినా ఆ అనుభవంతో నులువుగా ఆకళింపు చేసుకోగలుగుతున్నాడు. హేతుబద్ధమైన పరిష్కారాలు సూచించగలుగుతున్నాడు" అని చెప్పేవాడు. జాంగ్ మాదిరే డాక్టర్ సుటావో అన్నా మావోకు వల్లమాలిన అభిమానం. ప్రముఖ విశ్వవిద్యాలయంలో గ్రాడ్యుయేషన్ పూర్తి చేసిన డాక్టర్ సుటావో మేధా సంపత్తి పట్ల మావో గొప్ప ఆదరణ ప్రదర్శించేవాడు. అనేక విషయాల మీద సుటావోతో చర్చలు చేసేవాడు. ఆయనతో చర్చలు చేసిన నాడు ఏనాడూ మావో స్వరం పెంచి మాట్లాడడంనే చూడలేదు. సుటావోతో మాట్లాడుతూ ఒకసారి మావో – నేను స్కూల్లో చదువుకునే రోజుల్లో సామాన్యశాస్త్రం కన్నా సాంఘిక శాస్త్రం అంటే తెగ ఇష్టపడేవాణ్ని. అప్పట్లో తెలీలేదు కానీ

ఇప్పుడు ఆ లోటేంటో తెలిసి వస్తుంది నాకు అన్నాడు. అప్పుడు సుటావో నా విషయంలో అదే తిరగమరగలయింది. ఆ లోటు పూడ్చుకునే ప్రయత్నంలో ఉన్నా' అని చెప్పాడు. సుటావోతో చర్చకు కూర్చోవడం అంటే మావోకు మహా ఇష్టం. తత్వశాస్త్రం, రాజకీయాలు, చరిత్ర, సాహిత్యం, గనులు, యంత్రాలు, రసాయనశాస్త్రం ఇలా అనేక అంశాల మీద వాళ్లిద్దరి చర్చలు నిడిచేవి. వాడుకలో ఉన్న చైనా పరిభాషలో చెప్పాలంటే 'హై క్లాస్ స్టఫ్' మీద వాళ్ల చర్చలు సాగేవన్నమాట.

అయితే మేధావులను మావో ఎంతగా గౌరవించి అభిమానించేవాడో వాళ్లలో ఎవరన్నా ఏనాడన్నా శ్రామిక – రైతాంగ ప్రజానీకం పట్ల ఏమాత్రం తలపొగరు ప్రదర్శించినా సహించేవాడు కాదు. తీవ్రంగా విమర్శించేవాడు. చరిత్రలో అణగారిన ప్రజానీకం పట్ల కౌరవం లేని మేధస్సు ఎందుకూ కొరగానిదని, శ్రామిక ప్రజల ప్రయోజనాలకు అక్కరకు రాని మేధస్సు నేల విడిచిన సాముగారడీల వంటిదని హెచ్చరించేవాడు. అలాగే మేధావులు ఏనాడన్నా నిరుత్సాహానికి గురైనా, ఆత్మ విశ్వాసం లోపించినట్లు కనబడినా మావో వాళ్లకు గొప్ప స్థైర్యాన్ని ఇచ్చేలా మాట్లాడేవాడు. చైనా పారంపరిక చరిత్రలో నిలిచిన మహానుభావుల గురించి చెప్పి వాళ్లకు గొప్ప విశ్వాసం కల్పించే ప్రయత్నం చేసేవాడు. తన దగ్గర పనిచేసి తరువాతి కాలంలో ఏదన్నా గొప్పగా సాధించిన వాళ్ల గురించి మావో తరచూ మాకు చెబుతుండేవాడు. ప్రత్యేకించి టియాన్‌యున్‌యు, ఫెంగ్ యావోసాంగ్, జాంగ్‌జియాన్‌పెంగ్‌కు, నాకూ చెబుతుండేవాడు. తద్వారా మాలో కూడా అత్యుత్సాహాన్ని రగిలించి చదువులోనో, ఇంకో దాన్లో మమ్మల్ని ప్రయోజకుల్ని చెయ్యాలనే తలంపు, తపనా కనబడేది మావోలో. మావో శ్రమ వృధా పోలేదు. టియాన్‌యున్‌యు, లీలియాన్‌చెంగ్‌లు కాలేజి ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణులయి, సీటు సంపాదించారు. వాళ్లిద్దరికీ తిండికీ, పుస్తకాలకు అయ్యే ఖర్చు మావోనే భరించాడు. అప్పుడప్పుడూ పిలిపించుకుని వాళ్ల కాలేజీ జీవితం, చదువులు ఎంలా ఉన్నాయో ఆరా తీసేవారు. వాళ్లిద్దరూ పట్టభద్రులు అయ్యాక మావో వాళ్లకు విందుకు పిలిచాడు. వాళ్ల కోసం ప్రత్యేకంగా తనే స్వయంగా 'టోస్టు' వడ్డించాడు.

ఝూంగ్‌నాద్హైలీ ఉండగా మావో ఒక విశ్రాంతి స్కూలు ఏర్పాటు చేశాడు. అందులో టీచర్లనూ తనే స్వయంగా ఎంపిక చేశాడు. ఫస్ట్‌బాడీ గార్డు కంపెనీలోను, గార్డులలోనూ కనీస విద్యకు నోచుకోనివాళ్లందరినీ ఆ స్కూలుకు పంపే ఏర్పాట్లు చేశాడు. మొత్తం ఆరు సబ్జెక్టులు సిలబస్‌గా రూపొందించాడు. చైనా భాష, లెక్కలు, రాజకీయ శాస్త్రం, చరిత్ర,

భౌతిక శాస్త్రం, సాంఘిక శాస్త్రం బోధించేవారు. మావో ఇంటికి పశ్చిమ దిక్కున ఉన్న అరు బయటగానీ, ఫస్ట్‌బాడీ గార్డు కంపెనీ కాంపౌండులోగానీ తరగతులు నిర్వహించేవాళ్లు. విద్యార్థులుగా వాళ్లకు కావాల్సిన పాఠ్యపుస్తకాలు, నోటు బుక్కులు ఇతరత్రా సామాగ్రి ఖర్చుందా మావోనే భరించాడు. అలాగే వ్యాయామానికి అవసరమైన 'హారిజాంటల్ బాల్స్' 'డంబెల్స్' వంటివీ కొని పెట్టారు. ఈ ఖర్చంతా తన రచనల మీద వచ్చిన ఆదాయంలోనుంచే ఖర్చు చేశాడు మావో. ఏదన్నా పని మీద ఊరు వెళ్లాల్సి వస్తే ఆ స్కూల్లో స్టూడెంట్సుగా ఉన్న బాడీగార్డులు మావో వెంబడే వెళ్లే డ్యూటీలో ఉంటే వాళ్లు తమతోపాటు పాఠ్యపుస్తకాలు నోట్సులు తీసుకు వెళ్లాల్సిందే. ఒకళ్లిద్దరు టీచర్లనూ తోడు తీసుకు వెళ్లేవారు. ఒక్కసారి మావోనే పాఠాలు చెప్పేవాడు వాళ్ళకి. తరచూ వాళ్ల చదువు ఎలా సాగుతుందో ఆరా తీసేవాడు. ఇక రోజంతా మావోను అంటిపెట్టుకుని ఉండాల్సిన మాలాంటి వాళ్లమి ఇంకా ఎక్కువ సాయమే పొందేవాళ్లం. 1960ల నాటికి మేమంతా సెకండరీ హైస్కూలు గ్రాడ్యుయేషన్ పూర్తి చేశాం. ఇదంతా మావో చలవే. ఝూంగ్‌నాన్హైలో ఏర్పాటు చేసిమన 'విశ్రాంత స్కూలు' అనేది మావోకు మాత్రమే స్థామైంది. ఫెంగ్ యావోసాంగ్ ఆ స్కూల్లో చదివిన రోజుల గురించి జ్ఞాపకం చేసుకున్నప్పుడల్లా స్కూల్లో చేప్పేది ఆరు సెబ్జెక్టులేగానీ మావో మాకు అదనంగా ఇంకో సబ్జెక్టు మా అందరికీ నేర్పించింది మావోనే అని అంటుండేవాడు. సెలవుమీద సొంత ఊళ్లకు వెళ్లే అందరితో మావో ఈ హోంవర్క్ చేయించాడు. గార్డులు రాసి తీసుకొచ్చిన సామాజిక అధ్యయన నివేదికల్లోని తప్పొప్పులను మావోనే స్వయంగా దిద్దేవాడు. అలాంటి ప్రతులు చాలా మటుకు ఇప్పటికీ మిలిటరీ మ్యూజియంలో ఉన్నాయి.

సాంస్కృతిక విప్లవకాలంలో మావో రాసిన పుస్తకాలు తప్ప వేరే బుక్కులేవీ ముట్టకూడదనే ఆంక్షలు వచ్చిపడ్డాయి. సైన్యంలో కూడా అదే పరిస్థితి. చివరికి మార్క్స్, లెనిన్ పుస్తకాలు కూడా చదివే వీలు లేకుండా చేశారు. కానీ మావో ఇలాంటి పరిస్థితిని ఏనాడూ ఆశించలేదు. ఊహించి కూడా ఉండరు. 1950లలో మేం బేయిడైహీలో ఉండేవాళ్లం. పని మధ్యలో అలవాటుగా మావో అలా పచార్లు చేయ్యడానికి వెళ్తుంటే నేనూ తోకలా వెంటపడి వెళ్లాను. ఒక గార్డు ఏదో పుస్తకాన్ని దీక్షగా చదివేస్తున్నాడు. మావో అతని దగ్గరకు వెళ్లి ఏంటిదా పుస్తకం అంటూ అతని చేతిలోంచి తీసుకుని చూశాడు. జియావోసాన్ రాసిన పుస్తకం అది. యువకుడిగా మావో అన్న పుస్తకం. ఈ పుస్తకంలో చాలా మటుకు వాస్తవాలే ఉన్నాయనుకో. చాలా మటుకు మాత్రమే సుమా అన్నాడు మావో ఆ కుర్రాడితో. ఒక నిమిషం ఆగి అయినా నీలాంటి కుర్రాళ్లు చదవాల్సింది ఈ

పుస్తకాలా. మీరంతా రేపటి తరం వాళ్లురా అబ్బీ. రేపటి తరానికి పనికొచ్చే పుస్తకాలు చదవండి. నా మీద వచ్చిన పుస్తకాలు చదువుతూ కూర్చుంటే ప్రజల గురించి ఎలా తెలుసుకుంటారు. ప్రజల గురించి పదిమందీ రాసిన పుస్తకాలు చదవండి. ఈ సమాజాన్ని, ప్రపంచాన్ని ఉద్ధరించే రాతలను ఎక్కడున్నా వెతికి పట్టుకుని చదవండి అని చెప్పాడు. ఇలాంటిదే ఇంకో సంఘటన గురించి బాగా మీకు తెలియాలి. 1960ల ప్రాంతంల అనుకుంటా ఒక రోజు ఝూంగ్‌నాన్హిల ఏదో మీటింగ్‌కు వెళ్లి వస్తున్నాం. పక్క నుండి ఒకతను హడావుడిగా ముందుకు వెళ్తున్నాడు. అతని చంకలో ఒక పుస్తకం చుట్టచుట్టి ఉంది. మావో అతన్ని పిలిచాడు. ఏంటిదా పుస్తకం అనడిగాడు. వైరుధ్యాల గురించి అని పుస్తకం పేరు చెప్పాడు అతను. మావో ఆ పుస్తకం అందుకుని పేజీలు తిరగేస్తూ ఈ పుస్తకం రాసిన నాకే దీని మీద అంత తృప్తి లేదు. ఇంకోసారి తిరగరాయాల్సిన అవసరం ఉందనిపిస్తుంది. నీకేం అనిపించిందబ్బా అనడిగాడు. అతని నోట మాట పలుకు లేకుండా ఉండిపోయాడు. నాకు తత్వశాస్త్రం అంటే మా చెడ్డ ఇష్టం. నా బుర్రకు తోచింది రాశాను. అందులోంచి ఆచరణ వైరుధ్యాలు అన్నవి మాత్రమే ప్రచురించారు. నామటుకు నాకే వీటిని ఇంకా మెరుగ్గా రాసి ఉండొచ్చు అనిపిస్తుంది. అందుకే చెప్పా - నేను రాసిన పుస్తకాలు ఉన్నాయి. అవి చదవండి. వాటిల్లో మార్క్స్, లెనిన్ రాసిన పుస్తకాలు ప్రత్యేకం చదవండి అన్నాడు మావో.

కానీ సాంస్కృతిక విప్లవకాలంలో మావో ఆలోచనలకు భిన్నమైన పరిణామాలు చోటు చేసుకున్నాయి. అది వేరే సంగతి అనుకోండి. మావోతో ఏ మాత్రం పరిచయం ఉన్నవాళ్లయినా 'మావో నిరంతర అధ్యయనశీలి అన్న వాస్తవాన్ని విస్మరించలేరు. ఆఖరుకి శత్రువులు కూడా చైనా జాతి ప్రయోజనాలకు, జాతిజనుల గౌరవానికి మావోను ప్రతీకగా అంగీకరిస్తారు. అలాంటి సమున్నత వ్యక్తి 'జ్ఞాన సముపార్జన' మీద ఆంక్షలు ఉండాలని ఆశిస్తాడంటే నమ్మశక్యమైన విషయమైనా? తాము శ్రామికవర్గం నుంచి, రైతాంగ వర్గం నుంచి వచ్చామని గొప్పగా చెప్పుకునేవాళ్లలో కొందరు 'మేధావుల' పుట్ల తూష్ణీ భావం ప్రదర్శించిన సందర్భాలు ఉన్నాయి. కానీ మావో సమాజంలో మేధావుల పాత్ర పట్ల నిర్దిష్ట అభిప్రాయాలతో ఉండేవాడు. వారికి తగిన మర్యాదా మన్ననా ఇచ్చేవాడు. అలాగే విద్యాబుద్ధులు లేని వాళ్లు ముందబుద్ధులతో సమానం అని భావించేవాడు. అందరికీ విద్య రావాలని ఆకాక్షించేవారు. అనేక అవకాశాలు కల్పించాడు. చైనా ప్రజానీకం మొత్తం శాస్త్ర సాంకేతిక రంగాలలో అధ్యయనం సాగించి అద్భుత అభివృద్ధి సాధించాలని మావో కలలుకన్నాడు.

# 18. బాహ్య ప్రపంచంతో సంబంధాలు మావో ఆలోచనలు

**1949** మే 2వ తారీఖున మావో 'ఫ్రాగ్రాంట్ హిల్స్'లో ఉన్న తన అధికార నివాసం నుండి సమ్మర్ ప్యాలెస్‌లో ఉన్న లియుయాజిని కలవడానికి బయల్దేరాడు. సమ్మర్ ప్యాలెస్ తూర్పు ముఖద్వారం నుండి మావో కారు లోపలికి ప్రవేశించింది. ఆ పాటికే లియు అక్కడ ఎదురు చూస్తూ ఉన్నాడు.

మావో కారు దిగగానే ముందు లియు షేక్‌హ్యాండిచ్చి, ఆ తరువాత ఆ చేతిని కోణంగా గాల్లోకి లేపి కమ్యూనిస్టు పార్టీ వర్ధిల్లాలి. ఛైర్మన్ మావో వర్ధిల్లాలి. ప్రజావిముక్తి సైన్యం వర్ధిల్లాలి అని నివదించాడు. మావో అసౌకర్యంగా మొహం పెట్టాడు. పాత స్నేహితులం. మన మధ్యన ఈ స్తోత్రాలు అవసరమా. ఇలాంటివి మన మధ్యన దూరాలు పెంచవూ అని లియును అడిగాడు. అసలు నాకు తెలీక అడుగుతా నా గొప్ప ఏముందయ్యా ఇందులో. ఏం చేసినా ప్రజలదేనయ్యా ఆ గొప్పదనం. నువ్వూ, నేనూ ఆ ప్రజలలో ఒక భాగమే అన్నాడు మావో. ఒకప్పటి ఇంపీరియల్ గార్డెన్ అది. రాతి స్థంభాల మీద ఉన్న చెక్కడాలను పరకాయిస్తూ నడుస్తూ మాట్లాడుకుంటున్నారు వాళ్ళిద్దరూ. లియు హుటి ముఖ్యులతో మావో ఏదన్నా మాట్లాడడం మొదలు పెడితే వాళ్ల మధ్యన ఛాంగ్ - కై - షేక్ ప్రస్థావన రాకమానదు. జాతి వంచకుడు. నయవంచకుడు దుష్ట రాజకీయవేత్త అన్న పదాలు దొర్లాయంటే అవి ఛాంగ్-కై-షేక్‌ను ఉద్దేశించినవే. లియు చుట్టూతా కలియచూస్తూ పాత జ్ఞాపకాల్లోకి వెళ్లిపోయాడు. ప్రకృతి వైపరీత్యాలు పుట్టి, మన దేశం పుట్టినట్టుంది. చరిత్రను తిరగేసినా మనకు అదే సత్యం కనబడుతుంది. క్వింగ్ వంశస్థుల రాచరిక పాలనలో డొవేగర్ అనే మహారాణి కొంత కాలం మన గద్దను పరిపాలించింది. బుర్ర తక్కువ మహారాణి. సార్వభౌమ పరిపాలన అంటే బయటి ప్రపంచంతో చైనాకు ఉండే సంబంధాలన్నింటిని తెంపేస్తుంది. గూడులో గుడ్డు పెట్టినట్లు పరిపాలించడం అనుకుంది. సామ్రాజ్యవాదశక్తులు ఊరుకుంటాయా? గన్‌బోట్లతో దండెత్తాయి. దాంతో మన మహారాణిగారు అదురుకుని అసమ ఒప్పందాలు, చైనా మీద బ్రిటన్ దండెత్తి చేసిన నల్లమందు యుద్ధంలో ఓటమి పాలైన క్వింగ్ రాచరిక ప్రభుత్వం 842లో నాన్జింగ్‌లో సినో-బ్రిటన్ ఒప్పందం మీద సంతకాలు

చేసింది. 844లో అమెరికా, ఫ్రెంచి ప్రభుత్వాలు దండెత్తి రావడంతో క్వింగ్ ప్రభుత్వం వాంగ్జియా దగ్గర సినో - అమెరికన్ ఒప్పందం, హుయాంగ్ పూ దగ్గర 'సినో-ఫ్రెంచి' ఒప్పందాల మీద సంతకాలు ఒత్తింది. ఆ తరువాత కూడా క్వింగ్ రాజరిక ప్రభుత్వం అనేక అసమ ఒప్పందాల మీద సంతకాలు చేసింది. 858లో టియాన్జిన్ దగ్గర రష్యా, అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్‌లతో ఒప్పందాలు చేసుకుంది. 1860లో బీజింగ్‌లో 'సినో-రష్యా' ఒప్పందం మీద, 895లో 'షియోనెస్కీ' ఒప్పందం ఇలా గొలుసుకట్టు అసమ ఒప్పందాలను చైనా మీద రుద్దింది.

## పాద సూచిక

అనేకం మీద మహారాణి ముద్రలు గుద్ది వాళ్ల చేతుల్లో పెట్టింది. అది మొదలు ఆ దేశ ప్రజానీకం అంతులేని పీడనకు, దోపిడీకి గురవుతూనే వచ్చారు. ఈ గన్‌బోట్ సంధి సందర్భంగా సామ్రాజ్యవాద శక్తులు ఆవిడకు ముట్టచెప్పిన సొమ్ముతోనే ఇదిగో ఈ 'ఇంపీరియల్ గార్డెన్' కట్టించింది. ఆవిడ మాత్రం బతికినంత కాలం రాజభోగాలు అనుభవించి ప్రజలు తమ రక్తమాంసాలు ఓడి దేశ సంపదను సామ్రాజ్యవాద శక్తులకు కప్పంగా చెల్లించారు. ఎంతటి నయవంచకురాలో కదా ఆవిడ. తలుచుకుంటేనే జన్మ జన్మాల శని చుట్టుకున్నట్లు అనిపిస్తుంది" అన్నాడు. 'నిజమే ఆ పచ్చి అవినీతికర ఫ్యూడల్ ప్రభుత్వానిదే బాధ్యతంతా. ఆవిడ దగ్గర నావికాదళం లేదన్నమాటే గానీ ఉంటే దాన్ని కూడా సామ్రాజ్యవాద శక్తులకు పాదాక్రాంతం చేసి ఉండేదేమో అన్నాడు మావో లియుతో శృతి కలుపుతూ. అక్కడ ఉన్న రాతి కట్టడాల మీద చెక్కుళ్లను పరికిస్తూ సామ్రాజ్యవాద శక్తులు దోచుకు పోలేని ఇలాంటి కట్టడాలను మిగిల్చినందుకు ఒకింత సంతోషించాలేమో. అప్పనంగా వచ్చిన సొమ్మును రాచరిక ప్రభుత్వాలు ఎంత వృథాగా ఖర్చు చేసేవో గమనిస్తే ఈవిడ ఈ కాస్త మంచి పనైనా చేసిందని సరిపెట్టుకోవాలి. ఇంత అత్యద్భుత కట్టడం ఇవాళ ప్రజలకు ఉల్లాస, విహార కేంద్రంగా అయినా పనికొచ్చింది అన్నాడు పరాచికంగా.

ఆ తర్వాత వాళ్ల మధ్య చర్చ నల్లమందు యుద్ధం మీదకి మళ్లింది. అప్పటి నుండి దేశ స్వాతంత్ర్యం కోసం, సామాజిక వికాసం కోసం పోరాడి వీరోచితంగా మరణించిన త్యాగమూర్తుల గురించి మాట్లాడుతున్నారు. చివర్లో లీయు మావోకేసి బొటనవేలు (థమ్స్ అప్) చూయిస్తూ ఏది ఏమైనా చరిత్ర ఒక సత్యాన్ని రుజువు చేసింది. కమ్యూనిస్టు పార్టీ, ఆ పార్టీకి నాయకుడైన మీరు మమ్మల్ని విజయ పథంలో నడిపించగలరనే విశ్వాసాన్ని కలిగించింది అన్నాడు. మనం మన ప్రాచీన స్వాతంత్ర్య సమరయోధుల వారసత్వాన్ని

ముందుకు తీసుకెళ్తున్నాం. మన అనుభవాలు, శక్తి సంపదలు ఆ అమరులు చిందించిన నులివెచ్చటి నెత్తురు నుంచే గడించాం కామ్రేడ్ అన్నాడు మావో. ఒక్క నిమిషం ఆగి గట్టిగా నిట్టూర్చి పైకప్పుకేసి చూసి తిరిగి మెల్లిగా నడక సాగిస్తూ మన కామ్రేడ్స్ ఫ్రాన్స్, జర్మనీ, జపాన్, సోవియట్ యూనియన్‌లకు వాళ్ల సాయం ఆశిస్తూ వెళ్లారు. చివరకు నికరంగా ఒక విషయం తేలిపోయింది. ఈ పోరాటంలో విజయమో వీరస్వర్గమో తేల్చుకోవాల్సింది మనమే అని, ఆ బాధ్యత మన భుజస్కంధాల మీద మాత్రమే ఆధారపడి ఉందని. మనం బయట నుండి సాయం పొందే ప్రయత్నాలు కొనసాగిద్దాం. కాని ఆ సాయం మీదే పూర్తిగా ఆధారపడకూడదు. అలాగే ఛాంగ్‌కైషేక్ చేసినట్లు సామ్రాజ్యవాద శక్తులతో షరీకు అవకూడదు. దేశంలోని యుద్ధ ప్రభువులకు సామ్రాజ్యవాద శక్తుల దన్ను ఉంది. ఈ దేశాన్ని, దేశ సంపదను తాకట్టు పెట్టి తెగబలిసి ఉన్నారు వాళ్లు. ఇందాక మనం చెప్పుకున్న డోవెగర్ మహారాణికి వీళ్లకు తేడా లేదు నా దృష్టిలో, వీళ్లంతా ఆ తానులో ముక్కలే. వాళ్లకు దేశ ప్రయోజనాలుగానీ, ప్రజా సంక్షేమంగానీ పట్టవు. పామర జనాన్ని నరకంలోకి వెట్టి మరీ వాళ్ల కోసం భూతలస్వర్గాలు నిర్మించుకుంటారు. అయితే ఇలాంటి వాళ్ల ఆటలు ఎన్నాళ్లో సాగవు. చివరకు ప్రజలే వీళ్లను కూలదోస్తారు" అన్నాడు. వాళ్లలా నడుచుకుంటూ డోవెగర్ మహారాణి ముచ్చటపడి కొనుక్కున్న 'స్టీమ్ బోట్' దగ్గరకు చేరుకున్నారు. సిగలో పువ్వు మాదిరి ఆ మహాతల్లి ముచ్చటపడి కొనుక్కున్న స్టీమ్ బోట్ ఇది అన్నాడు లీయు.

'సంధి ఒప్పందాలు కుదుర్చుకున్నందుకుగాను ఆవిడకు ముట్టిన సొమ్ముకన్నా ఇలా ఖర్చు చేసింది ఎక్కువ అన్నాడు మావో ఆ స్టీమ్ బోట్‌కేసి చూయిస్తూ. "ఒక దేశం స్వావలంబన సాధించడానికికోసం, విస్తృత ప్రజానీకం అవసరాల కోసం కాకుండా చేసే ఖర్చు ఏదైనా సరే నా దృష్టిలో దండగమారి ఖర్చే. మన పెద్దవాళ్లు చెప్పనే చెప్పారు కదా 'దేహీ' అంటూ దేబిరించి తెచ్చుకున్నది అమృతమైనా సరే విషంతో సమానమే" అన్నాడు. సమ్మర్ ప్యాలెస్‌లో లీయుతో అలాంటి విషయాలు అనేకం చర్చించి వచ్చిన మరుసటి రోజు నుండి మావో తలమునకలయ్యే పనిలో మునిగిపోయాడు. ఒక పక్క ప్రజా సంఘాల ప్రతినిధులతో చర్చలు, మారో పక్క పురప్రముఖులు, ప్రజాస్వామిక పార్టీల నాయకులతో చర్చలతో బిజీ అయిపోయాడు. రాజకీయ సంప్రదింపుల సదస్సును నిర్వహించేందుకు జరుగుతున్న సన్నాహాలనూ పర్యవేక్షిస్తున్నాడు. రాత్రింబవళ్లూ అదే పని. జూన్ 15న జరిగిన సన్నాహక కమిటీ సదస్సులో మావో ప్రసంగించాడు. అప్పుడే స్పష్టంగా ఇలా ప్రకటించాడు – "పరస్పర గౌరవం, సహకారం, సమానత్వ ప్రాతిపదికగా చైనాతో దౌత్యసంబంధాలు నెలకొల్పదలచిన

ఏ విదేశీ ప్రభుత్వంతో అయినా మేం చర్చలకు సిద్ధంగా ఉన్నాం. ఉమ్మడి భౌగోళిక హద్దులను, సార్వభౌమత్వాన్ని గౌరవించే మరీ ముఖ్యంగా చైనాలోని ప్రతీఘాత శక్తులతో సంబంధాలు తెగతెంచుకున్న ఏ ప్రభుత్వాన్ని అయినా మేం చర్చలకు ఆహ్వానిస్తున్నాం. జన చైనా ప్రజానీకంతో స్నేహ, సౌహార్ద్ర సంబంధాలు జరపాలని ఆశించే ఏ విదేశీ ప్రభుత్వాన్ని అయినా మేం హృదయ పూర్వకంగా ఆహ్వానిస్తున్నాం. అంతర్జాతీయ వాణిజ్యం ద్వారా సమీకృత అభివృద్ధి, ఉత్పత్తి పెంపుదల సాధించడానికి ఈ ప్రపంచంలోని సకల దేశాల ప్రజానీకంతో సహకరించడానికి చైనా ప్రజ సిద్ధంగా ఉంది".

నవచైనా ఆవిర్భావ దినోత్సవం నాడు కూడా చైనా ప్రజానీకం అపారమైన శక్తి యుక్తుల మీద అత్యంత విశ్వాసంత మావో ఇలాంటి ప్రకటనే చేశారు. చైనా కేంద్ర ప్రజా ప్రభుత్వం చైనా ప్రజానీకం యొక్క అధికారిక ప్రతినిధిత్వ ప్రభుత్వం, ఈ ప్రభుత్వం పరస్పర సహకారం, సమానత్వం, గౌరవం ఇచ్చిపుచ్చుకునే ప్రతిపాదికన ఏ విదేశీ ప్రభుత్వంతో అయినా దౌత్య సంబంధాలు నెలకొల్పడానికి సిద్ధంగా ఉందని స్పష్టం చేశాడు. కానీ ఏం జరిగింది? చైనా ప్రజానీకం సోషలిజం నీడన జీవించడం చూసి సామ్రాజ్యవాద దేశాలకు కన్నుకుట్టింది. సమానత్వం, పరస్పర సహకారం అనే మాటలను తృణీకరించాయి. జన చైనా భౌగోళిక పరిహద్దులను, సార్వభౌమ హక్కును గుర్తించ నిరాకరించాయి. ఆర్థిక దిగ్బంధనం ద్వారా జన చైనాను ఎండగడతామని బహిరంగంగానే ప్రకటించాయి. చివరకు సోవియట్ కూడా జన చైనా ప్రభుత్వ అనుగడ పట్ల సందేహాలు వెలిబుచ్చింది. ప్రజా విముక్తి సైన్యం యాంగ్జీనదిని దాటి అవతలి తట్టు ప్రాంతాన్ని విముక్తం చేసే ప్రయత్నాలను మానుకోవాలని చెప్పింది. నాన్జింగ్‌ను విముక్తం చేసే కొద్ది రోజులకు ముందే రష్యా రాయబార కార్యాలయాన్ని, పరాయనం చిత్తగించిన కొమింటాంగ్ ప్రభుత్వంతో పాటే గుయచాంగ్ ఝూవోకు తరలించింది.

# 19. స్థూలంగా అదీ చరిత్ర

నవచైనా ఆవిర్భావం తరువాత దేశ భవిష్యత్తును తీర్చిదిద్దే ప్రణాళికా రచనలో, కార్యరంగంలో మావో తలమునకలై పోయాడు కొన్నేళ్లపాటు. కానీ మధ్యలో వెసులుబాటు చేసుకుని సోవియట్ సోషలిస్టు రష్యాను సందర్శించి వచ్చారు. ఏమి ఆశించి సోవియట్‌కు ప్రయాణం కట్టాడు? ఆర్థిక సాయం కోసం. చిక్కులతో కూడిన వ్యవహారమే అన్నాడు ముందే. ప్రయాణానికి కావాల్సిన లగేజి సర్దుతూ ఎన్ని రోజులు ఉండొచ్చు అనడిగాను. చేతివేళ్లు మూడు మడిచి చూయించాడు. అంతకన్నా ఎక్కువ రోజులు ఉండొచ్చుకూడా. బహుశా కొన్ని వారాలు కూడా... నెల రోజులు పట్టినా పట్టొచ్చు అన్నాడు. మొత్తానికి మావో సోవియట్‌లో పది వారాలపాటు గడపాల్సి వచ్చింది. చైనా ప్రజానీకం ప్రయోజనాలను, దేశం ఆర్థిక వ్యవస్థ పుర్నిర్మాణ అవసరాలను దృష్టిలో పెట్టుకుని మావో తన అంచనాలకు తగ్గి ఒక మేరకు రాజీపడి ఒప్పందాలు చేసుకున్నాడు రష్యాతో. అందుకు బదులుగా సోవియట్ రష్యా చైనాకు ఐదేళ్ల పాటు ఏటా 60 మిలియన్ డాలర్ల రుణం ఇవ్వడానికి అంగీకరించింది. 60 మిలియన్ డాలర్లు? అప్పట్లో సోవియట్ రష్యా నుండి ఆర్థిక సాయం పొందుతున్న ఏ తూర్పు యూరప్ దేశం కన్నా అతి తక్కువ మొత్తం. ఆ దేశాల్లో ఏదీ కూడా జనాభాలో కానీ విస్తీర్ణంలోకానీ చైనాలోని ఒక ప్రావిన్సు (జిల్లాకు) మించిన పెద్ద దేశం కాదు. కానీ కేవలం 60 మిలియన్ డాలర్ల రష్యా రుణానికి మావో అంగీకరించాడు. ఎందుకంటే 'దీర్ఘకాలికమైన, సమగ్రమైన దృష్టితో అత్యున్నత విలువల కల్పన కోసం స్వార్థ రహితంగా అందించిన సాయం అది అన్నాడు మావో. స్టాలిన్ మరణించాడు అన్న వార్త తెలియగానే మావో చలించిపోయాడు. 'ఇన్‌సోమ్నియాకు గురయ్యాడు. ఉదాత్తమైన స్నేహం' పేరిట రాసిన నివాళి వ్యాసంలో చైనాలో ప్రజా విప్లవానికి, సోషలిజం నిర్మాణానికి స్టాలిన్ అందించిన సహాయ సహకారాలకు హృదయ పూర్వక ధన్యవాదాలు అర్పించాడు. ఏ విదేశీ ప్రభుత్వంతో అయినా సరే సమానత్వం, పరస్పర ప్రయోజనం, పరస్పర గౌరవం ప్రాతిపదికన ముందుకొస్తే దౌత్య సంబంధాలు నెలకొల్పుకోవడానికి సిద్ధం అని మావో ప్రకటించింది అమెరికాకు వర్తిస్తుంది. కొరియా యుద్ధం మొదలైన రెండు రోజులకే అమెరికా అధ్యక్షుడు ట్రూమన్ 'తైవాన్'ను తటస్థీకరించాలని ఆర్డరు వేశాడు. ప్రజావిముక్తి సైన్యం తైవాన్ ద్వీపాన్ని విముక్తం చెయ్యకుండా నిలవరించడానికే ట్రూమన్ అలాంటి వైఖరి తీసుకున్నాడు. చైనా అంతర్గత వ్యవహారాల్లో అమెరికా ఇంత తలబిరుసు తనంగా జోక్యం

చేసుకోవడానికి ప్రయత్నించడంతో మావో అగ్గిమీద గుగ్గిలం అయిపోయాడు.

1950 జూన్, జులై, ఆగస్టు మాసాల్లో మావో ఎంతో ఉద్వేగంతో, కోపంతో, అసహనంతో, ఏదో చెప్పలేని ఆదుర్దాతో ఎంతగానో నలిగిపోయాడు. చైనాలో లోతట్టు ప్రాంతాలను విముక్తం చెయ్యడం తక్షణ ప్రాధాన్యతగా మావో పరిగణించాడు. టిబెట్, ఛాంగ్‌కైషేక్ పారిపోయి మకాం వేసిన తైవాన్‌నుల విముక్తే ఆ ప్రాధాన్యత. అలాగే భూ సంస్కరణలను అమలు చేయ్యడం, ద్రవ్యోల్బణాన్ని అరికట్టడం, ఆర్థిక వ్యవస్థకు పునరుత్తేజం కల్పించడం, అభివృద్ధికి బాటలు వేయడం ఏక కాలంలో బహుముఖ సవాళ్ళను పరిష్కరించాల్సిన పరీక్ష సమయం అది. ఇలాంటి పరిస్థితుల్లో కొరియా యుద్ధంలోకి దిగాలన్న ఊహే అయినా మావో మదిలో లేదని ఆయనతో నాకు ఉన్న సాన్నిహిత్యం బట్టి చెప్పగలను. ఇంట చక్కబెట్టాల్సిన పనుల్లో తలమునకలుగా ఉన్న రచ్చగెలవాలనే తలంపుతో మాత్రం లేదు అని ఖచ్చితంగా చెప్పగలను. అయితే అమెరికన్లు ఇన్‌చోన్ మీద దృష్టి పెట్టాడు. అక్కడ నుండి మావో ఎన్నో నిద్రలేని రాత్రులు గడిపాడు. దాదాపు ప్రతి రెండు గంటలకు సిగరెట్ యాష్ ట్రేను ఖాళీ చేయాల్సి వచ్చేది. అంత ఇదిగా సిగరెట్లు ఊది పారేసేవాడు మావో. కొరియాకు సైన్యం పంపించాలనే నిర్ణయం తీసుకున్న రోజున అలవాటుగా తెల్లారగట్టపడుకునే మావో నిద్ర మాత్రలు వేసుకున్నా కూడా ఆ రోజు పడుకోలేకపోయాడు. స్థిమితం లేని మనిషిలో మధ్యలోనే లేచి కూర్చున్నాడు. 'ఇంతకు మించి మార్గాంతరం లేకుండా పోయింది మనకు. ఏం జరిగినా సరే మన సైన్యాన్ని అక్కడకు పంపక తప్పేట్లు లేదు. ఏం జరుగుతుందో చూద్దాం ఈ యుద్ధంలో' అని ఎవరికో చెబుతున్నట్లు పైకి వినబడేలా గొణుక్కున్నాడు. మావో నివాసంలో తూర్పు వైపు గదిలో ఆ రాత్రి తెల్లార్లూ మీటింగు నడుస్తానే ఉంది. గది అంతా సిగరెట్ పొగతో నిండిపోయింది. చైనా సైన్యం కొరియా మీదకు దండెత్తిన కొన్ని రోజులపాటు మావో నిద్రలేని రాత్రులు గడిపాడు. 1949-50 ప్రాంతంలో మావోను తరచూ రాజకీయ, ఆర్థిక విభాగాలకు చెందిన ఉన్నతాధికారులే ఎక్కువగా కలుస్తుండేవారు. 1950 చివరి పాదంలో మాత్రం మిలిటరీ అధికారులతో విస్తృతమైన సమావేశాలు నడిచాయి. సైనిక బలగాల ప్రధానాధికారి జనరల్ నీయోగోంగ్జిన్ కొరియా యుద్ధం పరిసమాప్తం అయ్యేవరకూ మావోను ఎక్కువగా కలిసిన వ్యక్తిగా గుర్తు నాకు.

1953లో కొరియాతో నిర్యుద్ధ ఒప్పందం జరిగిన రోజున మావో తన గదిలోంచి బయటకు వచ్చి బీజింగ్ ఒపేరా గీతాన్ని ఒకటి ఎత్తుకున్నాడు. నిర్యుద్ధ సంధి మీద సంతకాలు

జరిగిన ఆ క్షణాలను ఎంతో ఆనందంగా గడిపాడు. ఆ సంతోషంలో మేమూ పాలుపంచుకున్నాం. ఆ ఏడాది నుండే ప్రతి ఏటా మావో సముద్ర తీరానికి షికారుకు వెళ్లడం మొదలైంది. పోటు మీద ఉన్న సముద్రాన్ని చూడడం కోసమే అక్కడ విడిది చేసేవాడు. సముద్రపు అలలు తాకుతూ సమానంగా మావో ఛాతీ ఎగిసి పడుతూ ఉండేది పోటు మీద ఉన్న సముద్రాన్ని చూసినప్పుడల్లా. మావో కళ్లు మెరిసిపోతా ఉండేవి. సముద్రము, ఆకాశమూ కలిసిపోయినట్లు కనిపించే దిగంతం చేసి ఆరాధనాపూర్వకంగా చూసేవాడు. ఒక రోజున అలా సముద్రాన్ని పరికిస్తూ పక్కన ఉన్న బాడీగార్డు ఝూంగ్ ముక్విని అలలు అలా ఎగసిపడడానికి కారణం ఏమిటో తెల్సా అనడిగాడు. చంద్రుడి ఆకర్షణ మూలంగా అని బదులిచ్చాడు అతను. గురుత్వాకర్షణ మూలంగా, చంద్రుడి గురత్వాకర్షణ మూలంగా అని కదా చెప్పాలి సరే ఇంకో ప్రశ్న శీతల ప్రవాహము, ఉష్ణ ప్రవాహాలు అంటే ఏంటో చెప్పగలవా అని అడిగేడు మావో. ఉష్ణ ప్రవాహాల గురించి నాకు అట్టే తెలీదుగానీ, శీతల ప్రవాహాలు మాత్రం సైబీరియా మీద నుండి వచ్చే చల్లని గాలుల మూలంగా ఏర్పడతాయనుకుంటా అని బదులిచ్చాడు ఝూంగ్‌ముక్వి. మావో నవ్వి అవి దక్షిణాదికి వీచే శీతల పవనాలు, నేను అడిగేది సముద్రంలోని శీతల-ఉష్ణ ప్రవాహాల గురించి తెలుసా అనడిగాడు. తెలీదు కామ్రేడ్ అని బదులిచ్చాడు ముక్వి. సముద్రంలో రెండు ప్రదాన ఉష్ణ ప్రవాహాలు ఉన్నాయి ఒకటి గల్ఫ్ ఆఫ్ మెక్సికో నుండి ప్రవహిస్తుంది అని ఒక నిమిషం ఆగాడు మావో. సముద్రం దిక్కుకేసి చూపాడు. దిగంతం కేసి చూయిస్తూ "తైవాన్" మనం విముక్తం చేయ్యాల్సిన ద్వీపం' అని చెప్పాడు.

1954లో భారత్-చైనాల మధ్య ఒప్పందం జరిగింది. శాంతియుత సహజీవనం కోసం ఆరోజు చేసుకున్న ఒప్పందం పేపే పంచశీల. నా అంచనాలో ఈ పంచశీల ఒప్పందం ప్రధానంగా మావో బుర్రకు తట్టిన ఆలోచనే. ఇంతకుముందే నే ప్రస్తావించినట్లు 1949లో జరిగిన తొలి రాజకీయ సన్నాహక సదస్సులో ఏ అంశాల ప్రాతిపదికన చైనా ప్రపంచ దేశాలతో దౌత్య సంబంధాలు నెలకొల్పుకోవడానికి సిద్ధంగా ఉందని ప్రకటించాడో ఆ భావపరంపరనే పంచశీల ఒప్పందంలో రెండు సూత్రాలలో పొందుపరిచారు. ఇండోనేషియా అధ్యక్షుడు సుకర్నోకు వీడుకోలు చెప్పి ఎయిర్ పోర్ట్ నుండి తిరిగి వస్తూ దార్లో ఒక రెస్టారెంటులో మటన్ బన్ను రొట్టె తినడానికి మావో ఆగినప్పటి వైనం గురించి ఇంతకు ముందుగా ప్రస్తావించాను. ఆ తరువాత అక్కడ నుండి సోవియట్ ఎగ్జిబిషన్ సెంటర్‌కు వెళ్లాం. అక్కడ జపాన్ పారిశ్రామిక ఎగ్జిబిషన్ స్టాల్‌ను సందర్శించాడు. చాలా ఆసక్తిగా స్టాల్ అంతగా తిరిగాడు. నిర్వాహకులు మావోను చూసి ఉబ్బితబ్బియిపోయారు.

ఆయన గౌరవార్థంగా ఒక ట్రాన్సిస్టరు రేడియో బహుమానంగా ఇచ్చారు. అప్పటికి మా దేశంలో రేడియోల ఉత్పత్తిలేదు. మాటల్లో నిర్వాహకులతో మనే రెండు దేశాల మధ్యన సంబంధాలు మెరుగుపడాలని ఆశిస్తున్నా. ఇప్పటికీ మన రెండు దేశాల మధ్యన దౌత్యసంబంధాలు లేవు. అయినా మన రెండు దేశాల ప్రజల మధ్యన సంబంధాలు మెరుగుపడడానికి ఇలాంటి ప్రదర్శనలు దోహదం చేస్తాయి. వాణిజ్యం ద్వారా మన రెండు దేశాల మధ్యన ఆర్థిక బంధం బలపడాలని నే మనసారా కోరుకుంటున్నా. బాహ్య ప్రపంచంలోని అన్ని దేశాలతోనూ చైనా అలాంటి సంబంధాలనే ఆశిస్తుంది. అవతలి వాళ్ల మనస్సుల్లో ఏమన్నా కుట్ర ఉంటే తప్ప రెండు దేశాల మధ్యన, ప్రజల మధ్యన సత్సంబంధాలు ఏర్పడడం అంత కష్టమైన విషయం కాదు అన్నాడు మావో. 1970ల నాటికి అనేక నాటకీయ మార్పులు చోటు చేసుకున్నాయి. అంతకు ముందు మావో చైనాతో ఏ దేశమైనా దౌత్యసంబంధాల ఏర్పాటుకు ముందుకొస్తే ముందు మౌలిక సూత్రాల పరిష్కారం కోసం గట్టిగా పట్టుపట్టేవాడు. కానీ ఆ పరిస్థితుల్లో మార్పు వచ్చింది. ఈ మార్పులను గమనంలో ఉంచుకునే మావో సరికొత్త దౌత్యనీతికి శ్రీకారం చుట్టాడు. అదే పింగ్ – పాంగ్ దౌత్యనీతిగా ప్రసిద్ధిగాంచింది. ఘర్షణ పూరిత వాతావరణంలో కూడా చర్చలకు మార్గం సుగమం చేసుకోవాలని మావో ముందస్తుగానే అర్థం చేసుకున్నాడు. దాదాపు ఇరవై ఏళ్ల పాటు చైనా-అమెరికా దేశాల మధ్యన నెలకొన్న ప్రచ్ఛన్న ఘర్షణపూరిత వాతావరణాన్ని బద్దలు కొడుతూ 1972లో మావో-రిచర్డ్ నిక్సన్‌ల మధ్య చర్చలు జరిగాయి. ఈ ఇద్దరు అగ్రనేతల్లో ఒకరేమో శ్రామికవర్గ విప్లవ సారథి, మార్క్సిస్టు మహోపాధ్యాయుడు కాగా ఇంకొకరేమో ప్రపంచంలోనే అతి శక్తివంతమైన పెట్టుబడిదారీ దేశాధ్యక్షుడు, బూర్జువాల అగ్రప్రతినిధి. భిన్నధృవాలకు ప్రతినిధులుగా నిలిచిన వీరిద్దరి మధ్యన జరిగిన చర్చలు సరికొత్త అంకానికి తెరలేపాయి. సభ్య ప్రపంచ దేశాలతో దౌత్యసంబంధాలు నెలకొల్పుకుంటున్న చైనా చరిత్రలో ఇదొక ప్రధాన ఘట్టం.

# ౨౦. నెరవేరని 'కల'

'ఇచువాన్'ను జయించాక ఒక రోజు చౌఎన్‌లై రెడార్మీ ఆఫీసర్లు అందరినీ సమావేశపరిచాడు. 'కామ్రేడ్స్ మన సెంట్రల్ కమిటీ, మన ఛైర్మన్ మావోలు మన తదుపరి కర్తవ్యాన్ని నిర్దేశించారు. మనం ఇప్పుడు ఉత్తర చైనా దిశగా మన జైత్రయాత్రను కొనసాగించబోతున్నాం. పచ్చనది అవతలివైపు భూ భాగం విముక్తే మన తదుపరి లక్ష్యం' అని ప్రకటించాడు. మేం సంతోషంతో కేరింతలు కొట్టాం ఆ మాటలు విని. హుజాంగ్‌నాన్ బలగాలను తుదముట్టించాక విముక్తి యుద్ధం కీలకమైన మలుపు తిరిగిందని మేం అర్థం చేసుకున్నాం. 1948 మార్చి 23న మేం ఛువాన్‌కోవు చేరుకున్నాం. అక్కడే మేం పచ్చనదిని దాటాలి. ఎర్రసైన్యానికి వీడ్కోలు పలకడానికి వచ్చిన జనాలతో కొండగుట్టలు చెట్టు చేమల సహా ఆ ప్రాంతమంతా కిటకిటలాడిపోయింది. నదిలో అప్పటికే పది పన్నెండు పెద్ద పడవలు సిద్ధంగా ఉన్నాయి. బలమైన కుర్రాళ్లు పడవలు నడిపేదానికి నియమించబడ్డారు. మావో మొదటి పడవ ఎక్కాడు. చౌ-ఎన్‌లై, రెన్‌బిషిలు రెండవ పడవ ఎక్కారు, మూడవ పడవలో లుడింగ్యీ హుక్వియామూ ఎక్కారు. మా పడవ నదీ తీరాన్ని వదిలింది. మేమందరం మావో చుట్టూతా నిలబడ్డాం. మావో చేతులూపుతూ ఒడ్డునున్న జనానికి వీడ్కోలు చెబుతున్నారు. ఆయన్ని కూచోమని అడిగాం. మా మాట వింటేగా ఆయన. ఇంకాసేపటికే పడవ అటూ ఇటూ ఊగుల్లాడసాగింది. ఇంకాస్త ముందుకు పోయే సరికి నదికెరటాలు మా పడవ పక్క భాగానికి తగిలి తపాతపామని శబ్దాలు వస్తున్నాయి. ఇక లాభం లేదని నేను మావో రెండు భుజాల మీద చేతులులేసి 'కూర్చోండి కామ్రేడ్ ఛైర్మన్' అంటూ కూర్చోబెట్టే ప్రయత్నం చేశాను. మావో నా చేతులు తోసేశాడు. కోతుల మూక మాదిరి అల్లరి అల్లరిగా ఎగసిపడుతున్న నదీకెరటాల వంక చూశాడోమాటు. దూరమవుతున్న తీరం క్రమంగా మసకబారుతున్న తీరం వెంబడి జనంకేసి కాసేపు చూస్తూ ఉండిపోయాడు. ఆయన బలంగా ఊపిరి పీల్చి వొదుల్తున్నాడు. కళ్లుమిలమిలలాడుతున్నాయి. దీన్ని బట్టి ఆయన భావోద్వేగానికి లోనయ్యాడని నే గ్రహించాను. ఆ డిటాచ్‌మెంట్ ఛీఫ్ స్టాఫ్ ఆఫీసరయిన మేజిలాంగ్‌కేసి తిరిగాడు మావో. "ఏం ఆఫీసర్ ! ప్రస్తుతం మనం పచ్చనది మీద ఉన్నాం. వెనుక మనం గెల్చుకున్న ఉత్తర షాంగ్సీ కనిపిస్తో ఉంది. ఇట్లా ఒక్క ఫోటో తియ్యవచ్చుకదా నన్నూ, అనడిగాడు. అదెంత భాగ్యం' అంటూ యేజిలాంగ్ గబగబా కెమెరా తీసి సిద్ధమయ్యాడు. ఆ వెంటనే మావో మొహాన నవ్వు మాయమైంది. మొహం గంభీరంగా పెట్టి, స్టడీగా

నిలబడ్డాడు. 'రెడీ'అంటూ యేజిలాంగ్ గబగబా నాలుగు ఫోటోలు తీశాడు. ఆనందంగా ఉంది నాకిప్పుడు. అన్నాడు. మావో మామూలయిపోతూ. ఉత్తర షాంగ్సీ పీఠభూమి ప్రజానీకం, ఈ పచ్చనదీ – నేను ఒకే ఫోటోలో ఉండడం జీవితాంతం గుర్తుండిపోయే విషయం కదూ అన్నాడు.

నది మధ్యన చేరుకునే సరికి అసలు కష్టాలు మొదలయ్యాయి. శీతాకాలం గడ్డకట్టిన మంచు పెళ్లలు కరిగి నదీ ప్రవాహపు ఒరవడితో పాటు దిగువ భాగానికి కొట్టుకుపోయే కాలం అంది. మంచు పెళ్లలంటే చిన్న చిన్న ముక్కలు కాదు హీనవక్షం మైలురాయి సైజులో ఉంటాయి ఒక్కటి. అంతకు అన్నింతల సైజులో ముక్కలు కూడా కొట్టుకు వస్తుంటాయి ఒక్కోమారు. దానికి తోడు కెరటాల ఉధృతి కూడా విపరీతంగా ఉంది. అంత పెద్ద పడవని కూడా కెరటాలు ఎత్తికొడతా ఉన్నాయి. మా పడవ అప్పుడప్పుడూ గాల్లోకి లేచి దబీమని మళ్లీ నీళ్లమీద పడతా ఉంది. అలా పైకి లేచినప్పుడల్లా నెత్తిమీద ఉన్న అకాశం తప్ప మాకేమీ కనబడ్డంలా. తిరిగి లోతైన బావిలో పడ్డట్టు దబీమని పడతా ఉంది పడవ. దీనికి తోడు మంచు పెళ్లలు వచ్చి పడవకు గుద్దుకుని ధనేల్ ధనేల్‌మని శబ్దాలు వస్తున్నాయి. తెడ్లు వేసే కుర్రాళ్లు మాత్రం ఇవేం పటట్టనట్లు 'అదిరా బజ్జా పట్టు, ఇంకా ముందుకు నెట్టూ, ఐసరబజ్జా పట్టూ, ఇంకా ముందుకు నెట్టు అని లయగా అరుస్తూ బలంగా తెడ్లు వైస్తూ మా పడవను ముందుకు నడిపిస్తున్నారు. మావో గొప్ప ఉద్వేగంతో అదంతా గమనిస్తూ ఉన్నాడు. ఆయన మొహం చూస్తుంటే మనసులో ఉన్నదేదో బయటకు చెప్పేలా ఉన్నాడని అర్థమైంది నాకు. ఉన్నట్టుండి మావో అరే అబ్బాయిలూ ఇప్పుడు ఈ నదిలో ఈతకొట్టే దమ్మూ ధైర్యం ఎవరికుందిరా అని అడిగాడు గట్టిగా. నిజానికి మా పడవలో గజ ఈతగాళ్లు ఉన్నారు. మా హోన్‌రాంగ్ ఈదేస్తాడు. నది వరద మీద ఉన్నప్పుడే జనరల్ పెంగ్‌కు సందేశం ఇచ్చి రావడానికి ఈ ఒడ్డు నుండి ఆ ఒడ్డుకు పోయి వచ్చాడు అటూ ఎవరో హోనరాంగ్ పేరు సూచిస్తూ అరిచారు. షిగువోరుయి గొంతు విప్పాడు. తనే కదూ, నది వరద మీద ఉన్నప్పుడు ఈ తట్టు నుండి ఆ తట్టుకి నేనూ ఈత కొట్టిన వాణ్నే, అన్నాడు. సన్‌యాంగ్ మాత్రం పీల గొంతుతో నేనూ ఇటు నునుంచి అటు ఈతకొట్టిన వాణ్నే. కాపోతే అప్పట్లో నది అక్కడక్కడా ఎండిపోయి ఉంది అన్నాడు. క్షణం ఆగి ఐనా నేను రెడీ అన్నాడు. అప్పుడు మావో బాగుందిరా అబ్బాయ్, ఇకనే....లే అయితే మనిద్దరం పడవలోంచి దూకేద్దాం. ఇక్కణ్నించి ఆ ఒడ్డుదాగా ఈతకొడుతూ పోదాం అన్నాడు. ఒక్కసారిగా ఉలిక్కిపడ్డా నేను ఏంటీ ఇట్లాంటప్పుడా మీరు ఈత కొట్టేది వీల్లేదు అని అభ్యంతర పెట్టే వాణ్నే. కానీ నోరు కట్టేసుకు కూర్చున్నా. ఎందుకంటే వొద్దని వారించే కొద్దీ ఆయన పట్టుదల పెరిగిపోతుందని నాకు తెల్సు. ఆయన మొండితనం, తెగువ

ఎక్కడికి దారి తీస్తాయో అన్న భయంతో నోరు విప్పాను కాదు నేను. మావో అలా అనగానే పడవ అంతటా నిశ్శబ్దం అలుముకుంది. కుర్రాళ్లు రెణ్నిమిషాలు తెడ్లు వెయ్యడం కూడా మరిచిపోయారు. ఇంతలో ఎవరో కూడదీసుకుని 'ఇవాళా, ఇప్పుడా, ఇప్పుడు వొద్దులెండి. అసలే మంచు పెళ్లలు ఆగాక ఇంకో రోజున తీరుబాటుగా ఈతకు రావచ్చు' అన్నాడు సన్‌యాంగ్ అదే అదనుగా. ఇప్పుడు కాదా, తీరిగ్గా ఇంకోమారు రావాలా అంటూ మావో గట్టిగా నవ్వేశాడు. భయపడ్డారు కదూ. నాకు తెల్సు అన్నాడు. తలతిప్పి పచ్చనదికేసి అలాచూస్తుండిపోయాడు. ఉరకలేస్తూ, నురగలు కక్కుతున్న ఉధృతమైన ఆ నదీ ప్రవాహం కేసి చూస్తూ ఏదో దీర్ఘాలోచనలో మునిగిపోయాడు. దీర్ఘంగా నిట్టూర్చి తనలో తాను గొణుక్కుంటున్నట్లుగా ఇలా అన్నాడు "ఈ నది ఉందే, దీన్ని ప్రపంచంలో ఎవరూ తేలిగ్గా తీసి పారెయ్యలేరు. ఈ పచ్చనది ఎవరూ మనం, మనజాతి. ఎవరూ మన జాతిని తేలిగ్గా తీసి పారెయ్యలేరు". మరికాసేపటికి ముప్పావు వంతు దూరం దాటేశాం. మావో ఎగువ ఒడ్డుకేసి తేరిపార చూశాడు. సూర్యకిరణాల వెలుగులో నది నీళ్లు బంగారంలా తళుకుతళుకుమని మెరుస్తూ ఉన్నాయి. టాంగ్ రాజవంశస్థుల పాలన కాలం నాటి విఖ్యాతి కవి 'లీబాయీ' రాసిన పద్యపాదం అందుకున్నాడు మావో. 'జాగ్రత్తా ! ఆ నభో మండలం నుండి దుమికిందీ ఈ మహా పచ్చనదీ' అని ఆపేశాడు. ఆ తరువాత గొణుకుతున్నట్లుగా ఎప్పటికి ఎగిసిపడుతుందో అంటూ ఏదో ఆలోచనలో మునిగిపోయాడు. మా పడవ అవతలి ఒడ్డుకు సమీపించింది. తూర్పు దిక్కున ఉన్న ఒక ఇసుక దిబ్బను తట్టుకుంటూ ఒడ్డుకి చేరుకుంది. ఒడ్డున ఉన్న అశేష జనవాహిని ఆనందోత్సాహాలతో మాకు స్వాగతం పలుకుతున్నారు. మావో ఇదేం పట్టనట్లు అప్పుడప్పుడూ భుజం మీంచి వెనక్కి - పచ్చనదికేసి చూస్తూ దీర్ఘంగా ఒక నిట్టూర్పు వదిలాడు.

నవచైనా ఆవిర్భావం తరువాత మావో ఎక్కడికి ప్రయాణమైనా అక్కడ ఉంటే నదిలోనో, సరస్సులోనో ఈతకొట్టకుండా మాత్రం అక్కణ్ణించి కదిలేవాడు కాదు. సవాలుకు సై అనే మనిషిలా ఒక్కదూకుతో నీళ్ళలోకి లంఘించేవాడు, ఈతకొట్టి బయటకు వచ్చేటప్పుడు శత్రువును సవాలులో ఓడించినంత తృప్తితో వచ్చేవాడు. అయితే పచ్చనది విషయంలో అలా ఉండేవాడు కాదు. ఆ నదికేసి ఆరాధనా పూర్వకంగా, గౌరవంగా చూసేవాడు. దాని అనుపానులన్నీ మహా జాగ్రత్తగా గమనించేవాడు. ఆ నదిని వదిలి వెళ్ళేటప్పుడు ఎవరో ఆత్మీయుణ్ణి వదిలి వెళ్తున్నంత ఇదిగా దిగులు పడేవాడు. పచ్చనదిలో ఈతకొట్టాలన్న మావో కోరిక కడదాకా నెరవేరలేదు. వయసు మీద పడడం మూలాన ఈ ఆలోచన విరమించుకున్నాడు. ఆ నదిని ఈదలేకపోయానే అన్న గుర్తు మాత్రం మావో వదిలిపెట్టలేదు. క్రీ.శ. 155-220 సంవత్సరం నాటి కవి 'కేఒకేఒ' పద్యంలోని ఓ గుర్రంయవనాశ్వంగా

ఉన్నప్పుడు ఎలా ఉండేదో వయసు మళ్ళాక కూడా అలానే దూకుడుగా ఉండాలి అనుకునేది. పచ్చనది విషయంలో మావో కూడా అలానే అనుకుంటూ ఉన్నాడు అనిపించేది నాకు.

మావో అంతరంగిక కార్యదర్శి గావోజి వేరే బాధ్యతల మీద షాంగ్జీ ప్రావిన్సులోని సియాన్‌కు బదిలీ అయ్యాడు. ఉత్తర షాంగ్జీ యుద్ధంలో గావో మావోను అంటిపెట్టుకునే ఉన్నాడు. మావోతో పాటే పచ్చనదిని దాటి వచ్చాడు. 1962 ఏప్రియల్ 19న గావో నూతన బాధ్యతలు చేపట్టడానికి గాను మావో దగ్గర వీడ్కోలు తీసుకునేందుకు వచ్చాడు.

అతన్ని చూడగానే మావో మనిద్దరం చాలాకాలం పాటు కలిపి పనిచేసాం. ఇన్నాళ్ళూ చాలా స్నేహంగా గడిపాం అన్నాడు ఆత్మీయంగా. ఇప్పుడు నువ్వు నన్ను వదిలిపెట్టి వెళుతున్నావ్... నేను నీకు ఎప్పుడూ జ్ఞాపకం ఉంటాననే అనుకుంటాను. నువ్వేం అనుకోనంటే నువ్వెక్కడున్నా సరే నాకో సాయం చేసి పెట్టగలవా అనడిగాడు మావో.

ఆ మాటలకు గావో ఉద్వేగంతో కదిలిపోయాడు. అదేం మాట కామ్రేడ్ ఛైర్మన్, మీరు అడిగితే నా ప్రాణం పెడతాను. మీరు చెప్పే చిన్న పని చెయ్యలేనా? ఏం చెయ్యాలో చెప్పండి అన్నాడు.

మావో ఒక సిగరెట్ వెలిగించి రెండు మూడు దమ్ములు లాగి వొదిలి మనం పచ్చనదిని పడవమీద దాటుకొచ్చాం గుర్తుందిగా? నా వల్ల గుర్రాన్ని పడవమీద కట్టేస్తే అది కట్టు తెంపుకుని ఆ నదిలో ఈదులాడుకుంటూ అవతలి ఒడ్డుకు చేరుకుంది – గుర్తుందిగా అని, క్షణం ఆగి మనం ఉత్తర షాంగ్జీ యుద్ధంలో ఉన్నప్పుడు నువ్వు అడ్వాన్స్ పార్టీతో కలిసి మనం వెళ్ళాల్సిన తోవ నిర్ణయించడానికి ఇళ్లమీద గుర్తులు పెట్టేవాడివి గుర్తుందిగా అనడిగాడు. గుర్తుంది అన్నాడు గావో.

'ఇప్పుడూ కూడా షాంగ్జీలో నా కోసం అలాంటి అడ్వాన్సు పార్టీ చేసే పనిలాంటిదే చేసి పెట్టాలి. ఈసారి నేను షాంగ్జీ వచ్చినప్పుడు నా నల్లగుర్రం మీద ఎక్కి పచ్చనది వెంబడే స్వారీ చెయ్యాలని ఉంది. అందుకు ఏర్పాట్లు చేస్తావ్ కదూ. దీని కోసమైనా నేను షాంగ్జీ వస్తాను అన్నాడు మావో.

'నేనిప్పుడే ఈ పనిమీద బయల్దేరుతున్నా' అని గావో వీడ్కోలు తీసుకుని వెళ్లిపోయాడు.

నిజానికి ఆ సమయానికి గావో భార్య నిండు చూలాలు. ప్రసవం రోజులు కూడా దగ్గర పడ్డాయి. అయినా గావో ప్రయాణం వాయిదా వేసుకోలేదు. వైమానిక దళ డిప్యూటీ కమాండర్ దగ్గర ప్రత్యేక అనుమతి సంపాదించి తన భార్యను విమానంలో సియాన్ పంపించేసాడు మావో కోసం ఎదురు చూడసాగాడు. రేపోస్తాడా, మాపొస్తాడా అన్నట్లు

ఉండేది గావో ధోరణి. మావో దగ్గర పనిచేసినవాళ్ళు ఎవరూ ఆయన సాన్నిహిత్యాన్ని అంత తర్వరగా మర్చిపోలేరు. గావో కూడా అందుకు మినహాయింపు కాదు. కలల్లో మావో తెగ కనిపించేవాడట. నిద్రలో మావో పేరే పలవరించేవాడట. ఒక్కసారి తుళ్ళిపడిలేచి అది కల అని తెలిసి కలతపడి కళ్ళనీళ్ళు పెట్టుకునేవాడట.

రోజులు లెక్కపెట్టుకుంటూ ఆ ఏడాది చివరి వరకూ గావో మావో వస్తాడని ఎదురు చూస్తూనే ఉన్నాడట. కాని మావో వెళ్ళనే లేదు.

అయితే మావో అభ్యర్థనను గావో మర్చిపోలేదు. 1965లో గావో ఇండోనేషియాకు వెళ్ళాల్సి వచ్చింది. సియాన్ నుండి బీజింగ్ చేరుకున్న గావో మావోను కలిసాడు. పచ్చనది వెంట నల్లగుర్రం మీద సవారీ చెయ్యాలన్న మావో కోరిక నెరవేర్చడానికి వీలుగా గావో ఒక రూట్ మ్యాప్ తయారు చేసి తీసుకు వచ్చాడు. అందులో పచ్చనది ప్రవహించే కొండలు, గుట్టలు, మలుపులు, కల్వర్టులు ఎక్కడెక్కడ ఉన్నాయి. వాటి నిడివి, ఏ మార్గంలో ప్రయాణం కష్టభూయిష్టంగా ఉంటుంది. ఎక్కడెక్కడ మావో విశ్రమించడానికి అనువుగా ఉంటుంది. అన్న వివరాలన్నీ పటంలో గుర్తు పెట్టి ఉన్నాయి.

మావోను కలుసుకుని మాట్లాడే సందర్భంలో తను, తన కుటుంబం, పని, చదువు మొదలగు విషయాల గురించి గావో ఏ కరువు పెట్టాడు. నేను మీకు రూటుమ్యాపయితే ఇచ్చాగానీ, ఆ ప్రయాణం నేనేగన చెయ్యాల్సివస్తే చేతులెత్తేస్తాను. అది నాకు అలిమి అయ్యే పని అనిపించట్లా. నే చక్క బెట్టాల్సిన పనుల ఒత్తిడి నాకు అంత వెసులు బాటు ఇచ్చేలా లేదు అన్నాడు గావో.

సియాన్ నుండి బీజింగ్ వచ్చే దారిలో గావోను ఆకట్టుకున్న విషయాలు ఏమిటో మావో వివరంగా అడిగి తెలుసుకున్నాడు.

"నా పరిస్థితి నీలానే ఉంది గావో, షాంగ్జీకు వచ్చి పచ్చనది వెంబడి నల్లగుర్రం మీద స్వారీ చెయ్యాలని ఉందని నీతో చెప్పానా... కానీ అందుకు తగిన సమయం కేటాయించే వీలు లేకుండా పోయింది. ఇక్కడి వ్యవహారాలలో నిత్యం తలమునకలయిపోతున్నా. నాకు షాంగ్జీ ప్రాంతం అంటే మా చెడ్డ ఇష్టం. నేను జియాంగ్సీలో ఉన్నది బహుకొద్ది కాలమే. కానీ యేనాన్‌లో చాలాకాలం ఉన్న ఇప్పటికీ నా మనసులో ఆ ప్రాంతమంతా ఒక మాట తిరిగి రావాలని ఉంది. అక్కడ పండే చోళ్ళ అన్నం తినాలని ఉంది. పచ్చనది వెంబడి షికారు చేసి రావాలని ఉంది. కాని అందుకు టైం చిక్కడంలా" అన్నాడు.

మావో కోరిక కోరికగానే మిగిలిపోయింది. అయితే చోళ్ళ అన్నం మాత్రం తిన్నాలన్న

కోరిక తీరింది. గావో తిరిగి షాంగ్జీకు వెళ్ళగానే మావో కోసం ప్రత్యేక చోళ్ళు పంపించాడు. గుర్తు పెట్టుకుని మరీ పంపినందుకు గావోకు మావో ప్రత్యేకించి అభినందనలు తెలియచేస్తాడు. పచ్చనది వెంబడి వైపు షాంగ్జీలో షికారు చెయ్యలేనందుకు అప్పుడుప్పుడూ మావో నొచ్చుకునేవాడు.

నాకు గుర్తున్నంతలో అన్నింటికన్నా మావో ఎక్కువ బాధపడిన విషయం తైవాన్‌ను మాతృభూమి అయిన చైనాలో విలీనం చెయ్యలేకపోయాయే అన్న అంశం. నా నెరవేరని కల ఇదే అని మావో తరచూ అంటూ ఉండేవాడు.

ఇంతకు ముందే నే ప్రస్తావించినట్లు 1953 ప్రాంతం నుండీ మావో సముద్ర తీర ప్రాంతానికి తరచూ వెళ్ళే అలవాటు చేసుకున్నాడు. సముద్రం అంచున ఆకాశంతో కలిసి పోయినట్లు ఉండే దిగంతం కేసి చూస్తూ తైవాన్ విముక్తి సాధించాలి అంటుండేవాడు. ఇంకా ఏదో చెప్పేవాడు కానీ, నాకు అంత బాగా గుర్తులేదు. గుర్తు ఉన్నంతలో చెప్పాలంటే – తైవాన్ చైనాలో అంతర్భాగమే గానీ విడిగా మనుగడ సాగిస్తుంది. (అంటే స్వయం పాలిత ప్రాంతం అనుకోవచ్చేమో) అన్నమాట విన్నప్పుడల్లా మావోకు చిర్రెత్తుకు వచ్చేది. చాంగ్–కై–షేక్ ను ఎంతగా చీదరించుకునేవాడో ఆ మాటలకు అంతకన్నా ఎక్కువగా చీదరించుకునేవాడు.

చైనా ప్రజల ఆత్మగౌరవాన్ని, చైనా జాతి ఆత్మాభిమానాన్ని దేశ సార్వభౌమత్వాన్ని ప్రపంచానికి చాటి చెప్పిన మావోను ఇప్పటికీ ప్రజలు తమ గుండెల్లో పెట్టుకు ఆరాధిస్తారు.

1972 లో అమెరికా అధ్యక్షుడు నిక్సన్ పర్యటన సందర్భంగా ఒక సంయుక్త ప్రకటన విడుదల కోసం జరిగిన కసరత్తులో అమెరికన్ బృందం ఈలైను మార్చాలి, ఆ పదం మార్చాలీ, ఈ వాక్యం ఉంచొద్దూ, ఇదిగో మేం చెప్పిన వాక్యం చేర్చండీ అంటూ గుంజాటనలు పెట్టారట. జరిగే తతంగాన్ని చౌఎన్‌లై మావో చెవినవేసాడు. ఏం చెయ్యమంటారు అని అడిగాడు. సంయుక్త ప్రకటన పాఠంలో మార్పులు చేర్పుల గురించి మాట్లాడదానికి సిద్ధమే కానీ తైవాన్ మీద మనం పొందుపరిచిన అంకంలో అక్షరం మార్పు ఉండదని నిక్సన్‌కు తెలియచెయ్యండి" అన్నాడు మావో. చివరి మాటగా ఆ పెద్దమనిషికి చెప్పండి. తైవాన్ విషయంలో వేలు పెడితే ఇరుదేశాల సంయుక్త ప్రకటన రేపు విడుదల అయ్యే అవకాశం ఉండదని స్పష్టం చెయ్యండి అని గట్టిగా చెప్పాడు.

1949 నుండి తైవాన్ అంశం మావో దృష్టిలో ఉండేది చైనా – అమెరికా దేశాల మధ్య సాధారణ సంబంధాలు ఏర్పడడానికి ప్రధాన అవరోధంగా మారింది తైవాన్ సమస్యే.

నవచైనా ఆవిర్భావం తరువాత పునుజున్ మావో ఆరోగ్యం కని పెట్టుకుని ఉండే నర్సుగా నియమించబడింది. నాకు మాదిరే ఆవిడ కూడా మావో దగ్గర చాలాకాలం పాటు పనిచేసింది. నేను వేరే బాధ్యతల మీద వచ్చేసిన తరువాత కూడా ఆవిడే చాలాకాలం మావోకు నర్సుగా పనిచేసింది.

1973 చంద్రమాన సంవత్సరాది రోజున మావో ఆవిడని 'గెస్టు'గా తన ఇంట భోజనానికి ఆహ్వానించాడు. భోజనానికన్నా ముందు 'ఎ స్ట్రగుల్ టు రిమెంబర్' అన్న సినిమా చూసారు. నిజానికి సినిమాల మీద మావోకు అంత ఆసక్తి లేదు. కానీ ఆ రోజున సినిమా చూస్తానని తనూ అందరితోపాటు కూచున్నాడు. సినిమా చూస్తున్న కొద్దీ మావో పాత జ్ఞాపకాల్లోకి నవచైనా ఆవిర్భావం నాటి ముందు సాయుధ పోరాటకాలంలోకి జారిపోయాడు. ఆనాడు యావత్ ప్రపంచాన్నే కదిలించివేసింది. చైనా ప్రజా విముక్తి పోరాటం. ఆనాటి జ్ఞాపకాలు మళ్ళీ తెరమీద చూస్తూ మావో చాలా కదలిపోయాడు. మౌనంగా రోదించాడు తెరమీద కదులుతున్న చరిత్రను చూసి. ప్రజా విముక్తి సైన్యం ఒక నగరంలో ప్రవేశించినప్పుడు ఆ ఊరి జనాలు అందరూ హర్షాతిరేకాలతో స్వాగతం పలుకుతున్న దృశ్యం పచ్చినప్పుడు అవునూ ఆ రోజున మాకు స్వాగతం పలికిన స్టూడెంట్స్‌లో నువ్వున్నావా అని మావో వుసుజును అడిగాడు. మావో అడిగి ప్రశ్నకు ఉన్నాని అర్థం వచ్చేలా 'వూ' తల ఊపింది. ఎందుకంటే ఆవిడా నోరు తెరిచి మాట్లాడే స్థితిలో లేదు. ఆవిడ ఏడుస్తూ ఉంది. సిన్మా చూస్తూ, అప్పట్లో ఆవిడ షాంగై స్కూల్లో చదువుకుంది. ఆవిడ ఏడవడం చూసి మావో మళ్ళీ కంటతడి పెట్టుకున్నాడు. అది చూసి సినిమా చూస్తున్న మిగతా జనాల కళ్ళూ తడి చెలమలయ్యాయి. అప్పుడు మావోను అక్కణ్ణించి బలవంతానా లేపదీసుకు వెళ్ళిపోయారు నర్సులు.

అందరూ అనుకున్నట్లుగా మావో పాత జ్ఞాపకాలతో కదిలిపోయి అలా కంట తడిపెట్టుకుని ఉండడు. తైవాన్‌కు విముక్తం చెయ్యలేకపోయామే అని తలుచుకుని బాధపడి ఉంటాడని అనుకుంటున్నా.

చదవను, రాయను – ఏదో ఒక పని చెయ్యనిదే మావోకు పొద్దు పోయేది కాదు. అనేక అంశాల మీద పుస్తకాలు తీసుకురావాలని అనుకున్నాడు కానీ వాటిల్లో చాలావరకు నెరవేర్చలేకపోయాడు. బహుశా మావో నెరవేరని కలల్లో ఇది కూడా ఒకటి అనుకుంటా.

1954 ప్రాంతంలో మేం బేయిడైహీలో ఉన్నాం. వీలు చిక్కినప్పుడల్లా సముద్రం ఒడ్డుకేసి వెళ్ళి పచార్లు చేసేవాడు మావో ఒకసారి అలానే షారుకి వెళ్ళి ఏదో పద్యం పాడుతున్నాడు. మావో అంతరంగిక వైద్యుడు డా॥ సు అప్పుడు ఆయన్తో ఉన్నాడు. ఎవరి

పద్యాలు కామ్రేడ్ మీరు పాడుతుందీ అనడిగాడు ఆయన ఎలా ఉన్నాయ్ అని ఎదురు ప్రశ్న వేశాడు మావో.

'భేషుగ్గా వినసొంపుగా ఉన్నాయ్' అని బదులిచ్చారు డాక్టరు గారు 'కావ్ కావ్' రాసిన పద్యం ఇది. ఎడర్నీ ఆన్ పుట్ అవుటాఫ్ సమ్మర్ గేట్' అన్న పద్య కావ్యంలో లుకింగ్ ఎట్ దిసీ అన్న ప్రథమ అంకంలోనిది ఈ పద్యం అని వివరించాడు మావో.

'కావో కావో పద్యమా? అతగాడిదా' అన్నాడు డాక్టరు అదో మాదిరి కంఠంతో.

'ఏ ఆశ్చర్యంగా ఉందా? నా దృష్టిలో అతని గొప్ప దేశ భక్తుడు. గొప్ప సైనికుడు, గొప్పకవి, అన్నాడు మావో.

అక్కడ ఉన్న మేమంతా చిత్తరపోయాం. గతంలో ఒకసారి అదే కవిని నయవంచకుడు, నమ్మకద్రోహి అని తిట్టిపోసాడు మావో. ఇప్పుడు అతని గురించేనా ఇంత గొప్పలు చెబుతున్నాడూ? బహుశా కావో కావో పేరుతో ఇద్దరు కవులు ఉన్నారేమో, మావో ఇప్పుడు ఇంకో కవి గురించి చెబుతున్నాడేమో అనుకున్నాం మేం.

ఎవరూ కావో కావో నా? ఆ ధూర్తుడి గురించా మీరు పొగుడుతా అని అడిగాడు డాక్టర్‌ను.

'ఆపండి చెత్త' అన్నాడు మావో మధ్యలోనే కల్పించుకుంటూ, 'కావో కావో చైనా ఉత్తర ప్రాంతం యావత్తూ ఏకీకృతం చేసి పచ్చనది లోయలో వెయి రాజ్యాన్ని స్థాపించాడు. చైనాలోని అత్యంత కీలక భూ భాగం అది. తూర్పుహాన్ రాజవంశస్థుల కాలం (క్రీ.శ. 25-220) నాటి అనేక తప్పుడు విధానాలను సంస్కరించాడు. అధికారం చలాయిస్తున్న అనేక కులీన కుటుంబాల రెక్కలు కత్తిరించేసాడు. తన రాజ్యంలో ఉత్పత్తిని అపారంగా పెంచాడు. తొలిసారిగా అశ్వబలాన్ని వ్యవసాయం పనుల్లోకి దించాడు. పడావు భూముల్ని, బంజరు భూముల్ని కూడా సాగులోకి తీసుకు రమ్మని రైతులకు ప్రోత్సాహకాలు ప్రకటించాడు. చట్టాలను పటిష్టంగా అమలు చేసాడు. అప్పటికే యుద్ధంలో చితికిపోయిన రాజ్యాన్ని చిర కాలంలోనే స్వయం సమృద్ధి సాధించే దిశగా నడిపించాడు. ఇంతటి ఘనకార్యం సాధించిన ఆ మనిషి ధూర్తుడు నయవంచకుడు ఎలా అవుతాడు? మీరు నమ్ముతారా? కానీ నమ్మించారు. ఫ్యూడల్ ప్రభువుల, సనాతనవాదుల కొమ్ము కాసే కిరాయి రాతగాళ్ళందరూ కసిలి కావో కావోనం అలా చిత్రీకరించారు. కత్తికన్నా ఘంటం గొప్పదని ఊరికే అనలేదు. పాలకశక్తులు కిరాయి రాతల ద్వారా ప్రజల మనసుల్లో విషం నింపాయి. సర్వా బద్ధాలు ప్రచారం చేసాయి. ఇప్పటి దాగా ఇదే పరంపర కొనసాగింది. చరిత్ర గర్భాన దాగి ఉన్న ఇలాంటి

సత్యాలను ఎన్నింటినో మనం వెలికి తియ్యాలి. ప్రజలకు వాస్తవాలు ఏమిటో వివరించాలి అంటూ సుదీర్ఘంగా చెప్పుకొచ్చాడు మావో.

మావో అంత ఉద్రేకంగా, ఉద్వేగంగా మాట్లాడడం నేను ఎప్పుడూ చూళ్ళేదు. అందులోనూ గతించిన చరిత్ర గురించి అంత ఇదిగా పట్టించుకుంటాడని నే ఎన్నడూ అనుకోలేదు. ఇదేదో 'కావో కావో' లాంటి చారిత్రక వ్యక్తికి మాత్రమే పరిమితం అయిన అంశం అనిపించలా నాకు, వాలక శక్తుల పక్షాన సాగించిన ప్రచారం ప్రజల ఆలోచనలను ఏ మేరకు, ఎలా ప్రభావితం చేస్తాయో గ్రహించడానికి ఇది ఒక ఉదాహరణ మాత్రమే.

'కావో కావో' మీద అప్పటికే చలామణిలో ఉన్న అభిప్రాయాలను మార్చడానికి రాత పూర్వకమైన కృషి చెయ్యాలి అని మావో అనుకునేవాడు. కాని చెయ్యలేక పోయాడు. అయితే గావో మెర్సువో పని చేసాడు. అతను రాసిన వ్యాసం పెద్ద సంచలనమై కూచుంది. దేశ వ్యాప్తంగా పత్రికలలో పెద్ద ఎత్తున చర్చ నడిచింది. చివరికి ఎక్కువమంది గువో అభిప్రాయాలతో ఏకీభవించారు.

కావో కావో మీద అసక్తికరమైన చర్చ జరిగిన రోజు రాత్రి పడుకోబోయే ముందు మావో మమ్మల్ని పిలిచి అబ్బాయిలూ ఇవాళ్టి మన కుర్రకారు ఆలోచనలు ఎలా ఉన్నాయో నాకు తెలుసుకోవాలని ఆసక్తిగా ఉంది. రచయితలు కూడా ఎక్కువమంది కుర్రవాళ్లకు పనిపాటల గురించి వైవాహిక సంబంధాల గురించి సలహాలిస్తూ రాసేవాళ్ళే కానీ చరిత్రమీద వాళ్ళ అవగాహన ఎలా ఉంది. ఈ ప్రపంచం గురించి వాళ్ళ ఆలోచనలు ఎట్లా ఉన్నాయి అనేది తెలుసుకునే ప్రయత్నమే చెయ్యట్లా. ఎట్లా మరి మన రేపటి తరం గురించి తెలుసుకునేది అంటూ మా ముందు ఒక పెద్ద ప్రశ్న లేవనెత్తి తన దోవన తను పడుకున్నాడు.

ఆ తరువాత కొన్ని రోజులకి టియాన్‌యస్‌యు ఏదో పుస్తకం చదువుతూ మావోకు కనిపించాడు.

'ఏంటిదో ఆ పుస్తకం' అనడిగాడు మావో

'ఏదో లెండి.... నాకయితే తత్వశాస్త్రం, చరిత్ర అంటే ఇష్టం అని చెప్పాడతను.

అలా అయితే ఫెంగ్‌క్యుయి రాసిన 'నో ది వరల్డ్' (ప్రపంచం గురించి తెలుసుకో) అనే పుస్తకం తెచ్చి చదువు అని సలహా ఇచ్చాడు మావో.

ఆ తరువాత కొన్ని రోజులకి టియాన్‌ను పిలిచి మార్క్సిజం మౌళిక సూత్రాలకు సంబంధించిన పుస్తకాలు ఇచ్చి చదవమన్నాడు. చారిత్రక భౌతికవాదం మీద చిన్నపాటి

లెక్చరు ఇచ్చారు. చివరికి అతనితో ఒక మాట అన్నాడు. యువతరాన్ని దృష్టిలో పెట్టుకుని వాళ్ళకోసం ఒక పుస్తకం రాయాలనుకుంటున్నా. ఈ ప్రపంచం వాళ్ళది, భవిష్యత్తు వాళ్ళది ఈ రెండు సూత్రాలు మాత్రం మారవు ఏది మారినా మారకున్నా అదీ యువతరం పట్ల మావోకు ఉన్న అంచనా.

1935 ప్రాంతంలో మావో తరచూ ఒక ముక్క అంటుండేవాడు – చైనా గోడను తాకనివాడు మొనగాడే కాదు అని పచ్చనదిని ఈదాలన్న కోరిక తీర్చుకోలేకపోయాడు కానీ 'గ్రేట్ వాల్'ను మావో చాలా సార్లు సందర్శించాడు. అక్కడకు వెళ్ళిన ప్రతిసారీ షిహుయాంగ్టీ గురించి తనదైన శైలిలో అభిప్రాయాలు వ్యక్తం చేసేవాడు. చైనాను క్రీస్తు పూర్వం 246 నుండి 209 వరకు పరిపాలించిన క్విన్ రాజవంశస్థులలో షిహు యాంగ్టీ తొలి చక్రవర్తి. చైనాను పరిపాలించిన ఈ ఫ్యూడల్ చక్రవర్తి గురించి కావో కావో మీద ఉన్న మాదిరిగానే జన సామాన్యంలో ఉన్న సాధారణ అభిప్రాయాలకు భిన్నమైన రీతిలో స్పందించాడు మావో. ప్రజలు కష్టాలకు, కడగండ్లకు గురయిన మాట కొట్టిపారెయ్యలేని వాస్తవం కానీ అతను కూడా శిఖర సమానమైన కొన్ని విజయాలు సాధించాడు. ఒక జాతిగా చైనా యాపత్తును సమైక్య పరచి విశాలదేశంగా తీర్చిదిద్దాడు. ఆ తరువాత రెండువేల సంవత్సరాలు పాటు చైనాను అనేకమంది ఫ్యూడల్ చక్రవర్తులు రాజులు, రారాజులు పరిపాలించారు కానీ వారందరూ పరిపాలనా సౌలభ్యంకోసం షిహుయాంగ్టీ రూపొందించిన వ్యవస్థనే కొనసాగించారు. ఇది చిన్న విషయం కాదు. మన దేశానికి ఏకీకృత లిపికి అతని కాలంలోనే రూపకల్పన జరిగింది. వాహనాలను స్థిరకొలతలు ఏర్పాటు చేసాడు. యాపద్దేశంలో ఏకరీతి చట్ట న్యాయాలను అమలు చేసాడు. ఈ గడ్డను ఒక దేశంగా సంఘటిత పరిచాడు. అని వివరించాడు.

కావో కావో, షిహుయాంగ్టీల మీద సంప్రదాయంగా వస్తున్న చరిత్ర చిత్రణలకు భిన్నంగా మాట్లాడిన మొదటి వ్యక్తి మావో. అదే సందర్భంలో అప్పటికీ ఇప్పటికీ ఎవరయినా పోలిక తెచ్చి ఏ విషయాన్నయినా సమర్థించుకోవాలని చూస్తే నిర్ద్వంద్వనిగా ఖండించేవాడు. మీ పోలికే తప్పు. షిహుయాంగ్టీకు మనకూ పోలికేంటి అతనికన్నా వెయ్యిరెట్లు మెరుగ్గా మనం పరిపాలించాలి. అతనొక నియంత. నేను అతని ఊసు ఎత్తానంటే చైనా, సమైక్యత కోసం, పాలనా పరమైన అభివృద్ధి కోసం, ప్రజల కోసం ఏమన్నా మేళ్ళు చేసి ఉంటే వాటిని గుర్తించమనే చెబుతున్నా. నవచైనా అధ్యక్షుడు, ఫ్యూడల్ చక్రవర్తి ఎప్పుడూ ఒకటికారు. నవచైనా అధ్యక్షుడు ప్రజా సేవకుడు మాత్రమే అని సూటిగా చెప్పేవాడు.

1960లలో మేము ఆయన్తో కలిసి రైల్లో హునాన్ వెళ్తున్నాం. జ్యోతిష్యం చెప్పేవాళ్ళ

గురించి లీయన్ ఎత్తుకొచ్చింది. మావో పేరిట కుటుంబానికి శాంతి చేయించిన విషయమూ బయటపెట్టింది. అప్పుడు మావో నవ్వుతూ నిజంగా నీకు అలాంటి వాటి మీద నమ్మకం ఉంటే నీ జాతకమే చెప్పించుకుని ఉండవచ్చుగా అని చురకవేసాడు.

మీకు తెలీదు నేనెందుకలా చేసానో, ఈ మాటు ట్రిప్‌లో మీ గురించి కొంతమంది జనాలు తిట్టుకోవడం నా చెవులారా విన్నాను అంది లీమిన్. సరిగ్గా అప్పుడే లోపలికి అడుగుపెడుతున్న మావో షుసియాన్ ఆ మాటలు విని విభ్రమకు గురయి అంతలోనే తేరుకుని 'వాళ్ళ గురించి పట్టించుకోవనక్కర్లా. వాళ్ళెవరో వర్గ శతృవులయి ఉంటారు అని అరిచినంత కోపంగా చెప్పింది.

మావో అదే చిరునవ్వుతో తల అనంగీకారంగా అడ్డంగా ఊపుతూ 'కావక్కర్లా' అన్నాడు. 'జనాలు తిట్టుకోవడం అసాధారణమైన విషయమేం కాదు. వాళ్ళు తిట్టకపోతేనే ఆశ్చర్యం. నన్ను తిట్టిన ప్రతివాళ్ళు చెడ్డమనిషి అనుకోకూడదు. నాలో తప్పులు ఎంచకూడదు అంటే ఎట్లా? అంటూ క్షణం పాటు ఆగి సాలోచనగా చాంగ్‌కై షేక్ నా కుటుంబ సమాధుల్ని కాటిలో కలిపేసాడు. కమ్యూనిస్టు పార్టీ నన్ను పక్కన పెట్టింది. నేను పార్టీకోసం పనిచేస్తానన్నా అవకాశం ఇవ్వలేదు. విప్లవం సాధించడం సాదాసీదా అయిన విషయం కాదు. దాని కోసం ఎన్నో త్యాగాలకు సద్ధపడాలి. నా కుటుంబ సమాధుల్ని కూలదోసి నాకు సమాజంలో స్థానం లేకుండా చెయ్యాలని చూసారు. అది అరిష్టం అన్నారు. నా గురించి నానా చెత్తా ప్రచారం చేసారు. కానీ ఇవేం నన్ను కదలించలేకపోయాయి. నాకేం కాలేదు కదా - అలాంటి నమ్మకాలు ఒట్టి అభూత కల్పనలు. ఈ రోజున నా ప్రజలే నా పూర్వీకుల సమాధులను పునర్నిర్మించారు. నేనూ మీ లాంటి మామూలు మనిషినే. నీలాగా, తనలాగా, ఆమెలాగా, అతనిలాగా ఈ మావో జెడాంగ్ కూడా ఒక మనిషే. అందరి మానవుల మాదిరిగానే ఏదో ఒక రోజు నేనూ మరణిస్తాను. నన్ను 'ద్రష్ట' అని అంటుంచారు. ఏమో అదంతా ఉత్తదే, చెత్త తీసెయ్యండి. రేపు నేను చచ్చిపోయాక నా మీద అనేక విమర్శలు రేగవచ్చు. నేను 'మంచి' అని భావించి చేసిన పనులు తప్పుడు ఫలితాలు ఇచ్చి ఉండొచ్చు. తప్పు చెయ్యడం మానవ సహజం. నేను మానవాతీతుణ్ణి అని ఏనాడూ చెప్పలేదు. నేనూ తప్పులు చేసి ఉండొచ్చు. కాని నేను ఏ పని చేసినా విప్లవానికి బద్ధుడనయి చేసా. ఈ దేశ ప్రయోజనాలే గీటురాయిగా పెట్టుకుని పనిచేసా. అందుకే నా గురించి ఎవరేం అనుకున్నా, ఎంత తప్పుగా మాట్లాడిన పట్టించుకోను అన్నాడు మావో.

విప్లవం విజయం సాధించిన పిదప మావో ఒకే ఒక అంశం గురించి తీవ్రంగా తపనపడుతూ ఉండేవాడు. విప్లవస్ఫూర్తిని పార్టీ సభ్యులలోకి, క్యాడర్‌లోకి, ప్రజా రాశులలోకి

ఎంతో లోతుగా తీసుకెళ్ళాలా అనేది ఆ తపన. కేవలం భౌతిక పరిస్థితులలో మార్పుల కోసమే కాకుండా బౌద్ధిక పరిస్థితులలో మౌళిక మార్పులు తీసుకు రావాలని ఆశించాడు. వెయ్యేళ్ళంటే కడు దూరం ఈ రోజునే ఈ క్షణానే అవకాశం చేజిక్కించీ అన్న కవి వాక్కును ఔదల దాల్చి మావో తలకెత్తుకున్న కొన్ని కార్యక్రమాలు వాస్తవ దూరంగా మారాయి. ఎందుకంటే అలాంటి బహుముఖ మార్పులకు యావత్ దేశం ఇంకా సంసిద్ధం కాలేదు. గ్రేట్ లీప్ ఫార్వార్డ్ (పెద్ద గెంతు) గ్రామీణ ప్రాంతాల్లో ప్రయోగాత్మకంగా తలపెట్టిన కమ్యూన్ల వ్యవస్థ - ఇలాంటి తొందరపాటు చర్యలే.

అలాగే మావో తలపెట్టిన సాంస్కృతిక విప్లవం కూడా పొరబాటు నిర్ణయమే అని చెప్పడానికి నే సందేహించను. ఈ పొరబాటు నిర్ణయానికి అనేక ఇతరత్రా అంశాలు దోహదం చేసి ఉండొచ్చు. సాంస్కృతిక విప్లవం యావత్ దేశం మీద విధ్వంసకర ప్రభావం చూపించింది. జీవిత పర్యంతంలో మావో చేసిన ఘోరమైన తప్పు ఇదే. మావో చేసింది తప్పుడు నిర్ణయం మాత్రమే కానీ గాంగ్ ఆఫ్ ఫోర్ (దుష్టచతుష్టం) మాత్రం ఘోరనేరాలకు పాల్పడింది. కాబట్టి తప్పుడు నిర్ణయాన్ని తప్పుడు నేరాలను ఒకేగాటన కట్టి టూడకూడదనేది నా స్థిరాభిప్రాయం. 'సాంస్కృతిక విప్లవం' ద్వారా మావో ఆశించిన సదాశయాల్ని తప్పుపట్టలేం. కమ్యూనిస్టు పార్టీలో అవినీతిని, బ్యూరోక్రటిక్ పద్ధతులను వొదిలించాలను కోవడం ఏ రకంగా చూసినా తప్పుకాదు.

మావో ఈ రెండు రుగ్మతలని నిలువెల్లా ద్వేషించేవాడు. ఇందుకు సంబంధించి నా అనుభవాలను ఇంతకు ముందు అధ్యాయాల్లో ప్రస్తావించాను. 1950వ దశకంలో బ్యూరోక్రసీ, దుబారా వ్యయాలను వ్యతిరేకంగా ఆందోళన కార్యక్రమాన్ని ప్రకటించింది. పార్టీ. మావో అనేక సందర్భాల్లో ఏంటీ సర్కారు సొమ్ము ఏమన్నా నొక్కినావా? ఇంతకు ముందు చెయ్యలేదనుకో ఇహ ముందు చెయ్యవనే గ్యారంటీ ఏమిటి? అని కరుగ్గా ప్రశ్నించేవాడు నన్ను. 'జాగ్రత్త లంచగొండితనం అనేది పంచదార పూసిన విషపు గుళిక లాంటిది. తీసుకో తీసుకోమని ఊరిస్తా ఉంటుంది. నువ్వు నా దగ్గర చాలా కాలంగా పని చేస్తున్న వాడివి. ఇతరులకీ నీకు చాలా తేడా ఉంటుంది. నువ్వు తప్పు చేస్తే అది నాకు ఎంత నామర్ధానో ఊహించు' అని హితవు చెప్పేవాడు. 'పొరపాటును కూడా ఆ ఉచ్చులోపడమాకు ఇన్నాళ్ళు మన మధ్య స్నేహితాన్ని శతృత్వంగా మార్చుకోకు అని సున్నితంగా హెచ్చరించేవాడు. నువ్వు నా బాడీ గార్డువి. ర్యాంకులో చిన్న వాడివే కావచ్చు. కానీ నాతో సాన్నిహిత్యంలో మాత్రం నీదే ఫస్ట్ర్యాంక్. దాన్ని అడ్డుపెట్టుకుని లబ్ధిపొందాలని చూడమాకు. నిజాయితీగా ఉండు. ముక్కు సూటిగా మెసులుకో అని కర్తవ్య బోధ చేసాడు. పొదుపుగా బతకడం నేర్చుకో. దాన్నే అలవాటుగా మార్చుకో. అవినీతిని అమడదూరంలో

ఉంచడానికి ఇదే తొలిమెట్టు అన్న జీవిత సత్యం బోధించాడు నాకు.

మావోకు సుదీర్ఘ కాలంపాటు అంతరంగిక కార్యదర్శిగా పని చేసిన కామ్రేడ్ ఆ బాధ్యతల నుండి రిటైరయి వెళుతూ వెళుతూ తనతోపాటు తీసుకెళ్లిన సామాను అంతా ఒక జీపు డిక్కిలో సరిపోయింది. అంతా నికార్సయిన మనిషి ఆ కామ్రేడ్. మావో తన కుటుంబ సభ్యులని కూడా పిలిచి ఆ కామ్రేడ్‌తో ఫోటో దిగాడు. నీ అంతటి నీతిమంతుణ్ని వొదులు కోవాల్సి రావడం నిజంగా నాకు పెద్దలోటే అని మావో మనసారా అతన్ని ప్రశంసించాడు.

ఒకసారి మాతో పాటుగా ఒక కొత్తబాడీ గార్డు వచ్చి చేరాడు. అప్పుడే దేశం ఆర్థిక సంక్షోభం నుండి తేరుకుంటోంది. వచ్చి నాలుగునాళ్లు కాకముందే - ఏంటిదీ తిండీ... ఇలా ఉంటుందనుకోలేదు. మావో బాడీగార్డు అంటే ఇష్టం వచ్చింది తినగలిగినంత తినొచ్చు అని ఆశపడ్డానే అని మనసులోని మాట బయటకు కక్కేశాడు.

అందుకే మావో ఎప్పుడూ అంటూ ఉండేవాడు నా దగ్గర పని చెయ్యడం అంటే బాగా పలుకుబడి సంపాదించుకోవచ్చు అని అనుకోమాకండి. నాతో పనిచెయ్యడం అంటే మీరు మరిని త్యాగాలకు సిద్ధం కావడమే అని గుర్తుంచుకోండి అని అందుకే కొత్తగా ఎవరు డ్యూటీలో చేరినా ఈ రెండు ముక్కలూ చెప్పి చెప్పూ ఇప్పుడు నా దగ్గర పని చెయ్యడం ఇష్టమేనా అని అడిగేవాడు.

మావో మాకు ఎలాంటి ఆదర్శాలు చెప్పేవాడో తానూ అంత ఆదర్శంగా ఉండేవాడు. మావో దగ్గర చాలా కాలం పనిచిసి బయటకు వచ్చిన వాళ్లు చాలా మంది అయోమయానికి లోనయ్యేవారు. సమాజంలో ఉన్న సంక్లిష్టతలను అర్థం చేసుకోలేక తీవ్ర నిస్పృహకు లోనైనవాళ్లు ఉన్నారు. మావోకు ఈ సంక్లిష్టతలు తెలియక కాదు. తన దగ్గర పనిచేసి వెళ్లి పోయేవాళ్లకు రెండు విషయాలు గట్టిగా గుర్తుచేసేవాడు. నిజాయితీగా, విప్లవానికి బద్ధుడివై ఉండు. నీలో స్ఫూర్తిని చంపుకోమాక, దివాళా కోరుగా మారిపోమాక అని హితవు చెప్పి పంపేవాడు.

కమ్యూనిస్టు పార్టీ, దేశం-ఈ రెండూ తన అంచనాలకు తగినట్లు లేవనే అసంతృప్తి ఉంది మావోలో దాన్ని సరిదిద్దాలని తపన పడుతుండేవాడు. ఈ ఆలోచనా ధోరణి మూలంగానే 'సాంస్కృతిక విప్లవానికి రూపకల్పన' చేశాడని నా అభిప్రాయం. ఏదో మంచి చేద్దామనే ఉద్దేశం తలకెత్తుకున్న ఈ 'సాంస్కృతతీక విప్లవమే' దేశాన్ని దశాబ్దం పాటు అతలాకుతలం చేసింది. మావో పచ్చాత్తాపం ఇది. చరిత్ర పశ్చాత్తాపమూ ఇదే.



స్టడీ రూమ్‌లో మావో



అంగరక్షకుడు లి ఇంకిమావో, ఆయన కుటుంబంతో మావో

చాలా కాలం పాటు మావో
అంగరక్షకునిగా పనిచేసిన
లీ ఇంకియావో చెప్పిన జ్ఞాపకాల
ఆధారంగా క్వాన్ యాంచీ ఈ
పుస్తకాన్ని రాశారు. ప్రపంచ ప్రఖ్యాతి
గాంచిన ఓ రాజనీతిజ్ఞుని గురించిన
పుస్తకం ఇది. ఒక భర్తగా, తండ్రిగా,
ఓ కామ్రేడ్‌గా రైతుబిడ్డ అయిన
మావో గురించిన
సత్యాలను చెప్పే పుస్తకం ఇది.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA108B124 |
| పుస్తకం పేరు | మానవీయుడు మావో |
| తారీఖు | 21 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 234 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CP, BCP, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | lakshmi |
| పేజీలు విడదీసినది | naveed |
| స్కాన్ చేసినది | sharmila |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |